# సదాశివమ్

(నా జీవన ప్రస్థానము)



డాక్టర్ కాసరనేని సదాశివరావు

సాహితీ సదస్సు, గుంటూరు

# సదాశివమ్
## (నా జీవన ప్రస్థానము)

డాక్టర్ కాసరనేని సదాశివరావు సాహితీ సదస్సు, గుంటూరు

Dr. Sadasivam

Auto Biography

First Print: January 2008 Copies: 1000

Published by:

Sahithi Sadassu, Lakshmipuram, Guntur

For Copies:

Dr. Kasaraneni Jayapradamba Trust

Little White House Vidyanagar, 3rd Line Extn.

Guntur–522 007

# కై మోడ్పు

"సదాశివమ్" డాక్టర్ కాసరనేని సదాశివరావుగారి జీవనగానం. ఒక సర సహృదయుని సంభాషణం, ఒక మేధావి ఆలోచనా స్రవంతి. ఒక సేవాతత్పరుని సదయ హృదయ స్పర్శ.

సదాశివుడు బోళాశంకరుడు–అడిగినదే తడవు వరాల వర్షమే: సదాశివుడు గరళకంఠుడు–విషాన్ని కంఠంలో దాచిన లోకకళ్యాణ ప్రదాత, డాక్టర్ సదాశివరావు గారి తొలిపేరు "**సదాశివుడు**". ఆ పేరు పెట్టినవారికి ఆనాడేం తెలుసు–అది సార్థక నామధేయమవుతుందనీ, ఆయన జీవితం "**జయప్రద**" మవుతుందనీ.....

పట్టణానికి ప్రక్కనే వున్నా, తక్కెళ్ళపాడు గ్రామం తన ఉనికిని కాపాడు కుంటూనే వస్తున్నది. తన సంస్కృతీ వైభవానికి మెరుగులు దిద్దుకుంటూనే వస్తున్నది. అక్కడ పెరిగిన సదాశివరావుగారిలోనూ, ఆ కల్లకపటమెరుగని వైనం, ఆ సీదా సాదా తత్వం, ఆ కలుపుగోలు తనం, గూడుకట్టుకుని ఉండటంతో అవి ఆయన వ్యక్తిత్వానికి ప్రత్యేక ఆకర్షణలయ్యాయి; ఆభరణాలయ్యాయి.

ఈయన వ్యక్తిత్వం బహు ముఖీనం. అందువల్లనే ఒక్కొక్కళ్ళకు ఒక్కో కోణం నుండి అలా దర్శనమివ్వటం. అయినా సరే "నేను చెప్పేంతగా నా జీవితంలో విశేషాలేమున్నా"యని కొన్నాళ్ళు తటపటాయింపు. స్వీయ చరిత్ర వ్రాయించే ఎందుకు ఎందరు ఎంతగా చెప్పవలసి వచ్చిందో. ఈ స్వీయ చరిత్ర ఇలా అక్షర రూపం దాల్చటానికి కారకులైన వారందరికీ ధన్యవాదాలు.

నన్నయకు నారాయణభట్టు వలె డాక్టర్ సదాశివరావుగారికి డాక్టర్ జేక్కం పూడి సీతారామారావుగారు లభించారు. ఎంతో ఓపికతో వ్రాతప్రతిని సిద్ధం చేసి యివ్వటమేగాక, సవరణలు సరిచూచిన డాక్టర్ సీతారామారావుగారికి కృతజ్ఞులం. విషయాన్ని క్రమబద్ధీకరించి తగిన శీర్షికలను రూపొందించే పనిలో ప్రెస్సువారికి కొంత విసుగును కలిగించాం. అయినా అదంతా చిరునవ్వుతో భరించినయం. కోటేశ్వరరావు గారికీ, డానోస్కో ప్రెస్ యాజమాన్యానికి హృదయపూర్వక ధన్యవాదాలు.

సాహితీ సదస్సు, గుంటూరు

# విషయ సూచిక

## పరిచయ పరిమళం

చరిత్ర నిండా విజేతల ముఖాలే సామ్రాజ్య విజేతలు, రణంలో రక్తాన్ని వీరులుగా పారించిన విజేతలు: స్వార్థం తప్ప, ప్రజాశ్రేయస్సు పట్టని విజేతలు; కాకుంటే భౌతికవాద విజేతలు. సుఖాల పట్ల తప్ప ఆనందం పట్ల బాధ్యత లేని విజేతలు. జీవితానికి ఒక అర్థాన్ని, జీవనానికొక పరమార్థాన్ని నిర్ణయించుకొని మనుగడను సార్థకం చేసుకొన్న మనుషులకు ఈ చరిత్రలో స్థానం లేదు. ఈ లోటును భర్తీ చేయాల్సిన అవసరం మానవతావాదులందరి మీదా ఉంది.

గొప్ప వారు, మహానుభావులు అని మనం గౌరవించే వారు ఆకాశం నుండి ఊడిపడరు. మనలోనే పుడతారు. మన మధ్యనుంచే ఎదుగుతారు. ఐతే వాళ్ళు మన కంటే భిన్నంగా ఆలోచిస్తారు. సమాజాన్ని, పరిస్థితుల్ని మనకంటే భిన్నమైన దృష్టితో వీక్షిస్తారు. సకారాత్మకమైన ధోరణిని ప్రదర్శిస్తారు. అవిశ్రాంత శ్రమ చేస్తారు. సాధిస్తారు. ఒకవేళ లక్ష్యాన్ని వారుగా సాధించలేకపోయినా అత్యున్నత లక్ష్యాలవైపు మన దృష్టిని మళ్ళిస్తారు. వారి విజయ రహస్యాన్ని తెలుసుకోవడానికి మనకుండే మంచి మార్గం వారి జీవితాన్ని, వారి జీవన విధానాన్ని నిశితంగా పరిశీలించి విశ్లేషించుకోవడం. అంతకన్నా మంచిమార్గం వారే విశ్లేషించిన వారి ఆత్మకథను చదువుకోవడం.

ఇంతకూ మనిషి గొప్పతనాన్ని నిర్ణయించే కొలమానమేది? చదివిన చదువా? సంపాదించిన ధనమా? స్థాపించిన సామ్రాజ్యాలా? సాధించిన కీర్తి ప్రతిష్ఠలా? వీటన్నిటినీ పొందిన వాళ్ళు కూడా జీవితంలో మరేదో పోగొట్టుకు న్నామని బాధపడటం మనం చూస్తూనే ఉన్నాం. కించిత్ మనశ్శాంతి కోసం బాబాల చుట్టూ, గడ్డపు స్వాముల చుట్టూ ప్రదక్షిణలు చేయడం గమనిస్తూనే ఉన్నాం. నోములూ, వ్రతాలు, పూజలూ అంటూ దక్షిణలిచ్చు కోవటం ఎరిగే ఉన్నాం. జీవితంలో ఏదో ఒక క్షణంలో "ఈ జీవితానికి అర్థమేమిటి? పరమార్థ మేమిటి?" అనే ప్రశ్న ప్రతి మనిషికి ఉదయిస్తుంది.

ఊపిరి పీల్చిందానికి, ఊపిరి నిల్చిందానికి మధ్య నడుస్తున్నదేమిటి? ఈ ప్రశ్నలు కేవలం మెట్ట వేదాంతానికి సంబంధించినవి కావు. మనిషి ఆత్మావలోక నానికి, అది ఆత్మిక (ఆధ్యాత్మిక) భావనకు మనిషి మనుగడకు సంబంధించిన కీలక ప్రశ్నలు.

"మా మేనల్లుడు చక్రవర్తిరా" అంటాడు మానాన్న. నేను నవ్వుతాను. "నవ్వడం కాదురా! చూడు ఆదర్పమూ, ఆ తేజస్సు, కోటిమందిలో ఐనా కొట్టొచ్చి నట్టు కనిపించే రూపమూ, ఎప్పుడూ కూడి ఉండే బంధువులూ, ఆశ్రితులూ, స్నేహితులూ" అంటూ మానాన్న తెగ మురుసుకుంటాడిప్పటికి, "నేనేంటిరా! ఆయన్నెరిగిన వాళ్ళెవరైనా ఆమాట అనాల్సిందే" అంటారాయన. "అనక పోతే నువ్వూరు కుంటావా?" అంటాన్నేను. అది మా ఇంట్లో తరుచూ జరిగే సంభాషణ డాక్టరు గారిని గురించి.

నాకు ఊహ తెలిసింతర్వాత డాక్టరు గారిని చూడటం నా పదేళ్ళ వయస ప్పుడు. వంటినిండా దద్దుర్లు, దురదతో బాధపడుతుంటే ముందు మా నాన్న వేరే డాక్టరు దగ్గర చూపించాడు. ఆయన మింగడానికో పది బిళ్లలూ, వంటికి రాసుకోవాడానికో తెల్లమందు సీసా రాసిచ్చాడు. వెరసి ఆ చవక రోజుల్లోనే యాభై రూపాయల బిల్లు. డబ్బయితే వదిలిందిగానీ, రోగం పోయింది గాదు. సరే డాక్టరు గారు ఎటూ ఉన్నారాయే! చూపించాం. ముందు జరిగింది చెప్పాం. ఆయనో నవ్వు నవ్వారు. మోనాలిసా లాగా! అలా ఎందుకంటే, గుర్తొచ్చినప్పుడల్లా ఆనవ్వు నాకిప్పటికీ కళ్ళముందే కన్పిస్తున్నా. అందులోని రహస్యం నాకిప్పటికి అర్థంగాలేదు కాబట్టి.

సరే ప్రిస్కిప్షన్ రాసిచ్చారు తగ్గిపోతుందిలే అని చెప్పారు. లేచి బయటికొచ్చాం. ఫీజిచ్చేపని ఎప్పుడూ లేదు. మేనమామలం కదా! మందులు కొనబోతే వర్మగారు (డాక్టరు గారి బావమరిది) పావలా ఇమ్మన్నారు. "పావలా ఏంటి?" అన్నాడు మా నాన్న.

"ఆమందు ఖరీదంతే" అన్నారు వర్మ గారు, నాలుగు బిళ్ళలు, రోజుకి రెండు చొప్పున రెండు రోజులు. మొదటి డోసుకే జబ్బు మాయం. రెండోరోజు కి దురద కూడా! ఇచ్చినమందు డల్కోలాక్సు. విరేచనకారి. చెప్పొచ్చేదేమంటే మొదటి డాక్టరు లక్షణానికి వైద్యం చేస్తే, డాక్టరు గారు మూలానికి చేశారన్న మాట. ఏవిషయానికైనా మూలకారణం కనుక్కోడానికి శాస్త్రపరిజ్ఞానంతో బాటు తర్కం కూడా ఉండాలి. ఆ రెండూ ఆయనలో పరిపూర్ణంగా ఉన్నాయి కాబట్టే ఆయన డయాగ్నసిస్ ఎప్పుడూ తప్పు కాలేదు. వైద్యంలోనూ, జీవితంలో కూడా!

ఫీజివ్వలేదు, మేనమావలం కాబట్టి అన్నాను. కానివాళ్ళు కూడా చాలా మంది ఆయన దగ్గర ఉచితంగానే వైద్యం చేయించుకున్నారు. ఇచ్చే వాళ్ళ దగ్గరైనా తీసుకోవడమేగానీ, ఎంతిచ్చావని అడగటం గానీ, ఇచ్చింది లెక్కవేసు కోవడం గానీ ఆయనెరగడు. అదీ అందరిదగ్గరా తీసుకొనే వారూ కాదు. మరీ నిరుపేదల్లా కనిపిస్తే, "నాకేమీ ఇవ్వొద్దులే, మందులు జాగ్రత్తగా వాడుకో!" అనేవారు. మందులు కూడా ఫిజిషియన్ శాంపిల్స్ ఉంటే ఉచితంగా ఇచ్చి పంపేవారు. డబ్బు కోసమన్నట్టు కాకుండా రోగిని ఆరోగ్యవంతుణ్ణి చేయడానికి, అతడి ముఖంలో ఆనందం చూడటానికే ఆయన ఎక్కువ ప్రాముఖ్యం ఇచ్చేవారు. దాన్లోనే ఆయన తన ఆనందం కూడా చూసుకునేవారు.

డాక్టరు గారు నవ్వుతుంటే అచ్చం మాభాగ్యమ్మత్త నవ్వినట్టే ఉంటుంది. భాగ్యమ్మత్తంటే డాక్టరుగారి తల్లి. ఐతే, మాభాగ్యమ్మత్త ఏమంత ఎత్తరి కాదు. డాక్టరుగారేమో ఆజానుబాహుడు. "అది మా రామశాస్త్రులు బావ పోలికరా" అన్నాడు. మానాన్న. "మారామశాస్త్రులు బావ మంచి ఎత్తరి. రంగు తక్కువైనా స్ఫురద్రూపి, ప్రేమజీవిరా మాబావ!" అంటాడు మానాన్న. "మా బావ మంచి తనం, మా అప్ప తెలివితేటలు వచ్చినయిరా డాక్టరు గారికి" అని చెప్పుకొస్తాడు ఆయన.

డాక్టరు గారి ఆత్మీయత చాలా గొప్పగ ఉంటుంది. ఆయన దగ్గరకు వెళ్ళినప్పుడు ఆయన మనల్ని గమనించినట్టే ఉండరు. కానీ మనం ఏం పని మీద వచ్చి ఉంటామా అని ఆయన బుర్ర ఆలోచిస్తూనే ఉంటుంది. మనల్నాయన పలకరించేసరికి దాదాపు మన సమస్యకు (మనం చెప్పకుండానే) ఆయన పరిష్కారం కూడా ఆలోచించే ఉంటారు. ఇది నా అనుభవంలో చాలాసార్లు చూశాను. పని పూర్తైన తర్వాత మనకంటే ఆయన ఎక్కువ సంతోషించడం కూడా నేను చూశాను. అసలు ఎవరికైనా సహాయం. చేయడం అనేది ఆయనకో గొప్ప సరదా.

డాక్టరు గారికి చిన్నప్పుడు నోరు సరిగా తిరిగేది కాదని చెప్పడం మానాన్న కో గొప్ప సరదా. తాతని వాత అని, కోడిగుడ్డుని ఓడిగుడ్డు అనేవారని చెప్పి నవ్వుతాడాయన. ఐతే, ఆముక్తమాల్యద లాంటి కఠిన పాకకావ్యం ఆయన అభిమాన రచన అనీ, తెలుగు  నేలన సుప్రసిద్ధులైన కవులు, రచయితలెందరి తోనో ఆయన సాహిత్య చర్చలు చేశాడనీ తెలిసినప్పుడు ఆయన ఆశ్చర్యపోలేదు. "మా మేనల్లుడికి తెలియందే ముందిరా" అంటాడు.

"డాక్టరుగా మీకున్న పేరుకు తగినంతగా మీరు డబ్బు సంపాదించ లేదండీ". అన్నానేనొక సందర్భంలో. "డాక్టరు పని రోగం నయం చేయడమే తప్ప డబ్బు సంపాదించడం కాదు. ఐనా నా సంపాదన నా అవసరాలకు చాలా మించే వచ్చింది. ఆ విషయంలో నో రిగ్రెట్స్" అన్నారాయన. "డాక్టరుగారు ఏం సహాయ చేశాడు; ఎంత సహాయం చేశాడు; అనేదాని కంటే, ఏదైనా అవసరం వచ్చినప్పుడు డాక్టరు గారు ఉన్నారు కదా అనే భరోసా చాలా ధైర్యాన్నిచ్చేదిరా" అంటాడు మానాన్న. ఈ పరిస్థితి డాక్టరు గారి బంధువుల, స్నేహితుల చాలా మంది కుటుంబాల్లో ఉండటం నేను చూశాను.

ప్రసిద్ధులైన చాలామందికి వారికి చాటున వ్యతిరేకంగా మాట్లాడేవాళ్ళు కూడా. చాలామంది ఉంటారు. ఐతే డాక్టరు గారి విషయంలో అది అపవాదు. ఆయన సముఖంలోనూ పరోక్షంలోనూ కూడా ఎవ్వరూ ఆయన్ను విమర్శించడం నేనెరుగను. ఇందుకు ఆయన వ్యక్తిత్వమే కారణమనుకుంటాను. ఆయన ఎవ్వరి గురించీ చెడుగా మాట్లాడరు. ఎవ్వరినీ చులకనగా చూడరు. ఎన్టీరామారావు గారితో ఎలా మాట్లాడతారో జక్కంపూడి సీతారామారావు గారితోనూ అంతే ఆత్మీయంగా మాట్లాడతారు. 1956 లో ఫిజిక్సులో నోబెల్ ప్రైజు విన్నరు పేరు గుర్తు తెచ్చుకోడానికి ఎంత శ్రద్ధగా ఆలోచిస్తారో, మొవ్వారి రావమ్మ ముని మనవడి పేరు గుర్తు తెచ్చుకోవడానికి కూడా అంతే శ్రద్ధగా ఆలోచిస్తారు. అందరిపట్లా సమానమైన ప్రేమా సమానమైన ఆదరణాను.

డాక్టరు గారు ఎన్నికల రాజకీయాల్లోకి వచ్చినప్పుడు నేను చాలా చిన్నవాణ్ణి. ఐతే, ఉత్సాహంగా ప్రచారమూ అదీ చేసే వాళ్ళం. రాజకీయాల్లో కూడా ఆయన నమ్మిన సిద్ధాంతం నుంచి పక్కకు జరగలేదనేది అందరికీ తెలిసిన విషయమే. ఈ సందర్భంగా ఓ మాట చెప్పాలి. "ఈ ఓటర్లకు బుద్ధిలేదండీ! మంచి వాళ్ళను వదిలేసి రౌడీల్ని గెలిపిస్తున్నారు"అన్నాడొకాయన ఒకానొక సందర్భంలో డాక్టరు గారితో. "అలా ఎందుకనుకోవాలి? మంచివాళ్ళకంటే రౌడీల వల్లనే ఎక్కువ ప్రయోజనముందని జనం గ్రహించారనుకోవచ్చుగా" అన్నారు డాక్టరు గారు. అవతలాయన మళ్ళీ మాట్లాళ్ళేదు.

దేవుడు ఉన్నాడంటారు ఆస్తిక వాదులు. లేడంటారు నాస్తికులు. మనిషే దేవుడంటారు తాత్వికులు. ఐతే అందరూ కూడా ఉత్సాహం, జిజ్ఞాస, ప్రేమ మహా మానవ లక్షణాలని అంగీకరిస్తారు. డాక్టరు గారిని ఎరిగినవారందరూ ఆయనలో ఈ లక్షణాలు సంపూర్ణంగా ఉన్నాయని అంగీకరిస్తారు. డాక్టరు 'ఉత్సాహం ఎప్పుడూ పరవళ్ళు తొక్కుతూంటుంది.

ప్రతి విషయాన్ని కుతూహలంగా గమనించే జిజ్ఞాస ఉంది. ఇక ప్రేమ అవధులు లేనంత. ఆయన కేవలం మానవుడు కాదు, మహాత్ముడు. ఆయన చరిత్ర శాశ్వతం.

మా కుంటుంబం బహు విధాలుగా ఆయనకు రుణపడి ఉంది. ఆ రుణాన్ని తీర్చుకోవాలని మేమనుకోవడం లేదు. ఎందుకంటే, తరతరాలుగా ఆయన బంధుత్వం మాక్కావాలి. ఆయన ఎప్పటికీ మామేనల్లుడు గానే ఉండాలి. ఆయన్ని మేమే చదివించాలి. మా హస్తవాసి తోనే ఆయన గొప్పవాడు కావాలి. ఇప్పటికీ ఎప్పటికీ!

శివ అంటే శుభం అని అర్థం. సదా శివ అంటే ఎల్లప్పుడూ శుభం కలిగిన వాడు, కలిగించేవాడూనని, సార్థకనామధేయుడై డాక్టరు గారు పూర్ణాయుర్దా యులు కావాలి. మహానుభావులు ఆకాశం నుండి ఊడిపడరు. మనలోనే పుడ తారు. మన మధ్యనుంచే ఎదుగుతారు. శుభం. ఓ మహానుభావుడి ఆత్మకథను అవలోకించండి. ఓ పూర్ణ పురుషుని విలాసాన్ని కనుగొనండి.

తక్కెళ్ళపాడు పిన్నమనేని

మృత్యుంజయరావు.

20-12-2007

## ముందుగా ఒక్క మాట....

కొన్నాళ్ళనుండి కొంతమంది మిత్రులు నా జీవిత చరిత్ర వ్రాయమని కోరుతూ వచ్చారు. . నేను తాత్సారం చేస్తూవచ్చాను. అందుకు కారణాలు లేక పోలేదు. నాకు జీవిత చరిత్రల ప్రయోజనం తెలియక కాదు. గొప్పవాళ్ళ జీవితాలు ఎంత సాదా సీదాగా ఉంటాయో అవగాహనలేక కాదు.

ఈ విశ్వంలో భూగోళం ఎంత? భూగోళంలో మానవ సమాజం ఉనికి ఎంత? మానవ సమాజంలో ఒక వ్యక్తి స్థానం ఎంత? అటువంటి వ్యక్తినైన నేను చేయగలిగిందెంత; చెప్పగలిగేదెంత? ఎవరికివారు స్వీయ చరిత్రలు వ్రాసు కుంటూ పోతే చదివే వాళ్ళెవరు?–ఇవన్నీ నా మనస్సులో మెదిలిన ప్రశ్నలు.

చివరకు మిత్రుల కోరిక మేరకు వ్రాయటానికి పూనుకున్నాను. గుంటూరు ప్రక్కనే ఉన్న మా ఊరు చాలా చిన్నది. ఆ గ్రామంలో నా జననంవల్ల జనాభా ఒక శాతం పెరిగిందని తెలియగానే ప్రఖ్యాత రచయిత మార్క్ ట్వేన్ గుర్తుకు వచ్చాడు.

మా పల్లెటూళ్ళో ఒకింటినుండి ఎన్నో యిళ్ళవాళ్ళు నిప్పు పట్టుకుపోవటం నా మనసులో మెదిలింది. ఇంకేం శ్రీకృష్ణదేవరాయలవారి ఆముక్త మాల్యదలోని పద్యం గుర్తుకు వచ్చింది. వర్షాకాలంలో ఇల్లిల్లూ తిరిగితేగాని ఒకింత శిఖి దొరికేది కాదు. శిఖి అంటే శిఖ ఉన్నది కనుక నిప్పు. దొరికిన నిప్పు అయినా బుగ్గలు ఉబ్బించి ఊదితేగాని రాజుకోదు, రాజుకున్నదయినా రవులుకోదు: వర్షాకాలం కదా–ఒకటే పొగ చివరకు ఉడికిన అన్నమయినా తొలిపంక్తికే సరి. తిరిగి వంటకై స్త్రీల ప్రయత్నము. మాది రాయలకాలం నాటి సంస్కృతిని పట్టి ఉంచిన పల్లెపట్టు అన్పించింది.

థర్డ్ ఫారంలోనే మను చరిత్రలోని "అంకముజేరి శైల తనయాస్తన దుగ్ధము లానువేళ..." అనే పద్యాన్ని ప్రార్ధనా గీతంగా నేను చదివితే మా సుబ్రహ్మణ్యం మాష్టారి మెచ్చుకోలు నేను మర్చిపోయిందెక్కడ?

మా గురువులు గొప్పవారు. అందులో సందేహంలేదు. అయితే మావంటి శిష్యుల్ని చూచి పొంగిపోయిన గురువులూ పలువురు లేకపోలేదు. అయినా నేను అహంకారభరిత భీషక్కునుకాను. నరనరాన వినయాన్నే మిగుల్చుకున్నాను.

మాది ఆరుగాలం శ్రమించే రైతు కుటుంబం. కుటుంబం పెద్దది. తండ్రిది. అర్ధాయుష్షు, తరువాత తల్లి సంసారాన్ని ఈదుకు రావలసివచ్చింది. మా అమ్మమ్మ చివరి కోరిక నన్ను డాక్టర్ని చేసింది. నేను ఎక్కొచ్చిన తరువాత కుటుంబానికి నా చేయూత లభించింది. కుటుంబ గౌరవాన్ని నిలబెట్టుకున్నాం.

డాక్టర్ జయప్రదలతో దండల పెండ్లి డాక్టరు దంపతుల సంస్కృతికైతే దారి చూపింది కాని దండల పెండ్లిండ్లు పెరగలేదు. నా వైద్య పద్ధతి పలువురికి వచ్చింది. వైద్య రంగంలోనేగాక విద్యారంగంలో కూడ కొంత కృషి చేసాను. ఏ రంగంలోనూ నేనెవరితోనూ పోటీ పడిందిలేదు. సమన్వయ సాధనే లక్ష్యంగా పెట్టుకున్నాను. ప్రారంభించిన సాహితీ సదస్సుకూడ సాహితీ సౌరభాలను గుబాళింప జేసింది. ఎందరో సాహితీ మిత్రుల్ని సంపాదించి పెట్టింది.

రాజకీయరంగం కూడ నన్ను తనవైపుకు లాక్కుంది. దాన్ని అవకాశంగా తీసుకుని సామాజిక రుగ్మతల్ని రూపుమాపాలనే ఆశ. కొన్ని దీర్ఘ రోగాలకు ఉపశమనాలేగాని సంపూర్ణ చికిత్సలుండవు. నాకు మాత్రం జాతీయస్థాయి నాయకులు కొందరితో చెలిమి ఏర్పడింది. క్లిష్ట సమయాలలో విశ్వవిద్యాలయ పరిపాలనలో పాలుపంచుకున్న తృప్తి మిగిలింది.

ఎదుటివాళ్ళకు స్వేచ్ఛనివ్వటం, వాళ్ళను చులకనగా చూడకపోవటమే ప్రజలకు నేను చేరువకావటానికి ప్రధానమైన కారణమనుకుంటాను. నాకు కోపం, రిపార్టీ తెలియని విషయాలేం కాదుగాని వాటిని దిగమింగటం ఎలాగో తెలిసింది. మౌనం మందుగా మారింది. అది నాలోనూ, ఇతరులలోనూ గాయాలు రేగకుండా సాయపడింది. బాధను భరించటం ఇంకా బాగా వచ్చినట్లు లేదు. వచ్చుంటే అర్థాంగి మరణపు వ్యధ నన్ను యింతగా వెంటాడేది కాదేమో.

ఇలా ఎన్నెన్నో విషయాలు మనసులో ముసురుకుంటూంటే జీవిత చిత్రణ నల్లేరు మీద బండి నడకయ్యే మాట నిజమేగా! అంతా పూర్తయిన తరువాత చూస్తే–"ఇదంతా ఎందుకు" లే అన్పించలేదు. అందుకే ఇలా మీ ముందుంచాను.

– డాక్టర్ సదాశివరావు



నేను - నా సోదరులు : సత్యన్నారాయణ,
మురహరిరావు, నేను, సీతాపతిరావు, మన్మథరావు



మా అమ్మ, తమ్ముడు మన్మధరావు, మరదలు మేరిలతో
రామచంద్రపురంలోని మా ఇంట్లో

డా॥ కాసరనేని సదాశివరావు గారి స్వీయ చరిత్ర

# సదాశివమ్

ఆవిష్కరణ సభ 16.2.08, శనివారం సా॥ 6 గం॥లకు,
కాటన్ అసోసియేషన్ ప్రాంగణం, గుంటూరు

సభాధ్యక్షులు : ప్రొ॥ వి. బాలమోహన్‌దాస్
ఆవిష్కర్త : జస్టిస్ జాస్తి చలమేశ్వర్
సంవిక్షణం : ప్రొ॥ యార్లగడ్డ లక్ష్మీప్రసాద్





'సదాశివమ్' పుస్తకావిష్కరణ ఫోటోలు



డా॥ సదాశివరావు గారి శతజయంతి ప్రారంభ వేడుకలు
డా॥ జయప్రదాంబ డిగ్రీ కళాశాలలో - 13-10-2022



తక్కెళ్ళపాడులో డా॥ సదాశివరావు గారి విగ్రహం వద్ద కుటుంబ సభ్యులు
13-10-2022




శ్రీనాథ్ పబ్లిక్ స్కూల్, తక్కెళ్ళపాడులో **13-10-2022**న ఉత్సవాలు




గుంటూరు బృందావన్ గార్డెన్స్ శ్రీ వేంకటేశ్వరస్వామి వారి గుడిలో ఉత్సవాలు




గుంటూరు మెడికల్ క్లబ్‌లో జరిగిన ఉత్సవాలు




ఆర్.వి.ఆర్. అండ్ జె.సి. ఇంజనీరింగ్ కళాశాలలో జరిగిన వేడుక




జె.కె.సి. కళాశాలలో డాక్టర్ గారి శత జయంతి వేడుకలు




నరసరావుపేటలో డాక్టర్ గారి శత జయంతి వేడుకలు



హైదరాబాదులో డాక్టర్ గారి శత జయంతి వేడుకలు




గుంటూరు పాటిబండ్ల సీతారామయ్య హైస్కూలులో డాక్టర్ గారి శత జయంతి వేడుకలు




తెనాలిలో డాక్టర్స్ నిర్వహించిన
డా॥ సదాశివరావు గారి శత జయంతి వేడుకలు



గుంటూరు అవగాహన సంస్థ వారు నిర్వహించిన
డాక్టర్ గారి శత జయంతి ఉత్సావాలు

# నేను మా గ్రామము

**నా జననం–ఒకశాతం పెరిగిన జనాభా:**

నేను ఎందరిలోనో ఒకనిగా బ్రతికినా నా బాల్యం అందరిలో ఒకనిగానే గడిచినది. గుంటూరు పట్టణమునకు తూర్పున నాల్గు కిలోమీటర్లలో వున్న రామచంద్ర పాలెం అనే చిన్న గ్రామము నా జన్మభూమి. తండ్రి రామశాస్త్రి, తల్లి–సౌభాగ్యమ్మ.

తెలుగు లెంక చెప్పుకున్నట్లుగా–"కల్లకపటులేని పల్లెలో నాగలి/ దున్నువారు నన్ను కన్నవారు"

మా కుటుంబములో ఎవరూ చదువుకొన్నవాళ్ళు లేనందువలన పుట్టిన తేదీ వ్రాసి పెట్టుకొనలేదు. గ్రామములో అందరిదీ అదే పరిస్థితి. అయితే అప్పట్లో గ్రామములో ఒక ఆచారముండేది. కాన్పు చేసిన మంత్రసాని మునసబు గారింటికి వెళ్ళి, ఫలానా వారింట్లో కాన్పు జరిగిందని చెప్పేది. మునసబు, కుటుంబసభ్యులకు కబురుచేసి రిజిష్టరులో సంతకము లేక వేలుముద్ర వేయించు కొనేవారు. కుటుంబ సభ్యులెవ్వరూ పుట్టినతేది గుర్తుంచుకోవటం కానీ, పుట్టిన రోజు జరపటంకానీ, చేసేవారుకారు. పుట్టిన రోజు పండుగలు యేమీ జరుగ లేదు. ఇటీవల తెలుసుకోవాలని ఆసక్తి గలిగి ఆ రికార్డులను పరిశీలించటం జరిగింది. దాని ప్రకారము అక్టోబరు 13న 1923న జన్మించినట్లు తెలిసింది. నా పుట్టినరోజున ప్రకృతి, పరవశించి, ఆకాశమంతా వెలుగులతోనూ, పెద్ద శబ్దాలతోనూ నిండిందని మా అమ్మ చెప్పేది. అంటే మరేమీ లేదు ఆరోజు తుఫాను. నే పుట్టినప్పుడు మా గ్రామపు వయస్సు 9 సంవత్సరాలు. జనాభా సుమారు వందమంది. నా పుట్టుకవలన మా ఊరి జనాభా ఒక శాతం పెరిగింది. ఈ ఊహ నాకే వచ్చిందనుకొంటే, అమెరికన్ రచయిత 'మార్క్ ట్వైన్' పరిస్థితి కూడా అదే అని తన జీవిత చరిత్రలో వ్రాసుకొన్నాడు.

నాకు ఊహ తెలిసేటప్పటికి నేను మా తాత, అమ్మమ్మల వద్ద, ప్రక్కనేవున్న తక్కెళ్ళపాడులో వున్నాను. ఆ ఇంట్లో మా తాత, అమ్మమ్మ, మా మేనమామ, మేనమామ భార్య (మా పెద్ద తల్లి కుమార్తె) వున్నారు. అందరూ నన్ను గారాబంగానే చూసేవారు.

**ఆట పాటలు :**

పల్లెటూరిలో పుట్టి పెరిగేవారికి, బాల్యంలో చెప్పుకోదగిన విశేషాలు ఏముంటాయి–తోటి పిల్లలతో కలసి బజార్లలో ఆడుకోవటం తప్ప. ఆడుకోవ టానికి ఆట స్థలాలు వుండవు. ఆటపాటలు నేర్పేవాళ్ళు ఎవరూ వుండరు. పట్టణాలలో విద్యావంతుల కుటుంబంలో పుట్టిన పిల్లవాళ్ళు, బాల్యంలో ఎన్నో విషయాలు తెలుసుకోవచ్చన్న విషయం ఆచంట జానకిరామ్ గారి బాల్య స్మృతులవల్ల తెలుసుకోగలిగాను. పుట్టిన గ్రామము, పెరిగిన గ్రామము పూర్తిగా వ్యవసాయము మీద ఆధారపడినవే. ఎక్కువమంది సామాన్య రైతులు. ఆడవారు మగవారు అందరూ పొలంపనికి వెళ్ళేవారు. త్రాగే నీటికి ఊరి చెరువులే ఆధారము.

నా బాల్యం అంతా తక్కెళ్ళపాడులో మాతాత అమ్మమ్మల ఇంట గడిచింది. నాకు ఊహ తెలిసిన తరువాత, మా తల్లి దండ్రుల దగ్గర కొద్ది నెలలు మాత్రము వున్నాను. ఏ గ్రామములోనైనా జీవన విధానంలో పెద్దగా తేడా లేదు. పురుషులు పొలంపని చేసేవారు. పొలంలో పండే పంటతో తృప్తిపడి జీవించేవారు. పిల్లలు కూడా చిన్న వయస్సునుండే ఒకరుచెప్పే పని లేకుండా, ఆడ పిల్లలు ఇంటిలో తల్లికి, మగపిల్లలు పొలంలో తండ్రికి సహాయపడ్తూ వుండేవారు. చెప్పుకోతగినన్ని ఆటపాటలు వుండేవికావు. సామాన్యంగా ఆడుకొనే ఆటలు, గోలీలు, బిల్లంగోడు, చెడుగుడు.

నేను ఆటల్లో పాల్గొన్నప్పటికీ ఏ ఆటలోను ప్రావీణ్యత సంపాదించలేదు. ఆట స్థలం ఊళ్ళో బజారులే. పెద్దవారు కూడా ఆడుకొనేటందుకు అంతగా స్వేచ్ఛను ఇచ్చేవారుకాదు. గోలీల ఆటలో మాత్రము, ఒకరిద్దరితో పార్టనర్షిప్పు చేసేవాడిని.

ఇవిగాక గ్రామంలో, గ్రామస్తులకు వీధి నాటకాలు, బుర్రకథలు, హరి కథలు, పురాణ కాలక్షేపం, సుద్దులు, పిచ్చుకుంట్లవారి పల్నాటికథ, మామూలు గా సంక్రాంతి పండుగ తర్వాత ఒక పదిహేను రోజులో, నెలరోజులో గ్రామంలో రచ్చబండ దగ్గర సాయంకాలం 5 గం.ల నుండి 7, 8 గంటల వరకు వరుసగా ప్రతిరోజు పల్నాటి కథను చెప్పేవాళ్ళు. పెద్ద వయసువారు ఎంతో ఆసక్తిగా వినే వారు. యువకులు కూడా వీలైనంతవరకు వినేవారు. ఆ సమయంలో మామూలు గా చెరువునుండి కావిడితో నీళ్ళు. తెచ్చుకొనేవారు. వారు అటువైపుగా వెళ్తూ బాలుడు వచ్చాడా? అని కుతూలహలంగా అడిగేవారు. పల్నాటి యుద్ధంలో, బాలచంద్రుడు, యుద్ధానికి వచ్చే ఘట్టం. యుద్ధం చేసేతీరు కథలో మనోహరంగా వర్ణించేవారు. బాలుడు రంగప్రవేశం చేసేడు అనగానే, నీళ్ళు తెచ్చే వాళ్ళంతా కావిడులు అక్కడే పడవేసి కూర్చొనేవాళ్ళు. ఈ ఆచారము 1950 తర్వాత ఊళ్ళల్లో కనపడకుండా పోయింది.

ఇదికాక గొల్లభాగవతులనే వారు నాటకాలు ప్రదర్శించేవారు వీధి వీధిలో వారు చదువుకోనందువలన ఉచ్చారణలలో లోపాలు వున్నప్పటికీ గ్రామ ప్రజలను బాగా మెప్పించగలిగేవారు. అవి కూడా అదృశ్యమైనవి. నేను దానిని గురించి తరువాత కాలంలో విచారించగా వారు ఆ వృత్తిని మానివేసి మిగతా యాదవులులాగా పశుపోషణకే పరిమితమయ్యారని తెలుసుకొన్నాను. అంత వరకూ మిగతా గొల్లలు వీరిని చాలా తక్కువగా చూడటం జరిగేదట. ఇటీవల కాలంలో ప్రపంచ వ్యాప్తంగా సినిమా యాక్టర్లు సమాజంలో చాలా గౌరవస్థానంలో వుండటము చూస్తున్నాము.

మన సాంప్రదాయం ప్రకారం, నట–విట, గాయకాదులు పంక్తి బాహ్యులు, ఈ గొల్ల భాగవతాల వంటివి కూడా అంతే. వీరు తరువాతి కాలంలో, యాదవకుల నాయకులను ఒప్పించి, మిగతా యాదవులతో కలిసిపోయారు.

ఇవిగాక తోలుబొమ్మ లాటలు చాలా కాలంగా ఆంధ్రదేశమంతటా ప్రసిద్ధి చెందినవి. మామూలుగా కుటుంబ సభ్యులు ఈ తోలుబొమ్మలాటలాడేవారు. ఎక్కువగా "రంగనాథ రామాయణం" నుండే సంభాషణలు చెప్పేవారు. వీళ్ళ గొంతులు చాలా మార్దవంగా వుండేవి. తోలు బొమ్మలాటల మధ్య వినోదానికి కేతిగాడు బంగారక్క బొమ్మలను ఆడించేవాళ్ళు. ఉత్సాహముండి చూడటానికి వెళ్ళినా, నిద్ర ఆగేదికాదు. నిద్ర వచ్చినప్పుడు ప్రక్కవాడితో, మళ్ళీ కేతిగాడు వచ్చినప్పుడు లేపు అని చెప్పేవాడిని. ఈ ప్రదర్శన కూడా నిద్రవలన నేను పూర్తిగా చూడగలిగేవాడిని కాదు.

వీధినాటకాలు సమాజాలుగా ఏర్పడి ఆడేవారు. అందులో ఒక ట్రూపు నాయకురాలు "చింతపూవు మాణిక్యం". ఆమె స్టేజీమీద, బీడి కాల్చుతూ, కాలే చివరను లోపలికి బెట్టి బైటికి తీసి చూపించేది, చూస్తుంటే అది ఎంత కష్టమో అనుకొనేవాడిని విశాఖపట్నం వెళ్ళిన తర్వాత ఆడవాళ్ళు మగవాళ్ళు (ముఖ్యంగా ఆడవాళ్ళు) చుట్టను కాలే చివరను నోటిలో పెట్టుకొని కాల్చటం చూశాను. దీన్ని 'అడ్డపొగ' అని పిలిచేవారు. అట్లా చేసినందువలన అంగిలిలోను, దవడలమీద గొంతులో క్యాన్సరు జబ్బులు వచ్చేవి.

విశాఖపట్నంలో వైద్యులు బహుళ ప్రచారం చేసినందువలన అది క్రమంగా తగ్గిపోయింది. ఆ చింతపూవు మాణిక్యం నాటకంలోని ఒక సీనులో ఇంటికి వచ్చిన పెద్ద మనిషిని చూపించి పిల్లవానితో "నాన్నగారికి నమస్కారాలు చెప్పరా?" అంటుంది. "నీ అమ్మ రోజుకొకడ్ని నాన్న అని చెప్తావు" అంటాడు. దానికి జనం విరగబడి నవ్వేవాళ్ళు. మాట అర్థం చేసుకోలేని వయస్సునాది. అయినా ఇప్పటికీ గుర్తుంది.

బుర్రకథలో మామూలుగా ముగ్గురు పాత్రధారులుంటారు. కథచెప్పేవాడు ఆహార్యం (వేషం) ధరించి అన్ని రసాలు ప్రదర్శించేవాడు. ఈ ప్రక్రియ ఆంధ్ర దేశంలో చాలా ఆదరణ పొందింది. ఇప్పటికి కూడా అక్కడక్కడ చూస్తూనే వుంటాము. ఇందులో ప్రసిద్ధుడు నాసర్. కేవలం ఆర్టిస్టేగాక భావుకుడు, కవి గూడా. అతను ఇటీవలి కాలంలోనే మరణించాడు. అతనికి క్యాన్సరు (ప్రొస్టేటు) జబ్బువస్తే, ఆపరేషను చేసి మందులిచ్చి సుమారు పదిసంవత్సరాలు వైద్యం చేశాను. మరణం తర్వాత అతను వ్రాసిన పుస్తకం ఒకటి అచ్చువేసి, దానికి "నాసరే" ముందు మాటలు వ్రాసి అందులో ఈ విషయాన్ని కృతజ్ఞతాపూర్వకంగా ప్రస్తావించాడు. వారి బిడ్డలిప్పుడు ఈ రంగంలోనే వున్నారు.

హరికథలు, పురాణ కాలక్షేపములు : ఒకే వ్యక్తి హరికథను చెప్తూ హావ భావాలు ప్రదర్శిస్తూ, పాడుతూ, ఆడుతూ నాట్యం చేస్తూ ఇచ్చే ప్రదర్శన. ఇది ఇప్పటికీ ప్రసిద్ధిలోనే వుంది. ఇటీవల కాలంలో స్త్రీలు హరికథలు చెప్తున్నారు. వీరిని భాగవతార్లు అని పిలుస్తారు. పురాణ కాలక్షేపం పండితులు ఒక్కరే భారత, భాగవతం, రామాయణాల్లోని ఏదో ఒక ఘట్టం తీసుకొని టీకా తాత్పర్యముతో సహా వారి వ్యాఖ్యలు కూడా జోడించి చెప్తూ వుంటారు. హరికథలు పురాణ కాలక్షేపాలు కేవలం వినోదాలేగాక ముక్తి దాయకం అని భావించేవారు.

1931 వరకూ, తెలుగు సినిమాలు లేవని చాలామందికి తెలియక పోవచ్చు. ఒక దశాబ్దంపాటు, మిగతా వినోదాలకు భంగం కలుగకుండా, నడచి నవి. ఆ తర్వాత కాలక్రమేణా సినిమా ప్రభావం ప్రజలపై ఎక్కువైనందువలన మిగతా వినోద కార్యక్రమాలు. తగ్గినవి. చాలా సినిమాలపైన "టాకీస్" అని వుంటుంది. అంటే మాట్లాడేది అని అర్థం. సినిమాలకు ముందు "మూవీస్" వుండేవి. అంటే మాటమాత్రం లేకుండా పాత్రల కదలికలు మాత్రమే వుండేది. వాటి కొరకు హాళ్ళు అప్పటికే కట్టివుంచారు. మాటల సినిమాలు వచ్చిన తర్వాత టాకీసు అని పేరుపెట్టారు.

పల్లెటూరు నుండి సినిమాకు రావటం బహు అరుదుగావుండేది. స్త్రీలకు మాత్రము చూడటానికి అతి తక్కువ అవకాశాలుండేవి. 1933లో అనుకొంటాను నేను మొదటి సినిమా చూడటం జరిగింది. మా బజారులోవున్న స్త్రీలు ఒక గుర్రపు బండిపై వచ్చి సినిమాచూచి వెళ్ళటానికి నిర్ణయించుకొన్నారు. నేను కూడా వారితోపాటే రావాలంటే మాతాత "జట్కాకు ఒక బేడ ఖర్చుపెడ్తావా, నడిచి వెళ్ళలేవా" అన్నాడు. నేను గుర్రపు బండికంటే ముందే వచ్చాను. సినిమా టిక్కెట్టు బేడ, "సీతారామ కళ్యాణం" అని గుర్తు. సినిమా అయిపోయేటప్పటికి రాత్రి పది గంటలు అయింది. ఈ సమయంలో, ఆడవాళ్ళతో రాత్రి ప్రయాణం చేయటం క్షేమంకాదు అని బండివాడు అన్నాడు. అందువలన, దగ్గరలో వున్న మద్ది వెంకటసుబ్బయ్య గారింటికి, (ప్రస్తుత అలహాబాద్ బ్యాంకు ఇల్లు) వెళ్ళి తక్కెళ్ళపాడు నుండి సినిమాకు వచ్చాము. ఈ రాత్రికి మేమిక్కడ వుంటాము అని చెప్పినప్పుడు ఆ ఇంటివారు నాలుగైదు చాపలిచ్చి, చెంబుతో మంచినీళ్ళు ఇచ్చి పడుకోమని చెప్పారు. ప్రొద్దునే లేచి ఇంటికి వెళ్ళాము. అప్పట్లో సినిమా నేల టిక్కెట్టు బేడ, అదే పాత సినిమా అయితే అణ. బేడ అంటే రూపాయలో 8వ వంతు, అణా అంటే రూపాయిలో 16వ వంతు. మా అమ్మ జీవితంలో చూసింది ఒక సినిమా మాత్రమే.

గుంటూరులో స్టేట్ బ్యాంకు సమీపంలో "తులాభార భవనం" అనే పేరుతో ఒక బిల్డింగు వున్నది. మా చిన్నతనంలో 1930-35 మధ్య గుంటూరులో 'మద్ది వెంకట సుబ్బయ్య అనే వ్యాపారి వుండేవారు. వారి ఇల్లు జిన్నాటవరు దగ్గర. అలహాబాద్ బ్యాంకు ప్రస్తుతం వున్న బిల్డింగువారి వసతి గృహం. దాని ప్రక్కన చుండూరివారి పాలెస్ అనే పేరుతో 'బచ్చు శ్రీరాములుగారి మేడవుంది. ఈ రెండు కట్టడాలు అప్పటికి గుంటూరులో వున్న అధునాతన కట్టడాలు. మద్ది వెంకటసుబ్బయ్యగారు వ్యాపారంలో తులతూగి ఆ డబ్బు అంతా ధర్మకార్యాలు చేశారు. ఆ తర్వాత తులాభారం జరుపుకున్న వారులేరు.

ఈ మద్ది వెంకటసుబ్బయ్యగారింట్లోనే ఆరోజు రాత్రి సినిమాకు వెళ్ళి వచ్చి మావూరివారు పడుకొన్నది.

తక్కెళ్ళపాడు వాళ్ళు వాళ్ళ పొలాలు దూరమైనవన్న కారణంగా రామ చంద్రపాలెం. వచ్చారు. మా ఊరి గడ్డ ఎత్తినవారి పేరు చిగురుపాటి రామ చంద్రయ్య. ఆయన పేరు, దేవుని పేరు రెండూ కలసి వస్తాయన్న ఉద్దేశ్యంతో, రామచంద్రపాలెం అని నామకరణము చేశారు. అందరూ దీన్ని 'గారపాడు' అని పిలిచేవారు. దానికి కారణం ఒకప్పుడు 'గారపాడు' అనే గ్రామం అక్కడ వుండే దని, ఆ గ్రామం అంతా విడిచి వెళ్ళిపోయారని, ఆ పొలాన్ని గారపాటి పొలంగా పిలిచేవారు. ఆకారణంగా నూతనంగా పెట్టిన పేరు వ్యాప్తిలోకి రాలేదు. ఇప్పటికీ దానిని గారపాడు అనే పిలుస్తారు. రికార్డులలో మాత్రము రామచంద్రపాలెం అనే వుంటుంది. మానాన్న ఒకసారి ఒక ప్రాంసరీ నోటు ఇచ్చి చదవమన్నాడు. అందులో మొదటిసారిగా రామచంద్రపాలెం పేరుచూచి, ఈ ఊరేవూరు అని అడిగాను. "ఇదే మన ఊరిపేరు" అని ఆయన చెప్పాడు.

**ఊరంతా ఒక కుటుంబం:**

మా తల్లి దండ్రులు సామాన్య కుటుంబీకులు. మాతాత (నాన్నగారి నాన్న)కు 20 ఎకరాల మెట్టపొలం. ముగ్గురు కొడుకులు పంచుకొన్నందువలన సుమారు ఏడు ఎకరాలు మా నాన్నకు వచ్చింది. అప్పటి పరిస్థితులలో భార్యా భర్తలు పనిచేసుకొంటే కుటుంబము గడవటానికి ఇబ్బంది ఉండేది కాదు. మగవాళ్ళతోపాటు ఆడవారుకూడా పాలంపనికి వెళ్ళేవారు. అదెవరూ తప్పుగా భావించేవారు కాదు. నా పుట్టుక నాటికి మాది పూరిల్లు. మొత్తం ఊరిలో మూడు లేక నాలుగు పెంకుటిళ్ళు వుండేవి. ఏ ఇంటికి ప్రహరీలు వుండేవికావు. మొత్తం ఊరంతా ఒక పెద్ద కుటుంబములాగా కన్పించేది. గాలికి, వెలుతురుకు కొదవలేదు. ఇప్పటి లాగా కరెంటు లేదని, ఫ్యాన్లు లేవని అనుకొనేవారులేరు. ఇంట్లో రాత్రిళ్ళు వెలుతురు కొరకు ఆముదపు ప్రమిదలు కాని కిరోసిన్

బుడ్డీలుకాని వాడేవారు. అప్పటికి లాంతర్లు వచ్చినని కానీ ఎక్కువమంది ఉపయోగించేవారు కారు. మాతాత, అమ్మమ్మలకు లాంతరు వెలిగించటం చేతగాదు. అప్పట్లో అదే ఒక పెద్ద అడ్వాన్సుమెంటు.

**ఇంటి నుండి యింటికి నిప్పు :**

అప్పటికి అగ్గిపెట్టెలు వచ్చినవి కానీ చాలా కొద్ది మంది ఇళ్ళలో వుండేవి. నలభై పుల్లల అగ్గిపెట్టె ఒక కాని. ఆ యింట్లో వారు దానిని నెల రోజులు వాడు కొనేవారు. మిగతావారు ఆ యింటి నుండి నిప్పు తీసుకొనివెళ్ళి వాళ్ళ పొయ్యి ముట్టించుకొనే వారు. వర్షాకాలంలో కట్టెలు సరిగా మండక పొగ ఎక్కువ వచ్చి ఆడవాళ్ళు చాలా ఇబ్బందిపడేవారు. ఈ అగ్గిపెట్టెలకు ముందు చెకుముకి రాయితో, నిప్పు పుట్టించేవారు. ఇప్పటికీ కొన్ని ప్రాంతాలలో, ఈ అలవాటు వున్నది. ముఖ్యంగా పొలంలో పనిచేసేవాళ్ళు. చుట్ట ముట్టించుకోవడం కోసం ఉపయోగించేవారు. అంటే శ్రీకృష్ణ దేవరాయల నాటి కాలమునకు, మా చిన్న ప్పటికీ, పరిస్థితులలో పెద్దగా తేడాలున్నట్లుగా తోచదు. అందుకు సాహితీ సమరాంగణ సార్వభౌముని ఈ పద్యమే సాక్ష్యం :

మీ ఇల్లిల్లు తిరుగ వొక్కింతబ్బు ముఖి, యబ్బె
నే వింటిలోని బూరి యిడి విపరక
రాఁణదు, రాజీవ రవులు కొల్పాపలె
గాని కల్గదు, గూడుదానఁ గలిగె
నేని కూరగుట మందైనఁ బెన్బోగ సుఖ
భుక్తి పేకూర, డా భుక్తి కిడినఁ
బ్రాగ్రోకల తీలు బహుజనాన్నము, దీర్ఘ
వారుల కొదవుఁ బునః ప్రయత్న,

తే.గీ. మ్రాజ్య పటముఖ్య లయ మెన్న రాలయాంగ
దారులయ మెన్న రంతిక, కారజనిక
పచన నాంధోగృహిణి రామి। బడక మరుఁడు
వెడవెడవె యార్ప నొగిలి రజ్జడివి గృహులు. (ఆముక్త మాల్యద 4-127)

**ఆశపడి ఆరు లంకణాలు చేస్తే.....**

మెట్ట వ్యవసాయంలో చాలా రకాలయిన ఆహార ధాన్యాలు పండేవి. వాటిని ఆహారంగా తినేవారు. ఉదా: జొన్నలు, సజ్జలు, వరిగ, కొర్రలు మొదలైనవి. ఎక్కడో భోగులు రోగులు వరి అన్నము తినేవారు. రోగులకు అందరికీ కూడ అది లభించకపోవటంతో, 'ఆశపడి ఆరు లంకణాలు చేస్తే ఆ రోజు కూడా జొన్న కూడేనా' అన్న సామెత వచ్చింది. ఇడ్లీ, కాఫీలు అసలు ఎరుగరు. ఎవరికైన జబ్బు చేస్తే, చిల్లరకొట్టు నుండి కాఫీ బిళ్ళలు తీసుకొని వచ్చి కాఫీ కాసి ఇచ్చేవారు. అందరూ రోజుకు మూడుసార్లు భోజనం చేసేవారు. పుష్టిగా వుండేవాళ్ళు. ప్రత్యేకంగా కూరలు కొనేవాళ్ళు కాదు. పొలంలో పండిన వాటినే వాడుకొనేవారు. పచ్చళ్ళు పెట్టుకొనేవారు, వ్యవసాయ ధాన్యాలతోపాటు, పొలంలో వేరుశెనగ, మిర్చి, పొగాకు, పండించేవారు. అని అమ్మగా వచ్చిన డబ్బుతో కుటుంబ అవసరాలు గడిచేవి. అందరూ చాలా వరకు తృప్తిగానే బ్రతికేవారు.

ఆరోజుల్లో కుటుంబ నియంత్రణ తెలియదు. అధిక సంతానాన్ని అదృష్టంగా భావించేవాళ్ళు. ఒకరోజు మా గ్రామంలో పున్నమ్మగారు (ఆమెకు ఒక్కడే కొడుకు) మా అమ్మమ్మతో ఇలా అంది ఎంతో ఆనందపడిపోతూ. "నేను గారపాడు వెళ్ళి వచ్చాను. ప్రతి ఇంటినిండా పిల్లలే", ప్రతి ఇంటా పిల్లలెందరున్నా పెట్టింది పంచుకు తినేవాళ్ళు.. అందరి పిల్లల్ని పెంచటం ఎలా అనే భావనే ఉండేది కాదు.

## ప్రాథమిక విద్య

మా కుటుంబములోకాని, మా తల్లిగారి కుటుంబములోగాని, అక్షరాస్యు లెవరూ లేరు–ఒక్కమా మేనమామ తప్ప. మా తాతకు మొగపిల్లవాడు ఒక్కడే. కనుక చిన్నప్పుడు బడికి పంపించి చదువుచెప్పించారు. అప్పట్లో ప్రభుత్వ స్కూళ్ళు వుండేవి కావు. చదువుకున్న వాళ్ళలో ముఖ్యంగా బ్రాహ్మణులల్లో డొక్క శుద్ధి వున్నవారు, ఉపాధ్యాయులుగా వుండేవారు. వారికి డిగ్రీలు, సర్టిఫికేట్లు లేక పోయినా, తెలుగు, సంస్కృత భాషల్లో మంచి పరిజ్ఞానం వుండేది. చిత్తశుద్ధితో చదువు చెప్పేవారు. అటువంటి స్కూలులోనే మా మేనమామ చదివాడు. మాతాత ఆశించినట్లు ఆయన వ్యవసాయం. చేయకుండా, కొంతమంది సహచరులతో కలసి చిన్నవ్యాపారం చేసేవాడు. ఇది మా తాతకు ఇష్టం వుండేది కాదు.

**పలకా బలపమే పెట్టుబడి :**

నాకు అయిదు సంవత్సరములు వచ్చేనాటికి తక్కెళ్ళపాడుకు జిల్లా బోర్డు స్కూలు వచ్చింది. నన్ను ఆ స్కూలుకు పంపించారు. పలకా బలపము ఇచ్చి–అదే పెట్టుబడి. అప్పుడు నాకుగాని, మా తల్లి దండ్రులకు గాని, మాతాత, అమ్మమ్మలు గాని నేను డాక్టరును అవుతానన్న ఊహే లేదు. వాళ్ళు ఆశించినదంతా నీడపట్టున బ్రతికే అవకాశము వస్తుందని. చదువు ఎక్కువ కాలం సర్కారుబడిలో (జిల్లాబోర్డు స్కూలులో). ఉదయం 7 గంటల నుండి 10 గం.ల వరకు, సాయంత్రం 2 గం. నుండి 5 గం. వరకు జరిగేది. మధ్యకాలంలో "గొడ్లు కాయటం (పశువులు). అప్పటికి కొద్ది మంది సంపన్నులు ఆడ పిల్లలను కూడా బడికి పంపించేవారు. మా బడిలోవున్న 40 మంది విద్యార్థులలో ఐదుగురు విద్యార్థినులు కూడా వుండేవారు. వాళ్ళెవరూ పై చదువులకు వెళ్ళలేదు.

**పెద్దబాల శిక్ష :**

ప్రతి తరగతికీ ఒక వాచకం వుండేది. అదే ముఖ్యమైన టెక్స్టు బుక్. ఆ స్థాయికి తగ్గ పాఠాలు వాటిలో వుండేవి. అందులో అన్ని విషయాలను గురించి ప్రస్తావించేవారు. ఆరోగ్యం, వ్యాయామం, పురాణ కథలు, నైసర్గిక పరిస్థితులు, చరిత్ర ఇవన్నీ వుండేవి. ఇవి కాక గణితబోధిని అంటే ఎక్కాలతోపాటు చాలా విషయాలను గురించి పరిజ్ఞానం అంటే వారాలు, నెలలు, సంవత్సరాలు, నక్షత్రాలు, శుక్లపక్షం, కృష్ణ పక్షం మొదలగునవి వుండేవి. తూకాలకు, దూరాలకు, పరిమాణాలకు సంబంధించిన వివరాలుండేవి. మా ముందు తరం వారు, పెద్ద బాలశిక్ష చదివేవారు. అందులో ఇంకా ఎక్కువ విషయాలు, కొన్ని క్లిష్టమైన లెక్కలు వుండేవి. ఇటీవలి కాలంలో ఆ పుస్తకం ఒకటి దొరికింది. పై అట్ట చినిగిపోయి వుంది. అందువలన ఏ సంవత్సరంలో అచ్చుఅయినది తెలియదు. భారతదేశాన్ని గురించి ఉదహరిస్తూ, జనాభా 17 కోట్లు అని వున్నది అంటే ఇప్పటి భారతదేశము, పాకిస్తాను, బంగ్లాదేశ్, శ్రీలంక, బర్మా కలిపి వున్న ప్రాంతం. ఇప్పటి జనాభాతో పోల్చినప్పుడు, ఆనాటి జనాభా ఎంత తక్కువో మనం ఊహించుకోవచ్చు. బహుశా ఆ పుస్తకం 1850 ప్రాంతంలోదయి వుండ వచ్చు. అప్పుడే కరువు కాటకాలతో చాలా ఎక్కువమంది మరణించేవారు. అప్పుడు జననాల సంఖ్యతో పాటు మరణాల సంఖ్య కూడా ఎక్కువగానే వుండేది. కలరా, మసూచి, శిశు మరణాలు, ప్రసూతి మరణాలు ఎక్కువగా వుండేవి. అందువలన జనాభా పెరుగుదల ఎక్కువగా వుండేది కాదు.

వ్యవసాయ భూముల ధరలు నామమాత్రమే! ఎక్కువ పొలం కావాలని, రైతులు ఆరాటపడేవారు కాదు. దీనికి కారణం తహశీలు ఎకరానికి 2-3 రూపాయలు వుండేది. అవి చెల్లించలేక ఇబ్బందిపడేవారు. ప్రస్తుతం భూములపై నున్న ఒత్తిడి ఎంత ఎక్కువో మనందరికీ తెలుసు.

మా తాత స్వంత తమ్ముడు 12 ఎకరాలు 40 రూ.లకు అమ్మాడు. దానిని ఒకరు కొనలేక ముగ్గురు కొన్నారని మా తాత చెప్పేవాడు.

## మందగిరిని చూసావా?

లెక్కలకు వేరే పుస్తకము వుండేది కాదు. పంతులు దగ్గర వుండేదేమో మాకు తెలియదు. లెక్కలన్నింటినీ నోటితో చెప్పటం, బ్లాకు బోర్డుపై వ్రాయడం. నోటు పుస్తకం కూడా లేదు. 3-4 తరగతులలోనికి వచ్చేటప్పటికి, నోటు బుక్, కలం మాత్రం వుండేవి. ఇప్పటి ఫౌంటేన్ పెన్నులు లేవు. పుల్లకలాలు మాత్రం వుండేవి. సిరాబుడ్డిలో ముంచి వ్రాసేవాళ్ళు. ఈ సిరాబుడ్లు కూడా అన్నీ కొన్నవి కావు. స్వంతంగా తయారు చేసుకొనేవాళ్ళు, కరక్కాయ సిరా తయారుచేసుకొనే వాళ్ళు. పాళీలు ఒకటి మొద్దుగా వ్రాసేది. దానిని గుమ్మడి విత్తు అనేవాళ్ళము, రెండోది గద్దముక్కు పాళీ, విద్యార్థులు బలపాలు సేకరించుకొన్నట్లుగానే ఈ పాళీలను కూడా సంపాదించుకోవటంలో ఒకరిపై ఒకరు పోటీపడేవారు. అప్పటికి పెన్సిలు కూడా వచ్చినది. వ్రాతపని ఎక్కువగా పేపరు, పెన్సిలుతోనే సరిపెట్టే వాళ్ళం. డ్రాయింగు పెన్సిలు ఒక కానీ, వయొలెట్ పెన్సిలు మూడు. కానీలు. హైస్కూలుకు వచ్చిన తర్వాత కూడా మూడు నెలలు మొదట పెన్సిలుతో వ్రాసాను. వయొలెట్ పెన్సిల్తో వ్రాస్తే చెరిగిపోదు.

మా పుస్తకంలో వ్యాయామం గురించి కథ వుండేది. ఓ వైద్యుని వద్దకు, బళ్ళమీద, రైళ్ళమీద ఎందరో రోగులు వస్తుండేవారు. అందరు తిని, బలిసి, లావెక్కిన వారు వచ్చేవారు. వారికాయన తగు సలహా ఇచ్చేవాడు. ఈ పాఠంలో వాని పేరు "మందగిరి". ఇది చదివిన తరువాత, మా మేనమామ రంగాచారి అనే ప్రసిద్ధుడైన వైద్యుని దగ్గరకు వైద్యము కొరకు వెళ్ళివచ్చి, అక్కడ విశేషాలు చెప్తున్నాడు నేను "మామయ్యా! అక్కడ మందగిరిని చూశావా" అని అడిగాను.

రంగాచారిగారు గవర్నమెంటు సర్వీసు నుండి రాజీనామా చేసి ప్రైవేటు వైద్యము చేస్తుండేవాడు. ఇప్పటికీ ఆయన విగ్రహము నేటి మద్రాసు జనరల్ హాస్పిటల్ గేటువద్ద వున్నది. ఈ విగ్రహాన్ని వేయించింది మద్రాసు పౌరులు. ఆయనకు స్వంతగా విమానం కూడా వుండేది అనుకొనేవారు. పి.వి.జి. రాజుగారి తండ్రిని అందులో వెళ్ళి చూసి. వచ్చేవాడు. అలానే అందని పళ్ళు పులుపు అనే పాఠం వుండేది. పాఠం చదవటం మినహా, ద్రాక్ష గుత్తులు ఆ రోజుల్లో మేమెరుగము. అచ్చు పుస్తకంలో బొమ్మ చూడటమే.

## ఏది ఎక్కువ బరువు??

ఆంధ్ర వాచకము వ్రాసినది మహావాది వెంకటరత్నంగారు; రెండవ వారు లింగన సోమయాజి. వీరు అడ్వకేటు. ప్రతి సంవత్సరము పరీక్షలుండేవి. ఉపాధ్యాయుల దృష్టిలో, ఫలానా విద్యార్థిని పై క్లాసుకు పంపవచ్చు అనుకొన్న ప్పుడు ఆ తరగతి పుస్తకం తెప్పించేవాడు. అదే ప్రమోషను. సుమతీ శతకం ఒకటి ప్రతి విద్యార్థి దగ్గర వుండేది. ఆ పద్యాలు పంతులుగారు చదివించేవారు. ఇవి కాక మూడు నాలుగు క్లాసులలో మగ పిల్లలకు గజేంద్ర మోక్షము, ఆడ పిల్లలకు రుక్మిణీ కళ్యాణము బోధించేవారు. డిక్టేషన్, చూచి వ్రాత రెండూ వుండేవి. సాయం కాలము అయిదు గంటలయిన తర్వాత విద్యార్థులందరినీ వరుసలో నిలబెట్టి, ఎక్కాలు, నోటి లెక్కలు చెప్పించేవారు. వ్యాయామం కొరకు వేసవి కాలంలో చెరువుల దగ్గరకు తీసుకొని వెళ్ళి డ్రిల్లు చేయించేవారు.

టీచరు సెంటరు క్లాసని ప్రతి నెలలో మూడవ శనివారము, పెదకాకానిలో జరిగేది. ఆ రోజు మాత్రం మాకు శెలవుండేది. స్కూలు ఇన్స్పెక్టరు అప్పుడప్పుడు వచ్చి స్కూలును ఇన్స్పెక్షను చేసేవారు. మామూలుగా గుంటూరు నుండి ఒంటెద్దు బండిపై వచ్చేవారు. వారి భోజన వసతి ఉపాధ్యాయుని ఇంట్లో వుండేది. ఒకసారి ఒక మిషనర్ మా గ్రామములో స్కూలు ఎట్లా జరుగుతుందో తెలిసికొనుటకు వచ్చాడు.

ఒక విద్యార్థిని ఒక నీశె ఇనుము, ఒకనీశె కాకి ఈకలు, ఏది ఎక్కువ బరువని ప్రశ్నించాడు. రెండూ సమానమేనని ఒక విద్యార్థి జవాబు చెప్పినప్పుడు నేను కాదు) ఆయన చాలా సంతోషించి గుడ్, గుడ్ అన్నాడు.

నాలుగవ తరగతి చదువైపోయిన తర్వాత మాతాత పంతులుగారిని భాగవతము 'చెప్పమన్నాడు. ఆ పుస్తకం మా ఇంట్లో వున్నది. తన కుమారుని కొరకు కొన్న పుస్తకము అది, మా మేనమామ చదివినట్లు లేదు. నేను ఒకటి రెండు నెలలు పంతులుగారి దగ్గర చెప్పించుకొన్నాను. మా టీచరుగారు చదివినది ఐదవ క్లాసు దాకా తాత్పర్యమున్న పుస్తకము కూడా కాదు. అయినా ఆయన చెప్పేతీరు మాకు ఆశ్చర్యమేసేది.

పద్యాలు కంఠస్థము రాలేదుగాని, అర్థం చేసుకోగలిగాను. ఇది జరిగిన తరువాత కొద్ది రోజులకు ఘంటా వేంకటప్పయ్య గారనే ఒక పంతులుగారు తక్కెళ్ళపాడులో బడి పెట్టారు. ఆయనది మామూలు ప్రాథమిక విద్య అయినా, హైయ్యర్ మాథమాటిక్సు కూడా చెప్పేవారు. ఆయన మా మేనమాకు స్నేహితుడు. అందువలన నన్ను ఆ స్కూలుకు పంపించారు. కొద్ది నెలలు మాత్రం వెళ్ళాను. బహుశా ఆయన మా మేనమామతో చెప్పివుండవచ్చు. ఈ పిల్లవానికి బాగా చదువు వస్తుందని. అప్పట్లో మా మేనమామ చిన్న వ్యాపారము చేస్తుండేవారు. ఆయన రోజూ గుంటూరుకు వచ్చి వెళ్ళేవారు. వారికిద్దరు స్నేహితులుండే వారు. వారి పిల్లలను, నన్ను గుంటూరులో ఇంగ్లీషు బడిలో వేయాలని ఉద్దేశం మా మేనమాకు కలిగింది.

**పేరు మారింది :**

అది ఏప్రియల్ 21, 1935న. ఆ రోజు రాత్రి నన్ను పిలిచి "రేపు గుంటూరు వెల్దం తయారుగా వుండ"మని మా మేనమామగారు చెప్పారు. అక్కడే వున్న మా తాతయ్య "ఎందుకు?" అన్నాడు.

వీడ్ని ఇంగ్లీషు మీడియంలో చేర్పించటానికి అన్నాడు మామయ్య. నీకు తెలుగు చెప్పిస్తే ఇంత బాగా వున్నావు. వాడికి ఇంగ్లీషు చదువా? అన్నాడు తాతయ్య. మా మేనమామ లేదులే ఇప్పుడందరూ ఇంగ్లీషు చదువుకొంటున్నారని చెప్పాడు. మర్నాడు ఏప్రిల్ 22వ తేదీన 1935లో కొత్త పేటలో వున్న స్కూలులో ఒక పంతులు గారి (గుండిమెళ్ళ శంకరనారాయణ) దగ్గరకు తీసుకొని వచ్చాడు. అది రెగ్యులర్ స్కూలు కాదు. గుంటూరు హిందూకాలేజి స్కూలు బ్రాంచి, అరండల్పేటలో వుండేది. ఆయన ఆ స్కూలులో పని చూసుకొని మధ్యాహ్నం 11 గం.లకు ఇక్కడకు వచ్చేవారు. గం. 11.00 నుండి గం. 1.30 వరకు ఇక్కడ వుండేవారు. మొత్త విద్యార్థులం పదిమంది కూడా వుండేవాళ్ళము కాదు. అక్కడకు రాగానే మొట్టమొదటి చర్య నా పేరు రూపాంతరము చెందటం. అక్కడ విద్యార్థులందరూ పట్టుబట్టి సదాశివరావుగా మార్చారు. అంతకు ముందు నా పేరు సదాశివుడు.

## హైస్కూలు విద్య

### ఇంగ్లీషు చదువు నెలకు రూపాయిన్నర:

ఇంగ్లీషు పుస్తకం, భాస్కర శతకము, రెండూ చెప్పించారు. ఇంగ్లీషు అక్షరాలు వచ్చిన తరువాత ఇంగ్లీషు మాటలు రోజుకు అయిదు-ఏడు చెప్పి పంపించేవారు. అక్కడ చదివే విద్యార్థులందరూ హైస్కూలులో జేరటానికి తయారయ్యేవారు. రెండు మూడు నెలలు గడిచేటప్పటికి, నాకు ఇంత తక్కువగా చెప్తున్నారనే అసంతృప్తి కలిగింది. రోజూ తక్కెళ్ళపాడు నుండి వచ్చి వెళ్ళటం నా అసంతృప్తికి కారణం. అదే సమయంలో మా స్వగ్రామమైన రామచంద్రపాలెంలో ఒకరు స్కూలు పెట్టారని తెలిసి, మేము ముగ్గురము ఆయన దగ్గరకు వెళ్ళి "ఇంగ్లీషు చెప్తారా" అని అడిగాము, చెప్తానన్నాడు. ఆయన ఎస్.ఎస్.ఎల్.సి. నిరుపేద కుటుంబం వారి తండ్రి యాచక వృత్తితో యీయనను చదివించారు. రోజూ చదువు చెప్పటం అయిన తరువాత గుంటూరులో పర్చూరు వీరయ్య గారి హాస్పటల్లో పనిచేస్తుండే వారు. తక్కెళ్ళపాడు గ్రామస్థులు, కాసరనేని బసవయ్య గారు ఆ హాస్పటలులో వైద్యం కొరకు వున్నారు. ఆయన ప్రోత్సాహము వలన ఎలవర్తి ప్రకాశరావుగారు మా వూళ్ళో స్కూలు పెట్టారు. జీతం విషయం మాట్లాడినప్పుడు మామూలు విద్యార్థులకు నెలకు రూపాయి, ఇంగ్లీషు చదువుకొనే వాళ్ళకు నెలకు రూపాయిన్నర అని చెప్పారు. దీనికి ఒప్పుకొని మేము ముగ్గురము అక్కడ చేరాము. రోజు తక్కెళ్ళపాడు నుండే ఈ స్కూలుకు వచ్చేవాడిని. మా స్వంత వూళ్ళో వున్న స్కూలుకు తక్కెళ్ళపాడు నుండి రావటం వింతగా వుంటుంది. కాని మా తాత, అమ్మమ్మలు నన్ను వదలిపెట్టి వుండేవారు కాదు.

మా పంతులుగారికి చదువు చెప్పటం క్రొత్త, మాకు ఇంగ్లీషు చదవటం క్రొత్త. స్కూల్లో చేరినప్పుడు నన్ను మరుసటి సంవత్సరము అంటే 1936లో సెకండు ఫారంలో జేర్పిస్తారా అని అడిగాను, అది కష్టమౌతుందేమో ఫస్టు ఫారంలో

జేర్పిస్తానన్నారు. కొన్నాళ్ళు గడిచిన తరువాత ఆయనంతట ఆయనే సెకండు ఫారంలో జేర్పిస్తానన్నారు. తర్వాత వారే దర్డు ఫారంలో జేర్పిస్తామన్నారు. మీ తాత బహుమతి ఏనున్నా ఇస్తాడేమో కనుక్కోమన్నారు. అప్పట్లో ప్రశ్నా పత్రాలు తెప్పించి నాచేత సమాధానాలు వ్రాయించేవారు. ఒకసారి మాక్మిలన్ కంపెనీ వారి హిస్టరీ పుస్తకంలో ఒక ప్రశ్నకు సమాధానము వ్రాశాను.

## కన్నీళ్ళు పెట్టించిన ఆర్యుల నాగరికత :

అందులో ఆర్యుల నాగరికతను గురించి వ్రాయమన్నారు. ఆ పుస్తకంలో వర్ణ వ్యవస్థ మాత్రమే వుంది. వర్ణ వ్యవస్థ మాత్రమే వ్రాసాను. మా పంతులు గారు ఇది చాలదు ఇంకా వ్రాయమన్నారు. నేను పుస్తకం తెచ్చి చూపించాను. అయినా పంతులుగారు ఇది చాలదు ఇంకా వ్రాయాలన్నారు. నేను చేతిలోని పుస్తకం విసిరి కొట్టాను. మా పంతులు గారికి కోపం వచ్చి నన్ను కొట్టారు. తరువాత కొద్ది సేపటికి నన్ను ఓదార్చి, తాను కూడా కన్నీళ్ళు పెట్టుకొన్నారు. ఈ ఒక్కసారే నేను విద్యార్థిగా పంతులుగారి చేతిలో దెబ్బలు తిన్నది. అందుకే ఈ విషయం కూడా వ్రాశాను.

## నేను యమ్.యస్.–మాష్టారు బి.యెడ్ ఒకసారే!

నాకు చదువు చెప్పిన సంతుళ్ళు ఎవరూ ఇంగ్లీషులో నిష్ణాతులుకారు. అందువలన మిగతా సబ్జెక్టులలో ఎన్ని మార్కులు వచ్చినా. ఇంగ్లీషులో మాత్రము తక్కువే వచ్చేవి. ఈ కారణంగా విద్యార్థులు లెక్కలు. తెలుగులో బాగా రాణిస్తారు. ఇంగ్లీషు మాత్రము క్లాసులో తప్ప, వేరుగా మాట్లాడే చొరవ వుండదు. నేను థర్డు ఫారంలో చేరిన తర్వాత, ప్రకాశరావుగారికి తను ప్రారంభించిన స్కూలుకు గ్రాంటు ఇచ్చారు. ఆరోజుల్లో గ్రాంటు ఇచ్చేవారు. అది పదో అయిదో వుండేది. ప్రకాశరావుగారు ఈ పదిరూపాయలతో రెండు సంవత్సరాలకు ఆయన సెకండరీ గ్రేడు పాసయ్యాడు. తర్వాత ఆయన ఒక సెకండ్రీ గ్రేడు టీచరును పెళ్ళి చేసుకున్నారు. తరువాత ఆయన ఇంటర్మీడియేట్, బి.ఏ. తరువాత బి.ఇడి, పూర్తి చేశారు. వారు బి.ఇడి పూర్తి చేయటం నేను ఎం.ఎస్. చేయటం ఒక్కసారే

జరిగింది. ఇద్దరమూ కాన్వొకేషన్లో కలిశాము. ఆయన సర్వీసంత జిల్లాబోర్డు, జిల్లా పరిషత్లోనే. అదైన తరువాత మోతడకలో హెడ్ మాస్టరుగా పనిచేశారు. వృత్తి ధర్మము బాగా నిర్వర్తించారు. నలుగురు సంతానము, అందరూ విద్య వంతులు, ఉద్యోగస్తులు, వారి ఒక అబ్బాయి గుంటూరు మెడికల్ కాలేజీలో ఇ.ఎన్.టి. ప్రొఫెసర్ డాక్టర్ వై. ప్రభాకరరావుగారు. ప్రకాశరావుగారు రెండేళ్ళ క్రితం మరణించారు. "ఇంకా ఎక్కువ రోజులు వుండను అందుకని చూడటానికి వచ్చానని చెప్పారు. తర్వాత సరిగ్గా నెల రోజులకు ఆయన చనిపోయారు.

## థర్డ్ ఫారంలోనే మనుచరిత్ర :

థర్డు ఫారంలో జేరిన తరువాత పుస్తకాలకు రూ.5 ఖర్చు అయ్యేది. దీనికి మా తాత పుస్తకాలకు రూ. 5 లు ఎందుకు, అన్నీ ఒకేసారి చదువుతారా, అనేవాడు. ఈ విషయం ఎంత చెప్పినా ఆయనకు అర్థమయ్యేదికాదు. అప్పుడొక రూపాయి, అప్పుడొక రూపాయి ఆయన దగ్గర తీసుకొని పుస్తకాలు కొనేవాడిని. నోటుబుక్స్ మాత్రము, తెల్ల కాగితాలు కొనుక్కొని కుట్టుకోవడమే. ఫౌంటెన్ పెన్ను మాత్రము లేదు. రెండు నెలల తర్వాత కోడి పిల్లలను పెంచి, వాటిని అమ్మిన డబ్బుతో మొదటి ఫౌంటెన్ పెన్ను, పిరాబుడ్డి కొనుక్కో గలిగాను. క్లాసులో మాత్రం ఎప్పుడూ ఫస్టు ర్యాంకులోనే వుండేవాడిని. అప్పటి నుండి క్రమం తప్పకుండా ప్రతి క్లాసు పాసయి 1940లో ఎస్.ఎస్.ఎల్.సి. పూర్తి చేశాను. థర్డు ఫారంలో జేరినప్పుడు పంతులుగారు (చెరువు సుబ్రహ్మణ్యంగారు) ప్రార్థన చేయమన్నారు. నేను అప్పుడు మను చరిత్రలోని పద్యం చదివాను.

"అంకముజేరి, శైల తనయా స్తన దుగ్ధములాను వేళ బా
ల్యాంక విచేష్ట తొండమున నవ్వలిచన్ గబళింపబోయి యా
వంక కుచంబుగాన కహివల్లభహారము గాంచివే మృణా
ళాంకుర శంకవంటెడు గజాస్యుని గొల్తు నభీష్ట సిద్ధికిన్."

ఈ పద్యం ఎక్కడిది అని వారు అడిగారు. మను చరిత్రలోనిది అని చెప్పాను. మనుచరిత్ర చదివిన వాళ్ళక్కడ థర్డు ఫారంకు వస్తున్నారా? అని ఆశ్చర్యపోయారు.

హిందూ కాలేజి హైస్కూలులో, అప్పటి ఉపాధ్యాయులందరూ బ్రాహ్మణులే. ఎవ్వరూ కూడా కులవిచక్షణ పాటించేవారుకారు. అందరూ చిత్త శుద్ధితో తమ కర్తవ్యము నిర్వహించేవారు. నా అదృష్టము కొద్దీ ఎక్కువమంది టీచర్లు అనుభవజ్ఞులు, ముఖ్యంగా తెలుగుకు శ్రీ మిన్నెకంటి గురునాధ శర్మగారు. అప్పటికే సీనియరు టీచరు. శ్రీ శిష్ట్ల హనుమచ్ఛాస్త్రిగారు, అలానే లెక్కలకు మైలవరం వెంకట్రామయ్య గారు, అత్యద్భుతమైన టీచరు. వారి విద్యార్థులెవ్వరు కూడా వారిని మరిచిపోవటానికి వీలు లేదు.

**పొరుగింటి పుల్లకూర :**

5వ ఫారంలో ఎలక్టివ్ సబ్జెక్టుగా నేను మాథమాటిక్సు తీసుకొన్నాను. అప్పట్లో ఎస్.ఎస్.ఎల్.సి.కి ఎలక్టివ్ సబ్జెక్టు చాలా ముఖ్యం. ఎస్.ఎస్.ఎల్.సి.లో చాలా మంచి మార్కులతో మాథమాటిక్స్లో పాసయ్యాను.

ఒకటో క్లాసు చదివేటప్పుడు, అందులో వాక్యములు చదువుకొంటూ ఇంటికి వెళ్తున్నాను. వీరిశెట్టి మంగమ్మగారి ఇంటివద్దకు వెళ్ళేటప్పటికి "పొరుగింటి పుల్లకూర రుచి" అన్న వాక్యం చదివాను. ఆమె ఆ మాటనిని "ఈ మాట పుస్తకంలో కూడా వ్రాశారా" అని అడిగింది, నాకు మాత్రం చెప్పేవాళ్ళు లేక పుల్లకూర అనే మాటకు అర్థం తెలియలేదు. దువ్వూరి వెంకటరమణ శాస్త్రిగారు వివరించే వరకూ నాకు తెలియలేదు ఆ సూత్రం.

**కోడలుపిల్ల–కోడెదూడ :**

నేను రద్దు ఫారం చదివేటప్పుడు జరిగిన విషయం ఒకటి వుంది. క్వార్టర్ ఆఫ్ ఇయర్లీ పరీక్షలయిన తర్వాత, హెడ్ మాస్టరు ప్రతి క్లాసుకు వచ్చి, ఏ సబ్జెక్టులో ఎవరు ఫస్టు వచ్చారు అని అడిగేవారు. ఒకసారి ఖాదర్ బేగ్ అనే ముస్లిం

కుఱ్ఱవాడు, మరియొక సారి మోజెస్ అనే క్రిస్టియన్ కుఱ్ఱవాడు ఫస్టు వచ్చారు. ఈ మోజెస్తో నాకు చాలా కాలం వరకు పరిచయం వుండేది. నేను ఎం.బి.బి.ఎస్. చదివేటప్పటికి అతను చదువు పూర్తి చేసుకొని, తాలూకా ఆఫీసులో గుమస్తాగా పనిచేసేవాడు. ఉద్యోగం ఎలా వుందని అడిగాను. దానికి ఆయన ఒక కథ చెప్పాడు. ఒకరు డిప్యూటీ కలెక్టరుగా పనిచేసి, రిటైరు అయి, కొడుకుకు తాలూకాఫీసులో గుమస్తా వుద్యోగం వేయించి పెండ్లిచేసి, తాను స్వంత ఇల్లు నొకటి ఏర్పాటుచేసుకొని, పాడి ఆవును కూడా కొని నిశ్చంతగా కాపురం చేస్తున్నాడు. ఒకరోజు కోడలు ఆవుపాలు పితికి, దూడను కట్టేయపోగా దూడ దొరక లేదు. అప్పుడు ఆమె, మామకు విన్పించేటట్లుగా, "మామయ్యకు చెప్పి నీకు కూడా తాలూకా ఆఫీసులో గుమస్తా పనివేయిస్తాలే" అని అన్నది. ఇది విన్న మామగారు, భార్య దగ్గరకు వెళ్ళి, "ఏమే కోడలుపిల్ల ఇట్లా అంది. కొంచెం విశేషము ఏంటో తెలుసుకో" అన్నాడు. అట్లానే అని కొడుకు దినచర్యను ఒకసారి చూచింది. ఆఫీసు నుండి ఇంటికి వచ్చేటప్పుడు బోలెడు ఫైళ్ళు తెచ్చి రాత్రి భోజనం అయిన తర్వాత ఆ ఫైళ్ళముందు వేసుకొని 11, 12 గంటల వరకు ఫైళ్ళుచూచి తర్వాత నిద్రపోయేవాడు. అందువలన ఆ వయస్సులో ఉండవలసిన ఉల్లాసం లేకుండా పోయింది. అదే కోడలకు బాధ, అని చెప్పింది. అప్పుడు తండ్రి కొడుకును పిలిచి నేను చాలా సంపాదించాను. నీవు ఉద్యోగం చేయవలసిన అవసరం లేదు. నాకు ఒక మనవణ్ణి త్వరగా ఇవ్వమని చెప్పాడట.

## దొందూ దొందే! :

ఇంకొక సందర్భంలో సైన్సు పంతులుగారు, ఆ సబ్జెక్టులో పదిమార్కులకు తక్కువ వచ్చినవాళ్ళు లేచి నిలబడండి" అన్నాడు. ఇద్దరు నిలబడ్డారు. ఒకడు మద్ది పున్నారావు రెండవవాడు వెంకటప్పయ్య. పున్నారావు! నీకు ఎన్ని మార్కులు వచ్చినాయి అని మాస్టరుగారు అడిగారు. పున్నారావు వెంటనే నాకు అయిదండి, వాడికొచ్చింది మూడే' అని చెప్పాడు. ఫోర్తు ఫారంలో గుంటూరు పరిసర ప్రాంతాలలో పెద్ద కలరా ఎపిడమిక్ వచ్చింది. దాదాపు నెల రోజులు స్కూళ్ళు

మూసివేశారు. చావులు కూడా ఎక్కువగా వుండేవి. డాక్టర్లు రోగుల దగ్గరకు వెళ్ళేవారు కారు.

## గుండీ లేకపోతే గుంజీళ్లే :

మా ఇంగ్లీషు టీచరు మాచిరాజు కృష్ణమూర్తిగారు. ఆయన చాలా స్ట్రిక్టు. ఒక రోజున నేను చొక్కాకు పిన్నీసు లేకుండా వెళ్ళాను. ఆయన ఆఫీసులో రైటరు దగ్గరకు వెళ్ళి ట్వెయిన్ దారము తెచ్చుకొని ముడివేసుకోమన్నాడు. నేను వెళ్ళటానికి లేవగానే నా ప్రక్క చెంచయ్య అనే విద్యార్థి, తనకున్న రెండు గుండీలలో ఒకటితీసి ఇచ్చాడు. ఆ తర్వాత మేము కలుసుకోలేదు. ఈ కారణంగానే నేను ప్రాక్టీసు పెట్టిన తర్వాతకూడా నాదగ్గరకు వచ్చే ముఖ్యంగా చదువుకొనే వాళ్ళకు (విద్యార్థులకు) గుండీలు పెట్టుకోమని చెప్పేవాడిని.

మైలవరపు వెంకట్రామయ్యగారు ఎస్.ఎస్.ఎల్.సి.లో మాకు లెక్కలు చెప్పేవారు. సిలబస్ కవరు కావటంకోసం వారు శని, ఆది వారములు కూడా ఇంటి వద్ద లెక్కలు చెప్పేవారు. ఉదయం 8.00 గం.లకు ఇంటి దగ్గర నుండి వచ్చేవాడిని. మధ్యాహ్నం 11.00 గంటలకు ఇంటికి వెళ్ళేవాడిని. ఒకసారి ఎందుకో ఇంటికివెళ్ళడం కొద్దిగా ఆలస్యమైంది. మా అమ్మమ్మ ఒక గొడుగు, చెంబెడు మంచినీళ్ళు తీసుకొని నాకు ఎదురు వచ్చింది.

## తాత వెనక్కి–అమ్మమ్మ ముందుకు

నన్ను ఇంగ్లీషు చదువులో జేర్చిన తరువాత, నేను అక్కడ మానుకోవటం, వేరొకరి దగ్గర చదువుకుంటున్నానని, ఇంతకు ముందు చెప్పాను. అప్పటి నుండి నా చదువుకు ఖర్చు, మా తాతగారే ఇచ్చేవారు. అందరము ఒకే ఇంటిలో వుండేవారము. కనుక, మా మామయ్య (మేనమామ) ఈ విషయంపై కోపపడ లేదు. చదువు బాగా చదువు కొంటున్నాడని సంతోషించేవాడు. అయితే ఈ లోపల తండ్రీ కొడుకూ తగాదా పడి. ఒకే ఇంటిలో వేరు వేరుగా వుండేవారు. నేను ఎస్.ఎస్.ఎల్.సి. పాసయినప్పుడు మా అమ్మమ్మ, తాత, తాత్కాలికంగా మా తల్లి దండ్రులవద్ద (రామచంద్రపాలెంలో) వుండేవారు.

పై చదువుల గురించి మా తాత నన్ను నిరుత్సాహపరిచాడు. ఆనాటి ఎస్.ఎస్.ఎల్.సి. పరీక్ష పాసు కావటం అందులో మొదటిధఫా, మంచి మార్కులతో పాసు కావటం చాలా అరుదు. నేను బాగా ప్యాసయి. కాలేజీ ప్రిన్సిపాల్ ను కలసి సీటు సంపాదించి, స్కాలరు షిప్పుకూడా తీసుకోగలిగాను. మాతాత మాత్రం ఏ పరిస్థితులలో కూడా చదువు సాగటానికి వీలులేదన్నాడు. అప్పుడు మా అమ్మమ్మ "నా మెడలో నగలు అమ్ముకొని చదువుకో" అంది. గుంటూరులో బ్రాడీపేటలోని ఏకాదండయ్యగారి సత్రంలో మా అమ్మ... ఆమె చెల్లెలు కంటి ఆపరేషను కొరకు వుండేవారు. నేను అప్పుడు రెండు నెలలు సత్రంలో వుండి చదువుకొన్నాను. చదువు బాగాసాగింది. తరువాత మా అమ్మమ్మను "బెల్లంకొండ" తీసుకొని వెళ్ళి కంటి ఆపరేషను (చుక్కడం) చేయించి మాతాత ఆమెను ఇంటికి తీసుకొని వచ్చాడు.

అమ్మమ్మ చివరి కోరిక : అప్పట్లో మా మేనమామ స్వరాజ్య సమరంలో పనిచేస్తుండేవారు. 1941లో వ్యష్టి (వ్యక్తి) సత్యాగ్రహంలో చేరారు. ఈ సత్యాగ్రహానికి ముందు పోలీసులకు కబురు చేసేవారు. దీనికి గాంధీగారి నుండి అనుమతి రావాలి. ఈ వ్యష్టి సత్యాగ్రహం చేయగానే మా మేనమామ గారిని పోలీసులు అరెస్టుచేసి, గుంటూరు సభ్కలుకు తరలించారు.

ఈ జైలులో వుండగా ఒకసారి మా అమ్మమ్మ వచ్చి ఆయనను చూసింది. మా తాత మాత్రం "ఏం ఖర్మబట్టి జైలుకు వెళ్ళాడు" నేను రానన్నాడు. ఆయనను చూడటానికి వచ్చిన మా అమ్మమ్మ నిలబడి చూసి నిశ్చేష్టురాలైపోయింది. ఇంటికి రాగానే మంచం పట్టింది. అప్పటి దాకా తిరుగుతూవున్న ఆమె తిరగటంలేదు. మా మేనమామను రాజమండ్రి సెంట్రల్ జైలుకు నాలుగు నెలల శిక్షతో బ్రిటీషువారు సాగనంపారు. మాకు ఆ సంగతి తెలియదు.

వారం రోజులు మా అమ్మమ్మ మంచంలో వుంది. మా అమ్మరోజూ ప్రొద్దుననే వచ్చి సాయంత్రము మళ్ళీ రామచంద్రపాలెం వెళ్ళేది. వారం రోజుల తర్వాత ఆమె అవసానదశలో మా తాతయ్య ఆమెను ఏమైనా చెప్తావా అని

అడిగాడు. ఆమె "నా దగ్గర డబ్బులు లేవు. నేనేమీ డబ్బులు దాచిపెట్టుకోలేదు. కానీ నీ దగ్గర డబ్బులు. వున్నంతవరకు వీడికి నాకు) చదువు చెప్పించు" అని చెప్పింది. ఆ తరువాత ఆమె మరణించింది. ఈ సంఘటన తరువాత మాతాత మాత్రం నా చదువును గురించి కాదు, కూడదు అని ఏమీ మాట్లాడేవాడు కాదు.

మా అమ్మమ్మ మరణించిన తరువాత సామాను తీసుకొని, రామచంద్రపురం వచ్చాము ఇంటి తాళం మా మేనమామ భార్యకు ఇచ్చి నేను ఫోర్తు ఫారంలో వుండగానే మా అమ్మమ్మ మా మేనమామ తగాదా పడ్డారు. మనస్పర్థలతో విడిపోయినా అదే ఇంట్లో వేరుగా వుండేవారు.

**పున్నెం టిల్లాలు :**

"పుట్టిన యిల్లు కర్షక విభూతికి గైతకు మన్కిపట్టు, నీ
మెట్టిన యిల్లు విజ్ఞత కమేయ వదాన్యత కాటపట్టు, తోఁ
బుట్టువ! నీవు నీ విభుడు పుత్రులు, పుత్రికలేమి, వారికేల్
పట్టిన వారు రోగతతి పాలిట విశ్రుత సుశ్రుతల్ గదా!"

–శ్రీ యార్లగడ్డ వెంకటసుబ్బారావు



తక్కెళ్ళపాడులోని మాతామహుల గృహము.

# నేను–మా కుటుంబం

**సెభాష్ సాంబయ్యా! :**

మా నాన్న చనిపోయేనాటికి మేము అయిదుగురము మగ పిల్లలము, ముగ్గురు ఆడపిల్లలు, ఆడపిల్లలలో అప్పటికే ఇద్దరికి పెళ్ళిళ్ళు అయినవి. మూడవ అమ్మాయి 1947లో తన 12వ యేట టైఫాయిడ్లో మరణించింది. కనుక ఇంటి వద్ద, మా అమ్మతోపాటు నలుగురు తమ్ముళ్ళు వుండేవారు. వ్యవసాయ పనుల కొరకు ఒక పాలేరు వుండేవాడు. అతని పేరు జంపని సాంబయ్య. అతను 1944 నుండి 1951 వరకు, మాతోనే వుండి బాధ్యతగా పనిచేసినందువలన, మా అమ్మ అతనిని బాగా చూసేది. 1946లో మా మేనమామ పొలం అమ్మిన తరువాత కేవలం 10 ఎకరాల వ్యవసాయానికి ఒక జత ఎడ్లు, పాలేరు, అట్టహాసం అంతా భరించటం కష్టమైనా అంతకన్నా గత్యంతరము. లేదు. నా పెద్ద తమ్ముడు మురహరిరావుకు చదువు అబ్బలేదు. 1952 నుండి వ్యవసాయ బాధ్యతలు నిర్వహించాడు.

మా వద్ద పని మానేసిన సాంబయ్య ఆ ఏడు ఎనిమిది సంవత్సరాలలో నిజామాబాద్ జిల్లా వెళ్ళి పెళ్ళిచేసుకొని, కొంత పొలం కొనుక్కొని వ్యవసాయం చేసాడు. 1990 ఆ ప్రాంతంలో ఒకసారి గుంటూరు నన్ను చూడటానికి వచ్చాడు. అతనికి ముగ్గురో నలుగురో పిల్లలని అందరూ పై చదువులు చదివి ఉద్యోగాల్లో వున్నారని చెప్పాడు. నాకు చాలా ఆనందం కలిగింది.

**పెరిగిన బాధ్యతలు :**

మిగతా తమ్ముళ్ళు ఒక్కొక్కళ్ళు గుంటూరు హిందూ కాలేజీ హైస్కూలులో చదివారు. వారిని గుంటూరులో నావద్ద వుంచుకునేందుకు ప్రయత్నించాను. ఇక్కడ వాతావరణము, అనుకూలముగా లేనందువలన, నాలాగే, మా ఊరినుండి హై స్కూలకువచ్చి, చదువుకొని వెళ్ళేవాళ్ళు. ఎస్.ఎస్.ఎల్.సి. అయిన తరువాత

రెండో తమ్ముడు సత్యన్నారాయణ, 3వ తమ్ముడు సీతాపతిరావులను విజయవాడ లయోలా. కాలేజీలో జేర్పించాను. సత్యన్నారాయణకు కాకినాడ మెడికల్ కాలేజీ లోనూ, సీతాపతిరావుకు ఆంధ్ర మెడికల్ కాలేజీ విశాఖపట్నంలోను సీట్లు వచ్చినవి. దురదృష్టవశాత్తు, సీతాపతిరావు ఎం.బి.బి.ఎస్. పూర్తి చేయలేదు. చివరి తమ్ముడు మన్మధరావు గుంటూరులో పి.యు.సి.లో జేరాడు. పి.యు.సి. ప్యాసు అయినప్పటికీ ఎక్కువ మార్కులు రాలేదన్న వుద్దేశ్యంతో మరలా పి.యు.సి. చదివి కాకినాడ మెడికల్ కాలేజీలో సీటు సంపాదించగలిగాడు.

సత్యన్నారాయణ డాక్టరు అయిన తరువాత పిడుగురాళ్ళలో డాక్టరుగా స్థిరపడి 1983లో చనిపోయేవరకు (47 సం॥) మంచి డాక్టరుగా పేరు సంపాదించుకొని ప్రజాదరణ బాగా పొందగలిగాడు. మన్మధరావు చేబ్రోలులో కొన్నాళ్ళు ప్రాక్టీసు చేసి, ఆ తర్వాత ఐర్లాండు వెళ్ళి అక్కడనుండి యు.ఎస్.ఏ. వెళ్ళి అక్కడ స్థిరపడ్డాడు. నా తమ్ముళ్ళు. నా దగ్గర వుండకపోవటం, నా అత్త మామలు, బావమరుదులు సన్నిహితంగా వుండటం చూచిన ప్రజలు, నేను కుటుంబాన్ని విస్మరిస్తున్నానని, జయప్రద తరుపు వారిని ఎక్కువగా ఆదరిస్తున్నానని చెప్పుకోవటం నేను గమనించాను. ఒకసారి ఇంటికి వెళ్ళినప్పుడు. మా అమ్మతో మాట్లాడుతూ ప్రాక్టీసు పెట్టిన తరువాత, సంపాదించిన డబ్బు, మా బావ మరుదులు ఇద్దరూ స్థిరపడటానికి ఖర్చు పెట్టానని చెప్పాను. దానికి ఆమె "తప్పేముంది" వాళ్ళు కూడా మనలాగానే ఆశపడి చదివించుకున్నవారే కదా! మన పిల్లలు చిన్న వాళ్ళు. వాళ్ళకు ఇవ్వటం న్యాయమే" నంది. ఆ మాట నాకు ఎంతో బలాన్ని ఆనందాన్నిచ్చింది.

### చదువులో శ్రద్ధే వ్యవసాయంలోనూ :

మా ఊరిలోకూడా కొంత పొలాన్ని కొని, మా జాయింటు ఆస్తి, 10 ఎకరాలు, మా పెద్ద తమ్ముడు మురహరిరావుకు ఇచ్చినా స్వంతానికి కూడా కొంత పొలంకొనుక్కొని మొత్తం పొలాన్ని, అతనినే పండించుకోమని చెప్పాను.

చదువులో చూపిన శ్రద్దే. వ్యవసాయంలో చూపటంవలన ఆశించిన ఫలమురాలేదు.

పెద్ద చెల్లెలుకు అయిదుగురు సంతానం. ముగ్గురు ఆడపిల్లలు, ఇద్దరు మగ పిల్లలు, చిన్న వయస్సులోనే సామాన్య రైతుకు ఇచ్చి వివాహం చేసినందువలన, ఆర్థిక స్తోమత సరిగ్గాలేదు. పెద్ద అమ్మాయి సంతానానికి ఆర్థిక సహాయము అందించాను. రెండో చెల్లెలకు సంతానము లేదు. భర్త చాలా కాలము రోగి గావుండి 7 లేక 8 సంవత్సరాల క్రితం చనిపోయాడు. ప్రస్తుతం ఆ చెల్లెలే నా ఆలనా పాలనా చూస్తున్నది. పెద్ద చెల్లెలు పేరు సాంబమ్మ, చిన్న చెల్లెలు పేరు అనసూయ, సూరమ్మ అని పిలుస్తారు.

నలుగురు తమ్ముళ్ళ పెళ్ళిళ్లు నేనే చేశాను. కట్నం కామకల విషయంలో బేరాలేమి లేకుండా. మురహరిరావుకు సంతానము నలుగురు. ఇద్దరు ఆడ పిల్లలు, ఇద్దరు మగపిల్లలు, నలుగురిలో ముగ్గురు గ్రాడ్యుయేట్స్. ఆడ పిల్లలిద్దరూ గృహిణులుగా స్థిరపడ్డారు. మగపిల్లలిద్దరూ చిన్న వ్యాపారం చేసుకొంటున్నారు. మురహరిరావు భార్య పేరు వర్ధనమ్మ. రెండో తమ్ముడు సత్యన్నారాయణ భార్య పేరు ప్రమీల. సంతానము ముగ్గురు. వీరి పిల్లల పెండ్లిళ్ళు సత్యన్నారాయణ మరణం తర్వాతే జరిగినవి. ఆడపిల్లలిద్దరూ బాగానే స్థిరపడ్డారు. మొగపిల్లవాడు మాత్రం చిన్నప్పటినుండీ అజమాయిషీలేని కారణంగా గాడితప్పి ఆరోగ్యాన్ని కోల్పోయి భార్య, ఇద్దరు పిల్లలతో కాపురం చేస్తున్నాడు. మూడవ తమ్ముడు సీతాపతిరావుకు ఒక ఆడపిల్ల, ఒక మగపిల్లవాడు ఆడపిల్ల బ్యాంకు ఆఫీసరు, ఆమె భర్త చిన్నవ్యాపారస్తుడు. వీరు మద్రాసులో స్థిరపడ్డారు. మగపిల్లవాడు కంప్యూటర్ స్పెషలిస్టు అయి మద్రాసులో ఏదో కంపెనీలో మంచి ఉద్యోగం చేస్తున్నాడు. సీతాపతిరావు భార్యపేరు చిత్ర.

నాలుగవ తమ్ముడు మన్మధరావుకు మొదటి భార్యవలన ఒక కూతురు ఒక కొడుకు, అమెరికా వెళ్ళిన తర్వాత ఆ భార్య విడాకులు తీసుకొన్నది. కొడుకు చనిపోయాడు. కూతురు ఒక అమెరికన్ అబ్బాయిని వివాహం చేసుకొని, ఇద్దరు బిడ్డల తల్లి అయ్యింది. మన్మధరావు (రెండో వివాహము) అమెరికన్ లేడీ "మేరీ" ని వివాహం చేసుకున్నాడు. ఆమె ద్వారా ఒక కుమార్తె. ఆ పిల్ల కాలేజీ చదువుకు వచ్చింది. ఆ పిల్ల పుట్టినప్పుడు. 625 గ్రాములు బరువు. అది కూడా సిజేరియన్ చేసి తీశారు. ప్రీ మెచ్యూర్ బేబీ కనుక దాదాపు మూడు నెలలు హాస్పిటల్లో స్పెషల్ కేర్ తీసుకొని పోషించారు. దానికయిన ఖర్చు సుమారుగా ఒక లక్ష డాలర్లు. అదృష్టవశాత్తూ, శారీరకంగానూ, మానసికంగానూ 'మామూలు బిడ్డలాగానే పెరిగింది.

**సహవాస ప్రభావం:**

మా సంతానము ముగ్గురు ఆడపిల్లలు, ఇద్దరు మగపిల్లలు, అందరూ డాక్టరే స్పెషలిస్టులే (పి.జి. లే వారందరూ డాక్టర్లను చేసుకున్నారు. వారు స్పెషలిస్టులే) కొన్నాళ్ళు. క్రిందట నా జూనియర్ అయిన ఒక డాక్టరు "అదేం కుటుంబం అండీ, డాక్టరు సదాశివరావు ఇంట్లో కుక్క వున్నదో లేదో తెలియదు. వుంటే ఆ కుక్కకూడా డాక్టరు. అయ్యేది కదా! అని కామెంటు చేసాడు." నా పర్సనల్ బార్బరు "కృష్ణ"కు నలుగురు కుమారులు, అందులో ఇద్దరు డాక్టర్లు, ఒకరు ఇంజనీరు ఒకరు జె.కె.సి. కాలేజీలో లెక్చరర్.

సాన్నిహిత్యము వున్నప్పుడు ఎంతో కొంత ప్రభావము వుండకపోదు అని నా అభిప్రాయము. మా ఊళ్ళో "తాడిచెట్ల వరుస"లో ఒకటి రెండు వేపమొక్కలు వున్నాయి అవి కూడా తాడి చెట్లలాగే నిటారుగా పెరిగినవి. సహవాస ప్రభావం ఇంతేకదా అనుకొన్నాను. నాకు ప్రస్తుతం మనుమల సంతానము ఏడుగురు, వారిలో ముగ్గురు డాక్టర్లయ్యారు. ఇద్దరు మెడికల్ కాలేజీలో వున్నారు.

ఒక ఇంజనీరు, ఇంకొకరు డైటీషియన్ గా వున్నారు. మా కుటుంబం రెండు తరాలవరకూ ప్రజా సేవలో వుంటున్నదనే తృప్తి నాకు వుంది.

**డాక్టర్ల కుటుంబం :**

మా తరంలో నేను గమనించిన అంశం, డాక్టర్ల పిల్లలు ఎక్కువమంది డాక్టర్లే కావటం, అందులో ఏ స్పెషలిస్టు పిల్లలు అందులో స్పెషలైజు చేయటం. మా పిల్లల చదువులకు సంబంధించినంత వరకూ 12వ క్లాసు, ఇంటర్మీడియట్ మామూలు స్కూళ్లల్లో కాలేజీల్లో చదివించాము. పెద్ద అమ్మాయి రమాబాల 12వ క్లాసులో చాలా ఎక్కువ మార్కులు సంపాదించింది. ఆ అమ్మాయి ప్యూర్సైన్స్లో ఉన్నత విద్యనభ్యసించాలనే కోరిక, వాళ్ళ అమ్మ, దగ్గర చుట్టాలు మెడిసిన్లో చేరటానికి ఒప్పించి, అప్లికేషను పెట్టించారు. ఎం.బి.బి.ఎస్. ఎం.డి. డిగ్రీలు ఇక్కడ పొంది, ఇంగ్లాండు వెళ్ళిన కొద్ది కాలానికే ఎం.ఆర్.సి.పి. ప్యాసయింది. రెండవ అమ్మాయి ఉమాబాల గవర్నమెంటు కాలేజీలో అరమార్కుతేడాతో సీటు మిస్సయింది. తను ఎం.బి.బి.ఎన్. కావాలని పట్టుబట్టినందువలన కాకినాడ మెడికల్ కాలేజీలో జేర్పించాము. ఆమె ఎం.బి.బి.ఎస్.. పూర్తిచేసి, ఇక్కడ డి.జి.ఓ. ప్యాసయి ఇంగ్లండు వెళ్ళి ఆమె, ఆమె భర్త చాలా కాలం ఉద్యోగంచేసి, ఇటీవల ఇద్దరూ జనరల్ ప్రాక్టీషనరులైనారు. రమేష్ కూడా ఎం.బి.బి.ఎస్. చదవాలనే ఉద్దేశ్యం కలిగి, ప్రభుత్వ కళాశాలలో సీటు రానందువలన, కాకినాడలో ఎం.బి.బి.ఎస్. లో చేరాడు. ఇంగ్లండు వెళ్ళి ఉద్యోగం చేస్తూ ఎఫ్.ఆర్.సి.ఎస్. ప్యాసయ్యాడు. మూడవ అమ్మాయి ఉషాబాల, డాక్టరైతే చాలా కష్టపడాలి. కనుక నేను డాక్టరును కాను అని అంటూ వుండేది. అలానే కాలేజీలో జేరినప్పుడు ఆర్ట్ గ్రూపు తీసుకొని ఒక వారం అయిన తర్వాత సైన్సు గ్రూపు తీసుకుంది. సాధారణంగా ప్యాసయ్యింది. నాకు కూడా ఎం.బి.బి.ఎస్. చదవాలని వుంది అంది. అందువలన ఆమెను కూడా మెడికల్ కాలేజీలో చేర్పించాము.

మా రెండవ కుమారుడు సురేష్ మీ రందరూ డాక్టర్లు అవుతున్నారు. గదా. నేను ఆడిటర్నై మీరు సంపాదించినంత నేనూ సంపాదిస్తానని అనేవాడు.

ఇంటర్మీడియేట్లో జేరేటప్పుడు సైన్సు గ్రూపే కావాలన్నాడు. ఆడిటర్ కావలసినవాడికి సైన్సు గ్రూపు ఎందుకు అని అడిగితే "నేను ఆలోచించగా వీళ్ళందరూ డాక్టర్లే నేను ఒక్కడినే డాక్టరు కాలేకపోతే నన్ను తెలివి తక్కువ వాడనుకుంటారేమో, అందుకే నేను కూడా సైన్సు గ్రూపు తీసుకొంటున్నాను అని అన్నాడు. ఎంట్రన్స్ ఎగ్జామినేషను వ్రాసిన తర్వాత ఎట్లా వ్రాసావని అడిగాను. కాకినాడలో సీటు వచ్చేటట్లు వ్రాసానన్నాడు. అట్లానే కాకినాడలో సీటు వచ్చింది. ఎం.బి.బి.ఎస్. అయిన తర్వాత ధవణగిరిలో ఎం.ఎస్. తర్వాత ఇంగ్లండులో ప్రతిష్టాత్మకమైన లివర్పూల్ యూనివర్శిటీలో ఎం.సిహెచ్ (ఆర్థో) చేశాడు. ఆవిధంగా అందరూ డాక్టర్లు కాగలిగారు. అందరూ డాక్టర్లనే వివాహమాడారు. వారందరూ మెడికల్ పోస్టు గ్రాడ్యుయేట్లే. చాలామంది వీరందరూ కలసి "పాలీ క్లినిక్ పెడితే బాగుంటుందనుకొనే వారు. అలా జరగకపోవటానికి ఒక్క కారణం. అందరి స్వభావాలు. ఒకటిగాకపోవటం" కొంత నా తప్పుకూడా వుందేమోననిపి స్తుంది. వారి చదువులు పూర్తయ్యేలోపల, పాలీ క్లినిక్ నేను నిర్మాణం చేసివుంటే బహుశా అందులో పనిచేసేవారేమో. మాకున్నంత ప్రాక్టీసు వున్న డాక్టర్లు ఇంకెవరైనా ఆ పనిచేయగలిగేవారు. నా ఆలోచన ప్రకారం ఇప్పుడున్న హాస్పిటల్ ఇద్దరికి సరిపోతుందని, మిగతా ముగ్గురు హాస్పిటల్ నిర్మాణం చేసుకోవటానికి కావలసిన స్థలం సేకరించి వుంచాలనుకొన్నాను కానీ హాస్పిటలు నిర్మాణము కుదరలేదు.

మా పిల్లలు చదువు విషయంలోకానీ, పెండ్లిళ్ళ విషయంలో కానీ వారిఇష్టమే మా ఇష్టంగా జరిగింది. సామాజికంగా కూడా సత్యవర్తన కలిగి, సమాజానికి ఉపయోగపడే వ్యక్తులుగా తయారయ్యారు.

మనుమ సంతానము ఏడుగురిలో, ఐదుగురు వైద్య వృత్తిలోనే వుండటం, నాకు సంతృప్తికలిగించే విషయం.


డాక్టర్ల కుటుంబం
డా॥ కాసరనేని సదాశివరావు
డా॥ కాసరనేని జయప్రదాంబ
డా॥ రమాబాల, M.D. M.R.C.P.
డా॥ పుయ్యూరు సురేష్ M.S. (ENT)
డా॥ ఉమాబాల, M.B.B.S., D.G.O.,
డా॥ సి.వి. సుబ్బారావు, M.S. (G.S.)
డా॥ కాసరనేని రమేష్, F.R.C.S.
డాక్టర్ శ్రీవల్లీరాణి M.B.B.S., D.Ch., M.R.C.P.
డా॥ ఉషాబాల, . M.B.B.S. DIP.Diabitology.
డా॥ పి. విష్ణు ప్రియరావు M.D., Ph.D.,
డా॥ కాసరనేని సురేష్, M.S., (Ortho), M.Ch.
డాక్టరు యమున M.D.
సమీర్, B.Tech., M.S.
అనిత
ఆకాశ్
అన్య
డాక్టరు సుమన
తులసి (వైద్య విద్యార్థి)
డా॥ కృష్ణవర్ధన్, M.B.B.S.
డా॥ పల్లవి, M.B.B.S.
ఆశ, ఎం.ఎస్.
డా॥ భానుతేజ M.B.B.S.
జయప్రద
(వైద్య విద్యార్థి)


మా కుటుంబం
వెంకట కృష్ణయ్య - మహాలక్ష్మమ్మ
రామశాస్త్రి - సౌభాగ్యమ్మ
డా॥ సదాశివరావు
డా॥ జయప్రదాంబ
సామ్రాజ్యం
సాంబయ్య
అనసూర్య
సుబ్బారావు
మురహరిరావు
వర్ధనమ్మ
సత్యనారాయణ
ప్రమీల
సీతాపతిరావు
చిత్ర
మన్మధరావు
కస్తూరి - మేరీ
డా॥ రమాబాల
డా॥ ఉషాబాల
డా॥ రమేష్
డా॥ ఉషాబాల
డా॥ సురేష్
సుశీల
సూర్యప్రకాశరావు
ప్రమీల, కస్తూరి
సుధాకరరావు
(సంతానంలేదు)
రాజేంద్రప్రసాద్
జయశంకర్
కళ్యాణి
సుచిత్ర
లక్ష్మి,
వకుళ
వెంకటరత్నం
దివ్య తేజ
శిరీష్‌కుమార్
సౌజన్య ఇందిరా
జెన్నిఫర్
నా తోబుట్టువులలో ఒకరికి తప్ప అందరూ సంతానవంతులే. వారికి పిల్లలు వారి పిల్లలకు పిల్లలు కూడా వున్నారు.

# కళాశాల విద్య

## రిజల్టు చూడని స్నేహితుడు :

నేను ఎస్.ఎస్.ఎల్.సి. ప్యాసయిన తరువాత ఇంటర్మీడియేట్లో చేరాను. ఈ ఇంటర్మీడియేట్లో నా చదువు బాగా సాగలేదు. అప్పట్లో నా ఎడమకాలు పై జొన్న దుంప దిగబడింది. దీని వైద్యం దాదాపు నాలుగు నెలలు పట్టింది. ఇప్పటికీ నా కాలుపై ఆ మచ్చవుంది. అప్పట్లో పర్చూరి వీరయ్యగారి దగ్గర తరువాత గుంటూరు ప్రభుత్వ హాస్పిటల్లో వైద్యము చేయించుకున్నాను. చివరలో మా ఇంటి చాకలి వైద్యముతో ఈ గాయం మానింది. బాగున్నరోజున నడిచే స్కూలుకు వెళ్ళేవాడిని. ఇంటర్మీడియేట్ రిజల్టు కొరకు రోజు గుంటూరుకు నడిచివచ్చే వాడిని. నాలుగు రోజులు వచ్చిన తర్వాత రెండు రోజులు వెళ్ళలేదు. తరువాత గుంటూరు వచ్చి మా స్నేహితుని వద్దకు వెళ్ళి రిజల్టు గురించి అడిగాను. రిజల్టు మొన్న వచ్చినవి. నేను సెకండు క్లాసులో ప్యాసయినాను. నీ రిజల్టు నే చూడలేదన్నాడు. అప్పుడు అతను నేను కలసి గుంటూరు మున్సిపల్ లైబ్రరీలోకి వెళ్ళి చూశాము. నేను ఫస్టు క్లాసులో ప్యాసయ్యాను. నాది ఎం.పి.సి. గ్రూపు అయితే ఇంజనీరింగు మెడిసిన్ రెండిటికి అర్హత వుండేది. అప్పటికే ఇంజనీరింగు సీట్లు అయిపోయాయని చెప్పారు. మిగిలినది మెడిసిన్.

## చలానుకు బేడ :

అప్పట్లో సింగం పుల్లారెడ్డి అని గుంటూరులో మా మేనమామకు స్నేహితుడు వుండేవాడు. ఆయన విశాఖపట్నంలో శానిటరీ కోర్సులో జేరి మధ్యలో చదువు మానేసి వచ్చాడు. మా మేనమామ, శ్రీ జి.వి. పున్నయ్యశాస్త్రి, గంటా శేషయ్య వీరందరు కలసి స్నేహంగా వుండేవారు. వీరందరూ నన్ను మెడిసిన్ చదవటానికి ప్రోత్సహించారు. మా మేనమామగారు నెలకు రూ. 50 లు ఇవ్వటానికి ఒప్పుకొన్నారు.

ఆ రోజుల్లో అప్లికేషను పూర్తి చేయటం కూడా మాకు ఒక ఘట్టమే. దాదాపుగా అందరూ బేడ డబ్బులిచ్చి యితరులతో దరఖాస్తు పూర్తి చేయించుకునే వాళ్ళు. నేను మాత్రం స్వయంగా ఆర్జీ పెట్టుకొన్నాను. దీనికి మూడు కానులు, సెల్ఫ్ అడ్రసుకు కనుక ఇంకా మూడు కానులు, ఆ తరువాత అప్లికేషను పూర్తిచేసి పంపించాము. అప్పట్లో ఒక సంగతి బాగా గుర్తుంది.

తాలూకా ఆఫీసులో చటానా కట్టాలంటే అక్కడవున్న గుమస్తా 'బేడ' ఇవ్వకున్నాడు. (రూపాయికి 5 బేడలు) నేను ఇవ్వలేదు. అదే సమయంలో మా ఊరు మునులుగారు మోపర్తి వెంకటసుబ్బయ్యగారు వచ్చి "మా ఊరు పిల్లాడయ్యా" చేయి అని చెప్పారు. బ్రేడ ఇవ్వకుండానే చేయించారు. అప్పట్లో ఇంటర్మీడియేట్ అంటే రెండు సంవత్సరాల కోర్సు. ఇంటర్మీడియేట్ మొదటి సంవత్సరము ప్రభుత్వ పరీక్షలుండేవి. కావు, రెండవ సంవత్సరము పరీక్షలుండేవి.

**పంచలు కట్టటం నేర్పే ప్రిన్సిపాల్ :**

ఈ సందర్భంగా మా ప్రిన్సిపాల్ గారు శ్రీ బుద్ధిరాజు రామచంద్రరావు గారిని గురించి చెప్పుకోవాలి. వారు ఒరిస్సాలో జన్మించారు. ఆయన మొదట్లో హైస్కూలులో "హెడ్మాష్టరుగారు, చాలా ఖచ్చితమైన హెడ్మాష్టరు అని చెప్పుకొనే వారు. వారిని గురించి. ఎందరో ఎన్నో విధాలుగా ప్రశంసించేవారు. శ్రీ ఆవుల సాంబశివరావుగారు. శ్రీ డి.వి. నరసరాజుగారు ఆయన పిల్లలకు చేసే సహాయాన్ని గురించి ఇతరులకు చెప్పేవారు. డి.వి. నరసరాజు గారైతే వారిపైన ఒక కథే వ్రాశారు. అప్పట్లో పిల్లలు చాలా మంది పంచెలు కట్టుకొనేవారు. చాలా మందికి సరిగ్గారాదు. వారుతీసుక వెళ్ళి పంచెలు కట్టుకోవడం. నేర్పేవారు. నా విషయానికి వస్తే మూడు నాలుగు నెలలు ప్రత్యేక శ్రద్ధతో ఇంగ్లీషు బోధించారు. అప్పట్లో మా వూళ్ళో పోస్టు ఆఫీసు లేదు.

అందుకని నా అప్లికేషనుకు వారి అడ్రసు ఇచ్చాను. సీటు వచ్చిం తర్వాత నాకు కాండక్టు సర్టిఫికెట్టు ఇచ్చి Wish you good luck అని చెప్పి పంపించారు.

## ఒక జబ్బుకు రెండు డాక్టరు సర్టిఫికెట్లా?

బుద్ధిరాజు రామచంద్రరావుగారు చాలాకాలం, గుంటూరు టౌను హై స్కూలుకు హెడ్మాస్టరు (హిందూ కాలేజీ హైస్కూలుకు పూర్వమువున్న పేరు 1935లో హిందూ కళాశాల ప్రారంభించినప్పుడు హైస్కూలు పేరుకూడా మార్చి, హిందూ కాలేజీ హైస్కూలు అని పేరు పెట్టారు. అప్పటి వరకు హైస్కూలు పెద్ద మాస్టరుగా వున్న రామచంద్రరావు గారు కాలేజీ ప్రిన్సిపాల్ అయ్యారు). ప్రిన్సిపాల్ గా పదోన్నతి పొందినా కొన్ని సంవత్సరాలపాటు రామచంద్రరావుగారి పేరే హెడ్మాస్టరుగా వుండేది. ఈయన ఆకృతిలో కురచ, ఒక కన్నులేదు. చాలా గొప్ప హెడ్ మాస్టరుగా పేరు సంపాదించారు. కళాశాల ప్రిన్సిపాల్ అయిన తరువాత కూడా అదే పేరు నిలబెట్టుకున్నారు..

అప్పట్లో కాలేజీ, సెకండరీ గ్రేడ్ వరకే. అంటే ఇంటర్మీడియేట్ మాత్రమే వుండేది. విద్యార్థుల సంఖ్య కూడా పరిమితంగా వుండేది. అందువలన ప్రతి విద్యార్థి గురించి ప్రత్యేకమయిన శ్రద్ధ తీసుకొనేవారు. నేను 1940లో ఎస్.ఎస్. ఎల్.సి. ప్యాసు అయిన తరువాత బ్రాడీ పేటలో నివాసముంటున్న మా హెడ్మాస్టరు ప్రకాశంగారి ఇంటివద్ద ఎస్.ఎస్.ఎల్.సి. పుస్తకం తీసుకొని, అదే పేటలో వున్న రామచంద్రరావుగారి ఇంటికి వెళ్ళాను. "ఏం పనిమీద వచ్చావు అని అడిగారు. నా ఎస్.ఎస్.ఎల్.సి. బుక్ చూపించి, ఇంటర్మీడియేట్లో ఎం.పి.సి. గ్రూపు కావాలని అడిగాను, అప్పటికి కాలేజీలో ఎం.పి.సి. సీట్లు పరిమితంగా వుండేవి. మార్కులు చూసి తప్పకుండా ఇస్తానన్నారు. అంతవరకు హైస్కూలులో ప్రభుత్వమువారు, ఫీజులు సగంరాయితీ ఇచ్చేవారు. 1937లో వచ్చిన కాంగ్రెస్ ప్రభుత్వము, కమ్మకులస్తులను విద్యా విషయంగా పై కులంవారుగా మార్చారు.

అందువలన, కాలేజీకి వచ్చేటప్పటికి, పూర్తి ఫీజు కట్టవలసివచ్చింది. అందువలన, మీరు స్కాలరుషిప్ ఇస్తే తప్ప నేను చదవలేను అని అన్నాను దానికివారు, అసలే బీద కాలేజీ, మీరు ఫీజు కన్సెషను అడిగితే ఎలా? అన్నారు. సరే మీ ఇష్టం అండీ మీరు స్కాలరు షిప్పు ఇస్తే చదువుతాను, లేకపోతే ఏ.సి. కాలేజికి వెళ్ళవలసివస్తుంది అన్నాను. దానికి వారు రేపు సాయంత్రం కాలేజీ దగ్గరకు వచ్చి కనిపించమన్నారు.

అప్పటికి కాలేజీ ప్రారంభం చేయలేదు. మరునాడు సాయం కాలము నేను వెళ్ళేటప్పటికి హైస్కూలు ఆవరణలో మా హెడ్ మాస్టరు తెలికచర్ల ప్రకాశంగారు, లెక్కల టీచరు వి. రంగనాయకులుగారు ప్రిన్సిపాల్ గారు, నిలబడి మాట్లాడు కుంటూవున్నారు. నేను దూరంగా నిలబడి నమస్కారం చేశాను. మా హెడ్మాస్టారు తెలికచర్ల ప్రకాశంగారు, రామచంద్రరావుగారితో మా స్కాలర్ షిప్పు స్టూడెంటు అని చెప్పారు. సరే రేపు ఉదయం రా! అని మరునాడు వెళ్ళగానే అప్లికేషను తీసి 1/3 వంతు సీజు కన్సెషన్ అనగా టర్మ్కు 10 రూ.లు కన్సెషన్ను ఇచ్చారు.

ఆ తర్వాత ఇంటివద్ద మాతాత పేచీ పెట్టడం, మా అమ్మమ్మ నన్ను సపోర్టు చేయడం ఇంతకు ముందే వ్రాశాను. ఇంటర్మీడియేట్ మొదటి సంవత్సరంలో కాలికి దెబ్బ తగిలినందువలన నెలపైగా కాలేజీకి అటెండుకాలేదు. అప్పటి ఇంటర్మీడియేట్ మొదటి సంవత్సరంలో యూనివర్శిటీ పరీక్ష వుండేది కాదు. ఏదన్నా అటెండెన్సు సరిగ్గా లేకుంటేను ప్రోగ్రెస్ సరిగా లేకపోతేను కాలేజీవారు డిటైను చేసేవారు. అందువలన ఒకరోజు వారిని కలసి, "నాకు అటెండెన్సు సరిపోకపోవచ్చు కాలికి దెబ్బతగిలినందువలన రాలేదు అని చెప్పాను. దానికి ఆయన ఇద్దరు డాక్టర్లనుండి సర్టిఫికెట్టు తీసుకురమ్మన్నారు.

అదేమిటండీ ఒక జబ్బుకు ఇద్దరు డాక్టర్ల సర్టిఫికెట్లు ఎందుకు అన్నాను. సరే ఒక డాక్టరు వద్ద పట్టుకలాలే అన్నారు. మా మేనమామకు మిత్రుడు డాక్టర్

తాడేపల్లి విదానందంగారి వద్ద సర్టిఫికెట్టు తీసుకున్నాను. సంవత్సరాంత పరీక్షల్లో మార్కులు బాగానే వచ్చినవి. అందువలన ప్రమోషను మామూలుగానే జరిగింది.

## రెన్ గ్రామరు-వెర్కు టెన్స్ :

సీనియర్ ఇంటర్మీడియేట్లో ప్రిన్సిపాల్ గారు, ఇంగ్లీషు ప్రోజ్, కాంపోజిషన్ టీచ్ చేసేవారు. ఒకరోజు కాంపోజిషనులో తప్పు వ్రాశాను. దానికి ఆయన కోపపడి, నీవు స్కాలర్ షిప్పు స్టూడెంటువు కూడా వెర్కు టెన్సు తెలియకపోతే ఎలా? రైన్ గ్రామరు తీసుకొని ఐదు వెర్బ్ కు టెన్సు ఇంపొజిషన్ వ్రాసుక రమ్మన్నారు. అలానే వ్రాసుకు వెళ్ళాను. అప్పుడాయన "మీది తక్కెళ్ళపాడు"కదా, లీజర్ అవర్లో నా రూంకు రా, అన్నారు. ఆయన ఏమీ తీసుకొనేవారు కాదు. నేను ఇంటి నుండి అన్నం కారియర్ పట్టుకొని వెళ్ళేవాడిని. పది నిమిషాలలో నేను అన్నము తిని ఆయన రూముకు వెళ్ళేవాడిని, ఆరూములో చిన్నబల్ల ఒకటుండేది. అక్కడ కాంపోజిషన్లు యానొటేషన్లు మొదలైనవి. చెప్పి వాటిని సరిచూసేవారు.

ఇంటర్మీడియేట్ చివర రెండు నెలలు గుంటూరులోనే వుండి, కాలం వృధాగాకుండా చదివి పరీక్షలు వ్రాశాను, ఫస్టుక్లాసు వచ్చింది కాని ఇంగ్లీషులో మాత్రం 200 మార్కులకు 70 మాత్రమే వచ్చినవి. అది చూసి నేను ప్రిన్సిపాల్ గారిని అడిగాను. ఇవి నాకు వచ్చిన మార్కులేనా! మోడరేషన్ ఏమన్నా చేశారా? అంటే దానికి ఆయన మోడరేషన్లో ప్యాసు అయివుంటే, మొత్తం మార్కులు 60% వాటికి ఫస్టు క్లాసు ఇవ్వరు. కనుక ఇవి నీకు వచ్చిన మార్కులే అన్నారు. ఇంత వివరంగా వ్రాయటానికి కారణం. ఆయన నా పట్ల తీసుకొన్న శ్రద్ధవలననే. ఇంగ్లీషులో ప్యాసు అయినాను. అది తప్పినట్లయితే, డాక్టరును అయివుండే వాడిని కాదు. ఆయన చేసిన మేలుకు నేను జీవితాంతం కృతజ్ఞతతో వుండవలసిందే.

ఆయన విద్యార్థులను ఎవరిని కలిసినా ఇటువంటి కథలే చెప్తూవుంటారు. ఆవుల సాంబశివరావుగారు, డాక్టర్ నరసరాజుగారు ఇంకా కొంతమంది జూనియర్సుక్కూడా వారి అనుభవాలను పంచుకొంటుంటే ఎంతో ఆనందం కలుగుతుంది. 1946లో రిటైర ఆయ్యారు. ఆ రోజుల్లో పెన్షన్లు లేవు. రిటైరు

అయిన తరువాత కూడా చాలా సంవత్సరాలు, ఇంటి వద్ద ట్యూషన్లు చెప్పుకొనే వారు. 1962లో నాకు ముందు ప్రిన్సిపాల్ వద్ద చదివిన ఎం.ఎస్.పి. రమణయ్య అనే చిత్తూరు జిల్లావాసి గుంటూరు లేబరు ఇన్స్పెక్టరుగా వచ్చారు. వారు నావద్దకు వచ్చి, ప్రిన్సిపాల్ గారి పరిస్థితి ఏమీ బాగాలేదు. మనం ఏదన్నా ఆర్థిక సహాయం చేయాలన్నారు.

**ఉడతా భక్తి :**

మేం ఇద్దరం కలిసి రూ. 11116.00 లు వసూలు చేసి, ఏకాదండయ్య హాలులో వారి మరొక పూర్వ విద్యార్థి కొత్త రఘురామయ్యగారి అధ్యక్షతన సన్మానంచేసి, పర్సు బహూకరించాము. తరువాత గుంటూరు జె.కె.సి. కాలేజీ ప్రారంభించినపుడు, ప్రారంభము, ఎవరుచేయాలి అన్న ఆలోచన వచ్చినప్పుడు, జాగర్లమూడి చంద్రమౌళిగారు వై.కె.ఎస్. ప్రకాశరావు గారు నేను బుద్ధిరాజు రామచంద్రరావు గారితో చేయించాలని నిర్ణయించాము. ఇంతటి మహా వ్యక్తికి, వ్యక్తిగత జీవితంలో కొన్ని బాధలు తప్పలేదు. ఒక కుమారుడు. ఎం.బి.బి.ఎస్. చదువుతూ అకాల మరణం పాలైనాడు. మరొక కొడుకు తల్లి దండ్రులను పట్టించుకొన కుండాపోయాడు. భార్య చాలా రోజులు మంచంలోవుండి మరణించింది. ఇద్దరు కూతుళ్ళు మద్రాసులో బాగానేవున్నారు. ఆయన మరణించిన తరువాత ఆయన అల్లుళ్ళు ఇద్దరు, బల్లలు, కుర్చీలు నన్ను తీసుకొమ్మన్నారు. నేను కొంత మొత్తం ఇచి ఆ కుర్చీ బల్లలు, జె.కె.సి. కాలేజీకి ఇచ్చాను. ప్రిన్సిపాల్ రోశయ్యగారు ఆ రివాల్వింగ్ చైర్లో కూర్చొని మహదానంద పడేవారు.

ఆయన ఇప్పటి ఒరిస్సాలో, బరంపురంలో వున్న ఒక హైస్కూలులో టీచరుగాపని చేశారు. అప్పట్లో వుప్పల లక్ష్మణరావు ఆయన విద్యార్థి. ఇటీవల లక్ష్మణరావు ఆత్మ కథలో ఈ విషయం తెలుసుకున్నా. తరువాత చల్లపల్లిలో చేసి, ఆ తరువాత గుంటూరు వచ్చారు.

హిందూ కాలేజీని ప్రారంభించింది శ్రీ జాగర్లమూడి కుప్పస్వామి గారు. శ్రీ రామచంద్రరావుగారు జె.కె.సి. కాలేజీ ప్రారంభోత్సవ సభలో "మా కాలేజీని శ్రీ కుప్పస్వామిగారు ప్రారంభించారు. నేను వారిపేర ప్రారంభం అయిన కాలేజీని ప్రారంభిస్తున్నాను" అని చెప్పారు.

ఇంటర్మీడియేట్లో చివరి రెండు నెలలు గుంటూరులో వున్నాను. దీనికి కారణం మొదటి సంవత్సరంలో కాలికి దెబ్బ తగలటంవలన ఎక్కువ రోజులు : క్లాసులు పోయినవి. ఇంగ్లీషు, మాథమేటిక్స్లో వెనుకబడి వున్నాను. అప్పటికి కొంతమంది విద్యార్థులు ట్యూషన్లు చదివేవారు. ట్యూషను చదవాలంటే చాలా మందికి నామోషి. నేను రానూపోనూ టైం సేవ్ చేసుకొని, పరీక్షలకు తయారు కావాలనుకొని చివరి రెండు నెలలు గుంటూరులో వున్నాను. మా మేనమామ వ్యాపార రీత్యా రోజూ గుంటూరు వచ్చేవారని చెప్పాను. ఆ సంవత్సరము విశ్రాంతి కొరకు మూడు గదులు అద్దెకు తీసుకొన్నారు. ఆ ఇంటికి కరెంటులేదు, కిరోసిన్ లాంతరులో చదువుకోవటమే. హోటలు టిక్కెట్లు 30పుస్తకంలా వుండేది. దీన్నికొని ఇచ్చి ఒక రూపాయి చిల్లర డబ్బులు ఇచ్చారు. అవి ట్రంకుపెట్టెలో వేశాను.

**పరువు కాపాడిన మామయ్య స్నేహితులు:**

నా ప్రక్క పోర్షనులో ఇద్దరు విద్యార్థులు వుండేవారు. మీకు పాకెటుమనీ నెలకు ఎంతవుతుందని అడిగారు. పాకెట్ మనీ అనేమాటకు అర్థం తెలుసుగాని, పాకెటు మనీ ఎప్పుడూ నా దగ్గర వుండేదికాదు.

ఒక రోజు రాత్రి మా మేనమామ స్నేహితులు ఇద్దరు వచ్చి పడుకొన్నారు. వారిద్దరూ ప్రొద్దుననే హోటలుకు వెళ్తాం రమ్మని నన్ను కూడా పిలిచారు. నాకు అలవాటు లేకపోయినా, మా మేనమామ అతిథులకు ఆమాత్రం మర్యాద చేయక పోతే బాగుండదని, ట్రంకు పెట్టెలోని చిల్లర డబ్బులలో అర్థరూపాయి తీసుకొని బయలు దేరాను. బిల్లు వాళ్ళే చెల్లించారు. బయటకు వచ్చిన తర్వాత జేబులో వున్న నాణెం చూస్తే అది "కాని", కాని-అర్థరూపాయి ఒకే సైజులో వుండేవి.

ఇబ్బందికరమైన పరిస్థితినుండి బయటపడ్డా. మా మేనమామకు పిల్లలు లేరు. ఆయన భార్య, మా పెద్ద తల్లికూతురు–నాకు అక్కయ్య. ఆమె చెల్లెలుకు సంతానం వున్నారు. వారిలో ఒక అబ్బాయిని, ఒక అమ్మాయిని, ఇక్కడకు తీసుకొని వచ్చి పెంచేవారు మామామయ్య. నా ఎం.బి.బి.ఎస్. చదువు చెప్పించటానికి ప్రధానమైన కారణం ఆ పెంచే అమ్మాయిని నాకు ఇచ్చి వివాహము చేయవలెనని. అయితే ఈ విషయం మేమెప్పుడూ చర్చించుకోలేదు. ఆ రోజుల్లో ఎం.బి.బి.ఎస్. లో చేరేటప్పటికే కొంత మందికి పెళ్ళిళ్ళు అయ్యేవి. ఎం.బి.బి.ఎస్. లో చేరిన మొదటి సంత్సరం నుండే ఆడ పిల్లల తండ్రులు, వరాన్వేషణ చేసేవారు. అట్లానే నా దగ్గరకు కూడా చాలా మంది వచ్చేవారు. నేను నాకు మేనరికం వున్నది. అని ఒక్క ముక్కలో వారికి జవాబు చెప్పి పంపించేవాడిని. అయితే ఆ అమ్మాయి వయస్సుకూడా చాలా తక్కువ.

**మరణంపై మరణం :**

ఎం.బి.బి.ఎస్. మొదటి సంవత్సరములో వుండగా, మా తాత మరణించారు. ఆయనకు 80 సం॥లు. మరణించాడన్న బాధ వున్నప్పటికి పెద్దవాడు కదా మరణం సహజమేకదా అని సరిపెట్టుకొనేవాడిని. రెండవ సం॥లో వుండగా మానాన్న ఆకాల మరణం. స్ఫోటకంతో 45 ఏళ్ళకు మరణించాడు. చివరిసారిగా వచ్చిన పెద్ద ఎపిడమిక్, కాలేజీకి సెలవలైనందు వలన, నేను ఇంటి దగ్గరనే వున్నాను.

ఆయన మంచంలోవున్న పదిరోజులు నేనే సపర్యలు చేశాను. మా అమ్మ పసిబిడ్డ తల్లి, మన్మధరావుకు అప్పుడు 8 నెలలు. మా తండ్రి మరణంవలన మా అమ్మ నేను ఎంత కలత చెందామో ఊహించుకోవలసిందే.

**కలలు అన్ని వేళలా కల్లలు కావేమో!**

ప్రతి జీవికి జాగ్రదావస్థ, నిద్రావస్థ వున్న సంగతి మనందరికీ తెలుసు. మూడవది స్వప్నావస్థ. దీనిని గురించి ప్రజలకు, సంపూర్ణమైన అవగాహన వుండదు. ప్రతినిద్రలోనూ స్వప్నాలు రావటం సహజం. కొంతమందికి వాటి

గురించి ఏమీ గుర్తుండదు. వారు తమకు కలలు రావని అనుకుంటారు. కలలు గుర్తు వుండేవారికి కూడా, అన్ని కలలు గుర్తుండవు.. గుర్తున్న వాటిలో కూడా స్పష్టత వుండదు. ఫ్రాయిడ్ అనే జర్మన్ మేధావి డాక్టరు స్వప్నాలకు ప్రత్యేకమైన ప్రాముఖ్యతనిస్తూ ఇది మానవుని అధోచేతనలో జరిగే ప్రక్రియ అని, ఆ స్వప్నాలను విశ్లేషించినందువలన, మానవుని మనస్థితిని, తెలుసుకోవచ్చునని, దానిని ఆధారం చేసుకొని, సైకోథెరపీ అనే ప్రక్రియ ద్వారా మానవుని ఆరోగ్యాన్ని మెరుగుపరచటం, సాధ్యమని, నమ్మి, తన జీవితమంతా ఆవిధంగానే ప్రాక్టీసు చేశారు.

వారి అభిప్రాయం ప్రకారం, లైంగిక ప్రక్రియే ఈ స్వప్నాలకు, మానవ ప్రవర్తనకు కారణము అనేవారు. ఆ తర్వాత వచ్చిన యూంగు మానవ ప్రవర్తనకు సెక్సు ప్రధాన కారణం కాదని, జీవితంలో పైకి ఎదగటం అని నమ్మేవారు. కలలను గురించి తరువాత కాలంలో చాలా మంది పరిశోధనలు జరిపారు. దీనిపై చాలా పుస్తకాలు కూడా వచ్చినవి. నేను కొన్నిటిని చదివాను. అయితే సామాన్యులకు అర్థమైయ్యే పరిస్థితిలో లేవు. ఇప్పటకీ పారాసైకాలజీ అనే పేరుతో ప్రపంచవ్యాప్తంగా, పరిశోధనలు జరుగుతున్నాయి.

నాకు చిన్నప్పటి నుండి "కలలు ఎక్కువే". కొద్దిసేపు నిద్రపోయినా కల వస్తుంది. అందులో స్పష్టత తక్కువ. స్పష్టత వున్న కలల్లో రెండు కలలు చెప్తాను. నేను ఇంటర్మీడియేట్ రెండవ సంవత్సరంలో వున్నప్పుడు తెల్లవారుతుండగా ఒక కలవచ్చింది. మా బాబాయి గారింట్లో ఒక గదిలోవుండి చదువుకొనేవాడిని, నిద్ర మెలకువవచ్చే సమయంలో వచ్చిన కల ఇది. ఫోర్తు ఫారం నుండి (9వ క్లాసు నుండి) ఎస్.ఎస్.ఎల్.సి. వరకు నాతోపాటు పాలపర్రు విద్యార్థి తేళ్ళ సత్య నారాయణ చదివాడు. ఇద్దరము స్నేహంగా వుండేవారము. ఇద్దరము ఎస్.ఎస్. ఎల్.సి. ప్యాసు అయినాము. నేను హిందూకాలేజీలో ఇంటర్మీడియేట్లో జేరాను. అతను ఏమైనదీ నాకు తెలియదు. ఎప్పుడైనా ఒకసారి గుర్తుకు వచ్చేవాడు. ఈ

కలలో అతను గుంటూరులో జిన్నాటవరు దగ్గర కలిసినట్లు, కలవచ్చింది. నేను దీనికి అంత ప్రాముఖ్యత ఇవ్వలేదు. అదే రోజు అదేచోట గుంటూరులో, ఆ జిన్నాటవర్ వద్దనే నన్ను కలిశాడు. నాకు ఆశ్చర్యం వేసింది. తన వివరాలు అడిగి తెలుసుకొన్నాను. వాళ్ళ అన్నయ్య సుబ్బారావు కాకినాడలో బి.ఎస్.సి. చదువు తున్నందువలన తానుకూడా అక్కడే ఇంటర్మీడియేట్లో చేరినట్లు చెప్పాడు. దీనికి విశ్లేషణ చేయవలసిన పనిలేదు.

రెండవ కల ఎం.బి.బి.ఎస్. సెకండ్ ఇయర్లో వేసవి సెలవులకు వచ్చి మామూలుగా మా బాబాయి గారింట్లోనే పడుకున్నాను. మెలకువ వచ్చే సమయానికు కలవచ్చింది. ఏమిటంటే, లాంతరు ఆరిపోయినట్లు. నూ పిన్నిని పిలిచి "పిన్నీ లాంతరు ఆరిపోయింది. వెలిగించు" అన్నాను. ఆరిపోయిన దీపము వెలగదులే లేవమంది, వెంటనే కళ్ళు తెరిచాను. అప్పటికి ఆరోగ్య విషయంలో ఏ విధమైన అనుమానంలేని మానాన్న వారం రోజులలో మరణించటం జరిగింది. ఈ కలను అన్వయించుకొనవలసి వస్తుంది.

మాతాతగారు చాలా కష్టపడ్డారు. ఆయన 80 ఏళ్ళ వయస్సులో పోయారు. మా అమ్మమ్మ 70 ఏళ్ళ వయస్సులో పోయింది. మా అమ్మమ్మ మా తాత కంటే రెండు సంవత్సరాలు ముందు మరణించింది.



జి. ఎతిరాజులు, వై. ప్రతాప్‌కుమార్, నేను, వై.ఎస్. కృష్ణమూర్తి

# వైద్య విద్య

## సడలించిన డ్రస్ రెగ్యులేషన్:

జూలై 1–1942 విశాఖపట్టణంలో ఆంధ్రా మెడికల్ కాలేజిలో జేరటానికి ప్రయాణం. అంతకు ముందు నేను గుంటూరు నుండి ఏ దూర ప్రాంతానికి వెళ్ళ లేదు. మా మామయ్య స్నేహితుడు పుల్లారెడ్డి, అంతకుముందు వైజాగ్లో శానిటరీ ఇన్స్పెక్టరు కోర్సు మధ్యలో మానేశాడని చెప్పాను ఆయన నాకు తోడుగా వచ్చాడు. విశాఖపట్టణాన్ని, వైజాగ్ అని పిలవటం, అప్పటి అలవాటు. ఇంగ్లీషు "Vizhagapatnm". విశాఖపట్నం అని పిలిస్తే మొరటువాడి క్రింద లెఖ, స్వతంత్రం వచ్చిన తరువాత, చాలా వూళ్ళపేర్లు మార్చినట్లుగానే వైజాగపట్టణం–విశాఖపట్టణం అయింది. సీటు వస్తుందన్న నమ్మకంతోనే మెడికల్ స్టూడెంటుకు కావలసిన బట్టలు, కోటు, ప్యాంటు, షర్టు, టైలు, కొద్దికొద్దిగా సమకూర్చుకోవటం జరిగింది. అప్పటికి సూటు, బూటు తప్పనిసరి. సూటు గుడ్డ నాణ్యమైనది గజం 0=14 అణాలు (సింగిల్ ను) 7 గజాలు కావాలి. బూటు ఖరీదు 7. రూ.లు చెప్పులు రూ.1–25 పైసలు. అప్పటికే బట్టల కొరత ఏర్పడింది దేశంలో. తరువాత కొద్ది సంవత్సరాలకు ఈ కొరత ఇంకా పెరిగి, చొక్కా గుడ్డను కొనుక్కోవటానికి క్యూలో నిలబడి తెచ్చుకోవలసి వచ్చేది. ఒకటే ఇచ్చేవారు. యుద్ధమైన తర్వాత 1946లో ప్రభుత్వం డ్రస్ రెగ్యులేషన్ సడలించింది. కోటుతో పనిలేకుండా ఇన్షర్టుగానో, బుష్ షర్టుగానో వేసుకుంటే సరిపోతుందని నిర్ణయించారు. అన్నట్లు ఈ బుష్ షర్టు యుద్ధకాలంలో ఆవిర్భవించింది.

## ప్రతాప్కుమార్ పరిచయం :

విశాఖపట్నం అర్థరాత్రిలో దిగాము. ఊరు మధ్యలో టర్నర్ చార్టీలో దిగాము. తెల్లవారిన తరువాత అక్కడ పని పాటులు చేసుకొనేవాళ్ళు, వాళ్ళ మాటలు విన్న నేను, ఆంధ్రదేశంలోనే వున్నామా అని ఆశ్చర్యపడ్డాను.

అంతకు ముందు ఒక సారి రాజమండ్రి వెళ్ళినప్పుడే మాటల వ్యత్యాసం గమనించాను. తర్వాత తర్వాత అలవాటు పడ్డాము. 2వ తేదీన కాలేజీలో జాయిన్ కావటానికి వెళ్ళినప్పుడే, ప్రతాపకుమార్ పరిచయం ఏర్పడింది. వీరి స్వగ్రామం తురిమెళ్ళ, వారి పెదతండ్రి కొడుకు నానారావుగారు ఆంధ్రా యూనివర్శిటీలో అసిస్టెంటు రిజిస్ట్రారుగా వుద్యోగం చేసేవారు. వారింట్లో వుండి. ఇంటర్మీడియేట్ చదివాడు. సీటు వచ్చినందువలన అతను కూడా మెడికల్ కాలేజీలో జాయిన్ కావటానికి వచ్చాడు. అప్పటికీ యూనివర్శిటీ గుంటూరుకు వచ్చింది కనుక అతను కూడా లాడ్జిలో వుండవలసి వచ్చింది. అంతకు ముందు అక్కడ వున్న పరిచయాలతో లాడ్జి సదుపాయం తేలికగానే పొందగలిగాము. అంతకు ముందు కొద్ది నెలల క్రితం జపానవారి బాంబింగ్ జరిగినందువలన చాలా బిల్డింగులు ఖాళీచేసి, జనం బయటకు వెళ్ళిపోయారు. చెంగలరావు పేటలో ఒక మేడ 17 రూ.లు అద్దె (నెలకు) ఏడు లేక ఎనిమిది మంది వుండేవాళ్ళం. నాతోపాటు ప్రతాపకుమార్కు హైస్కూలులో క్లాస్మేట్ అయిన ఎడ్లపల్లి వాస్తవ్యుడు, అలపర్తి సుబ్బారావు కూడా మా లాడ్జిలోనే వుండేవాడు. ఈయన గుంటూరులో ఏ.సి. కాలేజీలో ఇంటర్మీడియేట్ చదివాడు. ప్రత్తిపాడు. గ్రామస్తుడైన గల్లా ఎతిరాజులు ఇతని క్లాసుమేటు. ఎతిరాజులు వేరే లాడ్జిలో వుండేవాడు. సుబ్బారావును చూడటం కొరకు ఎతిరాజులు అప్పుడప్పుడు వస్తుండేవాడు. ఆరకంగా పరిచయం ఏర్పడింది.

**ఎతిరాజులుతో పోటాపోటీ :**

ప్రీ రిజిస్ట్రేషన్ కోర్సు అయిన తర్వాత ఎతిరాజులు గుంటూరు వచ్చినప్పుడు మా స్వగ్రామం "తక్కెళ్ళపాడు" అని తెలుసు కొన్నాడు. తిరిగి వచ్చిన తర్వాత మా పరిచయం ఇంకా వృద్ధి అయింది. ప్రీ రిజిస్ట్రేషన్ కోర్సు అందరమూ ప్యాసయ్యాము. జనవరిలో రెగ్యులర్ కోర్సు మొదటి సంవత్సరం ఎం.బి.బి.ఎస్. లో జేరాము. అప్పట్లో పుస్తకాల ఖరీదు కూడా ఎక్కువగా వుండేది.

అందువలన ఇద్దరు ముగ్గురు స్నేహితులు. వున్నప్పుడు ఒకరు కొన్ని పుస్తకాలు, వేరొకరు కొన్ని పుస్తకాలు కొని అడ్జస్టు అయ్యేవాళ్ళము. ఏప్రియల్ నుండి జూన్ వరకు మూడు నెలలు శెలవలు. శెలవలలో నాదగ్గరవున్న "గ్రేస్ అనాటమీ" ఎతిరాజులు తీసుకొని మే 15 వరకు తన దగ్గరవుంచుకొని వాళ్ళవూరు రమ్మన్నాడు. నేను ప్రతాప కుమార్ ఇద్దరము ఆవూరు వెళ్ళాము. మే 15న ఆవూరు వెళ్ళినప్పుడు, వారింటి వాతావరణము. ఇరుగు పొరుగు సాన్నిహిత్యము, చూచి నాకు ఆనందము కలిగింది.

మరుసటి సంవత్సరము జూలైలో ఎతిరాజులు కూడా మా లాడ్జిలోనే వుంటూ నా రూమ్మేట్గా వుండేవాడు. చదువులో పోటాపోటీగా వుండేవారము. చివరిదాకా అట్లానే సాగింది. ఫస్ట్ ఎం.బి.బి.ఎస్.లో యూనివర్శిటీలో నేను ఫస్టు వచ్చాను. కొద్దిలో ఫస్టు క్లాసు మిస్సయ్యాను, తర్వాత 5 లేక 6 సంవత్సరాలకు, ఎగ్జామినర్స్ కొంత లిబరల్ అయ్యి, పస్టు క్లాస్ ఇస్తుండేవారు. 1944 డిశంబరు నాటికి, మొదటి సంవత్సరం ఎం.బి.బి.ఎస్. అయిపోయింది. అంతకు ముందు కొద్ది నెలల క్రితమే, మా నాన్నగారు. చనిపోయారు. కుటుంబములో పెద్ద కొడుకునైనందువలన, కుటుంబ భారము నేనే వహించవలసి వచ్చింది. అప్పటికి నాకు నలుగురు తమ్ముళ్ళు, ముగ్గురు చెల్లెళ్ళు వున్నారు. ఐతే మా తల్లి చాలా ఆత్మ స్థైర్యము కలిగిన మనిషి వ్యవసాయ పనులు చేయటం, చేయించటం తెలిసిన వ్యక్తి కనుక ఆ భారము తానే నిర్వహించింది. అప్పటికి మొదటి సంవత్సరం అయిపోయింది.

మా ప్రొఫెసర్లు : ప్రొఫెసర్ ఆర్. కృష్ణారావు అనాటమీ, ఆ ఒక్కర్నే పేరుతో గాకుండా ప్రొఫెసరు అని పిలిచేవారు. మిగతా ప్రొఫెసర్లను పేర్లతో పిలిచేవారు. చాలా గొప్ప వ్యక్తి, ఆ డిపార్టుమెంటులో డాక్టర్ సీతారామారావు, డా. మాథ్యూస్ అసిస్టెంటు ప్రొఫెసర్లుగా వుండేవారు.

డాక్టర్ సీతారామారావు ఆ సబ్జెక్టుపై అథారిటీ, డాక్టర్ మాథ్యూస్ విద్యార్థులకు చాలా తేలికగా అర్థమయ్యేటట్లు చెప్పేవాడు.

ఆర్గానిక్ కెమిస్ట్రీకి ముక్కామల కృష్ణమూర్తిగారు. మరువటానికి వీలులేని లెక్చరర్. వీరిని గురించి చిన్న సంఘటన చెప్తాను. 1962లో నేను రాజమండ్రి డాక్టర్ సీతారామ్ హాస్పిటల్కు వెళ్ళాను. ఆ క్లినిక్కు కృష్ణమూర్తిగారు వైద్యానికి వచ్చారు. నేను నమస్కారము చేసి నేను మీ విద్యార్థిని, మీ అంత గొప్ప లెక్చరర్ను ఇకముందు చూడలేనేమో" అన్నాను. ఆయన దానికి స్పందిస్తూ. "Let me return the compliment, we cannot get such students also " అన్నారు. యూనివర్శిటీ ప్రొఫెసర్లు ఎగ్జామైనర్లుగా వచ్చినప్పుడు ఏం కృష్ణమూర్తి, ఇంత చదువు ఎట్లా చెప్పగలిగావు. మా యూనివర్శిటీలో మా ఆనర్సు స్టూడెంట్సు కూడా ఇంత బాగా ఆన్సరు చేయలేరు. అనేవారు". డా కొంగర కోదండరామయ్య గారిలాంటి స్టూడెంట్సు ఆ బాబ్లో వుండే వారన్నాడు.

ఫిజియాలజీ ప్రొఫెసరుకు ఎం.బి.బి.ఎస్. క్వాలిఫికేషను. అప్పట్లో కేవలం ఎం.బి.బి.ఎస్. క్వాలిఫికేషనుతోనే కొందరు ప్రొఫెసర్లు కాగలిగారు. పోస్టు గ్రాడ్యుయేట్ కాకపోయినా ఆయనను ప్రొఫెసరుగా చేసారు. కష్టపడి చెప్పేవాడు వీరి పేరు నంబూరి అలహరిసింగరీ, బయో కెమిస్ట్రీకి వి.కె. నారాయణమీనన్ చాలా స్ట్రిక్టుగా వుండేవాడు. ఎప్పుడూ సిల్కు సూటు వేసుకొనేవాడు. నాలెడ్జిలో అపుడేటుగా వుండేవాడు.

మేమెవరము అచ్చు పుస్తకాలు కొనేవాళ్ళము కాదు. ఆయన చెప్పిన నోట్సే మాకు సరిపోయేది.

మొదటి సంవత్సరం ఎం.బి.బి.ఎస్. పరీక్ష యూనివర్శిటీ పరీక్ష, అయిన తరువాత బోర్డు ఎగ్జామ్స్ మీటింగు అక్కడే జరిగేది. రిజల్టు ఫైనలైజు చేసేవాళ్ళు. తరువాత యూనివర్శిటీకి పంపేవారు.

మీటింగు అయ్యేటప్పటికి విద్యార్థులంతా బయట వేచి వుండేవారు. బయటకు వచ్చిన ఎగ్జామినర్స్ వెంట రిజల్సు కొరకు వెంటపడేవాళ్ళం. ఎవరో ఒక ప్రొఫెసరు చెప్పేవాడు. మా ఎగ్జామినేషన్లో నారాయణ మీనన్ గారు ఫలితాలు చెప్తూవున్నారు. నేను దగ్గరకు వెళ్ళాను. "You too come, for the results" అని వెళ్ళి పోయారు. నిజానికి నేను వెళ్ళింది రిజల్ట్సు కొరకు కాదు. ఫస్టు వచ్చానో లేదో తెలుసుకొందామని. ఫస్టు వచ్చానని తర్వాత తెలిసింది. ఆ తర్వాత ఏ పరీక్ష రిజల్ట్సు కొరకు వెయిట్ చెయ్యలేదు.

## అప్పట్లో టైఫాయిడ్ కూడా ప్రాణాంతకమే:

చదువు సాఫీగా జరిగిపోతూవున్నది. 1946 లో నాలుగవ సం॥లో వేసవి శెలవలకు ఇంటికి వచ్చేటప్పటికి మా అమ్మ మనస్థాపానికి గురైవున్నది. ఆదరణ ఆశించిన అన్న నుండి నిరాదరణ ఎదురైంది. ఆ పరిస్థితి అర్థం చేసుకొన్న నేను మా మేనమామతో తను పెంచే పిల్లను పెండ్లి చేసుకోనని చెప్పాను. సహజంగానే ఆయన నా చదువును గురించి పట్టించుకొనలేదు. ఆ తర్వాత మా కుటుంబానికి వచ్చే స్వల్ప ఆదాయంతోనే నా చదువు కొనసాగించాను. నేను ఫైనలియ్యరులో వున్నప్పుడు మా ఊరులో టైఫాయిడ్ ద్వారాలు వచ్చినవి. మా కుటుంబములో ఇద్దరు చెల్లెళ్ళు ఒక తమ్ముడుకు కూడా టైఫాయిడ్ వచ్చింది. ఆ విషయం తెలిసి నేను ఆగష్టు 15 (15-8-1947)న ఇంటికి వచ్చాను.

మా చిన్న గ్రామములో, ఒక కుటుంబములో టైఫాయిడ్ వలన ముగ్గురు మరణించారు. ఇంకా చాలా మంది మంచాలలో వున్నారు. ఆ రోజులలో, టైఫాయిడ్కు మందులేదు...ఇంకా క్లోరోమైసిటిన్ కనుగొనబడలేదు. ఒక పెన్సిలిన్ మాత్రమే వచ్చింది. అప్పటికి గుంటూరులో డాక్టర్ వై. వి. సుబ్బారావుగారు ప్రాక్టీసు పెట్టారు. వారివద్ద వైద్యమునకు వెళ్ళినప్పుడు, ప్రత్యేక వైద్యము ఏమీ లేదు కనుక, ఇంటి దగ్గరే వుంచి ఉపశమనానికి మందులు వాడమని సలహాఇచ్చారు.

ఒక చెల్లెలు, తమ్ముడు దాదాపు నలభై రోజులకు బ్రతికి బట్టకట్టారు. మరొక చెల్లెలు వ్యాధి తీవ్రతతో మరణించింది.

డాక్టర్ వై.వి. సుబ్బారావు గారు ప్రాక్టీసు మానివేసి ప్రభుత్వ ఉద్యోగానికి వెళ్ళారు. తర్వాత డా జె.వి. కృష్ణారావు గారి సలహాతో వైద్యము చేసేవాణ్ణి. మా చెల్లెలి వ్యాధి పూర్తిగా తగ్గక ముందే నేను విశాఖపట్టణం వెళ్ళాను. నేను వెళ్ళిన వారం రోజుల తర్వాత, ఆ అమ్మాయి వ్యాధి తీవ్రమై గుంటూరుకు డాక్టర్ జె.వి. కృష్ణారావుగారి దగ్గరకు తీసుకొని వచ్చినా ప్రయోజనం లేకపోయింది. ఆమె మరణించింది. ఆ విషయం నాకు తర్వాత వారం రోజులకు ఉత్తరం వ్రాశారు. ఆ ఉత్తరం ఉదయం అందుకొన్నాను. సాయంత్రానికి ఇంకొక చెల్లెలుకు జబ్బు చేస్తే కుగ్లరు హాస్పిటల్లో చేర్చినట్లు తెలిసింది. ఇక ఆ రాత్రే బయలుదేరి గుంటూరు రావటం జరిగింది. మా అమ్మాయికి ఎక్లాంప్సియా (గుర్రపు వాతం) నేను వచ్చే సరికి నెమ్మదించింది.

**అమ్మ మనసు వికలం :**

అప్పటికి రెండు మూడు రోజుల నుండి మా చెల్లెలు దగ్గర వున్న మా అమ్మ, నేను దూరపు బంధువు ఒకామెను రోగి దగ్గర వుంచి మా ఊరు నడచి వెళ్ళాము. ఆ ప్రయాణములో మా అమ్మ చెప్పిన విషయం ఒకటి మరచిపోలేను. చనిపోయిన చెల్లెలు చివరి రోజులలో జబ్బు విషమించినప్పుడు డాక్టర్ జె.వి. కృష్ణారావుగారిని వచ్చి చూడమని కోరగా మీ ఊరికి కారు రాదుగదా! అందువలన నేను రాలేను. రోగినే తీసుకొని రమ్మని చెప్పారు. "రేపు నీవు డాక్టరువయిన తర్వాత ఇట్లానే అంటావా అని అన్నది. రెండవ విషయము, కృష్ణయ్య అన్నా బ్రతికివుంటే బాగుండేది కదా (నా తర్వాత అతను) ఈ కృష్ణయ్య నా తమ్ముడు, 1928-29 ప్రాంతాలలో చనిపోయాడు. మామూలుగా మా ఇంట్లో చనిపోయిన వారిని గురించి ఎక్కువ మాట్లాడుకోవటం అలవాటులేదు. అతనికి నాలుగేళ్ళప్పుడు ఒళ్ళు కాలి చనిపోయాడు.

గత 20 సం॥లలో కృష్ణయ్యను గురించి మేమెప్పుడూ మాట్లాడుకొన్న గుర్తులేదు. దాదాపు మూడు నెలల నుండి బిడ్డలు వ్యాధితో వున్నారు కనుక వారి సేవలోపడిన, శారీరక మానసిక వ్యధను ఈ రూపంగా వెళ్ళడించింది. ధర్మం సరిగ్గా నిర్వహించలేదన్న భావం కాదు కనీసం అన్న–అన్న భార్యకూడా తొంగి చూడలేదు. అప్పటి నుండీ ఇప్పటికీ నేనీ మాటలు మరచిపోలేను.

నవంబరు మొదటి వారంలో విశాఖపట్నం చేరాను. డిశెంబరు 9న ఫైనలియర్ ఎగ్జామినేషన్లు. అందువలన పరీక్షలకు హాజరవ్వటమా మాను కోవటమా అని మీమాంస వచ్చింది. ఈ సమయంలో మా స్నేహితులు, క్లాసు మేట్సు పరీక్షకు వెళ్ళమని ఒత్తిడి చేశారు. ఆరకంగా పరీక్షకువెళ్ళటం జరిగింది. మొదటి స్థానం రాకపోయినా నాలుగో అయిదో స్థానం వచ్చింది. మా క్లామమేట్ ఎతిరాజులకు ఫస్టు ర్యాంకు వచ్చింది. ఎం.బి.బి.ఎస్. మొదటి సంవత్సరంలో నాకు ఫస్టు ర్యాంకు వచ్చినప్పుడు ఎతిరాజులు ఎంత ఆనందించాడో నేను అంతకన్నా ఎక్కువ ఆనందపడ్డాను.

ఆగష్టు 15 నుండి డిశెంబరు చివరి వరకు తిరగటం, ఇంటిదగ్గర రోగులకు మందుమాకులు చూడటం, ఆర్థిక ఇబ్బందిలు వచ్చాయి. అదే సమయంలో నేను ఫైనల్ ఇయర్ ట్యూషన్ ఫీజు కట్టిన రూ. 200 లు వాపసు వచ్చింది. అప్పటికి ఆంధ్రా మెడికల్ కాలేజీలో రెండు ఫ్రీ స్టూడెంట్ షిప్పులు వుండేవి. ఒకటి బ్యాక్వర్డు కాస్టు, రెండవది. ఫార్వర్డుకాస్టు వాళ్ళకు. బ్యాక్వర్డు ఫ్రీ స్టూడెంటు షిప్పు 3వ సం॥లోనే ఎతిరాజులుకు వచ్చింది. రెండవది నాకు ఫైనల్ ఇయర్లో వచ్చినది. ఆ డబ్బుతో నేను ఎగ్జామినేషన్ ఫీజు కట్టటమేకాక, ఆర్థిక ఇబ్బందులలో వున్న ఒక స్టూడెంటుకు కూడా ఫీజు కట్టాను, దీనితో 1947 డిశెంబరు నాటికి నా డాక్టరు చదువు పూర్తియింది.

అప్పుడు హౌస్ సర్జన్సీ తప్పనిసరి కాదు అయినా అందరమూ చేసే వాళ్ళము.. ఎవరో ఒకరిద్దరు హౌస్ పర్దను మానివేసి వెళ్ళారు. హౌస్ సర్జన్లలో

కొంతమందికే స్టైఫండు వచ్చేది. అది రూ. 88 లు. ఇంటి దగ్గర ఆర్థిక పరిస్థితి తెలుసు కనుక ఇంటి వద్దనుండి ఏమీ డబ్బు తీసుకొనలేదు. అప్పటికి మిత్రుల దగ్గర సుమారు రూ.150 లు చేబదులు తీసుకున్నాను. ఆమొత్తాన్ని హౌస్ సర్జన్ గా తీర్చగలిగాను.

హాస్పటలులో మొట్టమొదటి పోస్టింగు సర్జరీ వార్డులు. సర్జను డాక్టర్ మహదేవన్ అసిస్టెంటు సర్జను డాక్టర్ పిన్నమనేని వెంకటేశ్వరరావు. ఈయన చాలా స్టయిలిష్ వుండేవారు. అదే సంవత్సరములో ఆయన ఎం.ఎస్. పరీక్షకు హాజరు అయ్యారు. ఆంధ్రా యూనివర్శిటీలో (మెడికల్ పోస్టు గ్రాడ్యుయేట్ ఎగ్జామ్స్ 1945) వీరు ఎం.ఎస్. పాసయ్యారు, అంతక్రితం ఎవ్వరూ ప్యాసు కాలేదు. డాక్టర్ సదాశివన్ కూడా ఇదే సంవత్సరం వీరితోపాటే ప్యాసయ్యారు. పిన్నమనేని వంశంతో నాకున్న అనుబంధమువలన, మనస్సులో నేను కూడా ఎం.ఎస్. తీసుకోవాలని అభిప్రాయము ఏర్పడింది.

ఫార్మకాలజీ ప్రా॥ ఈశ్వరయ్యగారు. వీరు డాక్టరు డేవిడ్ కలసి ఫార్మాకాలజీ. టెక్స్టు బుక్ కూడా వ్రాశారు. ఈ సబ్బుక్టులో కూడా టెక్స్ట్బు బుక్ పనిలేకుండా వారిచ్చిన నోట్సే మాకు సరిపోయేది. చాలా లిబరల్ ఎగ్జామినర్, పాథాలజీ, మైక్రోబయాలజీ రెండు సబ్జెక్టులకు ప్రొఫెసర్లు M.R.C.P., F.R. C.P. ఒకరు డాక్టర్ భాస్కరమీనన్ (ఫార్మసీ) డాక్టర్ ఎన్.జి. పండలే (మైక్రో బయాలజీ) ఇద్దరూ గొప్ప ప్రొఫెసర్లే కాని, మైక్రోబయాలజీ ప్రొఫెసరు ఇమ్యూనిటీ అండ్ అలర్జీ చెప్పటానికి చాలా కన్ఫ్యూజ్ అయ్యేవాడు. మమ్ములను కూడా కన్ఫ్యూజ్ చేశేవాడు. Ophthalmology ప్రొఫెసరు డాక్టర్ ఘంటాయట్ క్లాసు ఓ.పి.లో టీచింగు చాలా బాగుండేది. ఆ సబ్జెక్టు కూడా టెక్స్టు బుక్తో పనిలేదు. ఇ.ఎన్.టి.కి కూడా తిరుమలరావుగారు, తరువాత డాక్టర్ పిన్నమనేని నర సింహారావుగారు జనరల్ సర్జరీ, డాక్టర్ ఎస్.వి.బి. షెపర్డు, తరువాత డాక్టర్ మహాదేవన్, డాక్టర్ రమణమూర్తి ఇంకొకరు డా కనక సర్వేశన్ అందరూ చాలా మంచి ప్రొఫెసర్లు, మంచి సర్జన్లే...

**శస్త్ర చికిత్సా నైపుణ్యం** : డా. పిన్నమనేని వెంకటేశ్వరరావుగారు సర్జికల్ రిజిస్ట్రార్గా వుండేవారు. వారు థర్డు ఇయర్లో మైనర్ సర్జరీ చెప్పేవారు. ఒక క్లాసు ఎగ్జామినేషనులో రెండు ప్రశ్నలు ఇచ్చి పరీక్షకు ముందే ఒక విషయం చెప్పారు. అవసరమైన దాని కన్నా ఎక్కువ రాస్తే రెండు మార్కులు కట్ చేస్తానన్నారు. పేపరు వాల్యుయేషను అయిన తరువాత క్లాసుకు తీసుకొని వచ్చి నా పేపరు చేత్తోపట్టుకొని "Here is a paper in which there is nothing less and Nothing more" అని చెప్పారు. అప్పటి నుండి నాకు వారిని గురించి పదభిప్రాయం వుండేది. గుంటూరు జనరల్ హాస్పిటల్లో ఆయన ఆవరరీ పర్జన్ గా మానుకొన్న తరువాత నేను ఆనరరీ సర్జను అయ్యాను. ఆపిరియడ్లో ఒకసారి నా ఆపరేషన్ డే రోజున ఆయన వేరే పనిమీద ఆపరేషను థియేటరు వద్దకు వచ్చారు. "ఏం సర్జరీ చెయ్యబోతున్నావ్ సదాశివరావు అని నన్ను అడిగారు. "Radical Mastectomy చేయబోతున్నాని చెప్పాను. (రొమ్ము క్యాన్సరుకు, రొమ్ముతీసి వేయటం) శస్త్ర చికిత్సారంగంలో ఈ ఆపరేషనుకు ఒక ప్రత్యేకత ప్రతిష్టవున్నాయి. నేను ఆపరేషను మొదలు పెట్టిన దగ్గరనుండి చివరి కుట్టువేసేవరకు అలాగే నిలబడి చూశారు. "That is good" అని బయటకు వెళ్ళారు. నా శస్త్ర చికిత్సా నైపుణ్యానికి పెద్ద సర్టిఫికేట్ నేను దీనిని పరిగణిస్తాను..

మెడిసిన్ డాక్టర్ పి. కుటుంబయ్య, డాక్టర్ మేజర్ షాన్, డాక్టర్ రామన్. డాక్టర్ కుటుంబయ్యగారు సబ్జక్టుతో పాటు ఎన్నో విషయాల గురించి అఖండంగా ఉపన్యాసం చేసేవారు.

సి.వి. రామన్ గారు 1, 2, 3 అని పాయింట్లు లాగా చెప్పేవాడు. మేజర్ షాన్ హిమటాలజీ ఎక్కువ స్టడీ చేసినవారు. వారి గైడెన్సవల్ల డాక్టర్ రామలింగస్వామి (ఢిల్లీ). ఎం.డి. చేశారు.

వకాలజీ ప్రొఫెసర్ ఆర్.జె. క్రిష్ణన్ క్లాసులో మెల్లగా మాట్లాడేవారు. ఆయన ఒకరోజు బ్రీచ్ డెలివరీ (కాళ్ళతో బిడ్డపుట్టడం) చేసేటప్పుడు, పై నుంచి లేడీ

డాక్టరు గారు సహాయకారిగా వున్నారు. ఆమె బలం చాలలేదు. అప్పుడు నా సహాయం అడిగారు. నోట్సులో కూడా నేను సహాయము చేసినట్లు వ్రాశారు.

ఆడపిల్లల పట్ల విచక్షణ అప్పుడే వుండేది. ఒక గ్రుడ్డి ఆమె కాన్పు కొరకు హాస్పటలుకు వచ్చింది. అప్పటికి ఐదు లేక ఆరవ కాన్పు. అందరూ ఆడపిల్లలే. ఈ కాన్పులో మగపిల్లవాడు పుట్టాడు. ఆమె విన్న వెంటనే "అత్తమ్మ మగపిల్లవాడు" అని కేకవేసింది.

ఆ డిపార్టుమెంటులో ఒక హెడ్ నర్సువుండేది. ఆంగ్లో ఇండియన్, మంచి పర్సనాలిటీ. డెలివరీ రూంలో సబ్జక్టు ఎంతో గొప్పగా చెప్పేది. మాకు ఆశ్చర్యము కలిగేది. మొత్తం మీద అప్పట్లో హాస్పటలులో అడ్మిషన్స్ 50 మాత్రమే, టీచర్లు అందరూ స్టూడెంటు గురించి ప్రతి ఒక్కరిని చాలా జాగ్రత్తగా చూసుకొనేవారు.

ఆ సంవత్సరం పరీక్షలో ఎం.ఎస్. డిగ్రీ పొందినది నేను ఒక్కడినే. మిగతా ఆరుగురిలో ఒక్క లక్ష్మీనరసమ్మ గారు తప్ప మిగతావారంతా ఆ ప్రయత్నం విరమించుకొన్నారు. లక్ష్మీనరసమ్మగారు మాత్రము 10 లేక 15 సంవత్సరాలు పట్టు విడువకుండా, పరీక్షకు వెళ్ళి చివరకు ఉత్తీర్ణులైనారు. అయితే ఆ తరువాత ఎక్కువ రోజులు జీవించలేదు.

**హౌస్ సర్జనుగా అనుభవాలు:**

మొదటి పోస్టింగు హౌస్ సర్జనులో, మొదటి మూడు నెలలు డాక్టర్ అనంతాచారిగారి యూనిట్లో, డా కె. కోదండరామయ్యగారు అసిస్టెంట్ సివిల్ సర్జన్ గా వుండేవారు. నేను విద్యార్థిగా వున్నప్పుడు, చదవటానికి తక్కువ సమయం మెడిసిన్ కు కేటాయించేవాడిని. ఆ మూడునెలలో మెడిసిన్ను గురించి చాలా ఎక్కువ నేర్చుకోగలిగాను. వార్డులో చాలా ఎక్కువ సమయం గడిపేవాడిని. డాక్టర్ కోదండరామయ్య గారితో అంతకు ముందే పరిచయం వున్నందువలన చాలా చొరవగా ప్రతి విషయాన్ని గురించి అడిగి తెలుసుకోగలిగేవాడిని. ఆ

పోస్టింగు పూర్తి అయ్యేలోపల, మెడికల్ సైడు నాకు మంచి ఫిజీషియన్ కాగలను అన్న నమ్మకం ఏర్పడింది. డా కోదండ రామయ్యగారు అప్పటికే ఎం.డి. పాసయ్యారు. రోగ నిర్ధారణలోనూ, ట్రీట్మెంటులోను చాలా సమర్థులు. టీచింగు కూడా అంతే, వారు తరువాత ఆంధ్రప్రదేశ్లో చాలా గొప్ప ఫిజిషియనుగా పేరు తెచ్చుకున్నారు.

**కలలో కనిపించే సర్జన :**

ఆ తర్వాత సర్జికల్ సైడు. డాక్టర్ రమణమూర్తి గారు సర్జను. డాక్టర్ స్నిమనేని వెంకటేశ్వరరావుగారు అసిస్టెంటు డాక్టర్ భావరాజు దయానందరావు గారు ఇంకొక అసిస్టెంటు.

డాక్టర్ పిన్నమనేని వెంకటేశ్వరరావు గారు తరువాత విజయవాడ లో ప్రాక్టీసు పెట్టి, గొప్ప సర్జనుగా పేరు తెచ్చుకొన్నారు. డాక్టర్ దయానందరావుగారు న్యూరో సర్జన్ ప్రభుత్వంలో సేవలందించి, రిటైరయ్యారు. ఆ రోజులలో ఎంత సర్జరీ చేసేవాళ్ళమో చెప్తే నమ్మరు. ఉదయం 8.00 లకు ధియేటరులోకి వెళ్ళి రాత్రి 10 లేక 11 గంటల వరకు సర్జరీ జరుగుతూనే వుండేది. వార్డులో రోగుల సంఖ్య కూడా చాలా ఎక్కువగా వుండేది. 20 బెడ్లువున్న వార్డులలో, 60-70 మంది రోగులుండేవారు. (ఫ్లోర్ బెడ్స్) అంత కష్టపడి పనిచేసినా, ఎవరూ విసుక్కునేవారు కారు.

డాక్టర్ దయానంద్ రావుగారు ఎప్పుడూ ఒకమాట అంటుండేవారు "నాకు ఆరు నెలల కొడుకున్నాడు. వాడు. మెలుకువగా వున్నప్పుడు నేను ఇంత వరకు చూడలేదు. రాత్రి ఇంటికి వెళ్ళేటప్పటికి నిద్రలో వుండేవాడు."

డాక్టర్ రమణమూర్తిగారు చాలా సిస్టమాటిక్ సర్జన్న. ఎక్స్ ట్రార్డినరీ సర్జన్ కారు. ఈయన రిటైరు అయ్యే ముందు ఉమ్మడి మద్రాసు రాష్ట్ర "Last Director of Medical Services" గాను తరువాత First Director of Medical

Services గా ఆంధ్రాలోనూ పనిచేశారు. గుంటూరులో సాంబశివపేటలో 22-6-1951న నా నర్సింగు హోమ్ ప్రారంభించిది వీరే. తరువాత చాలా కాలం వీరిని కలుస్తూ వుండేవాడిని. ఇప్పటికీ అప్పుడప్పుడు కలలో వస్తూ వుంటారు.

సర్జికల్ పోస్టింగు అయిన తర్వాత, ఇ.ఎన్.టి. ophthalmology, క్యాజువాలిటీ ఆరు నెలలు. ఈ ఆరు నెలల గురించి ప్రత్యేకంగా చెప్పవలసింది ఏమీ లేదు. నేను హౌస్ సర్జననుగా వున్నప్పుడు, ఆర్మీ టెంపరరీ సర్వీసుకు అప్లై చేశాను. ఆర్మీలో చేరాలని వుద్దేశ్యం లేదు. ఢిల్లీ ఇంటర్వ్యూకు వెళ్ళినందుకు టి.ఏ.డి.ఏ. ఆర్మీవారే చెల్లించేవారు. ఢిల్లీ చూడవచ్చు అన్న ఉద్దేశ్యంతో వెళ్ళాను. సెలక్ట్ కాలేదు గనుక సమస్యలేదు. అన్ని వార్డులలో బాగానే పని చేశాను కనుక, హౌస్సర్జను పూర్తి అయ్యేనాటికి డాక్టరుగా నేను రాణించగలను అన్న నమ్మకం ఏర్పడింది.

హౌస్ సర్జన అయిన తరువాత, పోస్టు గ్రాడ్యుయేట్ కావాలని కోరుకునే వారు. కావాల్సిన స్పెషలిస్టుతో పనిచేయాలి. ఇప్పటిలాగా దానికి సెలక్షన్లు వుండేవి కావు. హాస్పటల్లో ఒక సీనియర్ హౌస్ సర్జనగా గానీ, ఉద్యోగస్తుడయితే అసిస్టెంటు సర్జముగా గానీ పనిచేయాలి. ఈ సీనియర్ హౌస్ సర్జను అనే దానికి, ప్రభుత్వము ఏమీ జీతం ఇవ్వదు. కాండిడేటు 3 నెలలకు రూ. 30.00 చొప్పున చెల్లించాలి. ఎం.ఎస్. చేయాలన్న అభిప్రాయం దర్డు ఇయర్ మొదట్లోనే వచ్చిందని ఇంతకు ముందే చెప్పాను.

ఈ మూడు నాలుగు సంవత్సరాలలో ఈ అభిప్రాయం బలపడింది. అందువలన హౌస్ సర్జను పూర్తి అయిన మరునాడే సీనియర్ హౌస్ సనుగా చేరాను. ఆర్థిక సహాయము లేకుండా ఎలా చేయగలను, అన్న అనుమానమే రాలేదు.

## మామయ్య అదృశ్యం :

నేను హౌస్ సర్జనుగా వున్నప్పుడు మా కుటుంబములో ఒక దుస్సంఘటన జరిగింది. వ్యాపారం చేస్తున్న మా మేనమామ, నష్టం వచ్చి అదృశ్యమయ్యాడు. ఇది మా అమ్మను చాలా క్రుంగతీసింది. ఆమె పుట్టింటివారు సంపన్నులనీ, తోడ పుట్టినవాడు చాలా హోదాలో వున్నాడని ఒకరకమైన గర్వముండేది. ఎన్ని ఒడుదుడుకులు వచ్చినా, ఆ భావము వలన సమాజంలో తల దించుకునే పని లేకుండా వుండేది. నిజానికి, మా మేనమామ వ్యాపారంలో వచ్చిన నష్టం వలన అదృశ్యం కాలేదు. అప్పుడు నష్టాలొచ్చినప్పటికీ ఆరువేల రూపాయలు ఆయన వద్దవున్నవి. అప్పుల వాళ్ళనందరినీ పిలచి, నా దగ్గర వున్న డబ్బులివి. దీనితోటే అప్పులు సర్దుబాటు చేసుకోండని అని అంటే అందరూ సంతోషంగా ఒప్పుకొనే వారు. అప్పటికి ఆయనకు గ్రామములోనూ, బయట సమాజంలోనూ, వున్న గౌరవం అటువంటిది. ఈ విషయం తెలిసి, నేను ఇంటికి వచ్చి, మా మేనమామ భార్యతో మాట్లాడాను. ఆయన అదృశ్యమునకు ఆరువేల రూపాయలే కారణమని గ్రహించాను. ఆ తర్వాత ఆమె కన్నవారింటికే వెళ్ళి అప్పటికే చనిపోయిన చెల్లెలి బిడ్డల పోషణ చూచుకొంది.

హౌస్ సర్జన్సీ పూర్తి అయిన తర్వాత ఎం.ఎస్. చదవాలన్న ఉద్దేశ్యంతో సీనియర్ హౌస్ సర్జన్ గా చేరాను. సర్జరీలో మూడు యూనిట్లు వుండేవి. అదృష్టవశాత్తూ నాకు మూడో యూనిట్లో పోస్టింగు దొరికింది. ఆ యూనిట్ సర్జన్ ఆర్మీ సర్వీసునుండి రిటైరు అయి సర్జనుగా ప్రమోట్ అయి, ఆ యూనిట్కు వచ్చారు.

మిగతా సర్జనులకూ వారు ఎక్కువ స్వేచ్ఛనిచ్చి ఎక్కువ అవకాశములు మాకు ఇచ్చేవాడు. ఆరేడు నెలలలో సర్జరీచేయగలను అన్న ధైర్యము వచ్చింది. ఆ తర్వాత కొంత కాలము ఫిజియాలజీ లోనూ, కె.జి.హెచ్.లో ఆర్.ఎం.ఓ.గాను వుండి తర్వాత అదే యూనిట్కి అసిస్టెంట్ వద్దనుగా వెళ్ళాను. మా సర్జనుపేరు డా

ఆత్మారామారావు, వారి తాతగారు రామారావు గారు మద్రాసు మెడికల్ కాలేజీలో అనాటమీ ప్రొఫెసరుగా పనిచేశారట. మా సర్జన ఆర్మీలో పనిచేసిన సంగతి చెప్పేను కదా! సర్జరీ చాలా త్వరగా చేసేవాడు. త్వరగా పూర్తి చేసుకొని, రెండు గంటలకు ఇంటికి వెళ్ళేవాడు. మిగతా సర్జన్లు రాత్రి 10 గం.ల వరకు పనిచేసేవారని ఇంతకు ముందు చెప్పాను. పెద్ద కేసులు కూడా ఆయన ఒక ఆపరేషను టేబుల్ మీద, నేను, ఇంకొక ఆపరేషను టేబుల్ మీద చేసేవారము. ఆయనకేసు పూర్తి చేసుకొని నా టేబుల్ దగ్గరకు వచ్చి చూచి వెరీగుడ్ అంటూ వెళ్ళేవాడు. అందువలన నాకు కూడా ఉత్సాహం వచ్చేది. రెండు గంటల తర్వాత చిన్న చిన్న కేసులన్నీ నేనే చేసేవాడిని. మధ్యాహ్నం రెండు గంటలనుండి, మరునాడు ఉదయంవరకూ ఎమర్జెన్సీ సర్జరీ కేసులు నేనే చేసేవాడిని. ఒకరోజు ఒక కాంప్లికేటెడ్ కేసు వచ్చింది. అటువంటి కేసులు అరుదుగా వచ్చేవి. నేను చేయగలనుగదా, పర్జనును ఎందుకు డిస్టర్బ్ చేయాలని నేనే చేశాను. మర్నాడు ఉదయము రౌండులో ఈ విషయం చెప్పాను. నేను చేసినందుకు సంతోషపడ్తునే నాకు కబురు చేస్తే నే వచ్చేవాడిని కదా" అన్నారు. అందువలన కాన్ఫిడెన్సు, త్వరగా చేయటం రెండూనాకు వచ్చినవి.



# వలసపాలన-ఇక్కట్లు

1942లో నేను మెడికల్ కాలేజీలోజేరి, 1947లో పూర్తిచేసే నాటికి, దేశంలో చాలా మార్పులు జరిగినవి. ఒక ప్రక్క యుద్ధము, మరియొక ప్రక్క స్వాతంత్ర్య సమర పోరాటము, నాయకులందరూ జైళ్ళలో వుండటం దేశం మొత్తాన్ని మానసిక వత్తిడికి గురి చేసినవి. దీనికి తోడు, పండిన ఆహార ధాన్యాలు, ప్రభుత్వము వారు, స్వీకరించి, మిలటరీవారి కొరకు గోడౌవున్లలో పెట్టారు. దేశాన్ని కరువు కాటకాలకు గురి చేసారు. 1945లో రాయలసీమ కరువుకు గురైంది. సర్కారు జిల్లాలవారు ఆహార ధాన్యాలు, పుష్కలంగా అందించి, క్షామ పీడితులకు గంజి కేంద్రాలు నెలకొల్పి జన నష్టం ఎక్కువ లేకుండా చూసారు. పశు నష్టం మాత్రము విపరీతంగా జరిగింది. 1945లో బెంగాలు రాష్ట్రము మొత్తం క్షామానికి గురైంది. లక్షల సంఖ్యలో జనం మరణించారు. ప్రభుత్వము వారు గోడౌనులలో దాచిన బియ్యం, పనికిరాకుండాపోయి, వాటిని సముద్రంలో కలిపారు మినహా ఆ ధాన్యాన్ని ప్రజలకు ఇవ్వలేదు. ఈ కరువు పూర్తిగా (Man Made) మానవ కల్పితము.

**దేశ విభజన నెత్తుటేర్లు :-**

1947లో మనకు స్వాతంత్ర్యము వచ్చినప్పటికీ మనము ఆశించిన దానికి విరుద్ధంగా దేశవిభజన జరగటం, లక్షల సంఖ్యలో ప్రజలు హత్యాకాండకు గురి కావటం కోట్ల సంఖ్యలో జనాభా ఇండియా నుండి పాకిస్తానుకు, పాకిస్తాన్ నుండి ఇండియాకు తరలటం జరిగింది. నిజానికి 1946 నుండి బెంగాలులో మత కలహాలు రేగటం, దానివలన చాలా మంది ప్రజలు మరణించటం జరిగింది. మహాత్మాగాంధీ. సమయంలో బెంగాలు అంతా పర్యటించి, హత్యలు కొంత వరకు నివారించగలిగారు. కాంగ్రెసు నాయకులు, చాలా సందర్భాలలో, ఒక నెత్తురు బొట్టు కూడా నేలమీద పడకుండా స్వాతంత్ర్యము సంపాదించామని

ఉపన్యాసాలు చేస్తూ వుంటారు. బయట శతృవుల నెత్తురు నేలమీద పడలేదుకాని, భారత దేశ ప్రజలు వారిలో వారే నెత్తుటేర్లు ప్రవహింప చేసుకొన్నారు.

**బ్లాక్ మార్కెట్ :**

నిత్యావసర వస్తువుల ఖరీదు క్రమంగా పెరిగి దాదాపు అన్ని వస్తువుల రేట్లు, ఐదు సంవత్సరాలలో రెట్టింపు అయినవి. ఆహార ధాన్యాలతో పాటు బట్టలు, నిత్యావసర వస్తువులు దొరకటమే కష్టమయ్యింది. ఆహార ధాన్యాలకు రేషను, బట్టలకు రేషను, పెట్టడంవలన తగినంత ఆహారము లభ్యమయ్యేదికాదు. పెళ్ళి పేరంటాలు వచ్చినప్పుడు గృహస్తులకు, వచ్చిన వారికి భోజనం పెట్టక తప్పదు కదా! గవర్నమెంటు పదిమంది కన్నా ఎక్కువ మందికి భోజనం పెట్టడానికి ఒప్పుకొనేదికాదు. అందువలన ఆహ్వాన పత్రికలలో, మీరేషను మీరే తెచ్చుకోండి అని ప్రచురించేవారు. అన్ని వస్తువులను దొంగతనంగా కొనుక్కోవలసి వచ్చింది. అప్పుడే బ్లాక్ మార్కెటు అనే పదము వెలుగులోనికి వచ్చింది.

విశాఖపట్నంలో గుప్త అనే ఆయనకు, ఒక షాపు వుండేది. అందులో తెల్ల కాగితాలు కూడా అమ్మేవారు. 1946లో అసెంబ్లీ ఎన్నికలకు ఆయన కాంగ్రెసు టిక్కెట్టు ఆశించారు. మెడికల్ కాలేజీ విద్యార్థులు, యూనివర్శిటీ విద్యార్థులు, అందరూ ఈ "గుప్త" వైట్ పేపరు బ్లాక్ మార్కెట్ చేశారు. ఇతనికి ఇవ్వకూడదని ప్రచారం చేసి, స్వచ్ఛమైన కాంగ్రెవ్వారి తెన్నేటి విశ్వనాథంగారికి సీటు వచ్చేటట్లు చూశారు.

**గాంధీజీని తూలనాడిన కామరాజ్ :**

దక్షిణ భారత హిందీ మహా సభలో పాల్గొనటానికి మహాత్మాగాంధీ, ట్రెయిన్లో వస్తూ, విశాఖ పట్నంలో ఆగాడు, ఒక మూడవ క్లాస్ కంపార్టుమెంటు మొత్తం రైల్వే కంపెనీ వారు రిజర్వేషన్ చేశారు.

వాల్తేరు స్టేషనులో దిగిన తరువాత, ఆ దగ్గరలోనే మీటింగు పెట్టారు. మీటింగు అయిన వెంటనే బయలుదేరి దక్షణ భారత హిందూ ప్రచార సభ రజతోత్సవములకు వెళ్ళారు. మీటింగులో ఆయన చెప్పినదేమో నాకు గుర్తులేదు. కానీ, ఆయనను చూసిన జ్ఞాపకం బాగావుంది. వారి మద్రాసు పర్యటన అంతర్యాన్ని గురించి అపోహపడి, కామరాజ్నాడార్ గాంధీ గారిని తూలనాడినట్లు గుర్తు. అప్పటి వరకు రాజగోపాలచారి కాంగ్రెసులో లేరు. విలేఖరులు రాజగోపాలాచారిని, రాబోయే ఎన్నికలలో ముఖ్యమంత్రిని చేయటం కొరకు వచ్చారా? అని గాంధీ గారిని అడిగారు. అప్పటి తమిళనాడు కాంగ్రెస్ అధినేత కామరాజు నాడార్ రాజగోపాలాచారిని కాంగ్రెసులో చేర్చుకోవటానికి వీలు లేదని పట్టుబట్టి వున్నారు. ఆ సంఘటనను దృష్టిలో పెట్టుకొని moda "There seems to be clique in Tamil Nadu Congress". అని అన్నారు దానిపై కామరాజు తూలనాడారు.

మద్రాసు రాష్ట్రంలో అప్పుడు నాలుగు ప్రదేశ్ కాంగ్రేసులు ఉండేవి. A.P.C.C., T. N. C.C.L, K.P.C.C., M.C.C. అప్పటికే కాంగ్రెసు వారు భాషా సంయుక్త రాష్ట్రాలు. కావాలన్నారు కనుక ఇవి ఏర్పడినవి. ఇండియా రిపబ్లిక్ కాకముందే మద్రాసు రాష్ట్రంలో హరిజనులకు, దళితులకు, ముస్లింలకు, క్రిస్టియన్లకు కొన్ని సీట్లు రిజర్వు చేయబడ్డాయి. జమీందారీలకు ఒక్కసీటు ఆంధ్రాలో వుంది. దీనికి కారణం అంతకు ముందు పరిపాలించిన జస్టిస్ పార్టీ. ఈ రిజర్వేషన్లకు ప్రత్యేక ఎలక్టోరేట్ వుండేది. ఆంధ్రాలో జమీందారి సీటుకు ఎం.ఆర్. అప్పారావు నూజివీడు, యీయనకు వరుసకు బాబాయి అయిన మీర్జాపూర్ జమిందార్ పోటీ. మీర్జాపూర్ జమిందారు గెలిచాడు.

## అందరిలాగే నేనూ విద్యార్థి కాంగ్రెస్లో వున్నా :

కాంగ్రెసు నాయకులలో, సరోజినీనాయుడు, కమలాదేవి చటోపాధ్యాయ, ఇద్దరు మహిళా నాయకులు వుండేవారు. అందులో సరోజనీ నాయుడుగారు బాగా చదువుకొన్నది. పొయిట్రీ వ్రాయటం మాత్రమేగాక, కోకిల కంఠముతో పాడేది అని ప్రసిద్ధి. కాలేజీ విద్యార్థుల సభలలో, వారు పాల్గొనేవారు. అప్పటికే, విద్యార్థులలో ఇంగ్లీషు భాషపై పట్టుతగ్గింది. ఒక సభలో సరోజనాయుడును గురించి విద్యార్థి నాయకుడు. పరిచయం చేస్తూ "She is a great public Lady" అని పరిచయం చేశాడు. ఆమె చాలా సభల్లో ఆ విషయం చెప్పేది. పబ్లిక్అడీ అనే మాటకు సరైన అర్థం తెలియకనే విద్యార్థి ఆ మాట ఉపయోగించాడు. ఆమె చాల విట్టీగా మాట్లాడేది. అంతపెద్ద పోరాటంలో పాల్గొంటూ కూడా, ఆమె వాక్చాతుర్యం వలన అహ్లాదకరమైన వాతావరణాన్ని కలిగించేది. మహాత్మా గాంధీగారిని గురించి చెప్తూ, "He donot know how much it costs to maintain Mahatmaji so poor " అని అన్నది. అందరూ విద్యార్థుల వలెనే నేను కూడా విద్యార్థి కాంగ్రెస్లో వుండేవాడిని. సమావేశాలలో పాల్గొనేవాడిని.

## రాజు లేకుండా రాజ్యం నడిచేదెలా? !

నా చిన్నప్పటి నుండీ కాంగ్రెసు గురించి, మహాత్మాగాంధీని గురించి, జనం కథలు, కథలుగా చెప్పుకొనేవారు, 1936లో జిల్లా బోర్డు ఎలక్షన్లు జరిగినవి. మాఫిర్మానుండి (పెదకాకాని) కాంగ్రెసు తరపున, అడుసుపల్లి కోటయ్యగారు: నంబూరి కరణంగారు, గోపరాజుగారు జస్టిస్ పార్టీ మద్దతుతో పోటీ చేశారు. అప్పటికి నాకు తెలిసిన వివాదాలు "జస్టిస్పార్టీ డౌన్ డౌన్, కాంగ్రెస్ పార్టీ అప్, అప్." జిల్లా బోర్డు అనగా నేటి జిల్లా పరిషత్ ముందటి వ్యవస్థ. అప్పట్లో కాంగ్రెసు పార్టీయే గెలిచింది. జిల్లా బోర్డు కైవశం చేసుకొన్నారు. అంతకు పూర్వం ఐస్టిస్పార్టీ పరిపాలనలో వుండేది.

దాదాపు మూడుసార్లు శ్రీ జాగర్లమూడి కుప్పుస్వామిగారు, జిల్లా బోర్డు అధ్యక్షులుగా వుండేవారు. ఆనాటి ఎలక్షన్లలో ఓటర్లు చాలా తక్కువ సంఖ్యలో వుండేవారు. పాత తరం వారందరూ జస్టిస్పార్టీ అభిమానులే. మా మేనమామ కాంగ్రెసు తరపున ప్రచారం చేసినప్పటికీ, మాతాత కాంగ్రెసు పార్టీకి ఓటు వేయ లేదు. కాంగ్రెసు పార్టీ ప్రత్యేక ధ్యేయం, ఇంగ్లీషు వారిని దేశాన్నుండి పంపించి, రాజు లేకుండా ప్రజలే పరిపాలించుకోవాలని అనుకోవటము. పాత తరము వారికి ఈనినాదము రుచించేది కాదు. "రాజు లేకుండా రాజ్యం ఎట్లా నడుస్తుంది". అని ఎదురు ప్రశ్నించేవారు.

## ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో ముఖ్యమైన చట్టాలు :

1937లో అసెంబ్లీ ఎన్నికలు జరిగినవి. అప్పటి మన రాష్ట్రం "ఉమ్మడి మద్రాసు రాష్ట్రం" అంతవరకు రాష్ట్ర ప్రభుత్వం, జస్టిస్పార్టీ పరిపాలనలో వున్నది. మొట్టమొదటి సారిగా దేశ వ్యాప్తంగా జరిగిన ఈ ఎన్నికలలో, మొదటిసారిగా కాంగ్రెసువారు పోటీ చేయడం జరిగింది. చాలా రాష్ట్రాల్లో కాంగ్రెస్ గెలిచి, ప్రభుత్వాలను ఏర్పాటు చేసింది. మద్రాసు రాష్ట్రంలో సి. రాజగోపాలాచారి ప్రెమ్మినిస్టర్ అయ్యాడు. అనగా ప్రస్తుత ముఖ్యమంత్రి అన్నమాట. అప్పుడు ప్రధాన మంత్రి అనే పిలిచేవారు. ఆయన క్యాబినెట్లో టంగుటూరి ప్రకాశంగారు రెవెన్యూ మంత్రిగాను, వి.వి.గిరిగారు లేబరు మినిస్టరుగానూ వుండేవారు. ఆ ప్రభుత్వం కొద్దికాలమే అధికారంలో వుంది. దీనికి కారణం, 1939లో రెండో ప్రపంచ యుద్ధం ప్రారంభించినప్పుడు, బ్రిటీషు ప్రభుత్వానికి అండగా వుండకూడదన్న ఉద్దేశ్యంతో, కాంగ్రెసు పెద్దలు నిర్ణయించి, అందరినీ రాజీనామా చేయించారు.

ఆ ప్రభుత్వ హయాంలో, వచ్చిన ముఖ్యమైన చట్టాలు

(1) శారాదా ఆక్టు అనగా బాల్య వివాహాలు నిషేధించడం. అంత వరకు బాల్యంలో వివాహాలు విస్తారంగా జరిగేవి. బాల్య వివాహాలు చేయకూడదన్న ప్రచారం కందుకూరి వీరేశలింగంగారి నుండి చాలా మంది చేశారు. అయినా ప్రజలు అంత తేలికగా ఆమోదించలేదు. కొంతమంది చట్టానికి భయపడి నిజాం రాజ్యంలోవున్న పరిటాల వంటి పరగణాలకు వెళ్ళి పెండ్లిండ్లు చేసుకొని వచ్చేవారు.

(2) రైతు ఋణ విమోచన చట్టము. ఈ చట్టము చేసే ముందు ప్రకాశం పంతులుగారు, తన రెవెన్యూ సెక్రటరీతో ఒక కమిటీ వేసి, రాష్ట్ర వ్యాప్తంగా వివరాలు సేకరించారు. 1929లో ప్రపంచ వ్యాప్తంగా వచ్చిన ఆర్థిక మాంద్యమువలన, చిన్న రైతులేకాక చాలా మంది పెద్ద రైతులు కూడా అప్పుల ఊబిలో మునిగిపోయారు. ఆ విచారణ జరిగేటప్పుడు జరిగిన చిన్న సంఘటన పశ్చిమ గోదావరి జిల్లా ఏలూరులో జరిగిన సమావేశములో ఆ సెక్రటరీ ఒక రైతును "ఎంత పొలము వున్నది" అని అడిగాడు. దాదాపు 20 ఎకరాలు వున్నది అని చెప్పాడు. "అప్పు ఎంత వుంది" అని అడిగాడు. రూ.5000/- నుండి 10000/- చెప్పాడు. అయితే కొంత పొలం అమ్మి అప్పు తీర్చుకోవచ్చు గదా! అని సెక్రటరీ సలహా ఇచ్చాడు. దానికి రైతు "అయ్యా నిజం చెప్పమంటారా! రైతుకు భార్య మీద కన్నా పొలము మీదే ప్రేమ ఎక్కువ అందుకని అమ్మలేము." అని బదులిచ్చాడు. (ఈ విషయం ఆ సమావేశంలో వున్న వడ్డే శోభనాద్రిగారు అంటే మాజీ మంత్రి వడ్డే శోభనాద్రీశ్వరరావు గారి తాతగారు, నాకు స్వయంగా చెప్పారు). ఆ రిపోర్టు ప్రకాశం పంతులుగారికి చూపించిన తరువాత, రైతులను ఋణవిముక్తులను చేయుటకొరకు, "రైతు ఋణవిమోచన చట్టం" చేశారు. దీనివలన ఎక్కువమంది ఋణ విముక్తులైనారు

(3) మద్రాసు రాష్ట్రంలో జస్టిన్ పార్టీవారు పరిపాలించినపుడు, కమ్యూనల్ జి.వో. అమలులోనికి వచ్చింది. దాని ప్రకారం ఉద్యోగాలలోను, ప్రొఫెషనల్ కాలేజీలోనూ కులాల వారీగా సీట్లు ఇచ్చేవారు. ఉదా:10 సీట్లలో ఒకటి బ్రాహ్మణులకు, రెండు అబ్రాహ్మణులకు, ఈ రెండవ దానిలో విద్యా పరంగా వెనుకబడిన కులాలకు, ముస్లింలకు, క్రిస్టియన్లకు, ఆది ఆంధ్రులకు (ప్రస్తుతము దళితులు)కు వుండేవి. అబ్రాహ్మణులలో కొన్ని కులాలు ముందు, కొన్ని కులాలు వెనుక బడినవి వుండేవి. అప్పటికి కమ్మ కులస్తులు విద్యాపరంగా వెనకబడ్డ జాబితాలో వుండేవారు. వారు గవర్నమెంటు స్కాలర్ షిప్పులకు కూడా అర్హులు. వారిని 1939 కల్లా ఫార్వర్డు క్లాసులోనికి తెచ్చారు. అప్పటి నుండి విద్యా సంస్థలలో, కమ్మ కులస్తులకు స్కాలర్ షిప్పుల అవకాశాలు పోయినవి.

## గుంటూరుకు చేరిన ఆంధ్ర విశ్వ విద్యాలయం:

యుద్ధము మొదలైన దగ్గరనుండి వస్తువుల ధరలు పెరగసాగినవి. 1942 వరకు భారతదేశముపైన, ప్రత్యక్షంగా యుద్ధ ప్రభావం పడలేదు. 1942 ఏప్రియలులో జపానువారు విశాఖపట్నం మీద మద్రాసుమీద బాంబింగ్ చేశారు. ఇప్పటి ఆంధ్ర యూనివర్శిటీని వాల్తేరు నుండి గుంటూరుకు మార్చటం జరిగింది. గుంటూరులో మెడికల్ స్కూలు (ఎల్.ఎం.పి.) పెట్టాలనే వుద్దేశ్యంతో 1930కి పూర్వం బిల్డింగులు కట్టారు. ఆ తరువాత ప్రభుత్వం వున్న మెడికల్ స్కూళ్ళు కూడా మూసివేసింది. అందువలన ఖాళీగా వున్న బిల్డింగులో ట్రైనింగు స్కూళ్ళు నడిచేవి. ఇప్పుడు అవసరము వచ్చింది. కనుక యూనివర్శిటీని ఈ బిల్డింగులోనికి మార్చారు. వాల్తేరులోవున్న యూనివర్శిటీ కేంపస్ మిలటరీవారు ఆక్రమించి, షెడ్డులు నిర్మించుకొన్నారు. యుద్ధం అయిపోయిన తరువాత మిలటరీవారు యూనివర్శిటీ బిల్డింగులను ఖాళీచేశారు. అప్పుడు ఆంధ్రా యూనివర్శిటీ మరలా విశాఖపట్నంకు వచ్చింది.

యుద్ధం అయిపోయిన తరువాత కాంగ్రెసు వారందరూ జైళ్ళ నుండి బయటకు వచ్చారు. ఆంధ్రాయూనివర్శిటీ వైస్ ఛాన్సలర్ టరమ్ అయిపోనందున ఎలక్షనులు వచ్చినవి, యూనివర్శిటీ చట్టం ప్రకారం, యూనివర్శిటీకి ఎవరైనా పోటీ చేయవచ్చు. అర్హత లేమీ లేవు. అప్పటికి చాలా కాలంగా, సి.ఆర్. రెడ్డి గారు వైస్ ఛాన్సలర్ గా వున్నారు. కాంగ్రెసుపార్టీవారు బులుసు సాంబమూర్తిగారిని నిలబెట్టారు. సి.ఆర్. రెడ్డిగారు అత్యధిక మెజారిటీతో గెలుపొందారు. నిజానికి సి.ఆర్. రెడ్డిగారు కాంగ్రెస్ వారే. 1926లో మద్రాసు అసెంబ్లీలో ప్రతిపక్షంలో వుండి జస్టిస్ పార్టీ ప్రభుత్వాన్ని చాలా తీవ్రంగా విమర్శించేవారు. 1926 లో ఆంధ్రా యూనివర్శిటీ స్థాపించినప్పుడు జస్టిస్ పార్టీవారు రెడ్డిగారిని వైస్ ఛాన్సలర్గా పంపించి, అసెంబ్లీలో లేకుండా చేశారని అనుకొనేవారు. జరిగినది కూడా ఆదే. (1945-1946) గెలిచిన తరువాత వారికి సన్మానం గుంటూరులో జరిగింది. దానికి ఆయన సమాధానం చెప్తూ, "According to the Constitution of the Andhra University anybody can contest for Vice Chancellorship, so any body has contested" "ఎవరైనా పోటీ చేయవచ్చు-అందుకే ఎవరో ఒకరు పోటీచేశారు." ఆయన వాక్చాతుర్యానికి ఇది మచ్చు తునక.

1946లో మళ్ళీ అసెంబ్లీ ఎన్నికలు జరిగినవి. అప్పటికి ఓటర్ల సంఖ్య కూడా పెరిగింది. పన్ను కట్టేవారితోపాటు, సంతకం చేయగలిగిన వారికి కూడా ఓటు వచ్చింది. అన్నాప్రగడ కామేశ్వరరావుగారు గుంటూరుకు పోటీ చేశారు. గుంటూరు తాలూకా, సత్తెనపల్లి తాలూకాలకు మేడూరి నాగేశ్వరరావు, నర్సరావుపేట, గురజాల, మాచర్ల ప్రాంతాలకు కాసు బ్రహ్మానందరెడ్డిగారు పోటీ చేసి గెలిచారు. అప్పట్లో ఔతు రామిరెడ్డి, కల్లూరి చంద్రమౌళి మంతెన వెంకట్రాజు వగైరాలు నాయకులుగా వుండేవారు. 1946 అసెంబ్లీ ఎన్నికలు జరిగిన తరువాత ప్రకాశం పంతులుగారు (సైమినిస్టర్ అయ్యాడు. 1942లో రాజాజీ కాంగ్రేసు నుండి బయటకు వచ్చాడు. పాకిస్తాను ఇవ్వమని అడిగాడు.

కాంగ్రెసు పార్టీ నుండి సస్పెండ్ చేయబడ్డాడు. 1946 ఎలక్షన్ల తరువాత గాంధీగారి. పర్మిషనుతో కాంగ్రెసులో చేరినట్లున్నాడు. కానీ కామరాజ్నాడార్ మాత్రం రాజగోపాలాచారికి వ్యతిరేకంగా వుండటంవలన, ప్రకాశంగారికి అవకాశము వచ్చింది. అప్పటి నియమావళి ప్రకారం, పార్టీ లీడరు ప్రతి సంవత్సరం ఎన్నిక కావాలి. 1947లో ఓమందూరి పెదరామస్వామి రెడ్డియార్ లీడరుగా ఎన్నికయి. సైమినిస్టర్ అయ్యాడు. రెండు సంవత్సరాలకు రామస్వామి రెడ్డిగారి తరువాత పీసపాటి కుమారస్వామి రాజాగారు. (ప్రైమినిస్టర్ అయ్యారు. ఆయన 1952 ఎన్నికల వరకూ ముఖ్యమంత్రిగా పనిచేశారు.

**రాజకీయాల పట్ల ఆసక్తి :**

నేను విద్యార్థిగా వున్నప్పుడే స్వాతంత్రోద్యమం జరుగుతున్నది. అందు వలన ప్రతి విద్యార్థికి, మహాత్మాగాంధీ గారిని గురించి, కాంగ్రెసు సంస్థను గురించి, సదభిప్రాయం. వుండేది. నేను హైస్కూలులో వుండగా లోకల్బోర్డు ఎలక్షన్లు అసెంబ్లీ ఎలక్షనులు జరిగినవి. అప్పుడు వోట్ ఫర్ కాంగ్రెస్ అని అందరం కేకలు వేసినవారమే కాలేజీ చదువులకు మేము వచ్చినప్పటికీ కాంగ్రెసు, స్వాతంత్ర్యపోరాటం తీవ్రం చేసింది. అప్పుడు చాలా మంది జైలుకెళ్ళటం జరిగింది. అందులో మా మేనమామ ఒకరు. అందువలన రాజకీయాలను దగ్గరగా చూడటం జరిగింది. మెడికల్ కాలేజీలో జేరినప్పటికి, క్విట్ ఇండియా నినాదంతో చివరిపోరాటం జరిగింది. ఈ పోరాటంలో పాల్గొనకపోయినా. దగ్గరగా చూసే అవకాశము వచ్చింది.

మేము కాలేజీలో వుండగా కమ్యూనిస్టులు, ఆల్ ఇండియా స్టూడెంటు ఫెడరేషన్ పేరుతో విద్యార్థి ఉద్యమాలు ప్రారంభించారు. చదువు మీద వున్న ధ్యాసవలన, ఆ విషయాలు నేనంతగా పట్టించుకోలేదు. అప్పట్లో ఎం.ఎన్. రాయ్ ప్రభావంతో కొంత మంది రాడికల్ స్టూడెంటు యూనియన్ కూడా స్థాపించారు. అయితే అది, మేధావులకే పరిమితమైనది అన్న భావన వలన వ్యాప్తి చెందలేదు.

స్వాతంత్ర్య పోరాటం చివరి రోజులలో, కమ్యూనిస్టు పార్టీ కొంతమందిని ఆకర్షించింది. వీరు స్వాతంత్ర్యము అనంతరము సమాజము ఎట్లా వుండాలి. కాంగ్రెసు వారికే అధికారమిస్తే బూర్జువా వర్గములకే పరిమితము అవుతుందని, ప్రజలకు అధికారాలు కావాలి అంటే, కమ్యూనిస్టులు మాత్రమే ఆ పనిచేయ గలరని భావించేవారు. ఇదికాక, రెండవ ప్రపంచ యుద్ధము స్వభావాన్ని గురించి కమ్యూనిస్టులు కాంగ్రెసువారి దృష్టిలో కొంత తేడా వుండేది.

**పీపుల్స్ వార్ అంటే.....**

ఈ ఇద్దరూకాక మేధావి వర్గానికి చెందిన, ఎం.ఎన్. రాయ్ దీనిని పీపుల్స్ వార్ అని పిలిచాడు. అంటే యుద్ధంలో, హిట్లరూ, ఆయన సహచరులూ గెలిచిన ట్లయితే ప్రపంచంలో అంతా నిరంకుశత్వం వస్తుందని, బ్రిటను వారి మిత్రులు గెలిచినట్లయితే, ప్రజారాజ్యం వస్తుందని, భావించి, ఆ నినాదాన్ని ఇచ్చారు. కమ్యూనిస్టులు దానికి అంగీకరించలేదు. దానికి కారణము జర్మనీ నియంత హిట్లరు, రష్యానేత స్టాలిన్ కలసి, బ్రిటను మిగతా ఐరోపాదేశాల పై యుద్ధాన్ని జరుపుతున్నారు. 1941 వచ్చేటప్పటికి, రష్యా, బ్రిటన్లతో కలసి హిట్లరుతో పోరాటం చేశారు. అప్పుడు కమ్యూనిస్టులు దీనిని పీపుల్స్ వార్ అన్నారు.

**నాయకత్వం పురుళ్ళు జైళ్ళలోనే!:**

ఒకవైపు యుద్ధం జరుగుతున్నది. రెండోవైపు దేశంలో స్వాతంత్ర్య పోరాటం జరుగుతున్నది. స్వాతంత్రోద్యమ భావన, అందరిలోనూ ఏర్పడింది. 1941వ సంవత్సరంలో యుద్ధం పూర్తి అయింది. బ్రిటీషువారు వారి మిత్రులు మిగిలారు. 1946లో మనకు సెంట్రల్ అసెంబ్లీకి (పార్లమెంటుకు ముందున్న వ్యవస్థ) రాష్ట్ర అసెంబ్లీకి ఎన్నికలు జరిగినవి. ఎక్కువ రాష్ట్రాలలో కాంగ్రెసు ప్రభుత్వానికి వచ్చింది. మనం అప్పుడు ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో వున్నాము. ఇద్దరు ముగ్గురు కమ్యూనిస్టు సభ్యులు ఎన్నికయ్యారు.

కొంతమంది స్వతంత్రులు మినహా, మిగతావారందరూ కాంగ్రెసు సభ్యులే. క్విట్ ఇండియాకు ముందు 1937లో జరిగిన అసెంబ్లీ ఎన్నికల తర్వాత రాజగోపాలాచారి. నేతృత్వంలో మద్రాసులో కాంగ్రెసు ప్రభుత్వము ఏర్పడింది. 1939లో బ్రిటీషువారికి కాంగ్రెసువారు యుద్ధానికి సహకరించకపోవటం, అసెంబ్లీలకు రాజీనామా చేయటం జరిగింది. అందువలన 1942లో క్విట్ ఇండియా ఉద్యమం తరువాత అరెస్టు అయిన నాయకులు, యుద్ధం అయిపో గానే, మళ్ళీ ఎన్నికలు వస్తాయి. ఎవరి నాయకత్వం క్రింద ప్రభుత్వం ఏర్పరచాలి అనే మంతనాలు, జైళ్ళలోనే ప్రారంభించారు.

**పట్టాభి వర్సెస్ ప్రకాశం :**

ఆంధ్ర ప్రాంతానికి సంబంధించినంత వరకు రెండు వర్గాలుగా చీలి ఒకటి. టంగుటూరి ప్రకాశంగారి నాయకత్వం రెండవది భోగరాజు పట్టాభి సీతా రామయ్య గారి–నాయకత్వాన పరిచినవి. అప్పుడు ప్రదేశ్ కాంగ్రెసు ప్రెసిడెంటుగా వున్నది ప్రకాశంగారు, పి.సి.సి. సెక్రటరీగావున్న కళా వెంకట్రావుగారు, పట్టాభి సీతారామయ్యగారితో చేతులు కలిపి ప్రకాశంగారి ఆధిపత్యము తగ్గించేటందుకు పనిచేశారు. అయినప్పటికీ ఎన్నికలు అయిన తరువాత ప్రకాశంగారే మద్రాసులో ప్రీమియర్ (ముఖ్యమంత్రి). అయితే పట్టాభివర్గం, కళావెంకట్రావు గారి నాయ కత్వంలో తమ పోరుకొనసాగించి మరుసటి సంవత్సరానికి ప్రకాశంగారిని ముఖ్యమంత్రి కాకుండా చేసారు. అప్పటి వరకూ పి.సి.సి. ప్రధానంగా, కాశీ నాథుని నాగేశ్వరరావు, పట్టాభి సీతారామయ్య, ప్రకాశంపంతులు వంటి వారి నాయకత్వాన వడచింది. పట్టాలి ప్రకాశం మధ్య గ్రూపు తగాదాలు వచ్చినప్పుడు రంగాగారు ప్రకాశం పంతులుగారి తరపున నిలబడ్డారు.

## ధైర్యం ఉన్నవాడే మంత్రి :

1946లో ఎన్నికల తర్వాత, కాంగ్రెసు సంస్థ తరఫున ఎన్నికలు జరిగినవి. ఆ ఎన్నికలలో, రంగాగారు పి.సి.సి. అధ్యక్షులు. కందుల ఓబుల్ రెడ్డిగారు జనరల్ సెక్రటరీ, పెద్దిరెడ్డి తమ్మారెడ్డిగారు వైస్ ప్రెసిడెంటు, గౌతు లచ్చన్నగారు జాయింట్ సెక్రటరీ, దుగ్గిరాల బలరామ కృష్ణయ్యగారు జాయింట్ సెక్రటరీ, మిగతా జిల్లాలకు ఒక కమిటీ సభ్యుడు అయ్యారు. పి.సి.సి. తరుపున ప్రకాశం గారికి పూర్తి మద్దతు ఇచ్చేవారు. మరుసటి సంవత్సరము ప్రకాశంగారి ఓటమిని ఆపలేక పోయారు. ఆ తరువాత 1949లో ప్రభుత్వంలో వున్న పట్టాభి సీతా రామయ్యగారి గ్రూపు తరుపున రంగాగారిని ఓడించే ప్రయత్నం మొదలై వారికి తగిన అభ్యర్థి లభించక, అంతకు ముందు పట్టాభిగారి హయాంలో జాయింటు సెక్రటరీగా చేసిన నీలం సంజీవరెడ్డిని నిలబెట్టారు. అప్పుడు నీలం సంజీవరెడ్డి శాసనసభ్యుడు. "మీకెవరికీ ధైర్యం లేక నన్ను నిలబెడ్తున్నారు, గెలిస్తే సరే, ఓడితే మాత్రం నాకు మంత్రి ఇవ్వాలి" అని కండీషను పెట్టారు. రెండోదే ఖాయమయ్యింది, మంత్రి అయ్యాడు.

## కాంగ్రెస్ను వీడిన ఆంధ్ర నాయకులు :

తిరిగి 1951లో పి.సి.సి. ఎలక్షను వచ్చినపుడు మరలా సంజీవరెడ్డిగారే పోటీచేసారు. ఈ లోపల పట్టాభి గారు ఏ.ఐ.సి.సి. ప్రెసిడెంటు అయ్యారు. ఇక్కడ అధికారబలము, పైన సంస్థా బలము వుండికూడా గుంటూరు జిల్లా నుండి ఎన్నికయిన పి.సి.సి. ప్రతినిధులను 13 మందిని పి.సి.సి. అధ్యక్ష ఎన్నికలలో పాల్గొనకుండా కోర్టు ఆర్డరు తీసుకొచ్చారు. ప్రభుత్వంలో వున్నవారు వారి సర్వాన్ని వొడ్డి రంగా గారిపై సంజీవరెడ్డి గారిని మూడు ఓట్ల మెజార్టితో గెలిపించారు. ఇది చారిత్రకమైన ఎన్నిక. దీనితో రాష్ట్ర కాంగ్రెసు పార్టీ బ్రద్దలుగా పగిలిపోయింది. ఇదే సమయంలో కేంద్రంలో కూడా కొంతమంది కాంగ్రెసును వదిలి బయటకు రావటం జరిగింది.

అందులో కృపలాని మొదలైన పెద్దలు కిసాన్ మజ్దూర్ పార్టీని పెట్టారు. ఇక్కడ చీలినవారు ప్రకాశంగారు ప్రజాపార్టీగాను, రంగాగారు కె.ఎల్.పి.గాను (కృషికలోక్ పార్టీ) ఏర్పాటు చేసుకొన్నారు.

**కమ్యూనిస్టుల బలం స్థిరంగా ఉండిపోలేదు :**

స్వాతంత్ర్యము వచ్చినప్పటి నుండీ, కమ్యూనిస్టుపార్టీవారు ప్రజాస్వామ్యం వలన సోషలిస్టు ప్రభుత్వమురాదు. ప్రజలలోకి వెళ్ళి గెరిల్లా యుద్ధంలాంటి ప్రక్రియలలో, ప్రభుత్వంపై పోరాడి స్వాతంత్ర్యము తీసుకొని రావాలి అన్న భావనలతో, తెలంగాణాలోనూ ఆంధ్రప్రాంతాల లోనూ, పెద్ద ఉద్యమం నడి పారు. ప్రభుత్వం కూడా కఠినంగా వ్యవహరించి, ఉద్యమాన్ని ఆపేటందుకు ప్రయత్నం చేశారు. ప్రభుత్వ చర్యలవలన, ఎక్కువమంది కమ్యూనిస్టులు జైళ్ళ కెల్లడం, కొంతమంది ప్రాణాలు పోగొట్టుకోవటం జరిగింది. అందువలన 1952లో జరిగిన ఎన్నికలలో, కమ్యూనిస్టుల పట్ల సానుభూతి పెరిగి, ఎక్కువ మందిని శాసనసభకు గెలిపించారు. శాసనసభలోనూ పార్లమెంటులో కమ్యూనిస్టు వాణి బలంగా వినిపించింది. ఐతే అది ఎక్కువ కాలం నిలుపలేదు. 1955లో ఆంధ్రరాష్ట్రంలో వచ్చిన మధ్యంతర ఎన్నికలలో వారు ఘోరంగా ఓడిపోయారు. తరువాత వారు మరలా పూర్వ వైభవాన్ని సంపాదించుకోలేదు.

**భాషా ప్రయుక్త రాష్ట్రాలు :**

1953లో ఆంధ్రరాష్ట్రం ఏర్పడి, కర్నూలు రాజధాని అయింది. ఆ ప్రభుత్వానికి, ప్రజాపార్టీ నాయకుడుగా వున్న టంగుటూరి ప్రకాశం పంతులుగారి నేతృత్వంలో, కాంగ్రెసు ప్రభుత్వం ఏర్పడింది. ఆ ప్రభుత్వం పదమూడు నెలలు మాత్రమే వుంది. అసెంబ్లీలో ఓడిపోయిన తరువాత రద్దయి రాష్ట్రపతి పాలన, విధించారు. అప్పటి గవర్నర్ త్రివేది చాలా చురుకైన వ్యక్తి. ఆయన హయాంలోనే హైదరాబాద్ రాష్ట్ర ప్రభుత్వంతో సంప్రదింపులు జరిపి నాగార్జునసాగర్

ప్రాజెక్టును కేంద్ర ప్రభుత్వంతో అంగీకరింప చేశాడు. 1955 బై ఎలక్షను నాటికి కాంగ్రెసు పార్టీ ప్రజాపార్టీ కె. ఎల్. పి. లు కలిసి యునైటెడ్ కాంగ్రెసు పేరుతో పోటీ చేశారు. ఎక్కువ మెజార్టితో ఎన్నికలలో గెలిచారు. కమ్యూనిస్టులకు పదిహేను సీట్లు మాత్రమే దక్కినవి. అప్పుడు ఏర్పడ్డ ప్రభుత్వానికి బెజవాడ గోపాలరెడ్డి ముఖ్యమంత్రిగా, నీలం సంజీవరెడ్డిగారు ఉప ముఖ్యమంత్రిగా వున్నారు. భారతదేశంలో భాషా ప్రయుక్త రాష్ట్రాలకు నాంది పలికింది ఆంధ్ర రాష్ట్రం. ఆ తరువాత కేంద్ర ప్రభుత్వము రాష్ట్ర పునర్విభజన సంఘమును ఏర్పాటుచేసి, దేశాన్నంతా భాషా ప్రయుక్త రాష్ట్రాలుగా విభజించారు.

**ఉపముఖ్యమంత్రి–ఆరవ వేలు!**

ఆ మార్పుతో హైదరాబాద్ రాష్ట్రాన్ని మూడు ముక్కలుగా చేసి, కొన్ని జిల్లాలు కర్నాటకలోను, కొన్ని జిల్లాలు మహారాష్ట్రలోనూ కలిపి హైదరాబాదుతో పాటు ఎనిమిది తెనుగు జిల్లాలను తెలుగు రాష్ట్రంగా ఏర్పాటు చేయాలని, ఐదు సం॥ల తర్వాత వారు కావాలనుకొంటే ఆంధ్ర రాష్ట్రంలో కలిసిపోవచ్చని సిఫార్సు చేశారు. ఐతే అంతకుముందు దశాబ్దాల తరబడి విశాలాంధ్ర కావాలని రాజకీయ పార్టీలు, ముఖ్యంగా 'కమ్యూనిస్టులు' నినాదం చేస్తూ వచ్చారు. తెలంగాణా ప్రాంతంలో కొంతమంది. విశాలాంధ్ర కావాలని కోరుకున్నారు. అందువలన, ఈ ఐదు సం॥ల జాప్యం అవసరంలేకుండా, ఇప్పుడే విశాలాంధ్ర ఏర్పడాలని, రాజకీయ పార్టీలు భావించాయి. అప్పుడు తెలంగాణా నాయకులు, కొన్ని హామీలను అడిగారు. అందులో ప్రధానమైంది. ఆంధ్ర ప్రాంతంవారు ముఖ్య మంత్రి అయినట్లయితే, తెలంగాణా ప్రాంతం వారు ఉప ముఖ్యమంత్రి కావాలని, అందువలన నీలం సంజీవరెడ్డిగారు ముఖ్యమంత్రి అయి కొండా వెంకట రంగా రెడ్డిగారు, ఉపముఖ్యమంత్రి అయినారు. కొన్నాళ్ళ తరువాత ఉప ముఖ్యమంత్రికి ప్రాధాన్యత ఏమీ లేదని, చేతికి ఆరవ వేలులాంటిదని, రంగారెడ్డిగారే తన అసహనాన్ని వెల్లడించారు.

ఆ తరువాత దాని ప్రాముఖ్యత పోయింది. అభివృద్ధిని గురించి, పెద్ద మనుష్యుల ఒప్పందం పేరుతో, కొన్ని నిర్ణయాలు తీసుకొన్నారు.

**తెలంగాణా ఏమవుతుందో వేచి చూడాల్సిందే :**

1969 నాటికి తెలంగాణాకు న్యాయం జరగటంలేదని, మఱ్ఱి చెన్నారెడ్డి గారు, ఉద్యమం నడిపారు. దాని ఫలితంగా దాదాపు 300 మంది మరణించారు తప్ప వొరిగిందేమీ లేదు. 1972లో ముల్కీ సమస్యపై వచ్చిన కోర్టు తీర్పువలన ఆంధ్రులు, ఆంధ్రప్రదేశ్ నుండి విడిపోవాలని ఉద్యమం చేశారు. అంతగొప్ప ఉద్యమం అంతకుముందు జరుగలేదు. తర్వాత కూడా జరుగలేదు. ఆ ఉద్యమం లోనూ, 300 మంది మరణించారు. కానీ ఫలితంలేదు. ప్రధాని ఇందిరాగాంధీ గారు ఆరు సూత్రాల ఫార్ములా అనిపెట్టి, రాష్ట్రాన్ని ఆరు భాగాలుగా విభజించి, ఉద్యమాన్ని నిరమింపజేసారు. నిజానికి ఈ రెండు ఉద్యమాలు, ఉద్యోగస్తులు, ఉద్యోగాల గురించే.

1972 నుండి ఇటీవలి కాలం వరకు రాష్ట్ర ప్రజలందరూ ప్రశాంతంగానే వున్నారు. ఇటీవల కె. చంద్రశేఖరరావు (తెలుగుదేశం) తనకు మంత్రి పదనిరా లేదని, మరలా తెలంగాణా రాష్ట్ర సమితి పేరుతో ఉద్యమానికి పిలుపునిచ్చారు. 2004లో జరిగిన ఎన్నికలలో, కాంగ్రెసువారితో కలిసి తెలుగుదేశాన్ని ఓడించ గలిగారు. తెలంగాణా ఏమవుతుందో వేచి చూడవలసిందే.

**గ్రామీణ జీవితంలో వచ్చిన మార్పులు :**

వ్యవసాయమే ప్రధాన వృత్తిగా గల గ్రామాలలో దాదాపు 60 సంవత్సరముల నుండి, గణనీయమైన మార్పు వచ్చింది. వ్యవసాయక కుటుంబము అంటే మనుషులతోపాటు పశువులు కూడా వుండేవి. పొలంలో పనిచేయటానికి, మనిషితోపాటు పశువులు కూడా పనిచేసేవి. పండిన పంటను మనుష్యులు తినేవారు. పశువులు కూడా తినేవి. రైతు యొక్క స్తోమతను బట్టి

కొంతపొలం పశువుల మేతకే ఉపయోగించేవారు. అట్లానే వసతి కూడా మనుష్యులతోపాటు పశువులకు కూడా ఏర్పాటు చేసేవారు. చిన్న కుటుంబాలయితే మనుష్యులు పశువులు ఒకే ఇంట్లోనే. ఇంట్లో చిన్న పిల్లలు పశువులు ఈనినప్పుడు ఆ "పసిదూడలను వాటేసుకొని, ముద్దు పెట్టుకొని ఆనందించేవారు. వ్యవసాయము మిషన్లతో చేయటము వచ్చిన తరువాత ఎడ్లను ఎవరూ పోషించటము లేదు. కొన్నాళ్ళు పాడిగేదెలు మాత్రము వుండేవి. ఇప్పుడు చాలా కుటుంబముల వారు అవికూడా లేకుండా పాలప్యాకెట్లు కొనుక్కోవటం సర్వసాధారణమైంది.

పిల్లల చదువుల విషయంలో కూడా పట్టణాలను అనుకరిస్తూ, ఇంగ్లీషు మీడియంలో సూటు, బూటు, టై మోజులలోపడి చదువు చెప్పేవారికి ఎంత చదువు వచ్చునన్నదీ కూడా తెలుసుకోకుండా, బస్సుల్లో పట్నాలకు పంపడం ఆ వయస్సులో, వుండవలసిన పోషణ సరిగ్గా లేకపోవటం జరుగుతున్నది. పిల్లలు పాఠశాలలోనేకాక, తల్లి దండ్రులనుండి, ఇతర కుటుంబ సభ్యుల నుండి తెలుసుకోవలసిన విషయాలు ఎన్నో వున్నవి. కుటుంబములో ఆరకమైన తర్ఫీదు ఇవ్వలేకపోతున్నారు. అందువలన, పిల్లలకు, తల్లి దండ్రులకు వుండవలసిన సాన్నిహిత్యము కూడా లోపిస్తున్నది. పిల్లలు ఏమి చదువుతున్నది.

ఇంట్లో వారికి తెలిసే పరిస్థితి లేదు. చాలా విషయాలలో పిల్లల జ్ఞానము శూన్యము. ఈ దుస్థితినుండి ఎంత త్వరగా బయటపడితే అంత త్వరగా కుటుంబ వ్యవస్థ రక్షింపబడుతుంది.

ప్రపంచ వ్యాప్తంగా, పారిశ్రామిక విప్లవం వచ్చిన తర్వాత, మానవ జీవితంలో, చాలా మార్పులు వచ్చినవి. ఐనా నా చిన్నప్పటి గ్రామీణ జీవితంలో వ్యవసాయరంగ స్థితి కొన్ని శతాబ్దాల క్రిందటలాగానే వుండేది. వ్యవసాయం ఎద్దులు, మనుష్యులు, కలసి చేసేవారు.

పంటను కూడా అట్లానే అనుభవించేవారు. పొగాకు, వేరుశనగ, మొదలైన వంటలు కొద్దిగా వేసుకొనేవారు. ఆ డబ్బు ఇతర ఖర్చులకు సరిపోయేది.

ఇండ్లలో అప్పటికి చుట్టి పాత్రలే ఉపయోగించేవారు. అప్పుడప్పుడే జర్మన్ సిల్వర్ పాత్రలు, ఉపయోగంలోనికి వస్తున్నాయి. పిల్లలకు పొలం వెళితే ఆయా సీజను బట్టి తినటానికి వేరుశనగకాయలు, మొక్క జొన్న కండెలు, ఉచబియ్యం, పజ్జ కంకులు, కందికాయలు, దోపకాయలు, విరివిగా దొరికేవి. తర్వాత కాలంలో, వ్యవసాయ రంగంలో గొప్ప మార్పు వచ్చినది. ఎద్దుల వ్యవసాయం పోయి యాంత్రిక వ్యవసాయం వచ్చింది. తిండి గింజలు పండించటం మాని ప్రత్తి పొగాకు మిర్చి, మొదలైన పంటలకు అధిక ప్రాధాన్యతనిచ్చి, పెట్టుబడి కొరకు పెద్ద మొత్తాలలో అప్పులు తెచ్చి కొన్ని సందర్భాలలో అప్పులు తీర్చలేక ఆస్తులు కూడా పోగొట్టుకున్నారు. కొన్ని యేళ్ళ నుండి ప్రాణాలు కూడా పోగొట్టుకుంటు న్నారు. (రైతు ఆత్మహత్యలు). ప్రతి రోజు రైతుల ఆత్మహత్యలు వార్తా విశేషాలుగా చదవటం సర్వసాధారణం. ఇది ఎంతో బాధాకరమైనది.

కొన్ని రంగాలలో అప్పటికన్నా ఇప్పుడు మంచి మార్పే వచ్చిందను కొంటాను. ముఖ్యంగా చదువుల విషయంలో, పెద్ద వారు, చిన్నవారు, ఇంకా బీదవారు కూడా చదువు యొక్క ప్రాముఖ్యతను గుర్తించి అందుకొరకు, డబ్బు విరివిగా ఖర్చు పెడుతున్నారు. కొన్ని సందర్భాలలో మితిమీరి ఖర్చు పెడుతున్నారు.

గ్రామీణ జీవితంలో, వ్యక్తుల మధ్య వుండవలసిన సఖ్యత, నానాటికి దిగజారి పోతున్నట్లు కన్పిస్తుంది. దీనికి బహుశా ఒక కారణం, ఎన్నికలు కావచ్చేమో. అయిదు సంవత్సరాలకు ఒకసారి వచ్చే పార్లమెంటు, అసెంబ్లీ ఎన్నికలేగాక, పంచాయితీలకు, కోఆపరేటివ్ సొసైటీలకు వీటివలన ప్రతిసారి ప్రజలు నిభరించ పడటం మరలా కలిసి ఆవకాశము వచ్చేలోపల వేరే ఎలక్షను రావటంవలన కలిసే అవకాశాలే మృగ్యమైపోయి, ఒకరినొకరు శత్రువులుగా

చూచుకోవటం, సాధారణమై పోయింది. అంతేగాక ప్రతి ఎన్నికలలోనూ, పెద్ద ఎత్తున డబ్బు ఖర్చుపెట్టం చాలా సందర్భాలలో ఎన్నికలలోకి వచ్చినప్పటి నుండి పాక్షికంగా దెబ్బ తినటం వలన, ఉత్సాహం నశించి, జీవచ్ఛవాలుగా బ్రతకటం జరుగుతుంది.

ఏ ఉత్సవాలు, ఏ వినోదాలు లేకుండా, బ్రతకవలసిన పరిస్థితి ఏర్పడు తున్నది. టి.వి. లు వచ్చిన తర్వాత ఎక్కువ కుటుంబములవారు టి.వి.లతోనే కాలం గడుపుతున్నారు. గ్రామీణ జీవితంలో కూడా వ్యక్తిగత సంబంధాలు దెబ్బతిని, యాంత్రికంగా బ్రతుకుతున్నారు.

వ్యవసాయ కుటుంబములలో పసిబిడ్డలను తల్లి దండ్రులు ఎంత ప్రేమగా పెంచుతారో వృద్ధాప్యములో తల్లి దండ్రులను కూడా బాధ్యతగా పిల్లలు చూచు కొంటారనే నమ్మకం. నేను మెడిసిన్ చదివేటప్పుడు ఇంట్లో శెలవులలో వున్నప్పుడు, జరిగిన చిన్న సంఘటన–మాకు ఎదురింటి అవతల మామేనత్తగారి ఇల్లు వుండేది. పెద్ద ఇల్లు, పెద్ద ఆవరణ, సాయంకాలము ఇరుగుపొరుగు వారు వచ్చి అక్కడ కూర్చొనేవారు. నేను అట్లానే వెళ్ళేవాడిని. ఏదో మాటవరస వచ్చి "పిల్లలను తల్లి దండ్రులు చదివించినందువలన, వారి బ్రతుకు వారు బ్రతుకుతారు. అంతేగానీ తల్లి దండ్రులను బాధ్యతగా చూస్తారనుకోవటం సరిగాదు." అని నా అభిప్రాయం చెప్పాను. ఆ ప్రక్క ఇంట్లో ఆమె కోటమ్మ భర్తను పెద్దగా కేకవేసి పిలిచింది. "చూడవయ్యా శాస్త్రుల కొడుకు ఏమంటున్నాడో, పిల్లలను పెంచి పెద్దచేసి, చదువు చెప్పించేది వారి బాగు కోసమేగాని, తల్లి దండ్రులను చూడటానికి కాదట." అని ఆయనతోచెప్పింది. ఇది నేను ప్రస్తావించిన కారణం–గ్రామాల్లో వారికుండే నిశ్చితాభిప్రాయమునకు, నా మాటలు వ్యతిరేకం కనుక.

నాకు ఊహ తెలిసేనాటికి స్వాతంత్ర్య సమరం చివరిదశకు వచ్చింది. 1940లో వ్యక్తి సత్యాగ్రహముచేసి వేలాదిమంది జైళ్ళకు వెళ్ళారు. తర్వాత 1942లో "క్విట్ ఇండియా" పిలుపునిచ్చినందువలన, ప్రభుత్వము పెద్దఎత్తున అణచివేత: కార్యక్రమాన్ని చేపట్టింది. వ్యక్తి సత్యాగ్రహంలో పాల్గొన్నవారిలో మా మేనమామ పిన్నమనేని సూరయ్యగారు. నాలుగుమాసాలు జైలు శిక్ష అను భవించారు. స్వాతంత్ర్యము వచ్చిన తర్వాత, స్వాతంత్ర్య యోధులు పెద్ద ఎత్తున ప్రభుత్వము నుండి భూములు తీసుకొన్నారు. కానీ ఆయన ఆపని చేయలేదు.

1939లో ప్రారంభమైన రెండవ ప్రపంచ యుద్ధము నాకు బాగా తెలుసు... యుద్ధకాలములో రాజకీయవాదులు జైళ్ళలో వుండటమేకాక మామూలు ప్రజా నీకం చాలా ఇబ్బందులకు గురైనారు. ప్రతి వస్తువు, మామూలు ధరకంటే, ఎక్కువ ఖరీదు పెట్టి కొనవలసి వచ్చేది. బ్లాక్ మార్కెట్ అనే పదం అప్పుడే వచ్చింది. కొన్ని వస్తువులు అసలు లభ్యమయ్యేవి కావు. ఆహార ధాన్యాలకు కరువు వచ్చినందువలన ప్రభుత్వము రేషను ప్రవేశపెట్టింది. రైళ్ళలో ప్రయాణం చేయటం దుర్భరంగా వుండేది. రేషను చాలా కరెక్టుగా అమలు చేసేవారు. రైతుల ఇళ్ళలోవున్న ధాన్యాన్ని ప్రభుత్వము బలవంతంగా తీసుకొని వెళ్ళేది.

ఆహార కొరత చాలా సంవత్సరాలు కొనసాగింది. ప్రభుత్వము వారు వ్యవసాయాన్ని ప్రోత్సహించటానికి ఎన్ని ప్రయత్నాలు చేసినా 1970 వరకూ అమెరికానుండి పెద్దఎత్తున ఆహార ధాన్యాలు దిగుమతి చేసుకొనుట తప్పలేదు. భారత రైతాంగము చేసిన కృషివలన ఎక్కువ ఆహార ధాన్యాలు: పండించి, కరువు లేకుండా చేయటమేగాక ఈ రోజు విదేశాలకు కూడా ఎగుమతి చేస్తున్నాము.

స్వాతంత్ర్యము వచ్చేనాటికి నేను ఎం.బి.బి.ఎస్. ప్యాసు అయినాను. అందువలన చాలా కాలము స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొనలేకపోయినాను అనే భావన వుండేది. నాముందు తరంలో చూస్తే, దేశ వ్యాప్తంగానూ, తెనుగునేలపైన అన్ని రంగాలలో ఉద్దండులు అనేకమంది వుండేవారు, స్వాతంత్ర్యము వచ్చిన

తరువాత కొద్ది నెలలకే మహాత్మాగాంధీ మరణించడం, మిగిలిన నాయకులు అందరూ ప్రభుత్వ కార్యకలాపములలో మునిగిపోయారే తప్ప, . దేశానికి, ఆదర్శ ప్రాయులుగా, వుండలేకపోయారు. అందువలన ప్రజానీకంలో కూడా చాలా మంది నీతి నియమాలకు తిలోదకములు ఇవ్వటం జరిగింది.

ఇప్పుడు మనం వున్నది ఆ సమాజంలోనే. ఎప్పటికైనా ఈ దుర్భర వ్యవస్థ మారుతుందనే నమ్మకము కూడా లేదు. అందరికీ ఆహారాన్ని అందించే రైతు పరిస్థితి. నానాటికీ దిగజారిపోయింది. ఆత్మహత్యలు, సర్వసాధారణమయ్యాయి. ప్రతిరోజూ పేపర్ల ఈ వార్తలు చూసినప్పుడు మనస్సు కలుక్కుమంటుంది. అలానే మిగతా పేద వర్గాలు కూడా. రోజు రోజుకి వారి పరిస్థితి దిగజారిపోతున్నది. పేపర్లలో మాత్రం దేశం ఎంతో అభివృద్ధి చెందిందని, సంపన్నులు చాలా పెరిగారని, వార్తలు చదువుతూవుంటాము. బడుగు వర్గాల పరిస్థితి బాగుపడవంతవరకు ఈ పెరుగుతున్న సంపదంతా అర్ధంలేనిదేకదా!

ఎవరు ఎప్పుడు పుట్టాలో, వారి చేతులలో లేదుకదా! అందుకనే ప్రస్తుత సమాజంలో కలసిపోకతప్పదు. ఈ తరంలో కూడా మనమధ్య చాలామంది, మేధావులు, సేవాతత్పరులు వుండటం గ్రహించి, వారితో సన్నిహిత సంబంధాలు ఏర్పరచుకొనటంవలన కొంత మనసుకు ఊరట కల్గుతుంది సమాజాభ్యుద యానికి, వారి సేవలు ఎంతగానో ఉపయోగపడుతున్నవి.

నేను పుట్టినప్పటికి భారతదేశంలో మహాత్మాగాంధీ నాయకత్వం క్రింద స్వాతంత్ర్య సంగ్రామము జరుగుతున్నది. మా చిన్నప్పుడు, మహాత్మాగాంధీని గురించి, ప్రజలలో వున్న అభిప్రాయము ఆయన మానవుడు కాదని దేవుని అవతారమని, కొంతమంది చెప్పుకొనేవాళ్ళు. ఇంకా కొంత వయస్సు వచ్చిన తర్వాత, వారి ఉప్పు సత్రాగ్రహంను శ్రీ గురించి విదేశీ వస్తు బహిష్కరణ గురించి, కల్లు మాన్పించే ఉద్యమాన్ని గురించి వింటూ వుండేవాడిని. వారు ఆంధ్ర దేశము వచ్చినప్పుడు, హరిజనోద్ధరణ కొరకై తన కృషికి చేయూత నివ్వాలని మీటింగుల్లో

చెప్పటం, స్త్రీలు పెద్ద సంఖ్యలో వారి దగ్గరవున్న నగలు, నగదు, చాలా విరివిగా ఇచ్చారని చెప్పుకోవటం జరిగింది.

1936 లో ననుకొంటాను ఆయన ఆంధ్రదేశములో పర్యటించినప్పుడు గుంటూరులో ఆయనను చూడాలని పొద్దుబోయేవరకు ఎదురు చూచాను. అప్పటికి వారు రానందువలన ఇంటికి వెళ్ళటం జరిగింది. తరువాత 1946లో నేను ఎం.బి.బి.ఎస్. చదివేటప్పుడు వారు హిందీ ప్రచార సభ రజతోత్సవమునకు మద్రాసు వెళ్తూ విశాఖపట్నంలో ఆగి అక్కడ ప్రజలనుద్దేశించి కొంతసేపు మాట్లాడారు. అప్పుడు ఆయనను దగ్గరగా చూడటం జరిగింది. వారు హిందీలో ప్రసంగము చేశారు.

గాంధీగారి ప్రయాణాన్ని గురించి ఒక మాట చెప్పాలి. ఎప్పుడూ రైలులోనే ప్రయాణము చేసేవారు. రైలులో అప్పుడు నాలుగు తరగతులుండేవి. 1.2.3 ఇంటర్ క్లాసులు, వారు సామాన్య ప్రజలవలె మూడవ తరగతిలోనే ప్రయాణించుటకు నిర్ణయించుకొన్న తర్వాత, అప్పటి రైల్వే కంపెనీవారు (అప్పటికి రైలు వేరు వేరు కంపెనీల–ఆధీనంలో వుండేవి) గాంధీగారి ప్రయాణాలు ఒక ఫుల్ కంపార్టుమెంటు (మూడవ క్లాసు) రిజర్వు చేసేవారు. అందులో ఆయన సహచరులు, ఆయన పాడి మేక దానికి కావలసిన గడ్డి ఇత్యాదులు వుండేవి.

అంతకు ముందు చాలా కాలం నుండీ గాంధీగారు మేక పాలు ఆహారంగా తీసుకొనేవారు. పశువుల యజమానులు ఎక్కువ పాలు ఇవ్వటం కొరకు, పశువులను కొంత హింసకు గురిచేసేవారు. ఆవు ముడ్డిలో కర్రదోపితే ఎక్కువ పాలు ఇస్తాయని నమ్మేవారు. అదిచూసిన గాంధీగారు పాలను కూడా విసర్జించారు. ఆహారము ఎట్లా ఇవ్వాలో తెలియని ఆయన సహచరులు అనుచరులు చాలా బాధపడేవారు. అప్పుడు కస్తూరిబాయి, సరోజిని నాయుడు గారు ఆవుపాలు బదులు మేకపాలు తీసుకొండని చెప్పటం జరిగింది. అప్పటి నుండి మేకపాలనే తీసుకొనేవారు.

విశాఖపట్నం రాక సందర్భంలో జిల్లా కాంగ్రెసు ప్రెసిడెంటు పళ్ళంరాజు గారు వారికి ఆహ్వానం చెప్పటానికి వచ్చారు. గాంధీగారు "ఏం పళ్ళంరాజు! నేను చాలా సంవత్సరాల తర్వాత, ఆంధ్రదేశము వచ్చాను. ఇక్కడ పరిస్థితులలో మార్పు ఏమి కన్పించలేదని అన్నారు. మహాత్మాగాంధీ సామాన్య మానవుడని తెలిసినప్పటికీ వారి జీవిత చరిత్ర చదివిన వారికి గానీ దగ్గరగా చూచినవారికి గానీ, ఆయన సామాన్య మానవులు కాదు "మహాత్ముడు" అని తెలియవస్తుంది. విశ్వకవి రవీంద్రనాథ్ టాగూర్, గాంధీగారిని "మహాత్మా" అని పిలిచిన తర్వాత అందరూ వారిని అదే పేరుతో పిలవటం మొదలు పెట్టారు.

రాజకీయాలలో కొందరు విభేదించినప్పటికి వారి చిత్త శుద్ధిని ఎవ్వరూ శంకించలేదు. అప్పట్లో విభేదించిన వారు కూడా వారి మరణానంతరం వారిని "మహాత్ముడనే నమ్మారు. మన స్వాతంత్ర్యానికి ఒకటి రెండు సంవత్సరాలు ముందు తర్వాత బ్రతికి వున్న కొద్ది నెలలు వారి మనస్సు చాలా వత్తిడికి గురైంది. వారి మరణానంతరం ప్రపంచ వ్యాప్తంగా వారి ఘనతను గురించి కొనియాడారు. ఐన్స్టీన్ ఆయనను గురించి అన్న మాటలు బిర్లా హౌస్లో చెక్కారు. "రక్త మాంసాలతో ఈ భూమిపై మానవునిగా తిరిగాడు అంటే మానవులు నమ్మలేదు" ఈ దేశంలో గౌతమ బుద్ధుని తర్వాత అంతటి ఔన్నత్యము కలిగిన వ్యక్తి మహాత్మాగాంధీయే. అందరూ వారిని చూడటం మహాభాగ్యమని భావించేవారు. ఆ అదృష్టం నాకు దక్కింది.

ఆ తర్వాత ఈ దేశంలో మహోన్నత వ్యక్తులు జవహర్లాల్ నెహ్రూ, వల్లభాయిపటేల్, రాజేంద్రప్రసాద్ గార్లు. సాహిత్య రంగాలలో రవీంద్రనాథ్ ఠాగూర్. వీరందరికీ సమకాలీకుడవయినందుకు సంతోషము. ఆంధ్రదేశములో ప్రకాశం పంతులుగారు, ఆచార్య ఎన్.జి. రంగా గారు నాకూ బాగా నచ్చిన నాయకులు.

ఆచార్య రంగాగారితో 1942 నుండి నాకు సన్నిహిత సంబంధం వుంది. వారి సహచరి శ్రీమతి భారతీదేవి గారు మాకు (నాకు నా భార్య జయప్రదకు) ఆత్మీయురాలు.

కాలేజీ చదువునుండి ఎం.బి.బి.ఎస్. అయ్యేవరకూ, ప్రపంచాన్నంతటినీ రెండవ ప్రపంచ యుద్ధం అతలాకుతలము చేసినది. చాలా దేశాలలో గొప్ప నాయకులు దేశనాయకులుగా వారివారి దేశాలకు నాయకులైనారు. ఇంగ్లాండులో విన్స్టన్ చర్చిల్, అమెరికాలో రూజ్వెల్టు, జర్మనీలో హిట్లరు, రష్యాలో స్టాలిన్ ముఖ్యులు. చరిత్రకు ఒక రూపం ఇచ్చినవారు. వీరందరూ గొప్ప నాయకులైనప్పటికీ నాకు అందరిపట్లా, సద్భావంలేదు.

రెండవ ప్రపంచ యుద్ధంలో ఎక్కువ కష్టపడ్డ దేశం ఇంగ్లండు. జనాభా నష్టం, ఆర్థిక నష్టం జరిగినప్పటికీ, యుద్ధంలో గెలుపొందినందువలన ఇంగ్లాండు వారి ఔన్నత్యానికి భంగం కలగలేదు. అమెరికా దేశములో చాలా తక్కువ పౌరుల నష్టం. జరిగింది. ఆర్థికంగా కూడా పెద్ద నష్టమేమీలేదు. హిట్లరు విషయానికి వస్తే తన యుద్ధోన్మాదంవలన సగం ప్రపంచాన్ని అల్లకల్లోలంచేసి కోట్లాది మంది ప్రజల ప్రాణాలకు, ఆస్తులకు, భంగం కలిగించటమేగాక, తనదేశములో వున్న యూదులను అరవై లక్షలమందిని (ఆడ మగ, పిల్ల పెద్దా తేడాలేకుండా) చంపించిన దుర్మార్గుడని నా విశ్వాసం. అట్లానే రష్యాలో స్టాలిన్ కూడా కమ్యూనిజం పేరుతో తన దేశములోని రైతులను "కులక్"లనే ముద్రవేసి లక్షలాది మందిని చంపిన వ్యక్తి. యుద్ధములోనూ, పెద్ద సంఖ్యలోనే జనాభా నశించింది. కమ్యూనిస్టులు వారు నమ్మిన సిద్ధాంతంవలన 'స్టాలిన్' గొప్పవాడనుకోవచ్చు. అతనూ హంతకుడే.

మొత్తం మీద రెండవ ప్రపంచ యుద్ధం పూర్తి అయిన తర్వాత, ప్రపంచంలో గొప్ప మార్పు వచ్చింది. వలసరాజ్యాలన్ని ఒకటి తర్వాత ఒకటి స్వతంత్రదేశాలయినవి. అందులో ముందుగా మన భారతదేశ ప్రధాని నెహ్రూ" నూతనంగా వెలుగు చూచిన స్వతంత్ర రాజ్యాలన్నిటికీ ఆశాజ్యోతిగా వుండేవారు.

# రాజకీయ రంగ ప్రవేశం

నేను, హైస్కూలు, కాలేజీలలో చదివేరోజులలో, స్వాతంత్ర్య పోరాటం ఉధృతంగా జరగటం చూసి నేను ఒక తరం ముందుపుర్తే బాగుండేది అని అనుకొనేవాడిని. ఒక తరముందు, రాజకీయాలలోనేకాక, వివిధ ప్రజారంగాలలో ఉద్దండులుండేవారు. నా చదువు పూర్తి అవటం, స్వాతంత్రము రావటం ఒకే సారి జరిగింది. అందువలన, అప్పట్లో నాభావన మన నాయకులు స్వాతంత్ర్యం తెచ్చారుకదా. వారిపాలనలో దేశం అభివృద్ధి చెందుతుంది. అందువలన వృత్తిలో మన పాత్ర నిర్వహిస్తే సరిపోతుంది అని అనుకొనే వాడిని. అయితే తర్వాత అనుభవంలో తెలుసుకొన్నది. పై నుంచి క్రింది వరకు, రాజకీయ వాదులు ప్రజాసేవను విస్మరించి, స్వార్థానికి ప్రాధాన్యత ఇస్తున్నారని. 1946లో మద్రాసులో వచ్చిన మన ప్రభుత్వము వారు పెద్దగా లంచాలు తీసుకొనలేదు. వారి అనుయాయులకు ఏదోకొంత మేలుచేసేవారు. దానికి ప్రజలు ప్రభుత్వంపై విముఖత ఏర్పరుచుకొని, 1952 ఎన్నికలలో, చిత్తుగా ఓడించారు. అప్పుడే సినిమాలలో కొసరాజువారి గేయం "ఒక్కసారి మంత్రిచేయి గణనాథా. నువ్వు ఓడకుంటే ఒట్టుపెట్టు గణనాథా" అన్న గేయం వచ్చింది. తాత్కాలికంగా కొన్ని రోజులు ప్రభుత్వం తప్పుడు పనులు చేయటంలేదనే భావన కలిగినా, అప్పటి నుండీ, ఈ అర్థ శతాబ్దంలో లంచగొండి తనం, ఆశ్రిత పక్షపాతం, ఇతర అక్రమాలకు హద్దులేకుండా పోయింది. ఈ రోజు లంచగొండి తనాన్ని గురించి మాట్లాడటమంటే "గొంగట్లో అన్నము తింటూ వెంట్రుకలను ఏరుకున్నట్లే"...

**ఎమర్జెన్సీ ఘోరాలు :**

1950లో మనదేశం రిపబ్లిక్గా ప్రకటించుకొని, 1952లో మొదటిసారిగా, జనరల్ ఎన్నికలు నిర్వహించుకొన్నాము. అప్పటినుండి నాలాంటివారు ఊహించిన దానికి, భిన్నంగా పరిపాలన జరిగి, ప్రభుత్వాలు ప్రజలకొరకు కాక ఎన్నికైన వారికేననే అభిప్రాయం. బలపడింది.

నెహ్రూగారున్నంత వరకు ఒకమాదిరిగా వుంది. కొద్దికాలం లాల్ బహుదూర్ శాస్త్రిగారు ప్రధానిగా వున్నప్పుడు మరలా ప్రజల ఆశలు చిగురించాయి. దురదృష్టవశాత్తూ, ఆయన ఆకాల మరణమువల్ల శ్రీమతి ఇందిరా గాంధీగారు ప్రధాని కావటం జరిగింది. ఆమె పరిపాలన ప్రజాస్వామిక పాలనని చెప్పుకోవటానికి కూడా వీలు లేకుండా అన్ని రకాలైన దుర్మార్గాలకు పాల్పడింది. పాతతరం నాయకులు ప్రజలు కూడా విస్తుపోవటం-తప్ప ఏమీ చేయలేని పరిస్థితి ఏర్పడింది. దీనికి పరాకాష్ట ఇందిరా గాంధీ ఎన్నిక చెల్లదని కోర్టు తీర్పు ఇచ్చిన తర్వాత ఎవరూ ఊహించని విధంగా అత్యవసర పరిస్థితిని (ఎమర్జెన్సీ) ప్రకటించి, జయప్రకాష్నారాయణ మొదలు సామాన్య ప్రజల వరకు 1.5 లక్షల మందిని జైళ్ళకు పంపించి, అర్చకుడైన చిన్నకొడుకు సంజయ్ గాంధీతో కలసి ప్రజల ప్రాథమిక హక్కుల నన్నిటిని కాలరాచి పార్లమెంటులో విభజన పెంచి, 1977 వరకు ఎన్నికలు లేకుండా ఆమె నియంతృత్వ ధోరణిలో పరిపాలించింది. ఆ స్థితిలో, ఎన్నికలు జరిపినా, తానే ప్రభుత్వానికి వస్తానన్న నమ్మకంతో 1977లో ఎన్నికలు ప్రకటించి, జైళ్ళలోవున్న రాజకీయ నాయకులను విడుదల చేసింది. తన ఊహాకు భిన్నంగా జైళ్ళనుండి బయటకు వచ్చిన వివిధ పార్టీల నాయకులు, జనతాపార్టీని ఏర్పరచి, ఎన్నికలలో నిల బడ్డారు. "ఎన్నికలు ప్రారంభమైన దగ్గరనుండి జనతాపార్టీ బలపడుతుందని, అర్థంచేసుకొని ఎమర్జెన్సీని తాత్కాలికంగానే సడలించానేతప్ప పూర్తిగా ఎత్తివేయ లేదు." అని చాలాసార్లు ప్రకటించింది. ఎన్నికలు జరిగేటప్పుడు కాంగ్రెసు పార్టీలు కూడా అదే స్లోగన్తో, సామాన్య ప్రజలను భయపెట్టారు. ఐనా దేశం మొత్తంమీద కాంగ్రెసు ఘోరంగా ఓడిపోవటం, అందులో ఇందిరాగాంధీ, సంజయ్ గాంధీ కూడా ఓడిపోవటం జరిగింది. దక్షణాది రాష్ట్రాలలో, దీనికి విరుద్ధంగా, మొత్తం సీట్లు కాంగ్రెస్ గెలుచుకొంది. దీనికి బహుశా ఒక కారణం, ఎమర్జన్సీ పిరియడ్లో, ఉత్తర భారతంలో జరిగినన్ని ఘోరాలు ఇక్కడ జరగకపోవటము కావచ్చు. ఈ ఎన్నికల్లో మొట్టమొదటిసారి నేను పోటీచేయటం జరిగింది.

ఇక్కడ ఓడిపోయినప్పటికి, కేంద్రంలో ప్రభుత్వము ఏర్పడినందుకు, కొంత ఉపశమనం. నిజంగా ఇందిరాగాంధీ గెలిచి వున్నట్లయితే, దేశం ఏమయిపో యేదో ఊహించలేము. ఎన్నికలయిన తరువాత, ఎమర్జెన్సీలో జరిగిన ఘోరాలను గురించి సమాచారం దేశవ్యాప్తంగా అందరికీ తెలిసింది. కాంగ్రెసు పార్టీ, ఇందిరాగాంధీని బహిష్కరించింది. ఆమె తన స్వంత పేరుతో కాంగ్రెసు పార్టీని ఏర్పరచింది. ఆ తరువాత 1978 ఎన్నికలలో, కాంగ్రెసు చీలి రెండు పార్టీలు, జనతాపార్టీ ఒక పార్టీగానూ, పోటీ చేశాయి. అత్యాశ్చర్యంగా ఇందిరాగాంధీ పార్టీ ప్రభుత్వానికి వచ్చింది. ఆ తరువాత సంవత్సరానికి కేంద్రంలో జనతాపార్టీ చీలి రెండు పార్టీలుగా, ఉద్భవించి, మరలా జనరల్ ఎలక్షన్లు జరిగినవి.

**అన్న అభ్యర్థనపై తెలుగుదేశం అభ్యర్థిగా :**

మొరార్జీదేశాయి చరణ్ సింగ్ విభేదాల వల్ల చీలిక వచ్చింది. ఆ ఎలక్షన్లలో ఇందిరాగాంధీ మరలా కేంద్ర ప్రభుత్వాన్ని చేపట్టింది. 1978 అసెంబ్లీ ఎన్నికలలోనూ, 1980లో జరిగిన పార్లమెంటు ఎన్నికలలోనూ, నేను ఓడి పోయాను. అంతటితో ఎన్నికల రాజకీయాలకు దూరంగా వుందామనుకున్నాను. ఆంధ్రప్రదేశ్లో ఎన్టీఆర్ (నందమూరి తారకరామారావు) నాయ కత్వంలో, తెలుగుదేశం పార్టీ ఏర్పడి, 1983లో పోటీచేసి, ప్రభుత్వానికి వచ్చారు. ఆ ఎన్నికలలో ఎన్టీఆర్ నన్ను పార్టీ తరుపున ఆహ్వానించి, ఎన్నికలలో పోటీ చేయమని కోరారు. 1984లో మరలా పార్లమెంటు ఎన్నికలు వచ్చినవి. అప్పుడు మరలా ఎన్టీఆర్ పార్లమెంటుకు పోటీ చేయవలసిందిగా కోరారు. నేను ఒప్పు కోలేదు. చివరకు పార్టీలోనైనా చేరమన్నారు. దానికి ఒప్పుకొన్నాను. ఆ కారణంగా, 1985లో పెదకూరపాడు, నియోజకవర్గం నుండి అసెంబ్లీకి పోటీ చేయటం జరిగింది. ఆ ఎన్నికలలో మాత్రం గెలిచాను. శాసన సభ్యునిగా, నాకు చేతనైనంత వరకూ నియోజక వర్గానికి న్యాయం చేసానన్న తృప్తివున్నది.

**ఎత్తిపోతల పథకాలు :**

త్రివేది పరిపాలనా కాలంలో ఖరారైన నాగార్జునసాగర్ ప్రాజెక్టుకు 1959లో ప్రధాని నెహ్రూగారు శంకుస్థాపన చేశారు. ఈ ప్రాజెక్టు ప్రపంచం మొత్తం మీద, రెండవ పెద్ద ప్రాజెక్టు. ఈ ప్రాజెక్టు యొక్క విశిష్టత, విదేశీ టెక్నాలజీతో పనిలేకుండా పూర్తిగా మన ఇంజనీర్లే నిర్మాణం చేయటం. ఆచరణలోనికి వచ్చేటప్పటికి వారు ఊహించినట్లుగా కాలువ చివరి భూములకు నీరు సక్రమంగా ఇవ్వలేకపోవటం జరిగింది. అందువలన కాల్వ చివర భూముల వారు, కొంత నిరాశకు గురైనప్పటికీ, 17 లక్షల ఎకరాలకు నీరు అందించ గలుగుతున్నాము. వీరందరిని కాలువ చివర భూములకు, ప్రత్యామ్నాయంగా ఏర్పాట్లు కొన్నిచేసి కృష్ణానది నుండిగాని, నాగుల నుండిగానీ, లిఫ్టు ఇరిగేషను పథకాల వలన, సమస్య కొంతవరకు తీర్చగలిగాము. నేను ఎం.ఎల్.ఏ. గా వున్న హయాంలో 1985-89లో ఈ ఎత్తిపోతల పథకాలు, ఎక్కువ ప్రారంభించాము. అది ఎక్కువ కాలం తీసుకొన్నా. మొత్తం మీద ఆభూములకు కూడా నీళ్ళు అందివ్వ గలిగాము. ఆ లిఫ్టు ఇరిగేషను నిర్మాణము ఇప్పుడు కూడా జరుగుతూనే వున్నది. ప్రభుత్వం ప్రచారం చేస్తున్న. డ్రిప్ ఇరిగేషన్ (స్ప్రే ఇరిగేషను మొదలైన, పద్ధతులు అవలంబించిన ఇంకా ఎక్కువ పొలానికి నీరు ఇవ్వగలుగుతాము. పంట దిగుబడి కూడా ఎక్కువ వస్తుంది. 1989లో మరలా అసెంబ్లీసీటు వద్దన్నప్పటికీ ఒత్తిడిచేసి, టిక్కెట్టు ఇచ్చి పంపించారు. ఆ ఎన్నికలలో పార్టీ ఓడిపోయింది. నేను ఓడిపోయాను. ఆ తరువాత వచ్చిన పార్లమెంటు ఎన్నికలలో మరలా పోటీచేయమని కోరారు. నేను ఒప్పుకోవట్లేదు. అప్పటి నుండి ఎన్నికల తోటకి వెళ్ళలేదు. ప్రస్తుతం పార్టీలోనే వున్నాను.

**రాజకీయాలను గురించి :**

రాజకీయాలు చిన్నప్పటినుండి తెలిసినా, నేను డాక్టరు అయ్యేవాటికి స్వరాజ్యం వచ్చింది. అందువలన రాజకీయాలలోకి వెళ్ళవలసిన అవసరం లేదని నిర్ణయించుకొన్నాను. శ్రీమతి ఇందిరాగాంధీ, దేశంలో ఎమర్జెన్సీ ప్రకటించి, దేశ ప్రజల నోళ్ళు కట్టివేసి లక్షలాది మంది రాజకీయ నాయకులను, జైళ్ళకు పంపించి, పార్లమెంటు కాలాన్ని పొడిగించుకొని, ఆకాలంలో ఎన్నికలను ప్రకటించింది. అప్పట్లో నాకు, నాలాగే ఆలోచించే వ్యక్తులకు, తట్టినదేమిటంటే "చైనా లో వేయి పుష్పాలు వికసించని అని అందరి మనోభావాలను వ్యక్తపరిచిన తర్వాత కమ్యూనిజానికి వ్యతిరేకంగావున్న వ్యక్తులనందరినీ ఏరి వేసిన సంగతి. అలానే ఈమె. ఎమర్జెన్సీ కొనసాగిస్తూ ఎన్నికలు ప్రకటిస్తూ, తనను వ్యతిరేకించే వారందరూ బయటపడతారు కనుక వారిని తగిన రీతిలో శిక్షించటానికి వేసిన పానికేమో అనిపించింది. నేను పార్లమెంటుకు పోటీ చేయాలనుకొన్నప్పుడు, మా ఇంట్లో భార్యా పిల్లల అందరికీ ఈ విషయాన్ని వివరించి ఇటువంటి ప్రమాదము ఎదుర్కొనవలసి వస్తుందని చెప్పాను. వారందరూ ధైర్యంగా పోటీచేయండి అని ప్రోత్సహించారు. దీనికి తగ్గట్టుగానే శ్రీమతి ఇందిరాగాంధి ఎలక్షను ప్రచారంలో, ఎమర్జెన్సీ ఎత్తివేయలేదని, తాత్కాలికంగా సడలించామని, ఎన్నికల తర్వాత ఎమర్జెన్సీ పాలన పోతుందనీ పదే పదే చెప్పారు. దీనికనుగుణంగా కాంగ్రెసు అభ్యర్థిని సమర్థించే వారందరూ, ఎన్నికల తర్వాత ఎవరెవరిని జైళ్ళకు పంపవలసింది గ్రామాలవారిగా లిస్టులు తయారుచేశారు. ఎన్నికల ఫలితాలు, కాంగ్రెసుపార్టీని, నిశ్చేష్టులను చేసినవి. అప్పటికీ ఇందిరాగాంధీ ఎమర్జెన్సీ పొడిగించాలనే ఆలోచనలోనే వుంది. దక్షిణ భారతంలో తప్ప మిగతా అన్ని రాష్ట్రాలలో కలిసి ఇందిరకు పాతిక సీట్లు రాలేదు. తాను తన కొడుకు సంజయ్ గాంధీ ఓడిపోయారు.

ఆంధ్రప్రదేశ్ ఫలితాలు దీనికి విరుద్ధంగా, ఒక్కసీటు తప్ప మిగతా అన్ని సీట్లు కాంగ్రెసు గెలిచింది. ఆఫలితాలు వచ్చే సమయంలో చాలా గ్రామాల్లో వారి జనులు, స్వైరవిహారాలు చేశారు. ఇందిరాగాంధీ సంజయ్ గాంధీ ఓడిపోయారని తెలిసిన తర్వాత వారి విలువలు తగ్గటం జరిగింది. నిజంగా దేశం అంతా ఆంధ్రప్రదేశ్లోగానే కాంగ్రెసు గెల్చినట్లయితే మాలాంటివారు ఎటువంటి హింసలకు గురి అయ్యేవారో, ఊహించుకోవలసిందే.

తర్వాత 1978లో ఎలక్షనలో ఓడిపోవటం. 1980లో పార్లమెంటుకు పోటీచేసి ఓడిపోవడం 1977 ఎలక్షన్ల పరిణామాలే. తరువాత ఎన్.టి.ఆర్. 1982లో తెలుగుదేశం పార్టీ స్థాపించినపుడు వారు రామోజీరావుగారు, రెండు మూడుసార్లు నాకు కబురుచేసారు. 1980 తర్వాత ఎన్నికలలో నిలబడకూడదని నిర్ణయించుకొని వారి ఆహ్వానాన్ని అంగీకరించ లేదు. 1983లో తెలుగుదేశం ప్రభుత్వం వచ్చింది-గొప్ప మెజారిటీతో. 1984లో రామారావు గారు అమెరికాలో గుండె ఆపరేషను చేయించుకొన్న సందర్భంగా హైదరాబాదులో నాదెండ్ల భాస్కరరావుగారు కొంతమంది ఎం. ఎల్. ఏ. లను కూడ కట్టుకొన్నారు. రామారావుగారికి మెజారిటీ లేదు. కాంగ్రెసువారి సహకారంతో నేను ముఖ్య మంత్రిని అవుతానని గవర్నరు రామలాల్ దగ్గరకు వెళ్ళటం ఆయన భాస్కరరావు గారిని ముఖ్యమంత్రిగా నియమించటం. దానిపై రామారావుగారు మహోద్యమం నడపటం, దానికి కాంగ్రెసు పార్టీవారు తప్ప మిగతా అన్ని పార్టీలవారు సహకరించడం. రామారావుగారు మరలా ముఖ్యమంత్రి అయిన తర్వాత వెంటనే పార్లమెంటు ఎన్నికలు ప్రకటించడం జరిగింది. ఆ ఎన్నికలలో చరణ్ సింగ్ గారి నాయకత్వంలోవున్న లోక్దళ్ పొత్తు ఏర్పరచుకొన్నారు. నేను అప్పుడు రాష్ట్రలోక్దళ్ ప్రెసిడెంటుగా వున్నా. చరణ్ సింగ్ గారు నాకు ఫోనుచేసి సీట్ల విషయంపై మాట్లాడటానికి రామారావుగారిని కలవవలసినదిగా చెప్పారు. దానికి రామా రావుగారు "గుంటూరు సీటు ఇస్తాను" ఆ సీటుకు పోటీచేయమని అడిగారు. అంతకుముందే ఎన్నికలలో పోటీ చేయరాదని నిర్ణయించుకొన్నందు వలన

పార్టీసీటు అడగటానికి వెళ్ళి ఆసీటుకు నేను పోటీ చేయడం. "రాజరాజ నరేంద్రుడు కొడుక్కి పిల్లని చూడటానికి వెళ్ళి, తానే వివాహం చేసుకొన్నట్లు" అన్న భావన కూడా మదిలో మెదిలి ఏపరిస్థితులలోనూ, పోటీ చేయనని చెప్పాను. వారు చివరకు నన్ను గట్టిగా పట్టుబట్టి పార్టీలో చేరటానికి ఒప్పించారు. దీనికి డాక్టరు సీతారామారావు, డాక్టరు కాజ కృష్ణమూర్తి పాత్ర వున్నది. ఆ తర్వాత అసెంబ్లీ ఎన్నికలు వచ్చినప్పుడు రామారావుగారే స్వయంగా పిలిచి పెదకూర పాడుకు పోటీ చేయమన్నారు. దానికి అంగీకరించి పోటీచేశాను. ఎన్నికల ప్రచారంలో నన్ను మంత్రి వర్గంలో చేర్చుకుంటానన్న భావన వెలిబుచ్చారు. తీరా మంత్రివర్గం ఏర్పడే నాటికి నా తమ్ముడులాంటి డా ఎం.ఎస్.ఎస్. కోటేశ్వర రావుకు మంత్రి పదవి ఇచ్చారు. ఆ విషయాన్ని గురించి అప్పుడుగాని, తర్వాత గానీ నేనెన్నడూ రామారావుగారితో ప్రస్తావించలేదు. నియోజక వర్గానికి సంబంధించి ఏపనులు అడిగినా వెంటనే చేసేవారు. ఆ తర్వాత రెండు మంత్రి వర్గాలు ఏర్పడ్డా నేను పట్టించుకోలేదు. 1989 ఎన్నికలలో మళ్ళీ నన్ను పెదకూరపాడు అభ్యర్థిగా నిర్ణయించారు. వారితో "నేను ఈ నియోజకవర్గానికి చెందినవాడిని కాను. మొదటిసారి పోటీచేసి గెలిచాను. ఈ సారి నేను పోటీ చేయను" అని చెప్పాను. కానీ వారు పట్టుబట్టి అక్కడే మరలా టిక్కెట్టు ఇచ్చారు. పెదకూరపాడు నియోజకవర్గంలో స్థానిక నేతలు ఎక్కువ. నేను ఎం.ఎల్.ఏ. గా వున్న సమయంలో వారందరినీ సమదృష్టితో చూసేవాడిని. నేను రెండవసారి పోటీ చేయటం, మింగుడు పడని కొందరు నాయకులు చిత్తశుద్ధితో పనిచేయ లేదు. దానికి తోడు రాష్ట్రమంతా తెలుగుదేశం పార్టీకి వ్యతిరేక పవనాలు వీరి గుంటూరు జిల్లాలో ఐదుసీట్లు మాత్రమే గెలిచాము. ఎన్నికల తర్వాత కాంగ్రెసు ప్రభుత్వం ఏర్పడింది.

1989 ఎన్నికలు అయిన తర్వాత 1991లో జరిగిన మహానాడులో ఎన్.టి.ఆర్. గారు ఎన్నికలలో ఎందుకు ఓడిపోయింది, కార్యకర్తలు ఎలా పనిచేయ వలసింది, వివరిస్తూ సుదీర్ఘంగా ప్రసంగించారు. ఆ తర్వాత వడ్డేరంగారావుగారు (మాజీమంత్రి) కొన్ని విషయాలు చెప్పారు. నేను అంతకు ముందుమాట్లాడవ లెనని అనుకోకపోయినా అప్పటికప్పుడు వేదికమీదకు వెళ్ళి ఈ విధంగా ప్రసంగించాను.

"ఎన్నికల తరువాత జరిగిన కొన్ని విషయాలను గురించి ప్రస్తావిస్తా"నని మొదలు పెట్టాను. ఒక అభిమాని వచ్చి అంతా కలలాగా జరిగిపోయింది కదండీ! అన్నాడు. అంటే ఆయన ఉద్దేశ్యం, కలకాలం రామారావుగారే పరిపాలిస్తారని. మరొకాయన, ఎందుకు ఈయన తొందరపడి ఎలక్షను పెట్టిచ్చాడు. మామూలుగా జరిగితే గెల్చివాళ్ళమేకదా! అని వాపోయాడు, కొంతమంది అయితే, రామారావుగారి పార్టీ నిలుస్తుందా, వదలిపెట్టి మద్రాసు వెళ్ళిపోతాడా అన్నారు. కొంతమంది, విపక్షనాయకునిగా అసెంబ్లీలో కూర్చో గలుగుతాడా అంటూ ప్రశ్నించేవారు. తరువాత జరిగిన అసెంబ్లీ సమావేశాలలో, వారు ప్రవర్తించిన తీరు తర్వాత తుఫాను వచ్చినప్పుడు, ఆ జిల్లాల్లో తిరిగి ప్రజలను ఓదార్చటం, పై ప్రశ్నలన్నింటికీ, సమాధానం చెప్పినట్లే ఆ సందర్భంగా వారు గుంటూరు వచ్చినప్పుడు, బస్సుమీదకూర్చొని బజారులో తిరుగుతున్నారు. నేను వారి వెనుకనే కారులో నెమ్మదిగా వెళ్తున్నాను. ఒక 60 ఏళ్ళ వ్యక్తి బస్సు వెనకనడుస్తూ, "రామారావు ఎక్కడకు పోతారు, మొన్నమటుకు పోయేవాడా! మమ్మల్ని ఓట్లు వేయనిస్తే" అని అన్నాడు.

ఎన్నికలలో ఓడిపోయిన దాని గురించి, ఇక్కడ చర్చ జరుగుతున్నదని అనుకోలేదు. అన్నాగారేలో కొన్ని విషయాలు చెప్పారు. నా ఉద్దేశ్యంలో, ఓటమికి ప్రధానమైన కారణాలు మూడు: **మొదటిది** సినిమా విశ్వామిత్ర, నేనీమాట అనగానే మీలో చాలామందికి కోపం వస్తుందని నాకు తెలుసు.

ఫ్యాన్స్కి ఇలాంటి మాటలు వచ్చవు. వారి మొదటి సినిమా వచ్చినప్పటి నుండీ నేను వారి అభిమానిని. ఆ సినిమాలో ఇంత పోలీసు నుండి ఇంత అధికారి నయ్యాను అన్న డైలాగు (వేలుతో చూపిస్తూ) నాకిప్పటికీ చెవులలో మారుమ్రోగు తుంటుంది. దానికి కారణం, ఆ డైలాగు వారి నిజ జీవితంలో ఋజువు కావటమే. సినిమా విషయంలో కోర్టులో గెలిచిన సంగతికూడా నాకు తెలుసు. అప్పటికే కాంగ్రెసువారు చేసిన దుష్ప్రచారమువలన జరగవలసిన నష్టము జరిగింది. ఇప్పుడు మరలా ఇంకొక సినిమా తీస్తారన్నమాటలు వినపడుతున్నవి. తెలుగు ప్రజలు ఇప్పటికి రామారావుగారి సినిమాలు మూడొందలు చూశారు. మూడు వందల ఒకటవ సినిమా కొరకు ఎదురు చూడటంలేదు. రామారావుగారిని మరలా ముఖ్యమంత్రిగా చూడటానికై ఎదురు చూస్తూవున్నారు. అందువలన ఆ సినిమా ప్రయత్నం మానుకోవలసిందని ప్రార్థిస్తున్నాను.

**రెండవది** క్యాబినెట్లో ముప్పై ఒక్క మంది మంత్రులను రాజీనామా చేయించి, మూడు నాలుగు రోజులు రాష్ట్రంలో పరిపాలన స్తంభింపచేయటం. ఈ విషయమై, మేము బయట ప్రజలకు ఎంత నచ్చ చెప్పటానికి ప్రయత్నం చేసినా, వారిని ఒప్పించలేకపోయినాము, వాళ్ళు అంతా విన్న తరువాత, చివరకు "కాదులెండి, దానివలన పార్టీకి చాలా నష్టం జరిగింది" అనేవారు.

**మూడవది** శాసన సభ్యులు వంగవీటి మోహనరంగా, హత్య తదుపరి జరిగిన హింసాకాండ. విజయవాడ పట్టణ చరిత్ర తెలిసిన వారెవరికైనా ట్రంకు రోడ్డుపై దేవినేని మురళితో సహా, ఆరుగురిని చంపిన తర్వాత జరగబోయేది వూహించటం అసాధ్యముకాదు, అయినప్పుడు ప్రభుత్వం దీనిని నివారించే దానికి ఎందుకు కట్టుదిట్టమైన చర్యలు. తీసుకోలేదు అని ఒక వర్గంవారు బాధపడితే, ఆ తరువాత జరిగిన విచ్చలవిడి హింసాకాండ, దోపిడీలు లాంటి కిరాతక చర్యలనుండి ప్రభుత్వము ప్రజలకు రక్షణ కల్పించలేదని మరొకవర్గం బాధ

పడింది. ప్రభుత్వం ప్రజల విశ్వాసాన్ని కోల్పోయింది. దీనివలన, కృష్ణా, గుంటూరు ఉభయగోదావరి జిల్లాల్లో పార్టీకి చాలా నష్టం జరిగింది.

**మహానాడు గురించి** : అనుకోకుండా మేనెల అయినా ఈ రోజు చల్లగా వుంది. క్రిందటి మహానాడు, విజయవాడలో జరిగినప్పుడు ప్రజలు, కార్యకర్తలు ఎంత బాధపడిందీ. గుర్తుండే వుంటుంది. కాళోజీ నారాయణరావుగారు ఒకసారి మాతో మాట్లాడుతూ, భద్రాచలంలో సీతారామకళ్యాణం చూద్దామనుకొంటాను. అది ఎప్పుడు వేసవి కాలంలోనే వస్తుంది. అందువలన ఇంతవరకు చూడలేదు అని అన్నాడు. అలాగే అన్నగారి జన్మదినోత్సవం ఎప్పుడు మే నెల చివర్లోనే వస్తుంది కనుక హాజరయ్యే ప్రజలు, ప్రతినిధులు చాలా ఇబ్బందికి గురి అవుతున్నారు. మహానాడును అన్నగారి జన్మదిన సందర్భంగా. జరపకపోయినందు వలన వారి జన్మదిన ప్రాముఖ్యత ఏవిధంగాను తగ్గదు. ఉదాహరణకు ఈ జన్మదినోత్సవము కాశ్మీరులో జరుపుకొన్నారనుకోండి. వచ్చే జన్మదినోత్సవం ఏ స్టేట్ రాజధానిలో జరుపుకొంటారో, లేక ఢిల్లీలో జరుపుకుంటారో తెలియదు. మహానాడును పార్టీ ఆవిర్భవించిన రోజునో, లేక జనవరి 3, అంటే ప్రభుత్వానికి వచ్చిన రోజునో జరుపుకుంటే అందరికీ సౌకర్యంగా వుంటుంది. ఇది నా స్వంత ఆలోచన, సూచన.

ఇంతకుముందు మాట్లాడిన వడ్డే రంగారావుగారు తాము గాంధీ యుగానికి చెందిన వారమని, గాంధీగారి సూక్తులను అనుసరించియే చెప్పటం జరిగింది. గాంధీయుగమును గురించి నాకు కూడా కొద్దిగా తెలుసు. ప్రస్తుత పరిస్థితులలో ఆపరిపాలన సాధ్యము కాదేమో!

నా ప్రసంగం పూర్తి అయ్యే వరకు సభ అంత పెద్ద సంఖ్యలో చీమ చిటుక్కు మన్నా వినపడేటంత ప్రశాంతంగా వుంది. దీనికి కారణం నేను మాట్లాడిన దానికి రామారావుగారు ఏ విధంగా స్పందిస్తారో అనే ఉత్కంఠ ప్రతి ఒక్కరిలోనూ చోటు చేసుకొన్నది.

ఆ తర్వాత మాట్లాడిన రామారావుగారు నేను మాట్లాడిన ఏ విషయాన్ని ఖండించక పోవటం సభను ఆశ్చర్యపరిచింది. గద్దె బాబూరావులాంటి ఒకరిద్దరు నేను మాట్లాడిన తర్వాత సినిమాలు తీయవలసిందే అని ప్రసంగించినా సభికుల నుండి స్పందన రాలేదు.. ఆ తర్వాత భోజన సమయంలో చంద్రబాబు నాయుడు, ఉపేంద్ర, నేను ఒకచోటనే కూర్చొని భోజనం చేశాము. వివరము ఒకరితో ఒకరము ఒకమాటకూడా మాట్లాడుకోలేదు. ప్రసంగించి బయటకు వచ్చిన తర్వాత చాలా మంది యువకులు వచ్చి మాది ఫలానా ఊరండి. మీరు చాలా బాగా మాట్లాడారు అని అభినందించారు. అలానే తోటి శాసనసభ్యులు "ఏమన్నా ఇంత బాగా మాట్లాడతారని మాకెవరికీ తెలియదు. అసెంబ్లీలో ఎన్నడూ మాట్లాకపోతిరి". అని మెచ్చుకున్నారు.

ఆనాడు సాయంకాలం ఎడిషన్లలో నా ప్రసంగం బాక్సుకట్టి వేశారు. మరునాడు. ఉదయం ఎడిషన్లో ఈ విషయంపై ఎడిటోరియల్ వ్రాసారు.

అయినా కొంతమంది సన్నిహితులు, రామారావుగారి ఆగ్రహానికి గురౌతానేమోనని సంశయించారు. ఆ తర్వాత జరిగిన సంఘటనలలో ఆయన ఎప్పుడూ నాతో సహృద్భావంతోనే మెలిగేవారు.

**రాజకీయులకు సలహాలు :**

నేను, నాలాంటి చాలామంది. వృత్తిపరంగా పేరు సంపాదించినవారు. రాజకీయాలలో తిరిగి ఎన్నికలలో పోటీ చేయడం జరిగింది. ఏ ఒకటి రెండు సందర్భాలలో తప్ప, అందరూ రాజకీయాలలో విజయవంతంగా వుండకపోవ టానికి ప్రధానమైన కారణం, మామూలుగా రాజకీయాలలో వున్నవారి పద్ధతులను అనుసరించలేక పోవటమే. ఎన్నికలలో ప్రత్యర్థులకన్నా స్వంతపార్టీ వారి ఒత్తిళ్ళను తట్టుకోవటమే కష్టం అవుతుంది. అన్ని హంగులు వున్న ఏ పదిమందో తప్ప మిగతావారు రాణించలేరు.

క్రొత్తగా రాజకీయాలలోకి రావానుకునే వారెవరైనా ఇప్పుడున్న రాజకీయ వాదుల ఆలోచన, ఆచరణ అన్నీ తెలుసుకొని వారికి అనుగుణంగా నడుచుకున్నప్పుడే రాణించగలరు.

"కలదు కలబోయి తెల్గు ప్రెగ్గడలు మున్ను
మిన్న తాళంబు వైచి పేర్లన్న దినము
నేటి నీపాటు వెంచి కన్నీటి నిడకు
నిలుచునే కాలమొకలీల తెలుగు బిడ్డ!" –తుమ్మల

"నియతిలేని రాజనీతి, వేపటలేని
కలిమి వడతలేని తెలివి, పాడి
లేని బేర, విలేని పూజావిధి
చెనటి తప్పులని వచించె గాంధీ" –తుమ్మల

"అతడు సామాన్యడా! యేమి? యావదాంధ్ర
దేశ దేశిక ప్రవర విధేయుడైన
శ్రీ సదాశివరావు సుస్థిరయశుండు
శ్రీమతి జయప్రదాదేవి నోము పంట" –బొద్దులూరి నారాయణరావు



"అతడు సామాన్యుఁడా! యేమి? యావదాంధ్ర
దేశ దేశిక ప్రవర విధేయుఁడైన
శ్రీ సదాశివరావు సుస్థిరయశుండు
శ్రీమతి జయప్రదాదేవి నోము పంట."

- బొద్దులూరి నారాయణరావు

# దాంపత్య జీవనము

## విద్యార్థినులు ఒకరిద్దరే–గప్ చుప్ :

విశాఖపట్నం అన్నా, ఆంధ్రా మెడికల్ కాలేజీ అనగా కె.జి. హాస్పటలు అన్నా నాకెంత ఇష్టమో మాటలలో చెప్పలేను. ఒకపల్లెటూరి నుండి వెళ్ళిన నన్ను తొమ్మిది సంవత్సరాలలో, ఎం.ఎస్.తో సహా డిగ్రీ ఇచ్చి సమాజానికి ఉపయోగ పడే వ్యక్తిగా తీర్చి దిద్దిన ఘనత విశాఖపట్టనానికి దక్కుతుంది. ప్రాక్టీసు పెట్టిన తర్వాత కూడా కొన్ని ఏండ్లపాటు, ఏడాదికి ఒకటి రెండుసార్లు వెళ్ళివచ్చే వాడిని, వైజాగ్పట్నంలో హాస్టలు వసతి చాలా కొద్దిమందికి వుండేది. ఎక్కువమంది బయట "లాడ్జీ"లలో వుండే వాళ్ళము. మాలాగా పల్లెటూళ్ళనుండి వచ్చిన విద్యార్థులు ఒక లాడ్జిలో వుండేవాళ్ళము. మా లాడ్జిలో డాక్టర్ ఎతిరాజులు, నేను ఒక గదిలో వుండేవాళ్ళము. డాక్టర్ ప్రతాపకుమార్ మరికొందరు మిగతా గదులలో వుండేవాళ్ళు. మేము ముగ్గురము మాత్రము ఎప్పుడు విడిపోకుండా. వుండే వాళ్ళము. డాక్టర్లమయిన తరువాత గవర్నమెంటు సర్వీసులోజేరిన ఎతిరాజుల ప్రాక్టీసులో వున్న ప్రతాప కుమార్, నేను ఆ సహచర్యము అట్లానే సాగించాము. ఎతిరాజులు మరణంతో ఆ సంబంధము తెగిపోయినా మిగతా ఇద్దరమూ ఇప్పటికీ అలానే కొనసాగిస్తున్నాము. మా క్లాసులో ఆడపిల్లలు 8 మంది వుండేవారు. సాధారణంగా మగపిల్లలు, ఆడపిల్లలు మాట్లాడుకోవటం వుండేదికాదు. అందులో కమ్మవారిద్దరు ఒకామె మైనేని అన్నపూర్ణ, రాచకొండ విశ్వనాథశాస్త్రిగారి తమ్ముడు నరసింహశర్మ–మా క్లాసుమేటు–వీరిని పెళ్ళి చేసుకొంది. రెండవ ఆమె డాక్టర్ రాజ్యలక్ష్మి. ఒక వకీలును చేసుకొని తెనాలిలో ప్రాక్టీసు పెట్టి సెటిల్ అయ్యింది. ఆమె తల్లి దండ్రులకు తను ఒక్కర్తె కుమార్తె కనుక, వారక్కడ కుటుంబంలో వుండేవారు. ఆమె తండ్రిగారి చొరవవలన మేము వారింటికివెళ్ళటం, ఆమెతోకూడా మాట్లాడటం జరిగేది. అంతకుమించి ఏ మగ విద్యార్థి ఏ ఆడ విద్యార్థితో మాట్లాడటం జరిగేదికాదు.

## డాక్టర్ జయప్రద

నా శ్రీమతి డా॥ జయప్రదగారి స్వగ్రామము, మానికొండ నందమూరు దగ్గరలోని కలువపాముల. ఆ గ్రామస్తులు ప్రధానంగా వ్యవసాయదారులు, అంతకు ముందు తరంలో మీద అంతగా ధ్యాస వుండేదికాదు, మా మామగారు చలసాని పెద్దలకు చదువు లక్ష్మీనారాయణ వర్మగారు వీధి బడిలో చదువు పూర్తిచేసిన తర్వాత ఆ గ్రామములో వున్న పండితులవద్ద కొన్నాళ్ళు సుశ్రూష చేసి భాషా జ్ఞానము పెంపొందించుకొన్నారు. కవిత్వముకూడా వ్రాసేవారు. "కర్షక కవి" బిరుదాంకితులై చాలా గ్రంథాలు రచించారు. వీరు అదే గ్రామములో "వెల్లంకి "వారి ఆడపడుచు లక్ష్మీతులశమ్మగారిని వివాహమాడారు. తల్లి దండ్రులకు ఆమె ఒక్కతే సంతానము. వారి తల్లి మాత్రమే అప్పటికి జీవించి వున్నారు. వారి ఆస్తికూడా తక్కువేంకాదు (8 ఎకరాల మాగాణి).

మా మామగారు వ్యవసాయంమీద పెద్దగా దృష్టి పెట్టకపోయినా, వచ్చే ఆదాయం సరిపోయేది. వారి సంతానము శ్రీ వెంకటేశ్వరవర్మ, జయప్రదాంబ, శ్రీ వెంకట కృష్ణవర్మ, అప్పటికి హైస్కూలు విద్య గ్రామస్తులకు అందుబాటులో లేక పోయినా, వారి ఊరికి అయిదు ఆరుమైళ్ళ దూరంలో వున్న "మంటాడ" గ్రామంలో వున్న హైస్కూలుకు వారి పెద్దబ్బాయి వెళ్ళి చదువుకొనేవాడు. ఆయన ఎస్.ఎస్.ఎల్.సి. చదివేటప్పుడు జయప్రదాంబ అదే హైస్కూలులో ఫస్టు ఫారం (ఆరవ తరగతి)లో జేర్చారు. వెంకటేశ్వరవర్మ మెరిట్లో ప్యాసయి ఇంటర్మీడియేట్ చదవటానికి, బందరు హిందూ కాలేజీకి వెళ్ళాడు. సెకండు ఫారంలోకి వచ్చిన జయప్రదాంబ కూడా అక్కడ హైస్కూలులో జేరింది.

### ఆడపిల్లల్ని బడికి పంపటం సాహస కార్యమే :

అప్పట్లో ఆడ పిల్లలను హైస్కూలుకు పంపటమే అరుదు. తండ్రిగారికి విద్యపట్ల వున్న సదభిప్రాయం వల్లనే ఆమెను హైస్కూలులో పెట్టారు. బందరు

లోని సెంట్ ఆన్స్ స్కూల్లో చదివారు. వారి అమ్మమ్మ వెల్లంకి సుబ్బమ్మగారు బందరులోనే వుండి పిల్లలు ఆలనా పాలనా చూసేవారు, వర్మగారు కేవలం విద్యలో చురుకైన వాడే గాకుండా, మిగతా వ్యవహారాలలో కూడా చాలా చురుకుగావుండి, చదువును నిర్లక్ష్యం చేసి ఇంటర్మీడియేట్ తప్పాడు. అప్పటికి జయప్రదాంబ ఎనిమిదవ క్లాసు పూర్తి చేసుకున్నది.

వెంకటేశ్వర వర్మగారు ఇంటర్మీడియేట్ పూర్తిచేసే వుద్దేశ్యం లేక, ఏదో ఒక ఉద్యోగం చేయాలన్న వుద్దేశ్యంతో (కృష్ణా జిల్లావాసులు కొంతమంది జబల్పూర్ నగరంలో, ఉద్యోగాల్లోనూ పరిసర ప్రాంతాలలో వ్యవసాయంలోనూ స్థిరపడి వున్నారు. ఐబలాపూర్ మిలటరీ టేష్ కూడా) ఆయన అక్కడకు వెళ్ళి ఉద్యోగ ప్రయత్నం చేసినందువలన, మిలటరీ హెడ్ క్వార్టర్సులో సివిల్ సప్లయి డిపార్టు మెంటులో ఉద్యోగం సంపాదించారు. అక్కడ స్థిరపడ్డ కృష్ణా జిల్లా అమ్మాయి సరోజినిని వివాహమాడారు.

ఇక్కడ మూడు సంవత్సరాల హైస్కూలు విద్య పూర్తిచేసిన జయ ప్రదాంబను పై చదువులు చదివించటానికి నిర్ణయించుకొని వారి అమ్మమ్మ బందరులో కాపురం పెట్టి చదివించింది. హైస్కూలు చదువులు పూర్తి అయిన తర్వాత, కాలేజీలో జేర్పించింది. అప్పటికి కొద్దిమంది ఆడ పిల్లలు, ముఖ్యంగా పట్టణములలో వారు కాలేజీలకు వస్తున్నారు. పెల్లెటూరి నుండి కూడా అప్పటికి ఇద్దరూలేక ముగ్గురు (జాస్తి మహాలక్ష్మమ్మ, ఎన్. కోటేశ్వరమ్మ) చదువులకు వచ్చారు. ఇంటర్మీడియేట్ చదువు అయిన తర్వాత ఎం.బి.బి.ఎస్. కొరకు అప్లికేషను పెట్టడం, మద్రాసు మెడికల్ కాలేజీలో సీటు రావటం. జరిగింది.

ఆమెతోపాటు "సెకండ్ పారం నుండి ఇంటర్మీడియేట్ వరకూ తన సహచరులుగావున్న నాగమణి, శారద, అనే అమ్మాయిలకు కూడా మద్రాసులోనే సీటు వచ్చింది. నాగమణి ఎం.బి.బి.ఎస్. అయిన తర్వాత ఆంధ్రా యూనివర్శిటీలో వున్న కె.వి. శివయ్యగారిని వివాహమాడి అక్కడ స్థిరపడ్డారు.

శారదగారు తనక్లాసుమేట్ హరనాధ్ను వివాహమాడి తన చదువును మధ్యలోనే ఆపివేసి గృహలక్ష్మిగానే మిగిలిపోయారు. వీరు మద్రాసులో మెడికల్ కాలేజీలో చేరిన తర్వాత శారదగారి తల్లి ఈ ముగ్గురుకు వంటచేసి పెట్టేది. వీరు ముగ్గురు మూడు కులాలు అయినప్పటికీ వారి ఆత్మీయతకు కులం అడ్డురాలేదు.

తర్వాత కొన్నాళ్ళకు జయప్రదాంబ తల్లి తులశమ్మగారు తండ్రి వర్మగారు, మద్రాసులోనే స్థిరపడ్డారు. జబల్పూర్లో స్థిరపడ్డ వర్మగారికి, మొదటి సంతానము "ఆష" అనే ఆడపిల్ల, ఒక సంవత్సరము పెరిగిన తర్వాత తులశమ్మగారు ఆ అమ్మాయిని. తీసుకొని వచ్చి తనదగ్గరనే వుంచుకొన్నారు. కాలేజీకి దగ్గరలోనే వసతి కుదిరింది. ట్రాన్స్ఫోర్టుకు అప్పటికి "ట్రాములు" వుండేవి. అందువలన ఏమీ ఇబ్బంది వుండేదికాదు. అక్కడ 1949 నాటికి జయప్రదాంబ ఎం.బి.బి.ఎస్. పూర్తి చేశారు.

## మెడికల్ కాలేజీలో సీటువస్తే పెళ్ళికలే!:

అప్పట్లో మెడికల్ కాలేజీలో చేరేవాటికి కొంతమంది విద్యార్థులకు పెండ్లి అయ్యేది. పెండ్లి సంబంధాలవారు ఒకటవ సంవత్సరం నుండి నాల్గవ సంవత్సరాలదాకా ఎవరున్నారో. వెతికి పిల్లను ఇప్పిస్తామని వెంటబడేవారు. ఎక్కువమందికి ఎం.బి.బి.ఎస్. పూర్తి అయ్యేలోపే వివాహమయ్యేది. నాకు వున్న ప్రత్యేక పరిస్థితులవలన పెండ్లికి త్వరపడలేదు. కట్నం విషయంలో విముఖత కూడా వుండేది. చివరకు డాక్టరునే చేసుకొంటేమంచిదేమో అన్న అభిప్రాయం కలిగింది.

## జాయింట్ ప్రాక్టీసు ఆలోచన :

నాకు డాక్టర్ ఎతిరాజులతో కలిసి ప్రాక్టీసు చెయ్యాలని అభిప్రాయం వుండేది. డాక్టర్ ఎతిరాజులుగారి కజిన్ బ్రదర్ వీరాస్వామిగారు అప్పటికే ఉద్యోగంలో వున్నారు. అప్పటి మద్రాసు రాష్ట్రంలో కమ్యూనల్ జీ.వో. అమలులో

వుండేది. దీనివలన బాక్వర్డు క్లాసువారికి ఉద్యోగాల్లోనూ, ప్రమోషన్లలోనూ ఎక్కువ అవకాశం ఉంటుందనే భావనతో డాక్టర్ ఎతిరాజులు సర్వీసులో జేరాడు. జాయింట్ ప్రాక్టీసు మీద మొదటనుంచీ వున్న అభిప్రాయంవలన భార్య డాక్టరు అయితే, ప్రాక్టీసు అవరోధం లేకుండా జరిగిపోతుంది. అన్న ఉద్దేశ్యంతో డాక్టరునే వివాహము చేసుకొనటానికి నిర్ణయించుకొన్నాను. ఆ సమయంలో డాక్టర్ వీర రాఘవయ్య గారు అన్న మాటలవలన డాక్టర్ యార్లగడ్డ కృష్ణమూర్తి నన్ను అడిగాడు. సరేనని వెళ్ళి చూడటం, ఒప్పుకోవటం, ఉంగరాలు మార్చుకోవటం జరిగింది. తర్వాత గుంటూరులో 1949 మే 29వ తేదీన లాంచన రహితంగా కందుల ఓబులరెడ్డిగారి ఆధ్వర్యంలో వివాహం జరిగింది. తరువాత డిసెంబరులో ఆమె ఎం.బి.బి.ఎస్. పూర్తిచేసుకొంది. హౌస్ పర్ట్లను కొరకు విశాఖపట్నం వచ్చింది. అప్పటి నుండి ఆమె తల్లి దండ్రులు మేము ఒక కుటుంబమయ్యాము.

### దండల పెళ్ళిళ్ళు :

పూలదండల మార్పిడితో, వివాహము ముగించాము. పెళ్ళికి బ్రాహ్మణుడు లేదు. అప్పటికి యువత ఇటువంటి పెండ్లివైపు మొగ్గుతూవున్నారు. ఇంకా ఇటువంటివి రెండు మూడు జరుగుతాయని ఆశించాను. దానికి భిన్నంగా సంప్రదాయ పెండ్లిళ్ళు. పెద్ద పెద్ద కట్నాలు, హంగు ఆర్భాటాలు పెరుగుతూ వచ్చి, సామాన్యుడు పెండ్లి ఖర్చులే భరించలేని స్థితి వచ్చింది. పెండ్లికి నాకు రూ. 600/- లు వారికి రూ.1200/- ఖర్చు అయినవి. ఈ విధమైన పెళ్ళి క్రొత్తగా ఎవరూ భావించలేదు. ఒక తమ్మునికి తప్ప మిగతావారికి ఇదే పద్ధతిలో పెండ్లి చేశాను.

మా పెండ్లి ఖర్చులకు చేసిన అప్పు, ఇరువైపుల నుండి మేము ప్రాక్టీసు పెట్టిన తర్వాత తీర్చాము. గుంటూరు సాంబశివ పేటలో కోడె గోపాలకృష్ణగారి ఇంటివద్ద పెండ్లి పెద్దలు నావైపు నుండి కందుల ఓబులురెడ్డి, ఈడ్పుగంటి రత్న మాంబగారు ఆమెవైపు నుండి వచ్చారు. పెండ్లి జరిగిన తరువాత సీనియర్ హౌస్

సర్జనుగా చేరాను. ఆమె మద్రాసు వెళ్ళింది. డిశెంబరులో ప్యాస్ అయింది. ఈ లోపల నాకు టెంపరరీ సివిల్ వర్జన్ గా ఉద్యోగం వచ్చింది. దాంతో కొన్నాళ్ళు. సర్జరీ డిపార్టుమెంటులో కొన్నాళ్ళు ఫిజియాలజీలో కొన్నాళ్ళు ఆర్.ఎం.ఓ. మళ్ళీ సర్జరీ డిపార్టుమెంటులో పనిచేశాను. డాక్టర్ జయప్రదాంబ హౌస్ సర్జనుగా వైజాగ్లో చేరింది.

1951 జూన్ 22వ తారీఖున గుంటూరులో సాంబశివపేటలో ప్రాక్టీసు పెట్టాను. ప్రారంభోత్సవమునకు ప్రొఫెసరు డా రమణమూర్తి గారు వచ్చారు. సభకు అధ్యక్షత వహించారు. మెడికల్ కాలేజి ప్రిన్సిపాల్ డాక్టర్ డి.వి. సుబ్బారెడ్డిగారు. ప్రాక్టీసు ఏమీ ఒడుదుడుకులు లేకుండా సాగింది. ఇంతలో 1952లో జనరల్ ఎన్నికలు వచ్చినవి. ఆ ఎన్నికలలో నాకు ప్రత్యక్ష సంబంధం లేకపోయినా, శ్రీ ఎన్.జి. రంగాగారు కె.ఎల్.పి. మా మిత్రుడు బి.వి. శివయ్య, కె.ఎల్.పి. నుండి ప్రత్తిపాడులో పోటీచేసి ఓడిపోవటం జరిగింది. ఆ తర్వాత జరిగిన ప్రతి ఎన్నికలలోనూ అభ్యర్థిగా నాపేరు ప్రచారంలోకి వచ్చేది. ఐనా నా దృష్టి అటు మరలలేదు.

**విశాఖపట్నంలో ఉద్యోగాలు** : ఆమె విశాఖపట్నం వచ్చేనాటికి నేను ఫిజియాలజీలో ట్యూటర్గా వున్నాను. తర్వాత కె.జి.హెచ్. ఆర్.ఎం.ఓ.గా కొన్ని నెలలు వున్న తర్వాత సర్జరీ డిపార్టు మెంటులో పోస్టింగ్ ఇచ్చారు. నాది టెంపరరీ ఉద్యోగము. అందువలన అక్టోబరు చివరలో ఉద్యోగం ఊడింది. అదే వార్డులో సీనియర్ హౌస్ సర్జముగా జేరాను.

తర్వాత ఏప్రియల్ నెలలో ఎం.ఎస్. ఎగ్జామ్స్, ఉద్యోగ బాధ్యతలు లేనందు వలన ఎగ్జామినేషన్కు బాగా ప్రిపేరు కావచ్చుననుకొన్నాను. అలానే జరిగింది.

నాఉద్యోగం పోయినప్పుడు విశాఖపట్నంలో కె.జి.హెచ్.లో ఒక లేడీ ఆర్.ఎం.ఓ. పోస్టు ఉండేది. ఆ పోస్టులో సివిల్ అసిస్టెంటుగా ఒక డాక్టరు వుండే

వారు. ఆమెకు ప్రమోషను వచ్చి ఆ పోస్టు ఖాళీ అయ్యింది. జయప్రదాంబ గురువు గారు డేవిడ్ గారు డైరెక్టరుగా వుండేవారు. ఆపోస్టు తనకు ఇవ్వమని అడగగా వారు వెంటనే ఇచ్చారు. ఉండటానికి క్వార్టర్సు వుండేది. జీతం కొంత తక్కువైనా ఇబ్బందిలేకుండానే గడిచేది.

విశాఖపట్నంలో మరొక హాస్పిటలు "ఘోషా హాస్పిటలు" (అచ్చంగా ఆడవారికి) వుండేది. అది అప్పట్లో టీచింగ్ హాస్పిటలు కాదు. డాక్టర్ మరికాస్ అనే సమర్ధురాలైన డాక్టరు సూపరింటెండ్ వుండేవారు. మూడు నాలుగు నెలలకు, ఆ హాస్పిటలులో పోస్టింగు ఇచ్చారు. ఆమె ఆధ్వర్యంలో డాక్టర్ జయప్రద ప్రసూతి వైద్యములో బాగా అనుభవము గడించింది. 1951 మేనెలలో నేను ఎం. ఎస్. ప్యాసు అయ్యేనాటికి ఆమె ఆ ఉద్యోగంలోనే వుంది. నేను ఎం.ఎస్ ప్యాసయ్యే దానికి ఐదు ఆరు నెలల ముందే గుంటూరులో ప్రాక్టీసు పెట్టాలని నిర్ణయించాను.

**ప్రయివేటు ప్రాక్టీసుకు అప్పు చేసాం :**

పెండ్లి సమయంలో ఇద్దరి వద్ద డబ్బులు లేకపోతే ప్రాక్టీసు ఎలా పెట్టాలన్న ఆలోచన వచ్చింది. 1945లో ఉద్యోగం పోయిన వర్మగారు (బావగారు) వ్యాపారం పెట్టటం కోసమని స్వగ్రామంలోవున్న 12 ఎకరాలు అమ్మివేసి వ్యాపారం మొదలు పెట్టారు. ఉద్యోగం చేసే రోజులలో విపరీతమైన ఖర్చుకు అలవాటుపడ్డ వర్మగారికి వ్యాపారంలో వచ్చే ఆదాయం సరిపోయేది కాదు. నేను యార్లగడ్డ కృష్ణమూర్తి, పెండ్లి సమయంకి (ఇంకా రెండు సంవత్సరల తర్వాత కదా అప్పటికి) వర్మగారు రూ.10,000/- సర్దగలడని అనుకొన్నాము. నేను అదేమాట మా అమ్మతో చెప్పాను.

ప్రాక్టీసు పెట్టేనాటికి వర్మగారి పరిస్థితినాకు పూర్తిగా అర్థమై మా చిన్ననాటి స్నేహితుడు నందిపాటి నారాయణ తక్కెళ్ళపాడు వారికి జాబు వ్రాసాను. ఆయన ఇంటర్మీడియేట్ చదువు ఆపివేసి ఇంటివద్ద వ్యవసాయం గుంటూరులో కమీషను

కొట్టు నడిపేవాడు. వారిది ఉమ్మడి కుటుంబం ఆయనే పెద్దవాడు. అందువలన డబ్బు సర్దగలిగిన వెసులుబాటు వుంటుందన్న నమ్మకంతో ఆరు నెలల ముందే ఉత్తరం వ్రాసాను. నేను గుంటూరుకు వచ్చేటప్పటికి ఆ డబ్బు రెడీచేసి పెట్టాడు. దాంతో హాస్పిటల్కు కావలసిన పరికరాలు సమకూర్చుకొన్నాము.

**ఇంగ్లండు వెళ్ళేందుకు పదివేలకు కటకటే :**

ఎ.ఎస్. అయిన తర్వాత ఒక సంవత్సరంపాటు ఇంగ్లాండు వెళ్ళి వద్దామనుకొనేవాడిని, దానికైనా పదివేలు కావాలి కదా. అది సాధ్యకాదు కనుక ఆ ఊహకు అడ్డుకట్టవేశాను. అలానే బయప్రదాంబకు పి.జి. చేయాలనే కోర్కె వుండేది. అంటే మరో రెండు సంవత్సరాలు చేయాలి కనుక ఆ ఆలోచన కూడా మానుకొని ప్రాక్టీసులో జేరింది. మొదటి నుండి ప్రాక్టీసు బాగానే వుంది. కుటుంబ ఖర్చులు పోను కొంత మిగిలేది. ఒక సంవత్సర కాలంలో అప్పు తీరింది, వడ్డీ ఏమీ ఇవ్వలేదు.

ప్రాక్టీసు పెట్టినప్పటి నుండి మాతోనే వున్న చిన్న బావమరిది పెండ్లి కూడా ఆ సంవత్సరంలోనే అయ్యింది. ఇది విడో మ్యారేజీ, లాంఛనాలు లేకుండా జరిపించాము. కొన్నాళ్ళయిన తర్వాత వేరే కుటుంబము పెట్టుకొన్నారు. అతను అతని భార్య ఆయన అత్తగారు ఒక కుటుంబంగా వుండేవారు. అత్తగారికి కొద్ది పాటి ఆస్తి వుండేది. దానిపైన వచ్చే ఆదాయంతో పాటు జయప్రదాంబ ఎంతో కొంత సహాయం చేసేది. అతను హాస్పిటల్లో చిన్న చిన్న పనులు చేస్తుండేవాడు.

కొన్నాళ్ళ తర్వాత స్వతంత్రంగా బతకాలనే ఉద్దేశ్యంతో మెడికల్ షాపు పెట్టుకొన్నాడు. దానికి అవసరమైన డబ్బు సుమారు రూ. 5000/- లు నేనే సర్దాను.

ఈలోపు జబూర్లో వున్న వర్మగారి పరిస్థితి దిగజారి అక్కడ కొంత పొలంకొని వ్యవసాయం చేయాలన్న ఉద్దేశ్యంతో వుంటే దాని కొరకు ఒక రూ. 5,000/- లు సర్దాను.

**తమ్ముళ్ళను చదివించాను:**

మా తమ్ముడు సత్యనారాయణను మేము విశాఖపట్నంలో వుండగానే రెండవ ఫారంలో జేర్చాను. నేను వచ్చే నాటికి వాడు సెకండు ఫారం ప్యాసయి థర్డు ఫారంలోకి వచ్చాడు. వాడి తర్వాత వాడు సీతాపతిరావు. ఇక్కడ 1951లో సెకండు ఫారంలో జేరాడు. వారిద్దరూ మా వద్దనే వుండేవారు. ఇంట్లో జనా భా ఎక్కువగా వున్నా వీరిద్దరితో చనువుగా వుండేవారు కాదు. అదిగమనించిన నేను మా ఊరికి పంపించాను.

మా తమ్ముళ్ళకు సంబంధించినంత వరకు సత్యన్నారాయణ రూ. 6,000/- డొనేషనుతో కాకినాడ మెడికల్ కాలేజీలో చేరాడు. సీతాపతిరావు జబల్పూర్ మెడికల్ కాలేజీలో చేరాడు. ఆ తరువాత విశాఖపట్నంలో సీటు వచ్చినందువలన అక్కడ జేరాడు.

సత్యన్నారాయణ చదువు సాఫీగా సాగింది. సీతాపతిరావు మాత్రం అక్కడ సహవాసం వలన పి.సి.సి.లో తప్పటం, ఆ తర్వాత ఫస్టు ఎం.బి.బి.ఎస్. తప్పటం జరిగింది. అక్కడ వుంటే వీడు చదవటం జరగదన్న వుద్దేశ్యంతో చాలా బాధపడి గుంటూరు మెడికల్ కాలేజీ ప్రిన్సిపాల్ డి.జి. రెడ్డి గారితో నాకున్న సాన్నిహిత్యమువలన గుంటూరు మెడికల్ కాలేజీకి ట్రాన్స్ఫర్ చేయించగలిగాను. ఇక్కడకు వచ్చిన తర్వాత ఫస్టు ఎం.బి.బి.ఎస్. పూర్తయింది.

మూడు, నాలుగు సంవత్సరాలలో చైనాతో యుద్ధంలో ఆర్మీలో జేరాడు. చాలా నెలల వరకు ఆచూకీ కూడా తెలియలేదు. డాక్టరు నూతక్కి వెంకటేశ్వర రావు ఆర్మీ సర్వీసులో జేరి జబల్పూర్ వెళ్ళాడు. అక్కడ వీడిని గుర్తించి సర్వీసు

నుంచి డిస్ క్వాలిఫై చేసి పంపించాడు. ఆ తర్వాత అప్పుడొక సబ్జక్టు అప్పుడొక సబ్జెక్టు ప్యాసు అవుతూ ఫైనలియర్లోకి వచ్చాడు. ఫైనలియర్ ఇ.ఎన్.టి. ఆ స్తామాలజీ ఎస్.పి. మెడిసిన్ ఎగ్జామినేషన్ వ్రాసి ప్రాక్టికలు వెళ్తే ప్యాసు చేస్తారేమోనని భయపడి ప్రాక్టికల్స్ మానివేశాడు. దాంతో వాడి చదువు పూర్తి అయింది.

వీరిద్దరి తర్వాత మన్మధరావును కాకినాడలో డొనేషన్ 12,000/- కట్టి జేర్పించాను. ఇతడు ఇబ్బంది లేకుండానే ఎం.బి.బి.ఎస్. పూర్తిచేశాడు. వీళ్ళు మెడికల్ కాలేజీలో జేరినప్పటి నుండి, వాళ్ళకు పెళ్ళి చెయ్యమని మా అమ్మ తొందరజేసేది. "ఎల్లకాలము నువ్వు ఖర్చు పెట్టలేవుకదా! పెళ్ళి జరిగితే వచ్చే వాళ్ళు చూసుకుంటారులే నీ పిల్లలు కూడా పెద్దవాళ్ళు అవుతున్నారు" కదా అనేది.

**మురహరిరావుది ఎప్పుడూ మైనస్ బడ్జెట్టే:**

మా పెద్ద తమ్ముడు మురహరిరావు చదవటానికి మొండికేసి నాలుగు లేక ఐదు తరగతులలోనే చదువు పూర్తి చేశాడు. వ్యవసాయం చేస్తానన్నాడు. మా జాయింటు ఆస్తిమొత్తం అతను చదువుకోనందువలన అతనికి వ్రాసి ఇచ్చాము. అదికాక కొంత పొలం నేను వదలిపెట్టాను. భార్య ఆస్తి రెండెకరాలు వచ్చింది. మొత్తం సుమారు 20. ఎకరాలు అయింది. నేను ప్రత్యేకంగా పొలం కొనాలని అనుకోకపోయినా అప్పుడు నాలుగు, అప్పుడు నాలుగు ఎకరాలు కొని మొత్తం 16 ఎకరాలు చేశాను. ఈ మొత్తం మురారికే. వ్యవసాయం చేసుకుంటూ ఎప్పుడూ మైనస్ బడ్జెట్లోనే వుండేవాడు. తన ఆడపిల్లల ఇద్దరికి 5 ఎకరాలు కట్నంగా ఇచ్చాడు. తన స్వంతంగా ఖర్చుగా చేసుకున్నది 41/2 ఎకరాలు.

వాపొలం పైన ఆదా ఏమీ రాలేదనే భావం మా ఆవిడకు పిల్లలకు వుంటుంది కదా! రెండు పార్లమెంటు ఎలక్షన్లు అయిన తర్వాత నేను 8 ఎకరాల

పొలం అమ్మాను. ప్రస్తుతం మురారి వ్యవసాయం చేయటంలేదు. మొత్తం కౌలుకు ఇచ్చాడు. తర్వాత తమ్ముడు సత్యనారాయణ పిడుగురాళ్ళలో 16 సం॥లు ప్రాక్టీసు చేసి అకాలమరణం చెందాడు. తర్వాత తమ్ముడు సీతాపతిరావు ఎం.బి.బి.ఎస్. మధ్యలో ఆపివేసి ఏదో చిన్న చిన్న కాంట్రాక్టులు చేసుకొంటూ జీవనం గడిపాడు. చివరి తమ్ముడు మన్మధరావు అమెరికాలో స్థిరపడ్డాడు. ప్రస్తుతం అక్కడే పని చేస్తున్నాడు. మన్మధరావు కూతురు ఒక అమెరికన్ను వివాహము చేసుకొని అక్కడే స్థిరపడింది. మరియొక కూతురు ప్రస్తుతం కాలేజీ చదువులకు వచ్చింది.

**బంధుప్రీతి :**

చిన్నప్పటినుండీ బంధువులందరూ నా పట్ల ఆప్యాయంగా వుండేవారు. నేను డాక్టరునైన తర్వాత వారికి వారి పిల్లలకు అవసరమైన సహాయము అందించాను. అట్లానే జయప్రదాంబ సోదరులేకాక బంధువులకు కూడా అవసర మైన సాయం అందిస్తూనే వుండేవాడిని. ఇప్పటికీ అవే సంబంధాలు వారు కొనసాగిస్తున్నారు.

జయప్రదాంబ మద్రాసు మెడికల్ కాలేజీలో చదివింది. హౌస్ సర్జనుగా విశాఖపట్నంలో పోస్టింగు కావాలని ఆమె గురువుగారు ప్రొ. డేవిడ్ గారిని అడిగింది. దానికి ఆయన ఆశ్చర్యంగా "మద్రాసు మెడికల్ కాలేజీ స్టూడెంటు విశాఖపట్నం వెళ్ళటం "ఏమిటి" అన్నాడు. దానికి జవాబుగా నాభర్త విశాఖ పట్నంలో అసిస్టెంటు పర్జనుగా వున్నారు. నేను ఆయన దగ్గరగా వుండటం కొరకు వెళ్తున్నాను" అని చెప్పింది. అసిస్టెంటు సర్జనుగా ఎక్కడ చేస్తున్నాడు" అని ఆయన అడిగాడు. ఫిజియాలజీలో ట్యూటర్ చేస్తున్నాడని చెప్పి కొన్ని నెలల క్రిందట అప్పటి సర్జన్ జనరల్ను కలసి 'సర్జికల్ సైడు కావాలని అడిగాము.

ఆయన సరేనన్నాడు. కానీ ట్రాన్స్ఫర్ జరగలేదు" అన్నాము. దానికాయన అలాజరిగిందా, నీ భర్త పేరు చెప్పు అని పేరు చూచి ఆమె విశాఖపట్నం వచ్చిన ఒక నెలరోజులలోనే నన్ను ఆర్.ఎం.ఓ. గా పోస్టు చేశారు. ఆ తరువాత ఆయన ఆంధ్రా మెడికల్ కాలేజీ వార్షికోత్సవం కొరకు వచ్చారు. అప్పుడాయనను కలసి "థాంక్స్" చెప్పాను. దానికాయన సర్జరీలో పోస్టింగు ఇవ్వలేకపోయాను. త్వరలో ఆపనిచేస్తాను అని చెప్పి రెండు మూడు నెలల్లో సర్జరీలో పోస్టింగు ఇచ్చారు...

జయప్రదాంబ సహజంగా నెమ్మదస్తురాలు, మాట్లాడటమెంతో పని చేయటం కూడా అంతే! హౌస్ పర్జముగా క్రొత్తగా విశాఖపట్నం రావటం అందు వలన కొంత బెరుకు బెరుకుగా వుండేది. వార్డులో పని చేయటం ఆలస్యమయ్యేది.

ఆర్. ఎం.ఓ. గా వున్న నేను తన వార్డుకు వెళ్ళి, తను చేయవలసిన ఇంజక్షన్లు నేనే చేసి కొంత భారము తగ్గించేవాడిని, విషయం తెలియని వారు ఆర్.ఎం.ఓ. వచ్చి వార్డులో ఇంజెక్షన్లు చేస్తున్నారే అని విస్తుపోయేవారు.

దాదాపు 10 నెలలు హౌస్ సర్జను పూర్తి అయ్యేనాటికి నా ఉద్యోగం పోయి ఆమెకు సివిల్ అసిస్టెంటు సర్జను క్లాసు-1 ఉద్యోగం వచ్చింది. కొన్నాళ్ళు కె.జి.హెచ్.లోనూ మరి కొన్నాళ్ళు ఘోషా ఆసుపత్రిలో ఆమె పనిచేసేటప్పటికి, నా ఎం.ఎస్. పూర్తి అయింది. నాకు ఎం.ఎస్. ఎగ్జామినేషన్స్ మద్రాసు మెడికల్ కాలేజి ప్రొఫెసర్లు ఇద్దరూ ఎగ్జామినర్స్ గా వచ్చారు. ఎగ్జామినర్స్ బోర్డు అక్కడే కలసేవారు. ఫలితాలు అందరికీ తెలిసేవి. నేను జయప్రదాంబ వరండాలో వేచి వున్నాము. ఎగ్జామినర్స్ అందరూ బయటకు వచ్చారు. మేము వారికి నమస్కారం పెట్టాం. మా ప్రొఫెసరు రమణమూర్తిగారు, జయప్రదను చూపిస్తూ "ఈమె మీ కాలేజీ స్టూడెంటు. ఈ రోజు ఎం. ఎస్. వచ్చిన కాండిటేటు భార్య అని పరిచయం చేశాడు." ఆ రోజుల్లో ఎం.బి.బి.ఎస్.కు గానీ, పి.జి. కోర్సులకుగానీ ఎగ్జామినర్సన్న ముందు కలుసుకోవటం జరిగేది కాదు. అందువలన ఈ విషయం వివరంగా వ్రాసాను.

**ఆశ కనుపించి కనుమరుగయ్యింది :**

జయప్రదాంబ విశాఖపట్నం వచ్చినప్పటి నుండి, ఆమె మేనకోడలు "ఆశ" చిన్న పిల్లగా స్కూలుకు వెళ్తూ, సహజ వాక్చాతుర్యంతోను, విషయ పరిజ్ఞానంతో మమ్మల్ని ఎంతగానో అలరించింది. గుంటూరు వచ్చిన తర్వాత కూడా 1962లో తన మరణం వరకు ఇంట్లో వాళ్ళకు, బయటనుండి వచ్చే వారికి ఎంతో ఆనందాన్ని సమకూర్చింది. అందమైన ముఖం, కిలకిలా నవ్వటం, చూచిన వెంటనే ప్రతివారూ ముగ్ధులైయ్యేవారు. మా జీవితంలో ఆ పది సంవత్సరాలు, మధురంగా గడచిపోయినవి. అంత ఆనందాన్నిచ్చిన వ్యక్తి, అకాలంగా మరణించటం వలన, భాధ కూడా అంత ఎక్కువగా వుంటుంది గదా. అప్పటి

నుండి 1971లో మా పెద్దమ్మాయి వివాహమయ్యే వరకు మా ఇంట్లో, విందులూ, వినోదాలు ఏమీ జరగలేదు. ఆమె మరణించింది కిడ్నీ జబ్బుతో, అప్పటికి ఈ కిడ్నీ అబ్బుకు కిడ్నీ ట్రాన్స్ ప్లాంటేషను రాలేదు. వచ్చి వుంటే బ్రతికించుకో గలిగేవారమేమో! అంతకు ముందు 1941లో కూడా మా చెల్లెలు టైఫాయిడ్ జబ్బుతో మరణించేనాటికి, ఆ జబ్బుకు మందు రాలేదు. తర్వాత రెండు సంవత్సరాలకు "క్లోరోమైసిటిన్" వచ్చింది.

అన్ని వర్గాల ప్రజలకు అందుబాటులో ఉండాలనుకున్నాం : 1951 నాటికి గుంటూరు పట్టణంలో, వైద్య సౌకర్యాలు బాగా వున్నట్టే లెఖ. జిల్లా హెడ్ క్వార్టర్స్ హాస్పిటల్ చాలా పెద్దది. ఎప్పుడూ అనుభవజ్ఞులైన డాక్టర్లు ఈ హాస్పిటలు సూపరింటెండెంట్స్ గా వచ్చేవారు. బయట కూడా సర్జన్లుగా డాక్టర్ పర్చూరి వీరయ్య చౌదరిగారు, డా జానుగారు, వైద్యంలో డాక్టర్ ఏ.ఎస్. చలపతిరావు గారు, డాక్టర్ ఎం. అమరేశ్వరరావుగారు, డా శంకర మల్లిఖార్జునరావుగారు, లేడీ డాక్టర్లు డాక్టర్ ద్వారకాబాయి, డాక్టర్ సుశీలగారు ప్రసిద్ధులు. గుంటూరు పట్టణంలో తప్ప గుంటూరుకు పడమర గావున్న ఏ తాలూకాలోనూ ఎం.బి.బి. ఎస్. డాక్టర్లు లేరు.

అందువలన మేము ప్రాక్టీసు పెట్టినప్పుడు కేవలం సర్జరీ మాత్రమేకాక, అన్ని విభాగాల రోగులను, చూడవలెనని నిశ్చయించుకొన్నాము. అంతేగాక అన్ని వర్గాల ప్రజలకు అందుబాటులో వుండాలనే వుద్దేశ్యంతో ఖచ్చితమైన ఫీజు నిర్ణయించుకొనలేదు.

ఇద్దరమూ డాక్టర్లము కనుక ఆడవారందరూ ఆమె దగ్గరకు, మగవారు నా దగ్గరకు వచ్చేవారు. జయప్రదాంబకు ఏమైనా అనుమానము వచ్చినప్పుడు నన్ను సంప్రదించేవారు. అందువలన రోగులు మరొక డాక్టరు వద్దకు వెళ్ళే అవసరము వుండేదికాదు. పరీక్ష ఫీజు అనేది నిర్ణయించకపోయినప్పటికి మామూలుగా డాక్టరు పీజు రూ. 5/- ఇచ్చేవారు. కన్సల్టేషను ఫీజు విషయానికివస్తే అన్నిచోట్లా

ఒకే విధంగా వుండేదికాదు ఉదా: తెనాలిలో, ఏ డాక్టరు కన్సల్టేషను ఫీజు తీసుకొనేవాడు కాదు. రోగులకు నచ్చినవారి దగ్గర వైద్యము చేయించుకొనేవారు. కొన్నిచోట్ల రూ. 1/– తీసుకొనేవారు. మాకు ఆదాయము, మొదటి నెలనుండీ సరిపోయేది. అందువలన ఖచ్చితంగా ఫీజు వసూలు చేయాలన్న భావం ఎప్పుడూ రాలేదు. కొన్నాళ్ళ తర్వాత పరీక్ష ఫీజురూ. 5/– గా నిర్ణయించాను. నూటికి 30 నుండి 40 మంది వరకు ఇచ్చేవారు కాదు. ఏనాడు ఆదాయం తక్కువ అన్న భావము ఇద్దరిలో కలుగలేదు.

సర్జరీ కేసులకు ప్రసూతి కేసులకు తప్పనిసరిగా ఎంతో కొంత ఇచ్చేవారు. ఉదా: నా మొట్టమొదటి సిజేరియన్ ఆపరేషనుకు వారిచ్చిన ఫీజు రూ. 50/– ఈ ఆదాయంతోనే మొదటి పదిసంవత్సరాలలో, గుంటూరులో పాత ఇల్లుఒకటి కొత్త ఇల్లు ఒకటి కొనగలిగాము. ఆ తరువాత కాలంలో గుంటూరులో డాక్టర్ ద్వారకాబాయి నిర్మించిన హాస్పటలు భవనం కొంత అప్పు చేసి కొనగలిగాము. ఆ తరువాత వచ్చిన ఆదాయముతో హాస్పిటలును అభివృద్ధి చేసుకొనటానికి నూతన బిల్డింగులు ఏర్పరచుకొనుటకు అవకాశము గలిగినది. అప్పటికి, మా తమ్ముళ్ళు మెడికల్ కాలేజీలో చేరేదానికి, ఇద్దరికి డొనేషను కట్టాను.

మా పిల్లలు హైస్కూలు విద్యలోనే వున్నారు. తరువాత మా పిల్లలు మెడికల్ కాలేజీలో ప్రవేశించారు. పెద్దమ్మాయి రమాబాలకు గుంటూరులో మెడికల్ కాలేజీలో సీటు వచ్చింది. మిగతా నలుగురిని కాకినాడలో చదివించాను.

ప్రసూతి వైద్యంచేసే డాక్టర్లు మిగతావారికన్నా ఎక్కువ శ్రమ పడాల్సి వస్తుంది. పగలంతా పనిచేసి, రాత్రిపూట ఓ కాన్పు కేసు కొరకు హాస్పిటల్కు వెళ్ళి చూడవలసి వచ్చేది. మామూలుగా కాన్పు అయితే సరే, ఆపరేషను చేయవలసి వస్తే నేను కూడా వెళ్ళేవాడిని. జయప్రదాంబ ఓపికకుమించి శ్రమపడవలసి వచ్చింది.

## జయప్రద సంఘసేవా కార్యక్రమాలు :

ఇదికాక, వాలంటరీ సేవ పేరుతో కొన్ని కార్యక్రమములు నిర్వహించేది. జిల్లా వ్యాప్తంగా వున్న బాలవాడీ స్కూళ్ళ బాధ్యత ఆమెదే. కస్తూరిబాయి పేరుతో వున్న ఒక సంస్థకు శ్రీ కొండ వెంకటప్పయ్యగారి కుమార్తె అధ్యక్షురాలిగా వుండేది. జయప్రదాంబ దానికి కార్యదర్శి, మరికొందరు కమిటిలో వున్నప్పటికి ప్రధాన బాధ్యత తను తీసుకొని ఆ సంస్థకు ఒక బిల్డింగు ఏర్పాటు చేయాలన్న ఉద్దేశ్యంతో, విరాళాలు సేకరించి, ప్రభుత్వము ఇచ్చిన స్థలములో ఒక బిల్డింగు కట్టించారు. గుంటూరు ఐ.ఎం.ఏ. బిల్డింగు ప్రక్కన వున్న బిల్డింగు అదే. గుంటూరులో వున్న లేడీ డాక్టర్లతో కలసి ఆ బిల్డింగులో "ఫ్రీ క్లీనిక్" కొన్నిసంవత్సరాల పాటు నడిపారు. బీదసాదల పట్ల సానుభూతితో వైద్యము చేశారు. మొత్తము మీద ఆంధ్రదేశములో మొదటి తరములోని లేడీ డాక్టర్లలో ఒకరుగా, సమర్థవంతమైన వైద్యము అందించారు. వైద్యరంగానికి తనవంతుగా వన్నె తెచ్చారు.

## నీవు అనే సంబోధన జయప్రదకు ఎంత చిరాకో....

ఆంధ్రదేశంలో గుంటూరు పట్టణం, నాగరికమైన పట్టణంగా చెప్పవచ్చు. ఎన్నో శతాబ్దాలనుండి మహాకవులు, పండితులు, జన్మించిన జిల్లా ఇది. ఇటీవల కాలంలో కూడా అది 19వ శతాబ్దంలో ఉత్తరార్థంలో, ఇంగ్లీషు భాష ప్రవేశపెట్టిన తర్వాత హైస్కూళ్ళు. రావటం వివిధ విషయాలలో నిష్ణాతులైనవారు అధ్యాపకులుగా రావటం, క్రిస్టియన్ మిషనరీస్, వారి మతంతోపాటు విద్య వ్యాప్తికి, ఆరోగ్య పరిరక్షణకు ఎక్కువ కృషి చేశారు. అట్లానే జిల్లా అధికారులు చాలా సీనియర్ ఆఫీసర్లు, వైద్య రంగంలో ఐఎం.ఎస్. డాక్టర్లు (మామూలు డిగ్రీలు కాక ఇంకా ఎక్కువగా ఐ.సి.ఎస్. లోని ప్రత్యేక పరీక్ష ప్యాసు అయినవారు) జిల్లా వైద్యాధికారులుగా వచ్చేవారు. అలానే న్యాయ వ్యవస్థలో కూడా చాలా పేరుపొందిన అడ్వకేట్లు, అర్జీలు కూడా వుండేవారు. సామాన్య మానవుని యొక్క విషయ పరిజ్ఞానము హెచ్చుగానే వుండేది. అందువలన ఒకరకంగా ఇంట

లెక్చువల్ యట్మాస్ఫియర్, కొత్తగా వచ్చిన కలెక్టర్లకు కూడా వారి వృత్తి ధర్మముతోపాటు, సామాజిక పరిస్థితులపై అవగాహన వుండేది.

ఒక విషయములో మాత్రము పైన చెప్పిన దానికి భిన్నముగా వుండేది. ఎదుటి వ్యక్తిని సంభోధించేటప్పుడు నీవు అనే మాటే వచ్చేదికాని మీరు అనే మాట వచ్చేది కాదు. ఎలవర్తి రోశయ్యగారి దగ్గరకు దేశమంతా తిరిగి ఐదారుగురు పండితులు వచ్చారు. రోశయ్యగారు వారిని ఏమిటండీ విషయాలు అని అడిగారు. "మీ జిల్లా బహువచనంలో లేదండి" అన్నారట.

ప్రాక్టీసు కొత్తలో ఈ విషయంలో జయప్రదాంబ కొంచెం ఇబ్బంది పడేది. "ఏమిటి అంతా నువ్వు నువ్వు అంటారు". అని కొద్దిగా విసుగుకొనేది. నేను వివరం చెప్పాను. "నువ్వండీ అని కూడా అంటారు గ్రహించావా" మీరు అని అనటం వారికి అలవాటులేదు. అందువలన ఇబ్బంది అని చెప్పాను. ఆ తర్వాత నిదానంగా అర్థం చేసుకొని వారితో ఆత్మీయంగా మెలిగేది.

వైద్య విషయంలో మాత్రం ఎక్కువ రాజీపడేదికాదు. ఒకసారి మా హాస్పిటల్లో ప్రసవించినామె అంతకు ముందు కాన్పులో బిడ్డలు బ్రతకలేదని ఈ బిడ్డకు తన చేతులమీదగా ఒక "చొక్కా ఇవ్వమని" అడిగింది. అలాగే ఇచ్చింది. ఆ బిడ్డ తరువాత బిడ్డలు కూడా బాగానే వున్నారు. అప్పటి నుండి హాస్పిటలులో స్టాక్ పెట్టేది. అడిగిన వారందరికీ చొక్కాలు గౌనులు ఇస్తూ వుండేది.

**డాక్టర్ల కుటుంబం :**

వ్యక్తిగతంగా, నేను చెప్పవలసిన ఒకటి రెండు మాటలు. ఏ పురుషుడైనా భార్యనుంచి ఆశించేది, సంసార సౌఖ్యమేగాక, సత్సంతానాన్ని. ఈ విషయంలో రత్నాల్లాంటి ఐదుగురు బిడ్డలనుకొని, వారిని సక్రమమైన మార్గములో నడిపించి, అయిదుగురును డాక్టర్లను చేయటం, వారయిదుగురు డాక్టర్లనే వివాహము చేసుకొవటం, మొత్తం పదిమంది వివిధ విభాగాలలో పోస్టు గ్రాడ్యుయేట్లు

గావటం. మా కుటుంబానికి ఆనందదాయకము. వారు వేరు వేరు చోట్ల స్థిరపడి, మంచి డాక్టర్లుగానే పేరు సంపాదించుకొని వైద్యము చేస్తున్నారు. నాకు మనుమ సంతానము ఏడుగురు, వీరిలో ఐదుగురు డాక్టర్లుగా చదవటం, అందులో ఒక మనుమడు కృష్ణవర్ధన్ తనతోపాటు చదువుకొనే 'పల్లవి' అనే అమ్మాయిని పెండ్లి చేసుకొన్నాడు. మిగతా నలుగురు అదే పనిచేస్తే ఆ తరంలో కూడా పది మంది డాక్టర్లు అవుతారు.

జీవితకాలం భాగస్వామిగా వుండవలసిన జయప్రదాంబ మా అందరినీ విడిచి ముందుగా పోవటం, మా దురదృష్టం. పోయినవారిని గురించి చింతించి నందువలన ప్రయోజనమేమీలేదు. అందువలన మా బిడ్డలు ఆమె స్మృతికొరకు, గుంటూరులో ఒక ట్రస్టు ఏర్పరచి, వారిచ్చిన డబ్బుతోపాటు బంధువులు, మిత్రులు, అభిమానులు ఒక కళాశాలను ఆమె పేరుతో ఏర్పాటు చేశారు. దానికి అనుబంధంగా పోస్టలు బిల్డింగ కూడా పూర్తి కావచ్చింది.

ఇంతకు ముందు మా అత్తమామల ప్రస్తావన వచ్చినప్పుడు ఒక విషయం చెప్పాను. ఆడపిల్లను, హైస్కూలుకు పంపటమే అబ్బురమైన ఆ కాలంలో వారి అమ్మాయిని ఎం.బి.బి.ఎస్. చదివించిన సంస్కృతి సంపన్నులని, మాకు వివాహమైన తరువాత వారిరువురు మాతోనే వుండి మా కుటుంబ బాధ్యత నిర్వహణలోనూ, మా పిల్లల పెంపకములలోనూ వారు చేసిన సేవ మరువరానిది.

ఆమె మరణానంతరము, నాకు రెండుసార్లు జబ్బుచేసి కొన్నాళ్ళు అనారోగ్యంగా వున్నా ప్రస్తుతం ఏ ఇబ్బందులు లేకుండానే కాలం గడుపు తున్నాను. చివరి మాటగా నేను చెప్పవలసినది ''ఈ సమాజము, నన్ను బాగా చూసింది. ఆ ఋణం తీర్చుకోవటం ఎవరివల్లా అయ్యేపనికాదు, సమాజానికి నా కృతజ్ఞతలు చెప్పుకోవటం తప్ప...''

ఆమె స్వతహాగా నెమ్మదస్తురాలు, అలానే రోగులను పరీక్ష చేయటం కూడా. ఎక్కువ టైం పట్టేది. అందువలన మధ్యలో నేను కొంతమందిని, పరీక్షచేసి, ఆమె పని భారాన్ని కొంత తగ్గించేవాడిని.

లేడీ డాక్టర్ల ప్రాక్టీసు చాలా ప్రయాసతో కూడినపని. దీనికి ప్రధాన కారణం ప్రసూతి కేసులు. ప్రవవించేవారు ఎక్కువమంది రాత్రిళ్ళు ప్రసవిస్తారు. ఎంత టైము పడుతుందో తెలియదు. ఆరకంగా ఒక్కొక్క రోజు నాలుగు, అయిదు సార్లు, హాస్పిటల్ కి వెళ్ళాల్సి వచ్చేది. ప్రసవం కావటం కష్టం. ఆపరేషను తప్పదను కొన్నప్పుడే నేను వెళ్ళేవాడిని, తనొక గృహిణిగా, ఇల్లువాకిలి చూసుకోవటం, పిల్లలను గురించి శ్రద్ధతీసుకోవటం ఇవన్నీ అదనపు పనులు. తాను గర్భిణీగా ఉన్నప్పుడు కూడా, చివరి వరకూ రోగులను చూస్తూ వుండేది. ఇంత సహనం ప్రకృతిలో స్త్రీలకు మాత్రమే సాధ్యమనుకొంటాను.

పిల్లల పట్ల ఆమెకున్న ప్రత్యేక శ్రద్ధ: ప్రొద్దుననే ఆడ పిల్లలకు జడలు వేసి స్కూలుకు పంపిన తర్వాత, 12 గంటలకు స్కూలుకు వెళ్ళి పిల్లలను ఇంటికి తీసుకొని వచ్చి... భోజనం చేసిన తర్వాత మరలా స్కూలులోదించి, హాస్పిటలుకు వచ్చి నాతోపాటు రెండు లేక మూడు గంటల వరకూ పనిచేయటం జరిగేది. తల్లిగా తన బాధ్యతలను చాలా గొప్పగా నిర్వర్తించింది.

అలానే ఈ జిల్లా బాల్వాడీ స్కూళ్ళ నిర్వహణ భాధ్యతను ఆమె స్వీకరించింది. మా ఇంటి దగ్గరనేవున్న ఆమె తండ్రి 1982లోనూ, తల్లి 1984లో మరణించారు. వారు వృద్ధాప్యంలో చనిపోయినా వారి మరణం ఆమెను క్రుంగదీసింది.

కవిగారి కూతురుగావటంవలన సహజంగానే సాహిత్యంపట్ల అభిమానం వుండేది. నాకుకూడా అభిమానం వుండటంవలన, సాహితీ సదస్సు ఏర్పాటు చేయడం, బహుకాలం మాఇంట్లోనే నిర్వహించటం వచ్చిన అతిధులకు

మర్యాదలు చేయటం బాగా నిర్వహించేది. ఈ విషయాన్ని గురించి పండిత గొజ్జె పాటి వెంకటసుబ్బయ్య నేను నా మిత్రులన్న పుస్తకంలో ప్రత్యేకంగా ఆమె మర్యాదలను గురించి ప్రస్తావించారు. తీరికలేకుండా పని చేసే వృత్తిలో వున్నవారూ సంవత్సరానికో రెండు సంవత్సరాలకో సెలవలకు వెళ్ళాలనుకుంటారు. ఇద్దరం ఆసుపత్రి వదలి వెళ్ళటం అసాధ్యం కనుక ఎక్కువసార్లు ఆమె పిల్లలతో సహా సెలవలకు వెళ్ళి వచ్చేది..

1966లో మేమిద్దరం 10 లేక 15 రోజులు మణిపాల్లో జరిగిన సర్జన్ల కాన్ఫరెన్సుకు హాజరై, దక్షిణ దేశయాత్ర చేసి వచ్చాము. మాతోపాటు ఇంకా నలుగురైదుగురు డాక్టర్లువున్నారు.

ఆమె ఆరోగ్యం క్షీణించటం మొదలు పెట్టిన తర్వాత మోకాళ్ళ నొప్పులు, కదిలితే ఆయాసం వచ్చేది, హాస్పిటలుకు పై అంతస్థుకు కూడా వెళ్ళలేకపోయే వారు, ఆయాసానికి వైద్యం చేయించుకున్నా ఫలితం లేకపోయింది, చుట్టాలు, స్నేహితులు, వచ్చినప్పుడు వారికి మర్యాదలు చేయటమేగాక వారింట శుభ కార్యాలు జరిగినప్పుడు సాధ్యమైనంతవరకు హాజరై, ఏదో బహుమతి ఇచ్చేవారు.

1992 సెప్టెంబరు చివరి వారంలో ఒక రోజు సాయంకాలము బయట ముసురుగా వుంది. సాయంకాలం హాస్పిటలుకు బయలుదేరేటప్పుడు "పనిఏమి పెద్దగా లేదుకదా. నీవురావద్దు నే వెళ్తాలే" అని బయలుదేరి వెళ్ళాను. తర్వాత ఒక గంట సేపటికి, ఆమె ఛాతిలో బాగా నొప్పి వచ్చిందని ఫోను వచ్చింది. నేనూ మా పెద్దమ్మాయి రమాబాల, మేమిద్దరం వచ్చిచూసి ఊపిరితిత్తి చిట్లిపోయినందు వలన (న్యూమెథారాక్సు) నొప్పి, ఎక్కువ ఆయాసం వచ్చినట్లు గ్రహించి దానికి తగిన వైద్యము ప్రారంభించించాం. పట్టణంలో వున్న స్పెషలిస్టుల సహకారం కూడా తీసుకొని వైద్యము చేసినా, ఏమీ ఉపయోగం జరగలేదు. ఇంగ్లండులో వున్న మా ఇద్దరబ్బాయిలు ఒక అమ్మాయి వచ్చారు. ఆమె అందరి సమక్షంలోనే

అక్టోబరు 6వ తేదీన దసరా పండుగరోజున రాత్రి 8 గంటలకు తుదిశ్వాస విడిచారు.

బిడ్డలందరూ ప్రయోజకులై వారికి పెండ్లిండ్లు అయి పిల్లలు కూడా కలిగి సంపూర్ణ జీవితం గడిపి మరణించిందన్న భావము ఇతరులకు కలుగవచ్చు. కలకాలం కలిసి వుండవలసిన ఆమె నన్ను వదలి వెళ్ళటం నాకు ఎంతో లోటు అనేది బయటవారి కర్థంకాదుగదా! ఈ లోటును భరించటం తప్పదుకదా!

మా పిల్లలు ఆమె జ్ఞాపకార్థము డాక్టర్ జయప్రదాంబ డిగ్రీ కళాశాలను, ప్రారంభించారు. దాని నిర్మాణం కొరకు పిల్లలు ఇచ్చిన రూ. 10 నుండి 15 లక్షలు కాక చాలా మంది పెద్దలు సహకరించారు. అందులో ముఖ్యంగా డాక్టర్ మద్దిన గోపాలకృష్ణ రూ. 30 లక్షల పైగా విలువ చేసే స్థలాన్ని విరాళంగా ఇచ్చారు. దాంతోపాటు శ్రీ మండవ వెంకట్రామయ్య, (నూజివీడు సీడ్సు) గారి కుటుంబము పెద్ద మొత్తంలో విరాళమిచ్చారు. దాని కనుబంధంగా ఆడపిల్లలకు హాస్టలు కొరకు శ్రీ కోటపాటి మురహరిరావుగారు. భారీగా విరాళమిచ్చారు. ఎం.పి. లాక్సు, పండ్సుతోపాటు ఇతరులు ఇచ్చిన విరాళాలతో, దాదాపు పూర్తికా వచ్చినది. శ్రీ ఆలోకం పెద్దబ్బాయి గారు కూడా హాస్టలుకు భారీగా విరాళాలు ఇవ్వటమే ఏర్మాణ కార్యక్రమంలో కాలేజీ సెక్రటరీగావున్న శ్రీ రావెల సాంబశివ రావు గారికి తన సహకారము అందిస్తున్నారు. ఇట్లా డా. వై. లక్ష్మణస్వామి, శ్రీ సి. కోటేశ్వరరావు మొదలైన పెద్దలు చాలామంది సహకరిస్తున్నారు.

ఈ కాలేజీలో ప్రధానంగా కంప్యూటర్ కోర్సులు, ఎం.పి.పి. నడుస్తూ వున్నాయి. పోస్టు గ్రాడ్యుయేట్ కోర్సు పెట్టవలెననే ఆలోచనకూడా వుంది.



‘‘ఉన్నట్లు యుండ నద్దరి
డిన్నరులను నావజేర్చు క్రియ వేప డా బో
కున్నట్లయుండి కాలం
బున్నరులకు వయసు బుచ్చి మోసము దెచ్చున్’’

-ఆముక్త మాల్యద

‘‘కమ్మని దోసతోటవలె కాపురమున్ ఫలియింపజేసి నీ
ఎమ్మగు శాంతి ధామమున కేగితి వచ్చట నాత్మశాంతి రు
చ్చమ్మను నీదు సంస్కృతి యొసంగిన లెస్సగు నీ సదాశివ
త్వమ్మిట మాకు నూరట నివాస సుమాంజలు లందికొమ్మికన్’’

-పండిత చిన్నాము రామయ్య చౌదరి.

# ప్రాక్టీసు

**తొలిరోగి ఇంకా సజీవుడే:**

ఒకటా రెంటా చెడితేకాని వైద్యుడు కాడని ఒక సామెత. అందువలన ఎంత అనుభవమున్నా ప్రాక్టీసు పెట్టిన కొత్తలో కొంచెం భయంగానే వుండేది. అదృష్టవశాత్తూ, నా మొదటి రోగి బ్రతకటమే కాకుండా ఇప్పటికీ సజీవుడుగా ఆరోగ్యంగా వున్నాడు.. ఆ రోగి నరసాయపాలెం వాస్తవ్యుడు, గుంటూరులో మా ప్రక్క ఇంట్లో విద్యార్థిగా వుండేవాడు. అతని కుమారుడు డాక్టరు అయ్యాడు. మా హాస్పిటలు సిల్వర్ జూబ్లీ సంచికలో, పెద్ద వ్యాసం కూడా వ్రాశాడు. ఆయన పేరు ప్రత్తిపాటి అంకమ్మచౌదరి, ఊళ్ళో అంకుల్ అని పిలుస్తారు. ప్రాక్టీసు పెట్టిన కొద్ది రోజులలోనే, జిల్లా నలుమూలల నుండి వైద్యానికి. వచ్చేవారు. నేను ఎం.ఎస్. చదివాను పెద్ద డాక్టర్ని అని కాదు. భార్యా భర్తలు ఇద్దరూ డాక్టర్లు వైద్యము అందుబాటులో వుంటుంది అన్న భావముతో.

**డిగ్రీలలో విచిత్రం :**

నిజానికి నా డిగ్రీ ఎం.బి.బి.ఎస్. కన్నా చిన్నదనుకొనేవారు చాలా మంది చదువుకొన్న వాళ్ళు కూడా. ఒక ట్రైనింగు స్కూలు హెడ్ మాస్టరు. నా సర్టిఫికేట్ తీసుకొని వెళ్తే. ఎం.ఎస్. సర్టిఫికేట్ చాలదు. ఎం.బి.బి.ఎస్. తీసుకొని రమ్మని చెప్పారు అన్నాడు. ఇంకో టీచరు నేను సర్టిఫికెట్టు వ్రాస్తూవుంటే "ఎం.బి.బి.ఎస్. డాక్టరుగారి ద్వారా అంటే జయప్రదాంబగారి ద్వారా ఇప్పించండి" అన్నాడు. పేషంటు కూడా నా డిగ్రీ రెండు అక్షరాలే ఉండటం (ఎం.ఎస్) ఆమెది నాలుగు అక్షరాలు వుండటములో ఇదే అభిప్రాయం వెలిబుచ్చేవారు. దీనికి ఇంకొక కారణం కూడా వుంది. చిన్న ఆపరేషన్లు నేను ఒక్కడ్నే చేసేవాడిని, పెద్ద ఆపరేషనుకు ఆమె కూడా వచ్చేది.

మేం ప్రాక్టీసు పెట్టిన ఇల్లు, నర్సింగు హోం రెండూ కొత్తగా నిర్మించ బడినవి. అప్పటికే కరెంటు కొరత ఏర్పడింది. కొత్తగా కట్టిన ఇళ్ళకు ప్రయారిటీ ప్రకారం సప్లయి ఇచ్చేవారు. దానికి ఆరునెలలు పట్టింది. ఈ ఆరు నెలల్లో ఆపరేషన్లు పెట్రొమార్క్సులైటు, టార్చిలైటు సాయంతో చేసేవాడిని. మేజర్ సర్జరీ కూడా ఈ వెలుతురులోనే చేసేవాడిని.

జిల్లాలో నరసరావుపేట, తెనాలి తప్ప నీ సిటీకి కరింటు లేదు. అందువలన కొన్ని సంవత్సరాలపాటు బయట వూళ్ళల్లో వున్న డాక్టరు సోదరులకు సహాయము చేయటానికి వెళ్ళి, అక్కడ కూడా కరెంటు లేకుండానే ఆపరేషను చేసినచ్చేవాడను.

**నిజం చెప్పే డాక్టరు :**

ప్రాక్టీసు పెట్టిన మరుసటి సంవత్సరము, సత్తెనపల్లి తాలూకా "పెద ఫణిదం". లో మా బంధువుల ఇంటికి వెళ్ళాను. అక్కడ మా కజిన్ సిస్టర్, నిమ్మగడ్డ తులిశమ్మ "అబ్బాయి. గుంటూరులో నిజం చెప్పే డాక్టరు వచ్చాడని చెప్పుకుంటున్నారు" అని అన్నది. అప్పటికి ఇప్పటికీ, నా ప్రాక్టీసు గురించి వచ్చిన మెప్పులలో ఆ మాటే నాకు గొప్పగా అనిపిస్తుంది. బయట నుండి వచ్చి హాస్పిటల్లో వుండే వారికి ఎక్కువ వసతులు కల్పించలేక పోయేవాడిని. వాళ్ళు కూడా ఏమీ అనుకొనేవారు కాదు. కొంత మంది అయితే, ఇద్దరు ముగ్గురు రోగులు కూడా ఒకే గదిలో సర్దుకోనేవారు. మొదటి నెలలోనే హాస్పటలు ఖర్చులు, కుటుంబ ఖర్చులకు సరిపోను ఆదాయము వచ్చింది. అప్పటి నుండి ఎంతో కొంత వృద్ధి జరుగుతూనే వుంది. వచ్చిన డబ్బులు కన్నా రోగుల సంఖ్య ఎక్కువ ఆనందాన్ని కలిగించేది. చాలా రోజులు కన్సల్టేషను ఫీజు కూడా ప్రత్యేకంగా పట్టించుకోలేదు. రెండు సంవత్సరాలయిన తర్వాత ప్రక్కన పెద్ద బిల్డింగు తీసుకొని, ఆపరేషను ధియేటరుకు ప్రత్యేకంగా రోగులకు కొంత సౌకర్యమయిన

ఎకామిడేషన్ ఇవ్వ గలిగాను. ఇలా పది సంవత్సరములు సాంబశివపేటలో ప్రాక్టీసు చేసాను.

ప్రతి సంవత్సరమూ, చిన్నవి పెద్దవి కలిసి సుమారుగా ఐదు లేక ఆరు వందల ఆపరేషన్లు చేసేవాడిని, ప్రసూతి కేసులు కూడా గణనీయముగా వుండేవి. ఏదైనా ఇబ్బందివస్తే తప్ప నా సాయము లేకుండానే జయప్రదాంబ కాన్పు కేసులు నిర్వహించేవారు. అప్పట్లో గుంటూరులో, ఆపరేషన్లకు మత్తు ఇవ్వటానికి ప్రత్యేకంగా డాక్టర్లు వుండే వారు కాదు, ఎయిర్ కండీషను వసతులు అప్పట్లో లేవు. వేసవి ఇప్పటికన్నా . భయంకరముగా వుండేది. ముఖ్యంగా చిన్న పిల్లలు మరణించేవారు. దాదాపు పదివేలు పెట్టి ఒక ఎయిర్ కూలర్ కొన్నాము. దీనివలన పిల్లలకు లాభం వుండేది. దీనికి ఏమీ అదనంగా ఛార్జీ తీసుకునే వాడిని కాదు. అప్పటికి ప్రత్యేక పరీక్షలు లేవు. ఎక్స్ రే రెండు మూడు రక్త పరీక్షలు, మూత్ర పరీక్ష మల పరీక్షలు వుండేవి ఆ వసతులతోనే చాలా వరకు రోగ నిర్ధారణచేసి వైద్యము చేసేవాడిని. అప్పట్లో తెనాలి, బాపట్ల, చీరాల, చెరుకుపల్లి పట్టణాలకు వెళ్ళి సర్జరీ చేసివచ్చేవాడిని. డబ్బు ప్రమేయం లేకుండా). తెనాలి మినహా మరే ఊళ్ళలోనూ కరెంటు లేదు.

**మేయో సోదరులు గ్రామీణ వైద్యం :-**

1951 నాటికి, గుంటూరుకు పడమర, మొత్తం జిల్లాలో ఒక ఎం.బి.బి. ఎస్. ప్రాక్టీషనర్ కూడా లేరు. అందువలన కర్నూలు జిల్లాలో, నంద్యాల దగ్గర నుండి కూడా రోగులు గుంటూరుకు రావలసిందే. అప్పటికింకా ఇంగ్లీషు వైద్యము (అల్లోపతి) గురించి, ప్రజలకు అంతదావన లేదు. వైద్యము సామాన్య ప్రజలకు అందుబాటులో కూడా వుండేది. కాదు. గుంటూరు చుట్టు ప్రక్కల వారు కూడా రోగిని చివరి దశలో గుంటూరు తీసుకొని రావటం, ఫలితము లేకపోవటము జరిగేది. అప్పుడప్పుడే అల్లోపతి వైద్య విధానంలో గణనీయమైన అభివృద్ధి వచ్చి, చాలా ప్రాణాంతక వ్యాధులు నివారించే యాంటీబయోటిక్స్ వచ్చినవి.

1947–51 మధ్య కాలంలో క్షయకు, టైఫాయిడ్కు మిగతా చాలా రకాల జబ్బులకు యాంటిబయోటిక్స్ తో వైద్యము అమలులోనికి వచ్చింది. దానివలన ప్రజలలో కూడా వైద్యము పట్ల సద్భావము ఏర్పడి, ఆసుపత్రులకు వచ్చేవారు.

జిల్లాలో కొన్ని గ్రామాల్లో లోకల్ ఫండ్ డిస్పెన్సరీస్ వుండేవి. వాటిలో ఎల్.ఎం.పి. డాక్టర్లు వుండేవారు. వారు యాంటిబయోటిక్స్ విరివిగా వుప యోగించి వైద్యముపట్ల ప్రజలకు సద్భావము కలిగించారు. అప్పటికి కృష్ణా, గోదావరి జిల్లాల్లో జిల్లా తాలూకా కేంద్రాలు, అంతకన్న చిన్న వూళ్ళలో కూడా ఎం.బి.బి.ఎస్. డాక్టర్లు ప్రాక్టీసులో స్థిరపడ్డారు. ప్రభుత్వము వారు పి.హెచ్.సి. (ప్రైమరీ హెల్త్ సెంటర్సు) పేరుతో, కొన్ని గ్రామాల్లో ఆసుపత్రులు ఏర్పాటు చేసారు, కృష్ణా, గోదావరి జిల్లాలలో, చిన్న చిన్న గ్రామాల్లో ఎం.బి.బి.ఎస్. డాక్టర్లు స్థిరపడడటానికి ప్రధాన కారణము, గ్రామీణ ప్రజానీకమునకు, వైద్య సేవలు అందించాలనే తపనే. దీనికి కారణంకూడా, అమెరికాలో మేయో బ్రదర్స్ (మేయో సోదరులు) రోచెస్టరు అనే చిన్న గ్రామములో స్థిరపడి, ప్రపంచ ఖ్యాతి సంపాదించారు, ఆ విషయం మెడికల్ కాలేజీలో పనిచేసే ప్రొఫెసర్లు, ఏదో సందర్భంగా, ప్రస్తావించి వైద్య విద్య పూర్తి చేసేవారిని, గ్రామాల్లోకి వెళ్ళి ప్రాక్టీసు చేయవలసినదిగా ప్రోత్సహించేవారు. అట్లా స్థిరపడ్డ డాక్టర్లలో పోస్టు గ్రాడ్యుయేట్ అయిన డాక్టరు చల్లపల్లి సాంబశివరావు ఒకరు. వారు తరువాత, గుంటూరులో స్థిరపడి, జనరల్ హాస్పిటల్లో ఆనరరీ ఫిజీషియన్ గా పనిచేశారు. ఎందుకనో ఆ తరువాత గ్రామాల్లో స్థిరపడి ఉద్యోగము చేయడం డాక్టర్లు మానివేశారు.

అమెరికా మిన్నెసోటా స్టేట్లో, రోచెస్టరు అనే చిన్న గ్రామములో, డాక్టర్ మేయో అని ఒక జనరల్ ప్రాక్టీషనరు వుండేవాడు, ఆయనకు డాక్టర్ విలియమ్ మేయో, డా చార్లెస్ మేయో అని ఇద్దరు కుమారులు. వారి తండ్రి వద్దనే ప్రాక్టీసు చేస్తుండేవారు. వారిద్దరు సర్జరీ చాలా నైపుణ్యంగా చేయటమేగాక, రోగనివారణ కూడా చాలా గొప్పగా చేసేవారని ప్రఖ్యాతి.

19వ శతాబ్దపు ఉత్తరార్థంలో 1937 దాకా ప్రాక్టీసు చేసారు. మానవతా దృక్పథం ఎక్కువగా వుండేది. అందువలన ప్రపంచ ప్రఖ్యాతి వచ్చింది. ఇప్పటిలాగా మత్తు డాక్టర్లు వుండేవారు కాదు. క్లోరోఫారం జనరల్గా ఇచ్చేవారు. వారి దగ్గర తర్ఫీదు పొందిన అసిస్టెంట్లు మత్తు ఇచ్చేవారు. నేను 1985లో అమెరికా వెళ్ళినప్పుడు ఆ హాస్పిటల్ చూడాలంటే మా విద్యార్థి కంఠమనేని సత్యనారాయణ, తన స్వంత విమానంలో తీసుకెళ్ళాడు. ఆ హాస్పిటల్ ప్రస్తుతం వున్న కార్పొరేటు హాస్పటల్ లాగానే వున్నది. మేయోగారి ఒక మనుమడు, ఆవైద్య బృందములో వున్నారు.

మేము కూడా జనరల్ అనెస్తీషియా ఇవ్వవలసి వచ్చినప్పుడు, ఈ థర్, ఇథైల్ క్లోరైడ్ స్ప్రే, అంతకు ముందు అచ్చగా "క్లోరోఫారం" వాడేవాళ్ళం, స్పెయినల్ అనస్థీషియా అమలులోకి వచ్చింది. పొట్టా, పొట్ట క్రింది భాగములకు ఆపరేషను చేయటానికి వుపయోగపడేది, ఇది కాకుండా లోకల్ అనస్తీషియా శరీరములో ఏ భాగాన్నైనా, చిన్న ఆపరేషన్లు చేయటానికి ఉపయోగపడేది. అంతకు ముందు "టోన్సిల్" ఆపరేషనుకు "కొకైన్" వాడే వారని చెప్పుకొనేవారు. మేం వచ్చిన తర్వాత నోవొకైయన్ వాడుకలోకి వచ్చినది. జనరల్ అనేస్థిసియాలో వచ్చిన, గణనీయమైన మార్పువలన, ఇప్పడు ఎక్కువమంది డాక్టర్లు జనరల్ అనెస్తీషియాతోనే చేస్తున్నారు. ఐతే దీనికి ప్రత్యేక శిక్షణ పొందిన డాక్టరు తప్పనిసరి. అందువలన రోగి ఫీజు ఎక్కువ ఇవ్వక తప్పదు.

**మిషనరీ సేవలు ప్రశంసనీయం:**

గుంటూరు జిల్లాలో సత్తెనపల్లిలో 1961 వరకు ఎం.బి.బి.ఎస్. డాక్టరు లేడు. నరసరావుపేటలో 1966 వరకూ లేడు. చిలకలూరి పేటలో మాత్రం 1951 చివరలో డాక్టర్ కాజు కృష్ణమూర్తిగారు ప్రాక్టీసు పెట్టారు. ఆ తరువాత 10 సంవత్సరాలలో సుమారు పదిమంది డాక్టర్లయ్యారు. మిషను హాస్పిటల్ 19వ శబ్దాము చివరనే గుంటూరులో "కుగ్లర్ హాస్పిటల్", సెంట్ బోవెన్స్ హాస్పిటల్

స్థాపించారు. తరువాత చీరాల, పొన్నూరు, రెంటచింతల, మొదలైనచోట్ల కూడా వారు సేవలందించారు ఇప్పటికీ అందిస్తూనే వున్నారు. ఆ రోజులలో మిషనరీలు అమెరికానుండి, ఇంగ్లాండు నుండి వచ్చి ఇండియాలో ప్రత్యేకించి గుంటూరు జిల్లాలో హాస్పిటల్పు నెలకొల్పి, వారి సేవలనందించటం చాలా ప్రశంసనీయం.

గుంటూరు పట్టణానికి సంబంధించినంత వరకూ, మొదటినుండి, సమర్థులైన డాక్టర్లు ప్రాక్టీసు చేస్తూవుండేవాళ్ళు. చాలా జిల్లాలలో గవర్నమెంటు హాస్పిటల్స్లో వున్న డాక్టర్లు పెద్దవాళ్ళనుకోవటం వారిని జిల్లా సర్జను అని పిలుస్తుండేవారు. గుంటూరులో మాత్రం ప్రైవేటు ప్రాక్టీషనర్లుగా అటు వైద్యంలో గానీ, శస్త్ర చికిత్సలో గాని, సమర్థులైన డాక్టర్లు వున్నందువలన, ప్రజలలో గవర్నమెంటు డాక్టర్లు పెద్ద డాక్టర్లన్న అభిప్రాయము వుండేది కాదు. ఆ తరువాత కాలంలో కూడా గుంటూరు మెడికల్ కాలేజీ వచ్చి జిల్లా హెడ్ క్వార్టర్స్ హాస్పిటల్, జనరల్ హాస్పిటలై చాలా మంది, వైద్య నిపుణులొచ్చినప్పటికీ బయట ప్రాక్టీసు చేసే డాక్టర్లు వారి ఆధిక్యత నిలబెట్టుకో గలిగారు.

**గుంటూరు మెడికల్ కాలేజి–ప్రసవవేదన :**

గుంటూరు మెడికల్ కాలేజీ 1946లో ప్రారంభించబడింది. 1955 నాటికి, అన్ని హంగులతో ఏర్పడి, జనరల్ హాస్పిటల్గా విస్తరింపబడి, వైద్య విద్యార్థులకు టీచింగు సౌకర్యము ఏర్పడింది. 1946లో మద్రాసు రాష్ట్రంలో కాంగ్రెసు ప్రభుత్వము ఏర్పడి శ్రీటంగుటూరి ప్రకాశంగారు ముఖ్యమంత్రిగాను, శ్రీమతి రుక్మిణీ లక్ష్మీపతిగారు ఆరోగ్య మంత్రిగాను అయ్యారు. శ్రీమతి రుక్మిణీ దేవిగారు డాక్టరు ఆచంట లక్ష్మీపతిగారి భార్య. డా లక్ష్మీపతిగారు ఎం.బి.బి.ఎస్. పూర్తయిన తర్వాత ఆయుర్వేదంపట్ల మక్కువతో ఎక్కువ కాలము ఆయుర్వేదంలో పరిశోధన జరిపారు. ఆయన మెడికల్ కాలేజీలో వుండగానే, ఆయన మొదటి భార్య మరణించింది. ఆమె సంతానమే ఆచంటి జానికిరామ్ గారు–ప్రసిద్ధ పండితులు, కవులు.

అప్పటికి రుక్మిణీదేవిగారు కూడా మద్రాసులో వైద్య విద్యార్థిగా వుండేవారు. లక్ష్మీపతి ఈమెను వివాహము చేసుకొన్న తరువాత ఆమె చదువుకు స్వస్తి చెప్పారు. ఆమెకు సంతానము ఒక ఆడపిల్ల అనే గుర్తు. ఆమె కూడా డాక్టరయ్యింది. ఆమె భర్త మద్రాసులో ప్రఖ్యాతి చెందిన న్యూరోసర్జను డాక్టర్ బి. రామమూర్తిగారు.

ఆరోగ్య మంత్రిణిగా, రుక్మిణి లక్ష్మీపతిగారు గుంటూరులో మెడికల్ కాలేజీ ప్రారంభించటానికి వున్న అవకాశాలను పరిశీలించేందుకు ఒక కమిటీని ఏర్పాటు చేసి, కమిటీ గుంటూరు వచ్చినప్పుడు తామ కూడా అక్కడే మకాము చేసింది. కమిటీవారు. ఈ సంవత్సరం ప్రారంభించటానికి సాధ్యముకాదు. వచ్చే సంవత్సరము ప్రారంబించ వచ్చని రిపోర్టు తయారు చేశారు. ఆమె పట్టుబట్టి అదే సంవత్సరంలో ప్రారంభింప చేసింది. పూర్వమెప్పుడో మెడికల్ స్కూలుకు నిర్మాణము చేసిన భవనాలలో, అప్పటి వరకూ తాత్కాలికంగా ఆంధ్రా యూనివర్శిటీ (1942-46) వున్నది. వారు ఖాళీ చేసినందువలన ఆ బిల్డింగులలో మెడికల్ కాలేజీగా ప్రారంభించటానికి నిర్ణయించుకొని, 50 మంది విద్యార్థులతో, మొదటి రెండు సంవత్సరాల కోర్సు వరకు ప్రారంభించారు.

మామూలుగా క్రొత్త కళాశాలను ఏర్పాటు చేయవలసి వచ్చినప్పుడు, యూనివర్శిటీ అంగీకారము కూడా కావాలి. ప్రభుత్వమువారు ఈ అంశాన్ని గమనించకుండా కళాశాలను ప్రారంభించారు. యూనివర్శిటీ ఎగ్జామినేషన్లు వచ్చినప్పుడు, అప్పటి వైస్ ఛాన్సలర్ సి.ఆర్. రెడ్డిగారు "ఈ కాలేజీ ఎక్కడిది మా అంగీకారములేదుకదా అని" పేచీ పెట్టాడు. ప్రభుత్వము వారు తమ పొరపాటును గ్రహించి, వైఛాన్సలర్ గారిని, "ఇప్పుడేమిచేయాలి మార్గమేమిటి" అని అడిగారు వారు దానికి సమాధానంగా "కాలేజీ మాత్రం రికగ్నైజ్ చేయను" విద్యార్థులను ప్రైవేటు కాండిడేట్లుగా అంగీకరిస్తాను" అని చెప్పాడు.

రెండవ సంవత్సరాంతపు పరీక్షల్లో కాండిడేట్లను, మద్రాసు కాలేజీకి కొంత మందిని, ఆంధ్రామెడికల్ కాలేజీకి కొంతమందిని పంపించారు. దాదాపు 1953 వరకు ఇట్లానే జరిగింది. తరువాత హాస్పిటల్ అభివృద్ధి చేయటం అదనపు బిల్డింగులు కట్టడం జరిగిన తర్వాత మిగతా కోర్సును కొనసాగించేందుకు అనుమతించారు. అప్పుడు డాక్టర్ డి.జె. రెడ్డిగారు పాథాలజీ ప్రొఫెసరు మరియు ప్రిన్సిపాల్గా వచ్చారు. దాదాపు 10 సంవత్సరాలు వారు ప్రిన్సిపాలుగా వుండి, కాలేజీ హాస్పిటల్ బాగా వృద్ధిచేసి, దేశంలో వున్న మిగతా కాలేజీలకు దీటుగా వుండేటట్లు చేశారు.

**ఆనరరీ యూనిట్లు ఆకర్షించాయి :**

ఆకాలంలోనే, గుంటూరులో ఆనరరీ సర్జన్లను, ఆనరరీ ఫిజీషియన్లను ఏర్పాటు చేయటం జరిగింది. డాక్టర్ పిన్నమనేని వెంకటేశ్వరరావుగారు ఆనరరీ సర్జను గానూ డా॥ చల్లపల్లి సాంబశివరావుగారు ఆనరరీ ఫిజీషియన్ గాను ఉన్నారు. కొన్నాళ్ళ తరువాత..

వెంకటేశ్వరరావుగారు మానుకోవటంవలన నేను అనదరీనార్జను అయ్యాను. అవరక యూనిల్లనని బాగావుందన్న కారణంతో, మరొక పర్ణరీ యూనిట్, మరొక మెడికల్ యూనిట్ ఏర్పాటు చేసారు. డా॥ మద్దినేని గోపాల క్రిష్ణ, డాక్టర్ ఉప్పల పాటి వెంకటరత్నం పనిచేశారు. ఆనరరీ యూనిట్లలో పని చేసిన డాక్టర్లందరూ బయట ప్రాక్టీసు వున్నవారే గనుక, ఎవరూ డబ్బుకు కక్కుర్తి పడలేదు. నిజం చెప్పాలంటే, మిగతా యూనిట్ల కన్నా మా ఆనరరీ యూనిట్ల పట్ల ప్రజలు, విద్యార్థులు, పి.జి.లు ఆకర్షించబడేవారు. ప్రభుత్వం 1974లో ఈ ఆనరరీ సిస్టమ్ రద్దు చేసింది. నాకు సంబంధించినంత వరకూ, ఆ కాలంలో నేనందించిన వైద్య సేవలపట్ల చాలా సంతృప్తి చెందాను.

## కారు ఫోను లేకుండానే సాగిన ప్రాక్టీసు :

ప్రాక్టీసు పెట్టేనాటికి మా కుటుంబములో (గుంటూరు)లో నేను డాక్టర్ జయప్రదాంబ వారి తల్లిదండ్రులు, లక్ష్మీనారాయణవర్మగారు, తులశమ్మగారు, తమ్ముడు చలసాని వెంకటకృష్ణగారు, జయప్రద అన్నకూతురు 'ఆశ వుండే వాళ్ళము. వెంకటక్రిష్ణ వర్మకు . చదువు అబ్బలేదు. అందువలన మావద్దనే వుండి హాస్పిటల్లో సహాయకుడిగా వుండేవాడు. అదే సంవత్సరము, వివాహము చేసు కొన్నాడు. మేమందించిన సహకారముతో మెడికల్షిప్పు పెట్టుకొన్నాడు.

మేము మొట్టమొదట సాంబశివపేటలో ప్రాక్టీసు పెట్టాము. ఇల్లు నర్సింగ్ హోమ్ ప్రక్క ప్రక్కనే వున్నందువలన టెలిఫోను అవసరం కలుగలేదు. కారు అవసరం లేదు. ఐదు సంవత్సరాల తరువాత మొదటగా కారుకొన్నాను. అదీ పిల్లలు స్కూలుకు వెళ్ళే నిమిత్తం. 1957లో లక్ష్మీపురంలో ఇల్లుకొని 1958లో ఆ ఇంట్లోకి వెళ్ళాము. అప్పుడు టెలిఫోను అవసరమై, ఇంట్లోను, నర్సింగు హోంలో టెలిఫోను ఏర్పాటు చేసుకున్నాము. 1959లో కొత్తపేటలో డాక్టర్ ద్వారకాబాయి నిర్మించిన హాస్పటలు భవనం కొన్నాము. దాని ప్రక్కన కొంత స్థలముకొని, ప్రాక్టీసుకు కావలసిన మరికొన్ని వసతులు ఏర్పరచుకొని 1961లో నర్సింగ్ హోమ్ అక్కడకు మార్చాము.

## మొదటి పేషెంటు విద్యార్థి:

సాంబశివ పేటలో ప్రాక్టీసు ఉన్నప్పుడు, గుంటూరు పట్టణములో వున్న పెద్ద కళాశాలలు ఏ.సి. కళాశాల, హిందూ కాలేజి, ఉమెన్స్ కాలేజీ దగ్గర వుండుట వలన, ఎక్కువమంది విద్యార్థులు నా వద్దకు వైద్యానికి వచ్చేవారు. అందరికీ ఉచితంగానే వైద్యము పాము చిన్న చిన్న ఆసు ఏమీ ఖర్చు లేకుండా చేసేవారము. దీనికి ప్రధాన కారణము వారు తల్లి దండ్రులకు దూరంగావుండి, సుస్తీ చేసి నప్పుడు వారి దగ్గర డబ్బులు వుండవచ్చు వుండకపోవచ్చు.

మనము మాత్రము ఉదారంగా వుండగలము. అన్న భావము. నా మొదటి పేషంటు కూడా విద్యార్థి. ఈ విద్యార్థులలో చాలా మంది బి.ఇ.డి. కాలేజి నుండి వచ్చేవారు. వారు తరువాత జిల్లా వ్యాప్తంగా టీచర్లుగా స్థిరపడ్డారు. అందువలన నీవూరు వెళ్ళినా, ఆప్యాయంగా పలకరించే విద్యావంతులుండేవారు. వీరు పేదల నుండి. ధనవంతుల వరకు అందరూ వచ్చేవారు. వారిచ్చిందే తీసుకొనేవాడిని.

మొత్తం మీద ఎం.ఎస్. ప్యాసయ్యేనాటికి కేవలం డిగ్రీ రావటమే గాకుండా సర్జరీలో మంచి అనుభవంకూడా వచ్చింది. స్వతంత్రంగా హాస్పటలు ఏర్పరచు కొని, ప్రాక్టీసు చేయాలని నిర్ణయించుకొన్నాను. డాక్టర్ జయప్రదకూడా హౌస్ సర్జన్ తర్వాత, కొన్నాళ్ళు కె.జి.హెచ్లోను, కొన్నాళ్ళు ఘోషా హాస్పిటల్లోనూ ప్రసూతి నిర్వహణలో పనిచేసి, అనుభవం గడించారు. ఎం.ఎస్. 1951 మేలో ప్యాసయ్యాను. అంతకుముందు 5, 6 నెలల క్రిందటే ఎం.ఎస్, ప్యాసయినా ప్యాసుకాకపోయినా గుంటూరులో ప్రాక్టీసు పెట్టాలని నిర్ణయించుకొని, తక్కెళ్ళ పాడులో నాతోపాటు హైస్కూలు కాలేజీలో చదివిన, నందిపాటి నారాయణ అనే స్నేహితునికి కావలసిన డబ్బు సమకూర్చమని, ఉత్తరం వ్రాశాను. నేను. వచ్చేటప్పటికి ఆయన డబ్బుతో సిద్ధంగా వున్నాడు. మద్రాసు వెళ్ళి, సర్జరీకి కావలసిన పరికరాలను కొనుక్కొచ్చాము. గుంటూరు సాంబశివపేటలో నూతనంగా నిర్మించిన రెండిళ్ళను. ఒకటి కుటుంబానికి, రెండవది హాస్పిటలుకు నెలకు రూ.150 ల చొప్పున అద్దెకు తీసుకొన్నాము.

జూన్ 22వ తారీఖున హాస్పిటలు ప్రారంభోత్సవము, ప్రొఫెసరు డాక్టర్ రమణమూర్తిగారు చేశారు. ఆ సందర్భంగా జరిగిన సభకు నా ఫిజియాలజీ ప్రొఫెసరు అప్పటి గుంటూరు మెడికల్ కాలేజీ ప్రిన్సిపాల్ గావున్న డాక్టర్ సుబ్బారెడ్డిగారు అధ్యక్షత వహించారు. ఇద్దరూ సుదీర్ఘమైన ఉపన్యాసాలు చేశారు. డాక్టర్ యతిరాజులు. విశాఖపట్నంలో అప్పుడు కె.జి.హెచ్. పనిచేస్తున్నాడు. డాక్టర్ రమణమూర్తిగారిని తీసుకొని వచ్చే బాధ్యత అతనికి అప్పజెప్పాను.

అంటే వారికి కూడా టికెట్టు కొని వారికి ఇమ్మని చెప్పాను, వారట్లోనే చేశారు. రమణమూర్తిగారు, తిరిగి వెళ్ళేటప్పుడు నన్ను దగ్గరకు పిల్చి, "Donot repeat the same thing" నా టిక్కెట్టు నేను కొనుక్కొని వెళ్తాను' అని చెప్పారు. వారి సంస్కారము అటువంటిది.

**జన్మభూమి భావన నాకేం కొత్త కాదు:**

ప్రాక్టీసు పెట్టేముందు, చాలామంది స్నేహితులు, ఇంత పెద్ద డిగ్రీతో గుంటూరులో ప్రాక్టీసు పెట్టటమేమిటి, మద్రాసులోనో, హైదరాబాదులోనో, పెట్ట కూడదా అని అడిగారు. నా భార్య జయప్రదకు విజయవాడ అయితే బాగు ఉంటుందనే అభిప్రాయము వుండేది. అయితే నా నిర్ణయము అప్పటికప్పుడు తీసుకున్నదికాదు. మెడికల్ కాలేజీలో చేరినప్పుడే తీసుకున్న నిర్ణయమది. నేను పుట్టిన పరిసరాలకు, చేతనైన సేవ అందించాలన్నదే నా భావన. అప్పటికి గుంటూరులో జనరల్ హాస్పిటలు, కుగ్గర్ హాస్పిటలులో సర్జరీ జరుగుతుండేది. కాన్వెంటు హాస్పటలు ప్రధానంగా ప్రసూతి వైద్యము చేసేవారు, బయట ప్రాక్టీసు సర్జన్లలో ఇద్దరు పెద్దనులు ఉన్నారు. ఒకరు డా పరుచూరి వీరయ్య చౌదరిగారు, రెండవవారు డాక్టర్ సి.హెచ్. జానుగారు, ఇంతకు ముందు వీరయ్యచౌదరిగారు ఆపరేషను చేయటం నేను చూశాను. సర్జరీ నైపుణ్యంగా చేసేవారు జానుగారి సర్జరీ నేను చూడలేదుగాని, ఎక్కువగా టాన్సిల్సు ఆపరేషను పెద్దకొత్తేమీ లేకుండా ఇంజక్షను ఇచ్చి చేసేవారని, అలానే కడుపునొప్పి కేసువస్తే రోగి ఉదయం వస్తే సాయంకాలముకల్లా అపెండిక్స్ ఆపరేషను చేసేవారని చెప్పుకొనే వారు. డాక్టర్ జానుగారు నేను ప్రాక్టీసు పెట్టిన 4 లేక 5 ఏళ్ళకు ఒక రోగి కాలుతీసివేస్తూ తనకు హార్ట్ అటాక్ వచ్చి అక్కడికక్కడే కుప్పకూలి చనిపోయారు.

తెనాలిలో డాక్టర్ చదలవాడ కృష్ణయ్యగారు. అంతకుముందు మూడు నాలుగు సంవత్సరాలనుండి సర్జరీ చేస్తూవున్నారు. అంతకుమించి ఒంగోలులో మినహా ఎవరూ సర్జరీ చేసేవారులేరు. అందువలన గుంటూరులో సర్జరీ ప్రాక్టీసు బాగుంటుందని అనుకొన్నాను. అదే సమయంలో డా. వై.వి. సుబ్బారావుగారు కొన్నాళ్ళు మద్రాసు జనరల్ హాస్పిటల్లో అనుభవంగడించి గుంటూరులో హాస్పిటలు మరలా ప్రారంభించాడు. అయితే ఆయన కేవలం సర్జరీ కేసులు మాత్రమే చేసేవారు, సాధారణంగా మెడికల్ కేసులు చూసేవాడుకాదు. సర్జరీలో కూడా ప్రత్యేకత కావాలన్న వుద్దేశ్యంతో న్యూరోసర్జరీ, మొదలైనవి. కొన్నిచేసి చివరకు ప్లాస్టిక్ సర్జరీలో స్థిరపడ్డారు.

## నిజంగా జనరల్ సర్జన్నే!

నేను మాత్రము, కంటి ఆపరేషను తప్ప చేతనైనంత వరకు, అన్ని ఆపరేషన్లు చేసేవాడిని. టాన్సిల్ ఆపరేషను చిన్నదైనా ఊహించని కారణంతో రోగి మరణించే అవకాశము వుంది. పెద్ద స్పెషలిస్టు దగ్గరనుండి మామూలు ప్రాక్టీషనరు వరకు ఈ కేసులో దెబ్బతినకుండా వున్నవారు లేదు. దాదాపు 25 సంవత్సరాలు నేను ఆ ఇబ్బందిని. ఎదుర్కొనలేదు. తరువాత తప్పలేదు. మత్తు ఇవ్వటానికి అప్పటికి స్పెషలిస్టులు ఎవ్వరూలేరు. డాక్టర్ల దగ్గర అనుభవం గడించిన, నాన్ మెడికల్ పీపుల్ కొందరు వుండేవారు. డాక్టర్ పర్చూరి వీరయ్య గారి దగ్గర, సీతారామయ్య అనే సీనియర్ కాంపౌండరు వుండేవాడు. అవసరమైన ప్పుడు నేను వారి అనుమతితో సీతారామయ్యతో అనస్తీసియా ఇప్పించేవాడిని. ముఖ్యంగా టోన్సిల్ కేసులలో. వేసవికాలం చాలా ఎక్కువగా వుండేది. అత్యవసర మైన కేసులు తప్ప మేజర్ ఆపరేషన్లు ఆ ఎండాకాలము చేసేవాళ్ళము కాదు.

మా ఇద్దరికీ మంచి హస్తవాసి వుందని అనుకొనేవారు. ప్రాక్టీసులో ప్రధాన మైన ఇబ్బంది రోజుకు 24 గంటలు డాక్టరు అందుబాటులో వుండటం. అందులో పల్లెటూళ్ళనుండి రావటానికి ప్రయాణ సౌకర్యాలు కూడా లేవు. అందువలన వాళ్ళు ఇంటిదగ్గర బయలుదేరి ఏదో ఒక వేళకు హాస్పిటలుకు వచ్చేవారు. ఒక్కొక్కప్పుడు ఉదయం 8.00 గం.ల నుండి మధ్యాహ్నం 3.00 గం.ల వరకూ పనిచేసి భోజనానికి వెళ్ళబోయేటప్పటికి, పేషంట్సు వచ్చేవారు. సహజంగానే అటువంటి టైములో కొంత చికాకుపడక తప్పేదికాదు. రోగుల ఇబ్బందులు గ్రహించగలిగిన నేను చేసుకొని, వారి మీద విసుగుకొనకుండా, చూచేవాడిని.

## సాంబశివపేట నుండి కొత్తపేటకు :

రెండు సంవత్సరాల తర్వాత రోగుల వసతి కొరకు మా నివాసమునకు ప్రక్కన వున్న మూడు ఇళ్ళుతీసుకొని, 60 మంది వరకు వసతి కల్పించగలిగాను. అయినా ఆ బిల్డింగు హాస్పిటల్ కొరకు కట్టించినవి కావు కనుక అన్ని వసతులు సరిగా వుండేవికావు. మిషన్ హాస్పటల్సు, జనరల్ హాస్పిటలులో వైద్యము పొందే వారికి తోడుగా వుండేవారు. బయట వుండవలసిందే. అది మనకు కుదరదు. ప్రైవేటు హాస్పిటలులో వారి వంట భోజనానికి వసతికి కూడా అనుకూలంగా వుండేటట్లు ఏర్పాటు చేయటం తప్పనిసరి. 10 సంవత్సరాల తర్వాత కొత్తపేటలో డాక్టర్ ద్వారకాబాయి భవనములోనికి హాస్పిటలు మార్చి ఎక్కువ వసతులు కల్పించగలిగాము.

## ఆనందాన్ని అందించిన ఆపరరీ ఉద్యోగాలు :

1961లో డాక్టర్ ద్వారకాబాయి హాస్పటలు కొన్నాను. 1962లో గవర్న మెంటు హాస్పిటల్లో హానరరీ వర్ణముగాను, మెడికల్ కాలేజీలో హానరరీ ప్రొఫెసరు గా చేరాను. 1974లో హానరరీ పెద్దను రద్దయ్యేవరకు ఆపదవిలోవున్నాను. పని పెరుగుతున్నప్పటికీ, ఉత్సాహంగా రెండు పనులు చేసేవాడిని.

మామూలుగా రెగ్యులర్ యూనిట్లో జరిగే పనితో సమానంగా, సర్జరీగానీ, టీచింగు గానీ చేయగలిగాము. పోస్టుగ్రాడ్యుయేట్ చదవటానికి వచ్చిన డాక్టర్లతో ఎక్కువ సన్నిహితంగా వుండి వారిని బాగా ప్రోత్సహించే వాడిని.

పరీక్షలైన రెండు నెలల్లోపునే గుంటూరులో ప్రాక్టీసు ప్రారంభిచాము. హైస్కూలు, కాలేజీ, మెడికల్ కాలేజీ చదువులకు మార్గదర్శకులెవ్వరూ లేదు. అలానే ప్రాక్టీసు పెట్టిన తర్వాత కూడా ఏ విధంగా ప్రాక్టీసు చేయాలో చెప్పే వారెవ్వరూ లేరు. మెడికల్ కాలేజీలో వైద్యాన్ని నేర్చుకొంటారు కాని, ఫీజు ఎంత తీసుకొనవలసినదీ తెలియదు. సామాజిక ఆర్థిక పరిస్థితులను దృష్టిలో వుంచు కొని వారివ్వగలిగి నంచే తీసుకొనే వాడిని.

ఎక్కువమంది వైద్యానికి వచ్చేవారు కనుక వారిచ్చేది సరిపోయేది. నేను పెద్ద డాక్టరుని కనుక ఎక్కువ ఫీజుతీసుకోవాలి అనే భావన ఎప్పుడూ రాలేదు. దానివలన కొన్ని సందర్భములలో, రోగులు చిన్న డాక్టరు అని అనుకొనేవారు.

కాలక్రమేణ సర్జరీలో ప్రాక్టీసు పెరగటం, ఆ తరువాత గుంటూరులో పది సంవత్సరాలపాటు జనరల్ హాస్పిటల్లో ఆనరరీ సద్ధమగా పని చేయటం, ఆనరర్ ప్రొఫెసరుగా విద్యార్థులకు బోధించటం జరిగింది. నాకు తృప్తి గలిగించింది ఆపది సంవత్సరాల ప్రాక్టీసు, విద్యాబోధన.

ప్రాక్టీసు పెట్టినప్పటి నుండీ ఎప్పుడూ ఒకరిద్దరు డాక్టర్లు నావద్ద పనిచేస్తూ వుండేవారు. అనుభవము వచ్చిన తర్వాత వివిధ ప్రదేశాలలో, ప్రాక్టీసు పెట్టుకొని ప్రారంభోత్సవానికి నన్ను ఆహ్వానించేవారు. గుంటూరు జిల్లాలో చాలా ఎక్కువ మంది. స్థిరపడ్డారు. ప్రకాశం, కృష్ణా జిల్లాల్లో కూడా కొంతమంది స్థిరపడ్డారు. కొత్తగూడెం, భద్రాచలం, రాజమండ్రి, నిజామాబాద్, లాంటి చోట్లకూడా చాలా మంది ప్రజా రంజకులుగా పేరుతెచ్చుకొన్నారు.

అది నేను చాలా సంతోషించే విషయం. కొంత మంది (ప్రైవేటు ప్రాక్టీమలో రాణించలేక, ప్రభుత్వోద్యోగాల్లో చేరారు. అవసరమైన చోటకు అలా వెళ్ళి వారికి శస్త్ర చికిత్సలో సాయపడేవాడిని.

**కుటుంబ నియంత్రణ :**

నేను ప్రాక్టీసు పెట్టేనాటికి బర్త్ కంట్రోలు ఆపరేషను ఎక్కువగా మగవారే చేయించుకొనేవారు. ఆపరేషనుకూడా చిన్న ఆపరేషను అయినందువలన, డాక్టర్లం కూడా అదే ఆపరేషను ప్రోత్సహించేవాళ్ళము. ఔట్ పేషంటుగా వచ్చి ఆపరేషను చేయించుకొని ఒక గంటకూడా హాస్పిటల్లో వుండేపనిలేకుండా ఇళ్ళకు వెళ్ళేవారు. ప్రసవించిన తరువాత ఆడువారు ఆపరేషను చేయించుకోవటం మొదలు పెట్టారు. మొగవారి ఆపరేషన్లు తగ్గిపోయినవి. ఇప్పటికీ ఆడవారే హెచ్చుగా ఆపరేషన్లు చేయించుకొంటున్నారు. ప్రభుత్వము వారు ఈ ఆపరేషన్లను ప్రోత్సహించాలనే ఉద్దేశ్యంతో ఆపరేషను చేసిన డాక్టరుకు, చేయించుకున్న స్త్రీలకు ఆర్థికపరమైన ప్రోత్సాహకాలను అందిస్తున్నారు. అయినా ఇప్పటికీ, ఆర్థికంగా సాంఘికంగా వెనుకబడిన వర్గాలలో ఈ ఆపరేషన్లకు తగినంత ఆదరణ రాలేదు. ప్రభుత్వం కూడా ఉదాసీనముగా వున్నట్లు కనిపిస్తున్నది.

కాన్పుల విషయానికొస్తే కాన్పు కష్టమైనప్పుడు ఫోర్సెన్స్ డెలివరీ చేయటం అవసరమౌతుంది. ఒక్కొక్కప్పుడు సిజేరియన్ ఆపరేషను కూడా అవసరమౌ తుంది. మొదట సంవత్సరములో ఫోర్సెప్స్ డెలివరీ చేశాము. రెండవ సం॥లో సిజేరియన్ ఆపరేషను చేశాము. అప్పటి నుండి ఏ సంకోచము లేకుండా, అన్ని కాన్పు కేసులను చూసేవాళ్ళము.

## తొలిమేజరు ఆపరేషను:

నా మొట్టమొదటి మేజరు ఆపరేషను (జి.జె) తక్కెళ్ళపాడు వాళ్ళకే. మా ఊర్లో చాలా కాలము జీతానికుండి, నిజామాబాద్ ఏరియాలో స్థిరపడ్డ కోటయ్య అనే వ్యక్తికి చేయటం జరిగింది. ఇది కరెంటు వసతిలేని రోజులలోనే, ఆపరేషను గం. 2.30 ని.లు పట్టింది. తర్వాత కాలంలో ఇదే ఆపరేషను గంటలోపల చేసే వాడిని. ఆరోగి సంపూర్ణ ఆరోగ్యం కలిగి చాలా సంవత్సరములు బ్రతికాడు.

గుంటూరులో 1951 వ సంవత్సరంలో నేను ప్రాక్టీసు పెట్టేనాటికి, వైద్యసేవలు ఒక మాదిరిగా వున్నాయి. ఇద్దరు ముగ్గురు సర్జనులుకూడా వుండే వారు. అట్లాగే వైద్యములో ప్రసిద్ధిచెందిన డాక్టర్లు కూడా ఐదు ఆరు మంది కూడా వుండేవారు. వీరుగాక సుమారు పదిమంది ఒక మాదిరి వైద్యులు వుండేవారు. అయితే వీరిమధ్య సఖ్యత అంతగా వుండేది. కాదు. మీటింగులు జరిగినప్పుడు, మామూలుగా మాట్లాడుకున్నా మనస్సు విప్పి మాట్లాడుకోవటం చాలా తక్కువ. జిల్లాలో, తెనాలిలో కూడా ఐదు ఆరుగురు బాగా ప్రాక్టీసువున్న సర్జన్లు వుండే వారు. వారి మధ్య సఖ్యతవుండేదికాదు. అంతేకాదు, గుంటూరులోని వారికి తెనాలిలో వున్న డాక్టర్లపై ఈర్ష్య అసూయలు వుండేవి.

## ప్రొఫెషనల్ జెలసీ తగ్గించేందుకు కృషి :

నేను ప్రాక్టీసు పెట్టిన మొదటిలోనే ఈ పరిస్థితి మార్చాలనుకున్నాను. అవసరమైనప్పుడు ఇక్కడవున్న సీనియర్ డాక్టర్లు సలహాలు కోరేవాడిని. నేను ఎవరికైనా సలహా ఇవ్వటానికి అందుబాటులో వుండేవాడిని, నేను ప్రాక్టీసు పెట్టిన తర్వాత సంవత్సరమునకు తెనాలిలో నా స్నేహితులు డాక్టరు వీరయ్య, వీరరాఘ వయ్యలు ప్రాక్టీసు ప్రారంభించారు. వారిద్దరు ఎం.బి.బి.ఎస్. డాక్టర్లు. పోస్టు గ్రాడ్యుయేషను లేదు. అయినా సరే వారితోకూడా సర్జరీ చేయించాలనే వుద్దేశ్యంతో "మీరు ఇద్దరు డాక్టర్లు వున్నారు.

కదా, సర్జరీ చేయటానికి వెనుకాడవద్దు, అవసరమైనపుడు నన్ను పిలవండి నేను వచ్చి హెల్ప్ చేస్తాను. అలానే గుంటూరులో నేను చేసే ప్రతి మేజరు సర్జరీకి మీకు కబురు చేస్తాను. ఇందులో ఎవరో ఒకరువచ్చి నాకు హెల్ప్ చేయండి. ఆప్రకారం కొన్నాళ్ళకు మీకు విశ్వాసం పెరుగుతుందని చెప్పాను. రెండు సం॥లు జరిగిన తర్వాత ప్రత్యేకంగా నా అవసరం వుంటుంది అనుకొంటే తప్ప నన్ను పిలవవద్దు. మీరే సర్జరీ చేసుకోండని చెప్పాను. అంతలో చెరుకుపల్లిలో డాక్టర్ పాపారావు ప్రాక్టీసు ప్రారంభించిన తర్వాత, తెనాలి నుండి వీరయ్యగానీ, వీర రాఘవయ్య గాని అక్కడ సహాయము చేస్తుండేవారు. ఇంకా పెద్ద కేసు అనుకొంటే నన్ను పిలిచేవారు. నేను వెళ్ళి సహాయము చేసేవాడిని.

గుంటూరు, ప్రకాశం, కృష్ణాజిల్లాలో నావద్ద పనిచేసి, ప్రాక్టీసు చేస్తున్న డాక్టర్ల దగ్గర అవసరమైనపుడు వెళ్ళి వాళ్ళ ఆపరేషన్లు చేసి వచ్చేవాడిని, అట్లా వెళ్ళిన ప్రదేశాలు, తెనాలి, చెరుకుపల్లి, రేపల్లె, చిలకలూరిపేట, పిడుగురాళ్ళ, నరసరావుపేట, బాపట్ల, చీరాల, ఒంగోలు, కృష్ణా జిల్లాలో చల్లపల్లి, విజయవాడ. ఇట్లా వెళ్ళినప్పుడు నేను డాక్టర్లకు ఆపరేషన్లు ఈవిధంగా చేయాలని, చెప్పి కొద్ది కాలంలో వారు స్వతంత్రులుగా చేయగలిగేటట్లు రీసు ఇచ్చాను. ఒక సందర్భంలో కృష్ణా జిల్లా ఘంటశాలలో గొట్టిపాటి బ్రహ్మయ్యగారికి వారింట్లో శస్త్రచికిత్స చేశాడు. ఆ తర్వాత వారు మరలా ఒకసారి గుంటూరు వచ్చి శస్త్రచికిత్స చేయించుకున్నారు. అలానే ఇంకా కొంతమందికి కూడా చేసామ, శ్రీ బ్రహ్మయ్య గారు తన "జీవనవాకా అనే జీవిత చరిత్రలో ఆ విషయం గురించి ప్రస్తావించారు. ప్రశంసించారు కూడా, నేను చేసిన ఈ చిన్న సహాయమును గుర్తించారని వారి గ్రంథంలో ప్రస్తావించుట వారి సహృదయతకు తార్కాణం. ఒకటి రెండు ఆపరేషన్లు పుస్తకాలలో వున్నట్లుగాను, మేము నేర్చుకున్నట్లుగానే కాక కొత్త పద్ధతిలో చేసేవాడిని. ఒకటి నాష్టమో, రెండవది ఫిస్టులాఇన్యానో, ఫిస్టులా ఇన్యావో(ఆసనము చేసిన తర్వాత మరలా వచ్చే అవకాశం ఎక్కువ. అందువలన ప్రక్కలూటి) ఆపరేషను ఎక్కువ మంది సర్జన్లు ఈ ఆపరేషను చేయకుండా

తప్పించుకుంటారు. రెండు మూడు కేసులయితే అంతకు ముందు పది సం॥ల కాలంలో ఏ పదిమంది దగ్గరో ఆపరేషను చేయించుకొని 'వయంకాక' నా దగ్గరకు వచ్చేవారు. అందులో ఒకాయన స్కూలు టీచరు. నా విద్యార్థికి అన్న. అటువంటి కేసులు తీసుకొనే ముందు వారికొక విషయము చెప్పేవాణ్ణి. పూర్తిగా మానేవరకు నెలకానీ, రెండు నెలలు కానీ హాస్పటల్లో వుండాలని. ఆ స్కూలు టీచరుకు అదే చెప్పి ఆపరేషను చేశాను. రెండేళ్ళ తర్వాత అతనుండే వూరిలో కొత్తగా హాస్పిటలు ప్రారంభమునకు వెళ్ళాను. అప్పుడు అతడు పసి బిడ్డను ఎత్తుకొనివచ్చి "ఈ బిడ్డ మీ పుణ్యమేనండి" అన్నాడు. అప్పటికతనికి పెళ్ళయి దాదాపు 12 సం॥లు ఆ పన్నెండేళ్ళలో ఎక్కువ కాలం ఆపరేషన్లు, మందులు డ్రెస్సింగులతోనే కాలం గడపవలసి వచ్చింది. అందువలన సంతానము లేదు. ప్రాక్టీసు పెట్టిన కొత్తల్లో గ్రామములో పెద్దలు మా దంపతులను చూడటానికి ఆ హాస్పిటలును పరిచయం చేసుకోవటానికి వచ్చేవారు. మేము ప్రాక్టీసు ప్రారంభించటానికి ముందు మా ఊరినుండే రోగులు గుంటూరులో డాక్టరుకు చూపించుకోవలసి వస్తే సరాసరి డాక్టరు దగ్గరకు రాగలిగేవారు కాదు. గ్రామంలో ఎవరినైనా పెద్దవారిని వెంటబెట్టుకొని వచ్చేవారు. ఆ పరిస్థితి నుండి. ఏ గ్రామము నుండి ఎవరైనా సరే, సరాసరి నా దగ్గరకు రాగలగాలి అన్న ధ్యేయంతో ప్రాక్టీసు మొదలుపెట్టాను. ఆ ధ్యేయాన్ని సాధించాము.

గుంటూరులో నేను ప్రాక్టీసు పెట్టిన దగ్గర నుండీ, జూనియర్ డాక్టర్లు డైరెక్టుగా ప్రాక్టీసులో నిలదొక్కుకునే వాళ్ళు. అనుభవం గడించడానికి కొన్నాళ్ళు నా దగ్గర పనిచేసేవాళ్ళు. వాళ్ళు ప్రాక్టీసు పెట్టేటప్పుడు నన్ను ప్రారంభోత్సవానికు పిలిచేవారు.

అట్లా గుంటూరు జిల్లాలోను ఇతర పట్టణాలలోను, పల్లెలలోనూ చాలా మంది స్థిరపడ్డారు. వారికవసరమైనప్పుడు నా సహాయము కోరేవారు. వారికి సహాయము చేసేవాడిని.

అటువంటి తర్ఫీదుపొంది ప్రాక్టీసు పెట్టిన డాక్టర్లు దాదాపు అందరూ ప్రాక్టీసులో విజయవంతం అయినారు. ఆ పట్టణాలలోనూ, ఊళ్ళలో కూడా ఒకరికొకరు సాయంచేసుకొంటూ వుండేవారు. ఆరకంగా డాక్టర్ల మధ్య విరోధము తగ్గి సమైక్య భావము ఏర్పడింది. ఇది నేను సాధించిన విజయంగా భావిస్తాను. అలానే బయట ఆపరేషన్లుచేసి ఆ కేసుకేదైనా అనుకోని కాంప్లికేషను వస్తే నా దగ్గరకు తీసుకొచ్చేవారు. వారికి అవసరమైన చికిత్స చేసి నివారణచేసే వాడివి. ఇప్పుడు అన్ని పట్టణాలలో పెద్ద సంఖ్యలో డాక్టర్లు ప్రాక్టీసు చేస్తున్నారు. అన్ని విభాగాలలో ప్రత్యేక శిక్షణ పొంది ప్రత్యేక నిపుణులుగా ప్రాక్టీసు కొనసాగిస్తు న్నారు. పూర్వపు విరోధభావము కన్పించటం లేదు.

**వైద్యునిపై నమ్మకం వమ్ముకారాదు :**

మొదట ప్రాక్టీసు పెట్టేనాటికి సామాన్య జనానికి వైద్య చికిత్స అందు బాటులో వుండేదికాదు, పల్లెటూళ్ళలో మామూలుగా నాటు డాక్టర్లతో చికిత్స చేయించుకొంటూ, జబ్బు ప్రమాద స్థితికి చేరినప్పుడు మాత్రమే గుంటూరునకు తీసుకరావటం, ఆ స్థితిలో డాక్టరు ఏమి చేయలేకపోవటం జరుగుతుండేది. అప్పట్లో మామూలుగా వినబడేమాట "ఫలానా ఆయనను గుంటూరుకు తీసుకొని వెళ్ళారు. తర్వాత జరిగేది గుంటూరు నుండి మోసుకొని వెళ్ళడం." అందువలన ఏమయిందంటే ప్రతి చిన్న జబ్బుకు వైద్యము చేయవలెనని నిశ్చయించుకొని, వైద్యము చేసేవాడిని. చిన్న వాళ్ళకు కూడా అందుబాటులో వున్నానని తెలిసిన తర్వాత ఎక్కువమంది రావటం జరిగేది. నేను ప్రాక్టీసు పెట్టిన కొద్ది సంవత్సరాలకే గుంటూరు డిస్ట్రిక్ట్ హెడ్ క్వార్టర్సు హాస్పటల్ జనరల్ హాస్పటల్ అయ్యింది. అంతే మెడికల్ కాలేజీకి అనుబంధ హాస్పటల్ అయి వైద్యంలో అన్ని బ్రాంచిలలోనూ స్పెషలిస్టులు వచ్చారు. అప్పటికే అలవాటుపడ్డవారు నేను ఆ స్పెషలిస్టుల దగ్గరకు వెళ్ళమని సలహాచెప్పినా వెళ్ళేవారుకారు.

ఒక చిన్న ఉదాహరణ చెప్తాను ఒక ఇంటర్మీడియేట్ విద్యార్థి రొప్పుతూ రోజుతూ వచ్చి తనకు అనేమియా (రక్తహీనత) వున్నదని దాని కొరకు సంప్రదించిన డాక్టర్ల లిస్టు ఇచ్చాడు. అయితే అతన్ని చూస్తే అనేమియాకు వేరే కారణం వుంటుందని, అది పొట్టలో ఆసిడ్ తక్కువైనందువలన వచ్చిందని ఒక అవగాహనకు వచ్చాను. దాన్ని నిర్ధారణ చేయటానికి అవసరమైన టెస్టులు ఇక్కడ లేవు మెడికల్ కాలేజీలో బయో కెమిస్ట్రీలో పనిచేసే ఒక మిత్రుడు ఆ టెస్టు చేయటానికి అవసరమైన ద్రావకాలను తెప్పించి. పరీక్షచేయగా, పొట్టలో ఆసిడ్స్ అసలు లేనేలేవు. దానికి ట్రీట్మెంట్ చాలా తేలిక. హైడ్రోక్లోరిక్ ఆసిడ్ భోజనం చేసేటప్పుడు మంచినీళ్ళలో 10-15 బొట్లు వేసుకొని తాగడం టాబ్లెట్స్ రోజుకు ఒకటి వేసుకొనటం, టాబ్లెట్లు నా దగ్గర వుండేవి. 50-100 ఇస్తుండేవాడిని, హైడ్రోక్లోరిక్ ఆసిడ్ 500 మి.గ్రా. సీసా 5 లేక 10 రూ.లు వుండేది. ఆ వైద్యం అతనికి సంపూర్ణ ఆరోగ్యం చేకూరుతుంది. సంవత్సరం చివర్లో వారింటికి మా ఇద్దరిని భోజనానికి పిలిచి రూ. 116/- ఇచ్చాడు. ఏమిటి ఇంత డబ్బా? అని నేను ఆశ్చర్యపోయాను. సహజంగా ఆ కుటుంబంలోనివారేకాక, తెలిసినవారు కూడా పెద్ద డాక్టరుగా లెక్కవేస్తారు. కదా! ఆ కుటుంబాలవారంతా అన్ని చిన్న పిల్లల జబ్బులకు నాదగ్గరకు వచ్చేవారు. తర్వాత కొన్ని సంవత్సరాలకు వారి బంధువులకు పెద్ద ఆమెకు గుండెజబ్బు. రక్తస్రావం జరుగుతూవుంటే గుంటూరు జనరల్ హాస్పిటల్లో చూపించటానికి తీసుకొనివచ్చారు. ఇక్కడకు వచ్చిన తర్వాత వారి బంధువులు ఎక్కడకూ అవసరం లేదు. ఫలానా డాక్టరు దగ్గరకు తీసుకొని వెళ్ళమన్నారు. నేను గుండె స్పెషలిస్టును కాను, స్త్రీల వ్యాధులకు సంబంధంచిన వాడిని కూడా కాదు. హాస్పటల్కు తీసుకొని వెళ్ళమని చెప్పాను. కానీ వారు వినలేదు అప్పుడు నాకు తోచిన వైద్యసేవ చేసాను, రక్తస్రావం ఆగిపోయింది. గుండె జబ్బుకూడా నిదానించింది. ఆమె భర్త రిటైర్డు టీచరు. రేపల్లె వెళ్ళటం ఎందుకులే అని ఇక్కడే వున్నాడు. ఆ సమయంలోనే, వారికున్న ఒక అబ్బాయికి అమ్మాయికి పెళ్ళిళ్లు చేసాడు. ఆమె భర్తపేరు బోడేపూడి వెంకట్రావుగారు.

తెలుగు పండితులు. గొప్ప కవి కూడా. వారి అమ్మాయి పెళ్ళిచేసిన తర్వాత కూతురును అత్తవారింటికి పంపిస్తూ అందరికీ ఉదయం టిఫిన్ పెట్టివారు బయలుదేరే సమయానికి హఠాత్తుగా మరణించింది. అప్పుడు ఏర్పడిన పరిచయం వల్ల బోడేపూడివారు తాను వ్రాసిన తృష్ణావర్తం" అనే చిన్న గ్రంథము నాకు అంకితం ఇచ్చారు. తరువాత వారికి జబ్బు చేసినప్పుడు కూడా నేను వైద్యం చేసేవాణ్ణి. తాను సహజ మరణం పొందాడు. ఇది తెలియనివారికి ఎక్కడ మొదలు పెట్టి ఎక్కడకు వచ్చాను అని ఆశ్చర్యం వేయవచ్చు.

నా ఉద్దేశ్యం, రోగులకు ఒకసారి నమ్మకమేర్పడిన తర్వాత ఆ డాక్టరు పట్ల విపరీతమైన అభిమానం పెరుగుతుంది. ఆరకంగా నాదగ్గరవైద్యం చేసుకొనే వారుకూడా పెరిగారు. కొన్ని సందర్భాల్లో స్పెషలిస్టులవద్ద నివారణలేని జబ్బులకు నా వద్ద నివారణ జరిగింది. ప్రజానీకానికి నామీద ఎంత నమ్మకం ఏర్పడిందంటే, డాక్టరు కోదండరామయ్య దగ్గర సంప్రదించి, వారిచ్చిన మందులచీటీ తీసుకొని వచ్చి ఈ మందులు కరెక్టేనా అవి నా అభిప్రాయం అడిగేవారు. ఈ విధంగా ప్రాక్టీసు చేసినందువలన అచ్చంగా ఆపరేషన్లు చేసే డాక్టర్ల కన్నా నేను తక్కువే సంపాదించాను.

## వైద్యం వ్యాపారం కారాదు :

ఎక్కువ కాలం ప్రాక్టీసు చేసిన ఏడాక్టరైనా సరే, తన వైద్యంలో పొరపాటేమీ చేయలేదని, చెప్పలేడు. కొన్ని సందర్భములలో జరిగిన పొరపాట్లను గ్రహించి సరిదిద్దుకోవటం జరుగుతుంది. కొన్నిటిలో అవకాశము చేయిదాటిపోతుంది. అటువంటి సందర్భములో రోగికి సంబంధించినవారు, బాధపడటం, డాక్టరును నిందించటం కూడా జరుగుతుంది. డాక్టరువలన నీ తప్పులేకున్నా కూడా అనూహ్యంగా రోగి మరణించినప్పుడు కూడా డాక్టరునే నిందించటం జరుగు తుంది.

కొన్ని కేసులలో డాక్టరు చేసిన స్వల్ప వైద్యానికే రోగి బాగుపడి, డాక్టరును గురించి గొప్పగా చెప్పుకోవటం జరుగుతున్నది. పై రెండు పరిస్థితులలోనూ డాక్టరు క్రుంగిపోకుండానూ, పొంగిపోకుండాను వుండటం అవసరం.

ఇటీవల కాలంలో రోగి ఏ కారణంతో మరణించినా, జబ్బు నయం కాక పోయినా డాక్టరుపై దాడిచేసి లక్షలలో డబ్బులు గుంజటం జరుగుతున్నది. కోర్టులకు కూడా వెళ్ళటం జరుగుతుంది. మా తరం వారికి ఈ పరిస్థితి అనూహ్యం. దీనికి బహుశా ఒక కారణము డాక్టర్లు కూడా బీద సాదలని చూడ కుండా ఫీజు వసూలు చేయటం కావచ్చు. "మెడికల్ ప్రాక్టీసు ఈజ్ నాట్ ఏ ట్రేడ్ ఇట్ ఈస్ట్ కాలింగ్" అన్నది మాకు తెల్పిన సూత్రము. ఆ సూత్రాన్ని పాటించ గలిగితే ఇటువంటి అనారోగ్యకరమైన ధోరణులను అరికట్టవచ్చును.

## ఆరోగ్యలేమి నన్నూ బాధించింది

### ఉబ్బసము :

చూచిన వారు ఎవరైనా నన్ను ఆరోగ్యవంతుడనుకొంటారు. సంపూర్ణ ఆరోగ్యంతో వుండే అదృష్టము, ఏకొద్దిమందికో వుంటుంది. చిన్నప్పుడు చెప్పుకో దగ్గ అనారోగ్యము ఏమీ లేదు. ఇంటివద్ద, ఆముదపు పిండి ఎరువుగా వాడేవారు. ఒకసారి దాన్ని నలుగగొట్టేటప్పుడు ఆ గాలికి ఊపిరి ఆడనట్లు అనిపించింది. మా తండ్రి, అంతకు ముందు ఉబ్బసముతో బాధపడేటప్పుడు, చూసేవాణ్ణి కనుక, ఇది గూడా అటువంటి బబ్బే అని అనుమానించాను. ఆ తర్వాత కాలంలో ముఖ్యంగా చలికాలంలో, విపరీతంగా తుమ్ములు వచ్చేవి. కొంతసేపటికి, ముక్కుల వెంబడి నీరుకారి ఉపశమనం కలిగేది. అప్పుడు నేను వైద్య విద్యార్థిగా వున్నాను కనుక ఆ జబ్బుకూడా ఉబ్బసంలో గానీ అలెర్జీవల్లగానీ వస్తుందని అర్థం చేసుకొని, ఆ దశలోనే వైద్యం చేయించుకొంటే ఉబ్బసము రాకుండా వుంటుందనే భ్రమతో

ఇ.ఎన్.టి. సర్జన్ దగ్గరకు వెళ్ళి, దానికి ఎన్ని రకాలున్నవో అన్నీ చేయించు కొన్నాను. కానీ తగ్గలేదు.

కొన్ని సంవత్సరాల తర్వాత, ఉబ్బసము రానే వచ్చింది. ఎం.బి.బి.ఎస్. ఫైనలియర్లో ఇంటి వద్దనున్న ఒకరోజు తెల్లవారు జామున ఒక గంట, అరగంట శ్వాస బిగపట్టడము జరిగింది. అప్పుడు మా అమ్మను అడిగాను నాన్నకు ఉబ్బసం ఏవయస్సులో వచ్చిందని. పెండ్లి అయిన కొన్ని సంవత్సరాలకు వచ్చిందని చెప్పింది. (20-25). ఆ మరుసటి సంవత్సరంలో హౌస్ సర్జనుగా వున్నప్పుడు ఒకరోజు రాత్రిపూట భోజనంచేసి మిత్రులతో మాట్లాడుతున్నాను. అప్పుడు మరలా ఊపిరి ఆడకపోవటం జరిగింది. మరునాడు ఉదయం హాస్పటులకువెళ్ళి, మెడికల్ అసిస్టెంటు పిజిషియన్ గా వున్న డాక్టర్ కోదండరామయ్యగారిని కలసి ఇప్పుడు నాకు 'ఆస్తమా' వచ్చిందని చెప్పాను. ఆయన మీకు ఆస్మా ఏమిటండీ. ఇసనోఫిలియా అయి వుంటుందిలే అని దానికి కొన్ని ఇంజెక్షన్ల చేశాడు.

**ఉబ్బసమునకు ముద్దుపేరే ఇస్నోఫీలియా :**

ఇక్కడ ఇసనోఫిలియా వ్యాధిని గురించి కొంత వివరణ ఇవ్వాలి. 1935 ప్రాంతంలో విశాఖపట్నంలో కె.జి.హెచ్.లో పని చేసే డాక్టర్ విశ్వనాథం ట్యుబర్క్యులోసిస్ స్పెషలిస్టు ఈ వ్యాధిని కనుక్కొన్నాడు. అదే సమయంలో మదనపల్లి శానిటోరియంలో పనిచేసే ఒక మిషనరీ డాక్టరుకూడా కనుక్కొన్నాడు. అంతవరకు ఈ వ్యాధి క్షయవ్యాధిగాను, ఉబ్బసంగాను భావించి వైద్యము చేసే వారు. ఈ వ్యాధి నిర్ణయం, మామూలు రక్త పరీక్షలన నిర్ణయించేవారు. వ్యాధికి పేరు ట్రాపికల్ ఇసనోఫిలియా అని నామకరణం చేశారు. శరీరంలోని తెల్లకణములలో అయిదు రకాలు వుంటాయి. న్యూట్రోఫిల్లు, ఈసినోఫిల్స్, బేసోఫిల్సు, లింపోసైట్సు, మోనోసైట్లు, చీము పట్టే జబ్బులలో, నూట్రోఫిల్స్ ఎక్కువ. దీర్ఘ వ్యాధులలో లింఫోసైట్లు ఎక్కువగా పెరుగుతాయి. అలెర్జీకండీషన్లో ఈసినోఫిల్స్, కొలదిగా పెరుగుతవి.

ఈ ట్రాఫికల్ ఈసినుఫిలియాలో ఇసినోఫిల్స్ చాలా ఎక్కువగా పెరుగు తుంది. 90–95% వరకూ పెరిగి శ్వాసకు ఇబ్బంది కలిగిస్తుంది... అందువలన ఈ తెల్లకణాల సంఖ్యను నిర్ణయించి అందులో ఇసినోఫిల్స్ ఎన్ని వున్నదీ.

తెలుసుకొంటే వ్యాధి నిర్ణయించవచ్చు. మొత్తం కౌంట్ మామూలుగా వుండి ఇదివోఫిల్స్ వుండవలసిన 4–8% కన్నా ఎక్కువగా వ10% నుండి 20% వుంటే ఇది ట్రాపికల్ ఎసినోఫిలియా కాదు. చాలా కారణాలవలన ఈ మాత్రం పెరగవచ్చు.

ఈ వ్యాధి గుర్తింపు వచ్చిం తర్వాత, డాక్టర్లు ప్రతి ఉబ్బసం కేసును ఇసినోఫిల్స్ గా భావించి, వైద్యము చేయటం జరిగింది. వ్యాధికి మొదట్లో ఆర్సినికల్ ఇంజక్షన్ చేశేవారు. కాలక్రమేణా హెట్రజాన్ టాబ్లెట్సుతో ఈ జబ్బును పూర్తి నివారణ ఇవ్వగలిగాము. ఒకసారి వైద్యము చేసిన తరువాత జబ్బు పూర్తిగా తగ్గినట్టే. చాలా మంది ప్రజలు నాకు ఇసినోఫిలియా వుందని చెప్పుకొంటారు. ఎంతవుందని అడిగితే 10 లేక 20%గా చెప్తారు. ఏ జబ్బు పర్సంటేజ్లలో రాదు. వీరు ఉబ్బసానికి పెట్టుకొన్న ముద్దు పేరే ఈ ఇసినోఫిలియా, ఉబ్బసం అంటే ఏదో తప్పని, వంశపారంపర్యంగా వచ్చే జబ్బుకనుక, ఆ పేరు చెప్పుకోవటానికి ఇష్టపడరు.

నాకు వారిచ్చిన మందులతో నివారణ కాకపోగా తర్వాత కాలంలో, చాలా హెచ్చుగా వచ్చేది. ఎంతగానంటే రాత్రి పందుకొనబోయేటప్పుడు దానికి సంబంధించిన మందు" ఎఫిడ్రిన్ ట్యాబ్లెట్ వేసుకొనేవాడిని దానివలన ఆ రాత్రి ఇబ్బంది పెట్టకపోయినా మరునాడు పగలంతా కాళ్ళు తీసుకొని పోయేవి. మొత్తం మీద శీతాకాలము తర్వాత అంతగా బాధించేది కాదు. ప్రాక్టీసు పెట్టిన తరువాతకూడా కొన్నాళ్ళు అలానే గడిచింది. రాత్రిపూట ఏదయినా అర్జెంటు కేసు వచ్చి చూడటానికి బయటకు వెళ్తే ఆయాసం వచ్చేది.

అప్పటికప్పుడు ఆపరేషను చేయవలసినా, చేయక తప్పేదికాదు. కొన్నేళ్ళు గడచిన తరువాత పగలు రాత్రి తేడాలేకుండా ఈ వ్యాధితో బాధపడ్తూ. హాస్పిటల్కు కూడా వెళ్ళలేకపోయేవాడిని.

వైద్య పరంగా పూర్ణ పురుషుణ్ణి జయప్రదకు పని భారం ఎక్కువయ్యింది. రాత్రిపూట మళ్ళీ నన్ను కనిపెట్టుకొని ఉండవలసి వచ్చేది. అట్లా ఒక 10 లేక 15 రోజులు గడచిన తర్వాత స్థలం మార్పిడిచేస్తే. ఎట్లా వుంటుందో అని బాపట్ల డాక్టర్ యార్లగడ్డ కృష్ణమూర్తిగారి ఇంటి వద్ద కొన్నాళ్ళు వున్నాము. ఆ కాలంలో ఇల్యుస్ట్రేటెడ్ వీక్లీ పేపరులో సీరియల్గా "ఆఖరి రోజులలో నెపోలియన్" అనే శీర్షికతో 5 లేక 6 వారాలు ఆర్టికల్సు వచ్చినవి. అది పూర్తిగా చదివినప్పుడు నెపోలియన్ ఎంత అనారోగ్యంతో బాధపడేవాడు, అయినా యూరప్ ఖండం అంతా ఎంత అలజడి సృష్టించాడు. చివరి రోజులలో సెంట్ హెలీనా అనే దీనిలో ఎంత బాధపడ్డాడో చదివి-కేవలం ఉబ్బసం వ్యాధివలన, ఇంట్లో చేసుకొనే పనికూడా, చేసుకోలేకపోవటం సరిగాదు, ఏమందు వేసుకొని అయినా, పని చేయవలసిందే అని నిర్ణయించుకొని బాపట్ల నుండి తిరిగి వచ్చాను.

అట్లానే రోజుకు రెండు మూడుసార్లు టాబ్లెట్లు సీసామందు వాడుతూ ప్రాక్టీసు చేసాను. అయితే 1967లో అక్టోబరులో చాలా తీవ్రమైన అటాక్ వచ్చింది. దాన్ని స్టేటస్ ఆస్థమాటికన్ అంటారు. అంటే కొన్ని గంటలపాటు, శ్వాస బిగపట్టి ఆక్సిజన్ సాయంతోనే శ్వాసపీల్చుకోవలసి వచ్చేది. అప్పుడు డాక్టర్ సి. సాంబశివరావు వైద్యము చేశారు. తెల్లవారే సరికి మామూలుగా శ్వాస పీల్చుకోగలిగాను. అయినా సరే ప్రక్కనవున్న బాత్ రూములోకి వెళ్ళాలంటే భయం వేసేది. అప్పుడు కార్టిసోన్ మందువాడి ఆ తర్వాత ఏ.సి.టి. హెచ్. అనే ఇంజక్షను వాడిన తర్వాత నాలుగు రోజులకు మరలా హాస్పిటలుకు వెళ్ళ గలిగాను.

**ఫెన్సిల్ అలవాటయ్యింది :**

అప్పటినుండీ ఏమందులు వాడితే ఆయాసం రాకుండా వుంటుందో అని చాలా రకాలైన బిళ్ళలు సీసామందులు వాడి చివరకు ఫెనిసిడిల్ సీసామందు వుపయోగపడిందని నిర్ణయించుకొని అప్పటి నుండి ఇప్పటి వరకూ అదే వాడుతున్నాను. ఇది హేబిట్ ఫార్మింగ్ అని తెలుసు. దీని వలన కాన్స్టిపేషన్ వస్తుందని తెలుసు. అయినప్పటికీ పనిచేయటం ప్రధానం కనుక ఆ మందు ఇప్పటికీ అలానే వాడుతున్నాను. మొదట్లో సీసా ఒక వారం వచ్చేది. ఇప్పుడు రోజుకు ఒకసీసాపడుతుంది. ఈ మందును మద్యం ప్రియులు, మద్యానికి బదులుగా వాడుతున్నారని ఆ మధ్య వార్తలలో వచ్చింది. అది ఎంత వరకు నిజమోనాకు తెలియదు. ఇందులో నిద్రవచ్చే, మందువున్నదని తెలుసు. నిద్రపట్టటం వరకు నాకు ఉపయోగంగానే వుంది.

**రీనల్ కోలిక్** : కిడ్నీకి సంబంధించిన నొప్పి, మూత్ర పిండంలో (కిడ్నీలలో రాళ్ళు ఏర్పడినప్పుడు, రాళ్ళులేకుండా మూత్రం ఎక్కువ చిక్కగా వున్నప్పుడు ఈ నొప్పి రావచ్చు. 1946లో వైద్య విద్యార్థిగా వున్నప్పుడే మొదటిసారి రైలు ప్రయాణంలో ఈ నొప్పి చాలా తీవ్రంగా వచ్చింది. అప్పటికున్న పరిజ్ఞానంతో, ఇది కిడ్నీకి సంబంధించిన నొప్పి అని తెలుసుకొన్నందువలన భయం వేయలేదుగానీ, బాధ భరించటం మాత్రం కష్టమైంది, తరువాత రెండు రోజులకు, విశాఖ పట్నంలో ఈ నొప్పి మరలా వచ్చింది.

అప్పుడు హాస్పేటలుకు వెళ్ళి చూపిస్తే డాక్టర్ పిన్నమనేని వెంకటేశ్వర రావుగారు మార్ఫియా ఇంజక్షన్ ఇచ్చి హాస్పిటలులోజేర్చారు. నొప్పి వెంటనే తగ్గటమేగాక, ఎంతో సుఖంగా నిద్రపట్టింది. ఆ తరువాత, దానికి సంబంధించిన ఎక్స్ రేలు పరీక్షలు అన్ని చేసి, మూత్ర పిండాలలో రాయిలేదు అని నిర్ణయించారు. అయినా తరువాత చాలాసార్లు నొప్పి రావటం ఆ ఇంజెక్షనుతో తగ్గటం, తరువాత

రెండు లేక మూడుసార్లు ఎక్స్ రే తీయటం జరిగింది. అలా 1968 వరకూ ఆ నొప్పి వస్తూండేది. ఆ తరువాత రాలేదు.

**డయాబిటీస్ :** ఈ రోజులలో సుమారు 55 సం॥ల వయస్సువారు నీడ పట్టున కూర్చొని పనిచేసేవారు. తృప్తిగా భోజనంచేసేవారు, వీరికి సుగరువ్యాధి (మధుమేహం డయాబిటీస్) వస్తుంది. ఇది ప్రపంచంలో అన్ని దేశాలలోవున్నా మన దేశంలో ఎక్కువగా వస్తుందని, దీనికి సంబంధించిన డాక్టర్లు అభిప్రాయ పడ్తున్నారు. ఈ పై కోవకు చెందిన వాడిని కనుక నాకు ఈ వ్యాధి గత 20 సంవత్సరాల నుండి వున్నది. చాలా కాలంపాటు బిళ్ళలు మింగటంతో సరిపెట్టాను. గత పది పన్నెండు సంవత్సరాలనుండి రెండు పూటల "ఇన్సులిన్ ఇంజెక్షను" తో జబ్బును అదుపులో వుంచగులుగుతున్నాను.

**కొలెస్ట్రాల్:** నేను లావుగా వున్నా రక్తములో కొలిస్టెరాల్ నార్మల్ కన్నా తక్కువగా.. వుండేది. 1994లో గాల్డరు ఇన్ఫెక్షను వచ్చి ఆపరేషను చేయవలసి వచ్చింది. లోపల రాళ్ళు ఏమీ లేకపోయినా 'నలుసు' లాంటి రాయి వుండటం వలన ఈ జబ్బు వచ్చిందని తేల్చి గాల్గడరు తీసివేశారు.

1995లో మెడనుండి చేతులలోనికి విపరీతమైన నొప్పి వచ్చింది. దీన్ని మామూలుగా న్యూరాల్జియాగా భావించాను. వైరస్ వ్యాధివలన వస్తుంది. ఎం.ఆర్.ఐ. పరీక్షలో వెన్నుపూసలో ఒక భాగంలో కేరిస్ స్పెయిన్ వల్ల వచ్చిందని తేలింది. ఇది ఎన్నడూ ఊహించంది. దాదాపు సంవత్సరంపాటు బెడ్మీదే వుండి వైద్యం చేయించుకోవలసి వచ్చింది. అప్పటినుండి ఏ పనిలేకుండా ఆరోగ్యాన్ని కాపాడుకొంటూ ఇంట్లోనే వుంటున్నాను. ఒక సంవత్సరము క్రిందట రొటీన్ ఎగ్జామినేషన్లో బి.పి. కూడా వున్నదని తెల్చుకొన్నాను. అప్పటి నుండీ మందులు వాడుతూ కంట్రోలులోనే వుంది.

మొత్తం మీద వైద్యపరంగా పూర్ణ పురుషుడవయ్యాను!

# సాహితీ సదస్సు

**తింటే గారెలు తినాలి, వింటే భారతం వినాలి:**

హైస్కూలులో చదివేటప్పుడు హైస్కూలులో మిన్నెకంటి గురునాథ శర్మగారు శిష్ ట్లా హనుమచ్ఛాస్త్రిగారు, కాలేజీలో శ్రీ పళ్ళె పూర్ణప్రజ్ఞాచార్యులు, తెలుగు చాలా గొప్పగా చెప్పేవారు. చక్కగా బోధించటమేగాక, సాహిత్యంపట్ల అభిమానం పెంచేవారు. అయితే మెడికల్ కాలేజీకి వెళ్ళిన తర్వాత, కుతూహలం ఉండి తెలుగు పుస్తకాలు చదవటం తప్ప, చదువులో భాగంగా కాదు. మా మామ గారు సి. లక్ష్మీనారాయణ వర్మగారు, బాగా చదువుకొన్నవారు. గురువు వద్ద శుశ్రూష చేసి కవిత్వము కూడా నేర్చుకొన్నారు. చాలా పుస్తకాలు వ్రాశారు. వారిని కలుసుకోవటానికి సాహితీ మిత్రులు వచ్చేవారు. ఆ రకంగా అప్పటి వరకూ నాలో నిద్రాణంగా వున్న సాహిత్యాభిలాష పెరిగింది.

తెలుగులో ఒక సామెత వుంది. "తింటే గారెలు తినాలి, వింటే భారతము వినాలి" అని. తెలుగు వాళ్ళందరికీ గారెలు తింటముబాగా తెలుసు. నాకు కూడా అంతే, అందువలన భారతము చదవాలని ఆసక్తి గలిగింది. భారతము కొనితెచ్చి. చదవటానికి మొదలుపెట్టాను. కవిత్రయము వారి భారతము కొనితెచ్చాను. అంతా అర్థంగాకపోయినా, అక్కడక్కడ మొత్తం మీద చాలా వరకూ అర్థం చేసుకొంటూ కవిత్వములో వున్న స్వారస్యము పండితులు వచ్చినపుడు తెలుసుకోగలిగాను, తరువాత అట్లానే చాలా సారస్వత కావ్యాలు, ముఖ్యంగా "మనుచరిత్ర".

వర్తమాన కవులలో, తుమ్మల సీతారామమూర్తిగారు, గుఱ్ఱం జాషువా గారు, దువ్వూరి రామిరెడ్డిగారు, కొండవీటి వెంకటకవి మొదలైన వారి కవిత్వము చదివాను. కొంతమంది కవులు, వైద్య పరంగా పరిచయమై, వారి అభిమానాన్ని చాటుకునే దానికి వారి పుస్తకాలు నాకు అంకితమిచ్చారు.

వీరిలో కొల్లా శ్రీకృష్ణారావు మొదటివారు. తరువాత వారిలో ప్రముఖులు బోడేపూడి వెంకటరావుగారు, బొద్దులూరి నారాయణరావుగారు మరికొంత మంది కూడా ఇచ్చారు.

మామూలు సంభాషణల్లో చాలా మందికి, సాహిత్య అభిలాష వుండి, వృత్తిలో, వ్యాపారంలో, నిమగ్నం అయివుండుటంవలన, సాహిత్య పఠనానికి సమయం దొరకేదికాదు. ఒక రోజు నేను, మా శ్రీమతి జయప్రద, ఎలవర్తి రోశయ్యగారు, పెద్ది సత్యనారాయణగారు నా కారులో ప్రయాణము చేస్తూ వున్నాము. అంతకు ముందు తుమ్మల సీతారామూర్తి గారు రచించిన కొన్ని కావ్యాలు కారులోవున్నవి. అవి చదువుకొంటూ ఆనందించుతూవున్నాము. అప్పుడు నేను "జాషువాగారి కవిత్వంకూడా బాగా వుంటుందికదా" అని అన్నాను. సాహిత్యాభిమానులు మామూలుగా ఒక కవిగారి . కావ్యాన్ని మెచ్చుకొనేవారు, మరి ఒకరి కవిత్వాన్ని మెచ్చుకోలేరు.

**దసరా సరదా :**

సాహిత్యాభిమానులందరినీ ఒకచోట జేర్చి అందరి కవులు కవిత్వాన్ని వినే అవకాశం, చర్చించే అవకాశము, వుంటే బాగుంటుంది అవినేనన్నాను. నిజమే బాగా వుంటుంది అని వారందరూ అన్నారు. తర్వాత ఒక దసరా పండుగనాడు తెలిసిన కవులకు, పండితులకు ఉత్తరాలు వ్రాసి మా ఇంట్లో సమావేశము ఏర్పరిచాను. ఈ సమావేశమునకు వచ్చిన వారందరూ "మీ అభిప్రాయము బాగానేవుంది అన్నారు." సాహితీ సదస్సు" అనే పేరుతో ఒక సంస్థను నెల కొల్పాలని నిర్ణయించటం జరిగింది. దానికి అధ్యక్షులుగా నేను, సెక్రటరీగా కొల్లా శ్రీకృష్ణారావు వుండి, నెలకొక సమావేశము చొప్పున జరిగే ఏర్పాటు చేసాము.

## జొషువాగారి నామకరణం:

సాధారణంగా ఎప్పుడైనా ఇద్దరు ముగ్గురు కవులను ఒక వేదికపైకి తీసుకొని వస్తే... రసాభాసగా మారుతుందని నానుడి. సాహిత్య సదస్సు యొక్క ప్రధాన వుద్దేశ్యము అన్ని రకాల అనగా సాంప్రదాయక కవిత్వంతోపాటు, ఆధునిక కవిత్వంలో వచ్చిన వివిధ శాఖలను కూడా అవగాహన చేసుకొనే ప్రయత్నము. మొదటి సమావేశము మా ఇంట్లోనే జరిగింది. దానికి పట్టణంలో వారిని పరిసర ప్రాంతములవారిని ఆహ్వానించడం జరిగింది. ఆ సమావేశమునకు ముఖ్యులు శ్రీ జాషువాగారు. శ్రీ సంజీర్దేవ్ గారు, శ్రీ కొండవీటి వెంకటకవిగారు, శ్రీ అమరేంద్రగారు మొదలైనవారు వచ్చారు. ఆశయం మంచిదేనని అన్నారు. నూతన సంస్థకు "సాహితీ సదస్సు" అని జాషువాగారు నామకరణం చేశారు.

## సాహితీ సదస్సుకు సభ్యత్వ రుసుం లేదు :

ఆ తరువాత ప్రతినెలా సమావేశము జరిగేది. ప్రతి సభలోనూ ప్రధానవక్త కవిత్వముగానీ, వ్యాసంగానీ, వినిపించేవారు. దాని తరువాత ఔత్సాహికులు అవసరమైన వివరణ అడిగేవారు, యువకులను ఉత్సాహపరిచేందుకు వారికి కూడా కవితలు వ్యాసాలు వ్రాయటానికి అవకాశాలు వుండేవి. ప్రతినెలా, మీరు మీ సాహితీమిత్రులు, అందరూ రావలసిందని, వ్రాశేవారము. అందువలన, కాలం గడిచినకొద్దీ ఎక్కువ సంఖ్యలో హాజరు అయ్యేవారు. చాలా దూరం మండి అనగా పశ్చిమ గోదావరి, కృష్ణా నుండి కూడా వచ్చేవారు. మెంబరుషిప్పు ఫీజు లేదు. చాలా పట్టణాలల్లో సాహిత్య సంఘాలు రిజిష్టరు చేయించి సాహిత్య అకాడమీ (హైదరాబాదులో) మెంబర్లు అయ్యేవారు. ఆ దృక్పథంతో, సాహితీ సదస్సు నడిపితే, మెంబరుషిప్పు కావాలి. ఎల్లప్పుడు జరగాలి, అసలు ఆశయం మరిచేవారలు, ఆ రాజకీయాలలో పడిపోవాల్సి వస్తుందన్న భావంతో, "సాహిత్య అకాడమీవారు స్వయంగా మీ సంస్థనుండి ఒకరిని సభ్యులుగా పంపమని" కోరుతూ దరఖాస్తు పంపినా మేము ఆ మెంబరుషిప్పు తీసుకొనలేదు.

ఫిబ్రవరి నెలలో మాత్రము 17వ తేదీన (మా మేనకోడలు ఆశ, పుట్టినరోజున) కార్యక్రమము ఏర్పాటుచేసి, వీలయినంతవరకు, స్త్రీ రచయితల ఉపన్యాసములు ఏర్పాటు చేసేవారము. మిగతా నెలలో ఎక్కువగా మూడవ ఆదివారము ఈ సమావేశములు జరిగేవి. ప్రత్యేకంగా ఒకేచోట జరగవలెనని లేదు. సభ్యులు ఎవరి ఇళ్ళలో ఏర్పాటుచేసిన అక్కడే జరిపించేవారము. సర్వశ్రీ డాక్టరు శోభనాద్రి, డాక్టర్ ఎతిరాజులు, డాక్టర్ వై.వి. సుబ్బారావు, విజయా అండ్కో హనుమంతరావు, పడాల కోటయ్య నాయుడు, నన్నపనేని వీరయ్య చౌదరి, త్రిపురనేని శివరామ కృష్ణయ్య, గొరిజవోలు వెంకటరామయ్య, బాచిన సుబ్బారావు, మొదలైనవారి ఇళ్ళలో జరిగినవి. కాల క్రమేణా సభ్యుల సంఖ్య పెరిగిన తరువాత, పూర్ణ ట్యుటోరియల్ కాలేజీ, పాటిబండ్ల సీతారామయ్య హైస్కూలులో జరుగుతుండేవి. ప్రతి సమావేశములో ఏదో కొత్తదనం కనిపించేది. ఉదాహరణకు ఒక సమావేశములో అమరేంద్రగారు "కీట్సు" మహాకవిని గుర్చి ప్రసంగించారు. ఆ ప్రసంగమయిన తరువాత, గొరిజవోలు వెంకట్రామయ్య గారు ఆనందము పట్టలేక "ఇటువంటి కుమారుడు ఒకరుంటే జన్మ ధన్యమౌతుంది కదా" అని అన్నారు.

## వక్తలేకాదు శ్రోతలూ దూరప్రాంతాల నుండి వచ్చేవారు :

సాహితీ సదస్సు ప్రారంభంలో వక్తలు తమ ప్రసంగ వ్యాసములు ఇచ్చిన ఎడల, వాటిని అచ్చు వేయించవలెనని అనుకొన్నాము. కానీ అమరేంద్రగారు, సంజీవదేవ్ గారు మాత్రమే చెరి ఒక వ్యాసం ఇచ్చారు. ఆ తరువాత ఉపన్యాసకులు ఎవ్వరూ, ఎలాంటి వ్యాసాలు ఇవ్వనందువలన వాటిని అచ్చు వేయటానికి వీలుపడలేదు. గుంటూరు చుట్టు ప్రక్కలవున్న వారివేగాక దూర ప్రాంతముల నుండికూడా గొప్ప వక్తలను ఆహ్వానించి, వారితో ప్రసంగాలు చేయించాము. నెల్లూరు నుండి మరుపూరి కోదండ రామిరెడ్డిగారు, వేమన పైన చక్కని ఉపన్యాసం ఇచ్చారు.

మద్రాసునుండి రామలక్ష్మీ ఆరుద్ర హైదరాబాదు నుండి దివాకర్ల వెంకటావధానిగారు. డాక్టర్ సి.నారాయణరెడ్డిగారు, నాయని క్రిష్ణకుమారి, యశోదారెడ్డిగారు, వానమామలై వరదాచార్యులు గారు, (పోతన చరిత్ర గ్రంథకర్త)కాళోజీ నారాయణరావుగారు, రాయలసీమనుండి పుట్టపర్తి నారాయణాచార్యులు, గడియారం శేషశాస్త్రి, రాజన్న కవిగారు. సుబ్బన్న శతావధానిగారు వచ్చి ప్రసంగించారు. వెంపరాల సూర్యనారాయణ శాస్త్రిగారు ఆముక్త మాల్యద పైన మాట్లాడారు. మొత్తం మీద సాహితీ సదస్సులో ప్రసంగాలు, విమర్శలకు గురికాలేదు. అందరి అభిమానాన్ని నండూరి రామకృష్ణమాచార్యులు గారు, ఆచంట జానకిరామ్ గారు వచ్చారు. పొందినవి.

ప్రసంగం చేయటానికేగాక శ్రోతలుగా కూడా దూర ప్రాంతాలనుండి కూడా వచ్చేవారు. వేగుంట కనకరామ బ్రహ్మంగారు. "పెదపుల్లేరు" నారాయణ రాజుగారు, కృష్ణాజిల్లా నుండి గొజ్జెపాటి వెంకట సుబ్బయ్యగారు శ్రోతలుగా కూడా హాజరయ్యారు. అలా బయటనుండి వచ్చిన వారికి, మా ఇంట్లోనే భోజన వసతులు ఏర్పాటుచేసే వాళ్ళము. భోజనానంతరం పెద్దలు సాహిత్య గోష్ఠి జరిపే వారు. మొత్తం మీద సాహిత్య సదస్సుకు హాజరయిన ప్రతిఒక్కరు, ప్రతి సమావేశం తరువాత ఆనందంగా వెళ్ళేవారు. గుంటూరు పట్టణము విద్యాకేంద్రం కనుక, ఉద్దండ పండితులు సర్వశ్రీ జమ్ముల మడక మాధవరాయశర్మ, జంధ్యాల పాపయ్య శాస్త్రి నాగళ్ళ గురుప్రసాదరావు, ఏలూరుపాటి అనంత రామయ్య, బేతవోలు రామబ్రహ్మం, గుండవరపు లక్ష్మీనారాయణ, కడియాల రామమోహన రావు, ప్రసాదరాయ కులపతి, మొదలైనవారు అందుబాటులో వుండి, తక్కువ వ్యవధిలోనైనా సమావేశాలలో ప్రసంగించెడివారు. 1977 వరకు ఇలానే కొనసాగినవి. సభ్యుల స్థాయిని బట్టి ఉపన్యాసకులు కూడా చక్కగా మాట్లాడే వారు.

రాజకీయాలు తెచ్చిన స్తబ్ధత తరువాత కొన్నాళ్ళు అప్పుడప్పుడు జరిగేవి. నేను రాజకీయాలలో జేరినందువలన, ఈ వైపు శ్రద్ధ తగ్గటం వేరొకరెవ్వరూ ఈ బాధ్యత వహించటానికి ముందుకు రాకపోవటంవలన, పూర్తిగా ఆగిపోయినవి. అయినా ఇప్పటికీ సంవత్సరానికి ఒకటి, రెండు సమావేశములు జరుపు కుంటున్నాం కానీ సభ్యులలో కూడా పూర్వపు ఉత్సాహము లేదు. తరువాత కొన్ని సాహిత్య సంస్థలు గుంటూరులో ఏర్పడి, సమావేశములు. జరుపుతున్నా ఆ స్థాయిలో జరగటంలేదని నా అభిప్రాయము. ఇప్పటికీ నేను పొరుగు గ్రామాలకు వెళ్ళినప్పుడు, ఒకరిద్దరు వచ్చి మేము సాహితీ సదస్సుకు హాజరు అయ్యేవారమని చెప్తూ వుంటారు. ముఖ్యంగా జె.కె.సి కాలేజీలో బి.ఏ. స్పెషల్ తెలుగు చదివేవారు వస్తూవుండేవారు. మొత్తం మీద సమాజం మీద సాహితీ సదస్సు ప్రభావం కొంత వున్నందుకు నాకు సంతోషంగా వుంది.

**కవి, పండితులు :**

దువ్వూరి వెంకటరమణశాస్త్రిగారు, ఆంధ్రా యూనివర్శిటీలో తెలుగు వ్యాకరణం బోధించేవారు. అంతకుముందు చిట్టిగూడూరు సంస్కృత కళాశాలలో చదివి, అక్కడే కొన్నేళ్ళపాటు ఉపన్యాసకులుగా చేశారు. ఆ కళాశాల ప్రిన్సిపాలు వీరితో సాన్నిహిత్యం ఏర్పడి చివరివరకు విడదీయరాని బంధంగా మిగిలింది. సాహిత్యోపన్యాసలకు పిలిచినపుడు సామాన్యంగా ఇరువురు కలసి వచ్చేవారు. ఉపన్యాసం అందరికి అర్థమయ్యేటట్లు 'మహదానందం' కలిగించేటట్లు చేసే వారు. బాల వ్యాకరణము కర్తృత్వమును గురించి పండితుల వాదోపవాదాలు చేసుకునే రోజుల్లో వీరు "బాలవ్యాకరణం" చిన్నయసూరి గారే వ్రాసారు. అని గట్టిగా నమ్మడమేకాకుండా "రమణీయము" అనే పేరుతో వ్యాకరణానికి వివరణ గ్రంథము వ్రాసారు. సందర్భం వచ్చినప్పుడల్లా, చిన్నయసూరిగారి పేరు పండితలోకంలో వున్నంత కాలం తను జీవించి వుంటానని చెప్పుకొనేవారు. చిన్నయసూరిగారి వ్యాకరణ పరిచయంలో "లలితోక్తులతో" అనే పదం

ప్రయోగించాడు. పది సంవత్సరాలపాటు పాఠం చెప్పిన తర్వాత "వ్యాకరణంలో లలితోక్తి అనే మాటలను క్షుణ్ణంగా చూశాను. ఆ చిన్నయసూరిగారు సూత్రాలకు ఉదాహరణ ఇవ్వవలసి వచ్చినప్పుడు-నీతి వాక్యములు, లౌకిక దృష్టితో మనస్సుకు హత్తుకునేటట్లు చెప్పేవిగా అర్థం చేసుకొన్నాను. తాను వ్రాసిన "రమణీయం"లో ఇలాంటి ఉదాహరణలు ఉదహరించారు.

డాక్టర్ విశ్వనాథ సత్యనారాయణగారు 20వ శతాబ్దపు కవులలో కడు ప్రసిద్ధులు, అపారమైన పాండిత్యంతోపాటు, వివిధ సాహిత్య ప్రక్రియలలో నిష్ణాతులు, రచనలు చేశారు. అన్నిట్లోను ప్రసిద్ధి వహించిన కావ్యము వారి "రామాయణ కల్పవృక్షము". అంతకు ముందు వేయిపడగలు అన్న వేయి పేజీల నవలను వ్రాసి చాలా ప్రాచుర్యాన్ని పొందారు. కిన్నెరసాని పాటలు తెలుగు సాహిత్యంలో, ప్రత్యేక స్థానాన్ని పొందినవి. వారి ఆంధ్రప్రశస్తి అందరూ చదవవలసిన కావ్యము. చాలా శతకాలు వ్రాసారు. వాటిలో చాలా పద్యాలు. వివాదస్పదమైనవి. అంతేగాక వారిక్కడ ఉపన్యాసమునకు వచ్చినా, వారి ప్రసంగం ప్రారంభంలోనే, ఏదో ఒక వివాదాస్పదమైన విషయాన్ని ప్రస్తావించి, దానిపై తర్జన భర్జనలు జరిపేవారు.

నేను వారిని సాహితీ సదస్సుకు ఆహ్వానించినప్పుడు, "రామాయణ ప్రాశస్త్యమన్న' విషయముపై మాట్లాడవలసినదిగా కోరాను. నా ఉద్దేశ్యం వాల్మీకి రామాయణం దగ్గర నుండి తెలుగులో వచ్చిన అనేక రామాయణములతోపాటు వారి రామాయణ కల్పవృక్షము వరకు మాట్లాడతారని, ఆయన తన స్వభావాన్ని వదలకుండా ఉపన్యాసం ప్రారంభంలోనే, సభ్యులు నొచ్చుకొనే విధంగా ఒక ఉపమానం చెప్పి తన ప్రసంగాన్ని కొనసాగించారు. మధ్యలో ఒకచోట తన ప్రయోగాన్ని గూర్చి చెపుతూ. "వాల్మీకి ఇటువంటి ప్రయోగాలు చెయ్యలేదు" అని అన్నారు. ప్రసంగం పెద్ద వివాదాన్ని లేవదీయకుండానే పూర్తి అయింది.

వీరి "రామాయణ కల్పవృక్షానికి" జ్ఞానపీఠ అవార్డు ఇవ్వబడింది. చాలా ప్రతిష్టాత్మక బహుమతి అది.

**నాజర్ బుర్రకథ :**

బుర్రకథ అనాదిగా జానపదులలో బాగా ప్రాచుర్యంలో వుంది. గుంటూరు జిల్లా పొన్నెకల్లు గ్రామములో, ధూదేకుల కులంలో జన్మించిన నాజరు పెద్దగా చదువుకోలేదు. కమ్యూనిస్టు ప్రభావమునకు లోనై, వారితో పనిచేస్తూ బుర్రకథ రంగంలో ప్రావీణ్యాన్ని సంపాదించి, ఆంధ్రదేశములోనేకాక, తెలుగు ప్రజలున్న పట్టణాలలో ఎన్నో ప్రదర్శనలు ఇచ్చి ప్రజల అభిమానాన్ని ఎక్కువగా సంపాయించారు. సాహితీ సదస్సులో కూడా వారి కార్యక్రమము ఒకదానిని ఏర్పాటుచేసి, పాటిబండ్ల సీతారామయ్య హైస్కూలులో, బుర్రకథ చెప్పించాము. ఆ సందర్భంగా నేను సన్మానము చేశాను. ఆ తర్వాత నాతో సాన్నిహిత్యము పెంచుకొని వైద్యమునకు వచ్చేవారు. మూత్రసంబంధం అయిన జబ్బుతో గుంటూరులో ఒక స్పెషలిస్టు దగ్గర చూపించుకొని, ఆపరేషనుకు రూ. 30,000/- ఖర్చు అవుతుందని చెప్పగా నా దగ్గరకు వచ్చారు. ఆపరేషను అవసరమే అది నేను చెప్తాలే అని "ప్రొస్టేటు' 'ఆపరేషను చేశాను. ఆజబ్బు క్యాన్సరని తేలింది.

క్యాప్సరు అనగానే ఎవరికైనా భయం వేస్తుంది. ప్రక్కవాళ్ళు దానికి ప్రత్యేకమైన చికిత్స చేయించుకోవాలని ఉచిత సలహా చెప్తూ వుంటారు. నేను "ఈ కాన్సరు జబ్బుకు ప్రత్యేకమైన చికిత్స పనిలేదు. రోజుకు ఒక టాబ్లెట్టు వేసుకొంటే, 10 సంవత్సరాలపాటు ఏమీ ఇబ్బంది వుండదు" అని చెప్పి ఆ టాబ్లెట్టుకొనే ఇచ్చాను. పది సంవత్సరాల పైననే బ్రతికారు. సహజమైన మరణం పొందాడు.

బుర్రకథలు చెప్పటమేకాక స్వయంగా రచనలు చేసేవారు. పాండిత్యం పెద్దగా లేకపోయినా సామాజిక స్పృహవలన మామూలు భాషలో విషయ ప్రాధాన్యతతో వ్రాసేవారు. అట్లా వ్రాసిన ఒక పుస్తకానికి ముందుమాటకూడా తానే వ్రాసి అచ్చు కాకుండగానే మరణించారు. వారి పిల్లలు ఆ పుస్తకాన్ని తరువాత ప్రచురించారు. అందులో తన వైద్యమును గురించి రూ. 35,000/- ఖర్చు అవుతుందన్న జబ్బుకు ఒక్కరూపాయి కూడా ఖర్చులేకుండా చేసిన వైద్యాన్ని గురించి ప్రస్తావించారు.

నాజరును అమెరికా పంపవలెనని, అమెరికా "తానా" వారికి వీరిని ఆహ్వానించ వలసిందిగా సూచించాను. వారు రెండు సంవత్సరాల కొకసారి ఏర్పాటుచేసే మహాసభలకు చాలా మంది "ఆర్టిస్టులను ఆహ్వానిస్తారు (తానా ఖర్చుతో). ఈ విషయము ఎంతమందితో ప్రస్తావించినా, బయోడేటా పంపించ మనండి ఆలోచిస్తామన్నారుగాని వారి ప్రతిభను వారు గుర్తించినట్లు కనిపించదు. అందువలన అమెరికా వెళ్ళే ప్రయత్నం ఫలించలేదు. వారిని భారత ప్రభుత్వం పద్మశ్రీ తో గౌరవించింది.

**కాళోజి నారాయణరావుగారు** సుప్రసిద్ధ, తెలంగాణారచయిత, నైజాము నవాబుకు వ్యతిరేకంగా జరిగిన పోరాటాల్లో పాల్గొని, చాలాసార్లు జైలుకు వెళ్ళారు. సున్నితమనస్కులు. రచనలు ఎక్కువ గేయరూపంలో వ్రాసారు. ఆ గేయాలు చదువుతూ మధ్యలో కన్నీళ్ళు . పెట్టుకొంటూ వుంటారు. వినేవారికి చదివేవారికి కూడా కన్నీళ్ళు వచ్చే పరిస్థితి. గుంటూరులో సాహితీ సదస్సుకు వచ్చారు. ఎక్కువసార్లు సి.వి.ఎన్. ధన్ తమ కళాశాలలో వారి ప్రోగ్రాములు ఏర్పాటుచేసేవారు. వారు వచ్చినప్పుడు యాదగిరిగుట్టపై వున్న-నరసింహ స్వామిపై ఒక సుదీర్ఘగేయం చదివారు. ఆగుడి పూజారులు వీరికి నరసింహ స్వామిని గురించి వ్రాయమన్నప్పుడు, ఆ గుడితో దగ్గర సంబంధం వున్న వీరు కాదనలేకపోయారు. చాలా అర్ధంగా అర్థవంతంగా వుంది ఆగేయం.

"భద్రాచలంలో జరిగే సీతాకళ్యాణం చూడాలని హకోర్కి, కానీ సాధ్యం కాలేదు. ఎందుకంటే ఎప్పుడూ అది వేసవి కాలంలో వస్తుంది." అని ఎగతాళిగా అనేవారు. వారు వి దాదాపు 90 ఏళ్ళు బ్రతికారు. స్నేహానికి ప్రాణం ఇచ్చేవారు.

**బాలబంధు బి.వి. నరసింహారావు** గారు ఉద్యోగరీత్యా, ఇనస్పెక్టర్ ఆఫ్ స్కూల్సు, గొప్ప కళాకారుడు, నాట్యం ఆయన ప్రత్యేకత. వారు స్త్రీ పాత్రవేస్తే అందరూ ఈ వేషం స్త్రీదేనని భ్రమపడేవారు. మంచి గేయకర్త, చాలా అందంగా పాడేవారు. ఉపన్యాసం గంటలతరబడి చెప్పినా శ్రోతలకు ఆనందంగా వుండేది. నాకు 1959లో వీరి పరిచయం అయింది. అప్పటి నుండి మా కుటుంబానికి సన్నిహితుడైనాడు. మా పిల్లలందరూ 'మామా' అని పిలిచేవారు. కొన్ని రచనలు మా పిల్లలకు అంకితం కూడా. ఇచ్చారు. గుంటూరు వచ్చినప్పుడు, మా ఇంట్లోనూ, రావెల సాంబశివరావుగారి ఇంట్లో పి.వి.ఎన్ ధన్ గారింట్లో ఎక్కువగా గడిపేవారు. ఆంధ్రదేశమంతా తిరిగి శ్రోతలను, ముఖ్యంగా చిన్న పిల్లలను అలరించేవారు. సంజీవదేవ్ గారు, గొర్రెపాటి వెంకటసుబ్బయ్యగారు. వేగుంట కనకరామబ్రహ్మంగారు. నారాయణరాజుగారు మొదలైన వారు మిత్రమండలిని ఏర్పాటు చేసుకొని ప్రతి సంవత్సరము సంక్రాంతి పండుగకు వీరి ఇళ్ళలో ఏదో ఒక చోట కలిసేవారు. కలవటమంటే ఎవరి రచనలు వారు మిగతా మిత్రులకు చూపించి, ఆడుతూ పాడుతూ. ఆనందించేవారు. వీరికి చాలా చోట్ల సన్మానము జరిగినది. వీరి నివాసము గుడివాడ. ఈయన జీవిత చరిత్ర కూడా వ్రాసుకొన్నారు. ఆయన తల్లి దండ్రులకు కడసారి బిడ్డ. అందువలన ఎక్కువ రోజులు తల్లిపాలు త్రాగానని, ఊహ తెలిసిన తర్వాతకూడా తల్లిపాలు త్రాగటంవలన ఆరుచి తనకు బాగా గుర్తువున్నట్టు వ్రాసారు. అందరమూ తల్లిపాలు తాగినా ఆ రుచి ఎవరికీ గుర్తువుండదు. ఆ రచయితేకాక, ఇంగ్లీషు తెలుగు పుస్తకాలు చాలా చదివేవారు. గుడిపాటి వెంకటాచలంగారి (చలం)తో వ్యక్తిగత పరిచయమేగాక, వారంటే ఆరాధనాభావం వుండేది. ఎన్ని సన్మానాలు పొందినా, తన స్వస్థలములో సన్మానము జరగవలెనని కోరుకొనేవాడు.

రాయల అప్పారావు అనే ఒక సంపన్నుడు చాలా ఘనంగా వీరికి గుడివాడలో సన్మానము జరిపారు. ఆ సన్మానానికి మిత్రులందరమూ హాజర య్యాము. ఆరోజు వారి ఆనందానికి అవధులు లేవు, సంవత్సరం గుర్తులేదుకానీ జనవరి ఒకటవ తారీఖున జరిగింది. తరువాత సుమారు వారం రోజులకు విజయవాడలో ఒక సభలో ప్రసంగిస్తూ వుండగా పోర్టు అటాక్ వచ్చి కొద్ది గంటలలోనే మరణించారు. వారు వ్రాసిన పుస్తకాలు చాలా బాలబాలికలకు విజ్ఞానాన్ని వినోదాన్ని ఇస్తున్నది.

**మిత్ర సంపద :**

అన్ని సంపదలలోకి మిత్ర సంపద గొప్పదంటారు. నాకా సంపద ఎక్కువగానే వుంది. కొంతమంది ప్రముఖులు, రంగాగారు, గొట్టిపాటి వెంకట సుబ్బయ్యగారు, వారి మిత్రులను గురించి పెద్ద పెద్ద పుస్తకాలే వ్రాసారు. నాకు అటువంటి ప్రయత్నంచేసే ఆలోచనగానీ, ఓపికగానీ లేనందువలన ఆప్రయత్నం చేయటంలేదు. ఏదైనా సందర్భంగా కొంతమంది మిత్రుల పేరు రావచ్చుగానీ, అందరి గురించి ప్రస్తావించలేను..

చిన్నప్పటినుండి, అనగా విద్యార్థి దశనుండి నాకు చేతనైన సహాయము చేతనైనంత వరకూ, ఇతరులకు అందించేవాడిని. మిత్రులు కూడా నాపట్ల అదే విధంగా ప్రవర్తించేవారు. మొత్తం మీద మా మిత్రులనుండి పొందిన సాయమే ఎక్కువ. నేను అది బాహాటంగా ప్రకటించికపోయినా నా మనస్సుకు తెలిసిన నిజమది. మిత్రులెవరినీ, దూరం చేసుకొనే ఆలోచన ఎప్పుడూ వచ్చేదిలేదు. ఎవరైనా కొంతమంది అలా దూరమయినప్పుడు, దానికి కారణం వారే. చాలా మంది నన్ను "అజాత శత్రువు" అని ప్రశంసిస్తూ వుంటారు. ఎవరైనా నా పట్ల శత్రుత్వము ప్రకటించినా నేను దానిని అంగీకరించను. నాకు వారిపట్ల 'శత్రు' భావము వుండదు.

సాహితీ సదస్సు ద్వారా పరిచయం అయినవారిలో కొంతమంది మిత్రుల య్యారు. అందులో **నండూరి రామకృష్ణమాచార్యులుగారు**, గవర్నమెంటు కాలేజీ లో ప్రిన్సిపాల్గా పనిచేసి రిటైరయిన తరువాత, హైదరాబాదులో స్థిరపడ్డారు. వీరు గొప్ప కవి, విమర్శకుడు వ్యక్తిగతంగా సరసుడు, లౌకికుడు కూడా. నేను హైదరాబాదు వెళ్ళినప్పుడల్లా ఆయనతో కొంతసేపు గడిపేవాడిని. ఆయన వ్రాసిన అచ్చయిన పుస్తకాలు, ఇంటినిండా కట్టలు కట్టలుగా పడివుండేవి. వెళ్ళినప్పుడల్లా ఐదు ఆరు పుస్తకాలు ఇచ్చేవారు. అప్పుడప్పుడు ఉత్తరాలు కూడా వ్రాస్తుండేవారు. పద్య కవిత ప్రోత్సహించటానికి చాలా ఎక్కువ కృషిచేశారు. ఒకసారి ఉత్తరం వ్రాస్తూ నేను గుంటూరు వస్తున్నాను. జంధ్యాల పాపయ్య శాస్త్రిగారింట్లో రెండు రోజులుంటాను. వారింట్లో అజ్ఞాతవాసం చేస్తాను. మిమ్మల్ని కలవాలని వుందని వ్రాసారు.

వారు చెప్పిన రెండవరోజు సాయంకాలము, పాపయ్య శాస్త్రిగారింటికి వెళ్ళాను. పాపయ్యశాస్త్రి గారు వరండాలో కూర్చున్నారు. గదిలోనుండి నండూరివారు వరండాలోనికి వచ్చారు. "మీరేదో పెద్ద పనిమీదే వచ్చుంటారు మిమ్మల్ని ఈ పూట కలవటానికి వచ్చాను." అని చెప్పాను. "నలభై సంవత్సరాల క్రితం "కరుణశ్రీ" అనే కావ్యాన్ని వ్రాసి ఆ కావ్యానికి నాతో ముందుమాట వ్రాయించారు. ఇప్పుడు ఆకావ్యం రెండవ భాగమునకు కూడా వ్రాయటానికి పిలిపించారు. ఆ పని పూర్తిచేసి బయటకువస్తున్నా" నన్నారు. కొంతసేపు కరుణశ్రీ గారితో ముచ్చటించి వచ్చాను. అప్పుడు కరుణశ్రీగారి పరిస్థితి–మహదానందంలో వున్నారు. అంతే తను చేయదలచుకొన్న పని పూర్తి అయ్యిందన్న భావము నాకు వెల్లడి అయ్యింది.

మరునాడు ఉదయమే, **కరుణశ్రీగారు** రాత్రి మరణించారని తెలిసి చూడటానికి వెళ్ళాను. నండూరివారు పాపయ్యశాస్త్రిగారి మరణం, ఎంత తేలికగా జరిగిందో నాకు . వివరించారు.

నిన్న సాయంకాలము నేను వారిని చూచినప్పుడు వారిలో "సెన్సాఫ్ ఫుల్ఫిల్మెంట్" చూశాను. అందువలన నాకేమీ ఈ వార్త ఆశ్చర్యము కలిగించలేద న్నాను. నిజమేనండి. ఆమాట నాకు తట్టలేదు అన్నారు. ఆ తర్వాత నేనన్నాను మనం ఎక్కువ. రోజులు బ్రతకాలనుకొంటే, చేయాలనుకున్న పనులు, కొంత కొంత అయినా, కొరత వుండాలి అని. నండూరివారి మరణానికి ముందు వారింటికి వెళ్ళి హైదరాబాదులో కలిశాను. వయోభారము తప్ప, జబ్బేమీ కనిపించలేదు. తరువాత మూడు నాలుగు రోజులకు. ఆయన దగ్గరనుండి "కార్డు" వచ్చింది. తానొక కలగన్నాని, అందులో ఆయన విశ్వామిత్రుడని, నేను వశిష్టుడనని వ్రాశారు." తరువాత రెండు మూడు రోజులకు ఆయన మరణవార్త విన్నాను. వీరి మామగారు ఆత్మకూరి గోవిందాచార్యులు, స్వాతంత్ర్య సమర యోధులు. అందువలన ఆకుటుంబం అన్ని వర్గాలవారితోనూ, కలవటం అలవాటయింది.

20వ శతాబ్దపు మహా కవులలో **శ్రీ గుఱ్ఱం జాషువాగారొకరు**. సమాజం లోని అట్టడుగు వర్ణములో జన్మించి, స్వయంకృషితో, ఎన్నో అవరోధాలు ఎదుర్కొని, సమాజంలో గొప్పవారి ఆదరణను, బహుసన్మానాలను పొందారు. అందులో ముఖ్యమయినది, గుంటూరులో శ్రీఏకా ఆంజనేయులుగారి ఆధ్వర్యంలో జరిగిన గొప్ప సన్మానము. కనకాభిషేకముతో సత్కరించటమేగాక, రెండెకరాల మాగాణి, గుంటూరులో ఒక ఇల్లు ఏర్పాటు చేశారు. అట్లానే జాగర్లమూడి కుప్పుస్వామిగారు, నెల్లూరు జిల్లా మాలకొండారెడ్డి గార్ల ఆదరణ పొందారు. విజయవాడలో జరిగిన గజారోహణ గండపెండేర మన సన్మానము మరువలేనిది. ఆయన కుమార్తె హేమలత గోరాగారి కుమారుడుకు "లవణాన్ని" వివాహమాడి పాంఘిక కార్యక్రమాలలో భార్యాభర్తలిద్దరూ పని చేస్తున్నారు. ఆయన మరణానంతరము గుంటూరులో స్టేటు బ్యాంకు ఎదుట వారినిలువెత్తు విగ్రహాన్ని ఏర్పాటుచేసి, గుంటూరు ప్రజలు వారిపట్ల కృతజ్ఞతాభావాన్ని వెల్లడించుకొన్నారు.

**ఆచార్య ఎన్.జి. రంగాగారు** నాకు 1942 నుండీ పరిచయం. 1951 నుండి సన్నిహితులు, రాజకీయ రంగంలో, వారి పాత్రను చాలా మంది సరిగ్గా అర్థం చేసుకోలేదు. రైతులు, గ్రామీణ ప్రజల అభ్యున్నతికి, నిర్విరామంగా, కృషిచేసిన తపస్వి. తపస్వి అనగానే చాలా మంది అభిప్రాయం. సమాజానికి దూరంగావటం అడవులలో, ముక్కు మూసుకొని తపస్సు చేసేవారని. వీరు అట్లుకాక, క్రియాశీలకంగా జీవితమంతా తాము నమ్మిన సిద్ధాంతం కొరకు, అటు బ్రిటీషు ప్రభుత్వంతో, స్వాతంత్ర్యము తరువాత స్వదేశీ ప్రభుత్వంతో నిర్విరామంగా, యుద్ధం చేసారు. స్థూల దృష్టితో చూసినవారు "రంగాగారు రాజకీయాలలో రాణించలేదు, ఏ పదవిని అధిష్టించలేదు" అని అనుకోవచ్చు. వారి జీవిత భాగస్వామి భారతీదేవి గారు కూడా వారికి ప్రోత్సాహమివ్వటమేకాక తాను కూడా రాజకీయ రంగంలో పోరాడారు.

రంగాగారు ఆ పాత్ర పోషించకపోతే నెహ్రూగారి హయాంలోనే "సమిష్టి వ్యవసాయం"ను రైతులపై రుద్ది, వారి జీవితాలను ఛిన్నా భిన్నం చేసి వుండేవారు. ప్రభుత్వం వెలుపలనుండి రంగాగారు, ప్రభుత్వములో ఉండి చరణ్ సింగ్ గారూ చేసిన కృషివల్లనే, రైతాంగం ఈ మాత్రమైనా నిలబడింది. వారి దృష్టిలో ఎన్నికలలో గెలుపు ఓటములకు ప్రాధాన్యము లేదు. సుదీర్ఘ పోరాటమువలన, అలసిపోయి, తాము అనుయాయులందరినీ పదలి చివరి దశలో కాంగ్రెసులో చేరటం మావంటి వారికి బాధాకరం.

వారు మా కుటుంబము పట్ల చాలా ఆదరణ చూపేవారు. భారతీదేవిగారైతే గుంటూరు వచ్చినప్పుడు వారి మేనకోడలింటికి వెళ్ళకుండా మా ఇంటికి వచ్చి జయప్రదాంబతో ఒకటి రెండు రోజులు గడిపేది. వారు వ్రాసిన డిస్టింగ్విష్డ్ అక్వైంటెన్సెస్ అనే పుస్తకములో మా దంపతుల గురించి చాలా గొప్పగా వ్రాసారు.

రంగాగారు ప్రజలకు రాజకీయవేత్తగానే తెలుసు, వారు సాహిత్య రంగంలో బాగా పట్టు వున్న మనిషి తన తరంలో చాలామంది కవులకు

ప్రోత్సాహమిచ్చి, గొప్ప రచనలు చేయించేవారు. స్వయంగా ఆయన రచయిత. అనేక సమస్యలను గురించి. చాలా పుస్తకాలు వెలువరించారు. ఒకసారి వార్ల వెంకటేశ్వరరావు మాతో రంగా గారి గురించి మాట్లాడుతూ వారు సాహిత్య రంగంలోనే వున్నట్లయితే సాహిత్యాన్ని చాలా సుసంపన్నం చేసేవారు. ఎవలేని కీర్తి కూడా గడించేవారు అని అన్నారు.

రంగాగారు ప్రప్రథమంగా భారతదేశంలో రాజకీయ పాఠశాలలు నడిపి, ఎందరో శిష్యులను తయారు చేశారు. వీరందరినీ రంగాగారి పొలిటికల్ ఫ్యామిలీగా పిల్చేవారు. వారు అన్ని పార్టీలలోనూ వున్నారు. కొండంత దేవునికి కొండంత పత్రి తేలేముకదా, అందువలన వారి ప్రస్తావన ఇంతటితో ముగిస్తున్నాను.

**చౌదరి చరణ్ సింగ్** గారు ఉత్తర ప్రదేశ్లో రైతు నాయకులు, చాలా కాలము కాంగ్రెసులోనే వుండి, ముఖ్యమైన మంత్రి పదవులు నిర్వహించి, కాంగ్రెసులో విభేదించిన తరువాత ఎన్నికలలో ముఖ్యమంత్రి పదవిని చేపట్టారు. జనతాపార్టీ ఆవిర్భావము అప్పుడు తన వర్గము అత్యధిక సీట్లు గెలిచినా తను ప్రధానమంత్రి కావాలని కోరిక లేకుండా మొరార్జీదేశాయ్కు మద్దతు ఇచ్చారు. కానీ మొరార్జీ చరణ్సింగ్కు ఇవ్వవలసిన మర్యాద ఇవ్వకుండా కించపరచడం, తరువాత కొన్నాళ్ళకు, చరణ్ సింగ్ జనతాపార్టీని, వదలి తన అనుయాయులతో "లోక్ దళ్ పార్టీని స్థాపించి, కొన్ని నెలలపాటు, దేశ ప్రధానిగా పనిచేసిన తరువాత జరిగిన ఎన్నికలలో పార్టీ ఓటమి చవి చూసింది. తరువాత కొన్నాళ్ళు రాజకీయాలలో వున్నా పార్లమెంట్ మెంబరుగానే వున్నారు.

ఆయన కేంద్రంలో ఆర్థిక శాఖ మంత్రిగా వున్న కాలంలో ఆంధ్ర ప్రాంతంలో ఎక్సైజు నిబంధనలు తీసివేసి రైతులలో చాలా ఖ్యాతిగడించారు. వ్యక్తి గతంగా ఆయన అనుయాయులను చాలాబాగా ప్రేమించేవారు. అట్లా ఆంధ్ర ప్రదేశ్ నుండి నన్ను, వడ్డే శోభనాద్రీశ్వరరావును, సి.ఏ. చౌదరిగారిని అభి

మానించేవారు. నేను ఆంధ్రప్రదేశ్లో లోకదళ పార్టీ ప్రెసిడెంటుగా వుండి 1981-82 సంవత్సరములో చిలకలూరిపేటలో మీటింగు పెట్టి "కిసాన్సమ్మేళనం" జరిపి చరణ్‌సంగ్ గారిని ఆహ్వానించాను. అప్పట్లో చాలా విజయవంతంగా జరిగిన మీటింగు అది. వారు తిరిగి ఢిల్లీ వెళ్ళిన తరువాత ప్రెస్ వారితో మాట్లాడుతూ.. "నేను చాలా పెద్ద మీటింగులలో మాట్లాడాము ఆంధ్రప్రదేశ్, గ్రామీణ ప్రాంతంలో జరిగిన మీటింగును నేను ఎన్నడూ మరచిపోలేను" అని ప్రశంసలు అందించారు. ఎప్పుడూ ఢిల్లీలో కలిపినా, నా పక్కన కూర్చొని ఎన్నో విషయాల గురించి మాట్లాడేవారు. వారు అనారోగ్యంవలన తరువాత రాజకీయాలకు దూరంగా వున్నారు. ప్రచార సాధనాలు పనికట్టుకొని ఆయన్ని అప్రదిష్ట పాలుచేసినవి.

వైద్య వృత్తిలోనూ, బయట సమాజంలోనూ, పరిచయమైన గొప్ప వ్యక్తులు చాలా మంది వున్నారు. అందులో కొంతమంది చాలా సన్నిహితులు అయినారు. ఒకసారి వాసిరెడ్డి వెంకటసుబ్బయ్యగారనే కవి "మిమ్మల్ని డాక్టరుగానే కాదు, మాలో ఒకరని అనుకొంటాము" అని అన్నాడు. అలా సన్నిహితులయిన వారిలో శ్రీ సంజీవ్ గారొకరు. వారితో పరిచయం 1959లో అయినది. అప్పటి నుండీ వారు జీవించినంతకాలం సన్నిహితులుగానే వుండేవారు.

వారి పూర్తిపేరు **సూర్యదేవర సంజీవదేవ్.** 'ఊరు' 'తుమ్మపూడి', బకింగ్ హామ్ కెనాల్ ఒడ్డున వున్న చిన్న వూరు. వారు ఎక్కువ మందికి "చిత్రకారుడుగా" పరిచయం. నిజానికి చిత్రకారుడయినది జీవితంలో ఆలస్యంగా. చిన్నప్పుడే తల్లి మరణించటంవలన, పేద తల్లిగారింట పెరిగి, పది పన్నెండు సంవత్సరముల వయస్సు వచ్చేటప్పటికి తల్లి నగలు మూటకట్టుకొని దేశాటనకు బయలు దేరాడు. హిమాలయాల్లో రష్యన్ చిత్రకారుడు "రోరిక్" ఇంట కొన్నాళ్ళు వుండి వివిధ కళారీతులను ఆకళింపు చేసుకొని ప్రబుద్ధ భారతి ఎడిటోరియల్ ఆఫీసులో ఆలోచనా రీతుల్ని అర్థంచేసుకొని, అట్లానే వివిధ భాషలను గురించి కూడా స్వశక్తితో అధ్యయనము చేసి, చాలా భాషల్లో సాధికారికంగా వ్రాయటం,

మాట్లాడటం చేయగలిగేవారు. వారు ఇంగ్లీషులోనూ, తెనుగులోనూ, ప్రోస్, మరియు పోయిట్రీ రచయిత. చాలా విషయాలను గురించి, వ్యాసాలు వ్రాసారు. అవన్నీ ప్రింటు చేయించారు కూడా. తెగిన జ్ఞాపకముల పేరుతో ఆంధ్రజ్యోతిలో ప్రతి వారం వ్రాసిన విషయం చాలామందికి గుర్తుండి వుంటుంది. ఆయన ఒకసారి తన వ్యాస సంపుటిని రూపారూపాలు" అని ముద్రించారు. అంతకు ముందునాకు ఈ విషయం చెప్పారు. ప్రింటులో "స్పష్టాస్పష్టంగా" వస్తుందేమో అన్నాను. దానికివారు "రూపాలను గురించి అస్పష్టంగాను-అరూపాలను గురించి స్పష్టంగాను వస్తుందిలే" అన్నారు. వారి చెల్లెలు గుంటూరులో చింతపల్లి రాజాగారు "హరిహరప్రసాద్ గారి" పెద్దకోడలు. మా పరిచయమైన దగ్గరమండీ సంజీవీన్ గారు గుంటూరు వస్తే మా దగ్గరే ఎక్కువ వుండేవారు. వారిలో నేను ప్రత్యేకంగా గమనింకులపతిము.

ఏ విషయమైన ఏ స్థాయి వ్యక్తులతోనైనా సమానంగా మాట్లాడగలగటం, యూనివర్శిటీలకు ఉపన్యాసాలు ఇవ్వటానికి తరుచుగా వెళ్ళేవారు. అక్కడవారు ప్రొఫెసర్లతో ప్రొఫెసర్ల స్థాయిలోనూ వారిని అభిమానించే చిన్న పిల్లలు. వచ్చినప్పుడు చిన్నవారి స్థాయిలోనే మాట్లాడేవారు. అంతకన్నా విశేషమేమిటంటే "ఏకాంతంలో ఎన్ని గంటలైనా గడపగలిగేవారు" ప్రపంచంలో ప్రఖ్యాతి గాంచిన వ్యక్తులతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపేవారు. ఇంటికివచ్చిన అతిధులందరినీ ఆదరించేవారు. అట్లా వచ్చే సంఖ్య ఎక్కువగానే వుండేది. "వండవలయదు దేవురు వచ్చిరేని అన్నపూర్ణకు వుద్దియౌ అతని గృహిణి" సులోచనా దేవి. భోజన సదుపాయాలు విసుగు లేకుండా సమకూర్చేది. ఆమెది దోనెపూడి, సంజీర్దేవ్ గారు పూర్తి జీవితం గడిపి ఇటీవలే స్వర్గస్తులైనారు.

నేను హైస్కూలులో చదివేటప్పుడే **నార్ల వెంకటేశ్వరరావు** గారు ఆంధ్ర ప్రభకు సంపాదకులు అయ్యారు. అప్పటికి తెలుగులో వున్న పత్రికలు రెండే. ఒకటి ఆంధ్రపత్రిక, రెండు ఆంధ్రప్రభ, అప్పటి దినపత్రిక నాలుగు పేజీలుండేది.

ఖరీదు అర్థణా.. (మూడు పైసలు) అయినా చాలా కొద్ది మందే కొనేవారు. పల్లెటూళ్ళకు అసలు పేపరు వచ్చేదేలేదు. ఆంధ్రపత్రికకు, ఆంధ్రప్రభకు భాషలో తేడా వుండేది. ఆంధ్రపత్రిక ఎక్కువగా గ్రాంధికములోను, ఆంధ్రప్రభ వ్యవహారిక భాషలోను వుండేవి. దిన పత్రికల్లో వ్యవహారిక భాష ప్రవేశపెట్టిన ఘనత నార్లవారికి దక్కుతుంది.

1949లో మా పెండ్లి అయిన తర్వాత అక్టోబరులో నేను మద్రాసు వెళ్ళాను. అప్పటికి జయప్రదాంబ ఫైనలియర్ పరీక్షలకు తయారవుతున్నది. నార్లగారు ఆమెకప్పటికే పరిచయం. ఒకరోజు ఇద్దరము కలసి వెళ్ళాము. పెద్ద పత్రికా సంపాదకుడుగదా! ఎట్లావుంటాడో అనుకొన్నాను. చాలా సాధారణంగా వున్నాడు. మాట్లాడటం కూడా పల్లెటూరి బంధువులతో మాట్లాడినట్లే మాట్లాడారు. ఆ తరువాత రెండుమూడు సార్లు మద్రాసు వెళ్ళినప్పుడు వారింట్లోనే వున్నాను. వారితో మాట్లాడటం ఒక గొప్ప అనుభవం. ఎన్నో విషయాలను గురించి మాట్లాడటం, తన రచనలు నాకివ్వటం జరుగుతుండేది. ఆ తర్వాత విజయవాడలో ఆంధ్రజ్యోతి దినపత్రికను స్థాపించినప్పటి నుండి, తరచుగా కలుసుకోవటం జరిగేది. ప్రతిసారి ఎన్నో విషయాలను గురించి తెలుసుకొనే వాడిని. అయితే రాజకీయాలను గురించి మాత్రము మాకు ఏకాభిప్రాయం కుదిరేదికాదు. ప్రజలలో జీవితపు విలువలు పడిపోవటానికి కాంగ్రెసు ప్రభుత్వమే కారణమని నేను వాదించేవాడిని. దానికి భిన్నంగా వారు ప్రజాస్వామ్యంలో సరియైనవారిని ఎన్నుకోవటం ప్రజల బాధ్యత. అందువలన ప్రభుత్వాన్ని నిందించటం సరియైనదికాదు అనేవారు. యధారాజా తధాప్రజా, అన్నమాట రాచరికానికి వర్తిస్తుందికానీ ప్రజాస్వామ్యానికి కాదు అనేవారు. తరువాత హైదరాబాదులో వారు స్థిరపడినప్పుడు, వెళ్ళిన ప్రతిసారి ఒకరోజో, ఒకపూటో వారితో గడిపేవాడిని, వారి భార్య సులోచనగారు చాలా ఓర్పుగలమనిషి బహుసంతానవతి. వారి సంతానాన్ని సముదాయించే దానికన్నా, భర్తకొరకే ఎక్కువ సమయం వెచ్చించేది.

ఈ వ్రాసిన మాటలు నార్లగారి ప్రతిభా పాటవాలను గురించి చెప్పినవి కాదు. వారితో నాకున్న అనుబంధాన్ని చెప్పటం మాత్రమే.

నేను మెడికల్ స్టూడెంటుగా వుండగానే **ఆవుల సాంబశివరావు**గారిని మొదటిసారి. చూశాను. అప్పటికే ఆయన అడ్వకేటుగా మద్రాసులో ప్రాక్టీసు చేసేవారు. తక్కెళ్ళపాడు. వారి బంధువుల ఇంటికి వచ్చినప్పుడు వారితో పరిచయం అయింది. ప్రత్యేకంగా ఏమీ మాట్లాడిన గుర్తులేదు. జయప్రదాంబకు మద్రాసులో పరిచయం అయ్యారు. వారికి మా వివాహ ఆహ్వానము పంపినపుడు వారు హాజరు కాలేక ఒక చిన్నకార్డు మీద శుభాకాంక్షలు తెలిపారు. ఆ వ్రాసిన నాలుగు మాటలు చాలా కళాత్మకంగా వున్నవి. ఇటీవలిదాకా ఆకార్డు నాదగ్గర వుండేది. తరువాత గుంటూరు అడ్వకేటుగా వచ్చినపుడు వారు వారి సతీమణి నాకు సన్నిహితులయినారు. వారి సతీమణిగారు కూడా కృష్ణా జిల్లా వాసులే. ఆమెపేరు జయప్రద. అందువలన బయట ఎప్పుడైనా కలిసినప్పుడు, సందర్భము వచ్చినప్పుడు "మేమిద్దరమూ జయప్రదాంబవల్ల భులము" అని వారు చమత్కరించేవారు.

వారి చిన్నతనంలో తెనాలి పరిసర ప్రాంతాల విద్యార్థులపై కవిరాజు త్రిపురనేని రామస్వామిగారి ప్రభావము ఎక్కువగా వుండేది. అలానే రాజ కీయాలలో కూడా. కమ్యూనిస్టు ప్రభావం కూడా వుండేది. ఆ తర్వాత కాలంలో ఎం.ఎన్. రాయ్ గారి "రాడికల్ హ్యూమనిజం" ప్రభావితం చేసేది. వీరు చిన్న వయస్సులోనే చదివిన విషయాన్ని కూలంకషంగా అర్థం చేసుకొనేవారు. ఆ కారణంవలన, తెలుగు, సంస్కృత భాషలో కూడా ప్రావీణ్యత సంపాదించి, పురాతన గ్రంథాలను కూడా క్షుణ్ణంగా చదివి, తన జీవితానికి అన్వయించుకొని తనదైన దృక్పథాన్ని ఏర్పరచుకొన్నారు.

వారిని గురించి ఆలోచించినప్పుడెల్లా నాకు ఆశ్చర్యము కలిగించే విషయాలు వారి నియమబద్ధ జీవితము, వారి తండ్రికి వృద్ధాప్యంలో కలిగిన బిడ్డ, చిన్న తనములోనే తండ్రి మరణంవలన తల్లిపోషణ, అపారమైన సంపద. ఇన్ని కలిగి వుండిన వారెవరైనా.. నియమ బద్ధ జీవితమును వీడి స్వేచ్ఛా జీవితానికి అలవాటు పడేవారు. అలాకాకుండా. జీవితాంతం ఎక్కడా నియమము తప్ప కుండా పదవులను ఎన్నింటినో నిర్వహించి, పదవీ విరమణానంతరం, సామాన్య జీవితం గడిపారు. వారు నా సన్మాన సభకు అధ్యక్షత వహించారు. వారికి వారి స్వగ్రామములో జరిగిన ఒకే ఒక సన్మానానికి నేను హాజరయ్యాను. ఈ మధురానుభూతులు నా మనస్సులో పదిలంగా దాచుకొంటాను.

1972 జై ఆంధ్ర ఉద్యమంలో నాకు **యార్లగడ్డ లక్ష్మీ ప్రసాద్** పరిచయమ య్యాడు. అప్పటికి అతను హిందీ లెక్చరర్. చాలా ఉత్సాహ వంతుడు. అనేక విషయాలపై చక్కని అవగాహన ఉన్నవ్యక్తి, మా ఇద్దరి అభిప్రాయాలు చాలా విషయాలలో కలిసేవి. అప్పటికి జర్నలిస్టు, హిందీ తెనుగులో చాలా రచనలు చేశారు. ఇంగ్లీషు తెనుగు హిందీలలో అవర్గళంగా మాట్లాడగలడు. 1985లో నేను అమెరికా వెళ్ళినప్పుడు, తనుకూడా వచ్చాడు. అమెరికా, ఇంగ్లాండు దాదాపు రెండు నెలలపాటు కలసి తిరిగాము. అప్పటినుండి అతనికి నాపై గౌరవం పెరిగింది. ఎన్.టి.ఆర్. తో పరిచయం పెరిగిన తర్వాత, వారు రాజ్యసభ సభ్యులైనారు.

మేము ఇంగ్లాండులో వుండగానే ఆంధ్రాయూనివర్శిటీలో హిందీ లెక్చరరు ఉద్యోగం వచ్చింది. రాజ్యసభ కాలపరిమితి ముగియగానే మరలా యూనివర్శిటీలో లెక్చరరు అయ్యాడు. ఆయన ధారణశక్తి చాలా గొప్పది. ప్రస్తుతం హిందీ భాషకు ఆంధ్రప్రదేశ్లో చైర్మన్ గా వున్నాడు. ఇటీవలే "పుష్కిన్ అవార్డు, (రష్యను అవార్డు) వచ్చింది" ఇంకా ఎన్నో గౌరవాలను పొందాలని నేను ఆశీర్వదిస్తున్నాను.

జయప్రదాంబ కాలేజీలో ఆమె విగ్రహం పెట్టటానికి విశాఖపట్నంలో వున్న "పెట్నాయక్" దగ్గరకు వెళ్ళినప్పుడు లక్ష్మీప్రసాద్ గారు ఒక విగ్రహం ఎట్లా పెడతారు. మీ విగ్రహం కూడా పెట్టవలసిందేనని తన ఖర్చుతో విగ్రహాన్ని తయారుచేయించి. పంపించారు. ఆ తరువాత తాను వ్రాసిన "ద్రౌపది" అన్న పుస్తకాన్ని హైదరాబాదులో ఆవిష్కరణ జరిపినాకు అంకితమిచ్చారు. ఇటువంటి మిత్రులు లభించడం నా అదృష్టంగా భావిస్తాను. మిత్రులను గురించి నేను వ్రాయలేనని అనుకొని కూడా వీరి గురించి ప్రస్తావించాను.

నా దగ్గర పనిచేసిన డాక్టర్లు చాలామంది విజయవంతంగా ప్రాక్టీసు చేస్తున్నారు. నాపై గురుభావం కూడా చూపించుతున్నారు. వారందరి జాబితా వ్రాయటం సాధ్యపడదు. అయితే కొంతమందిని గురించి ప్రస్తావించకుండా వుండలేను. 1994లో నేను ఎమర్జెన్సీ సర్జరీకొరకు హాస్పిటలులో జేరినప్పుడు, ఒక గంటలోపల చాలా మంది డాక్టర్లు చూడటానికి వచ్చారు. డాక్టరు ఎవ్. సత్యనారాయణ (ఐ) ముందుగా బ్లడ్ బ్యాంకుకు వెళ్ళి బ్లడ్ ఇచ్చిన తర్వాత నా దగ్గరకు వచ్చాడు. 1968లో డాక్టరు ఎం.ఎస్.ఎస్. కోటేశ్వరరావు, 1969లో డాక్టరు జె. సీతారామారావు, నాదగ్గర పనిచేయటానికి వచ్చారు. ఒకరు వరంగల్ విద్యార్థి, ఇంకొకరు కాకినాడ. వచ్చిన కొద్ది కాలానికే వారిద్దరూ సన్నిహితులయి నారు. చాలా విషయాలలో వారి అభిప్రాయాలు, నా అభిప్రాయములు కలిసి నందువలన ఆత్మీయులైనారు. డాక్టర్ ఎం.ఎస్.ఎస్. కోటేశ్వరరావు అకాల మరణం మమ్మల్ని ఎంతో బాధకు గురిచేసింది.

విశాఖపట్నం మెడికల్ కాలేజీకి, హాస్టలు వసతి చాలా తక్కువ. అందు వలన ఎక్కువ మంది విద్యార్థులు, బయట ఇళ్ళు తీసుకొని, లాడ్జెస్ నడిపేవారు. ఒక్కొక్క లాడ్జిలో సుమారు పదిమంది వుండేవారు. మొదటి సంవత్సరంలో నేను డాక్టరు వై.వి. ప్రతాప్కుమార్ ఒకే లాడ్జిలో వుండేవాళ్ళము. డా ఎతిరాజులు, గుంటూరు ఏ.సి. కాలేజీలో చదివాడు.

ఎ.సి. కాలేజి నుండి మెడికల్ కాలేజీకి వచ్చిన విద్యార్థులతోపాటు వేరే లాడ్జిలో వుండేవాడు. మా లాడ్జికి అప్పుడప్పుడు వస్తూ వుండేవాడు. రెండవ సంవత్సరములో అతను కూడా నాలాడ్జిలోనే వుంటానన్నాడు. రూమ్కు ఇద్దరము మామూలుగా వుండేవారము. అప్పటినుండి మూడు నాలుగేళ్ళు అందరమూ కలిసేవున్నాము. ప్రతాప్కుమార్ కూడా అదే లాడ్జీలు వేరే గదిలో వుండేవాడు. అప్పటి నుండి మేము ముగ్గురము బయటకు ఎక్కడకు వెళ్ళినా కలిసే వెళ్ళే వాళ్ళము. డాక్టర్లము అయిన తరువాత ఎతిరాజులు ప్రభుత్వ సర్వీసులో కేరటం, ప్రతాప్కుమార్ చీరాలలో స్థిరపడటం, నేను గుంటూరులో స్థిరపడటము జరిగింది. ఎతిరాజులు ప్రభుత్వ సర్వీసులవల్ల ఎక్కువ కాలం, గుంటూరులోనే ఉన్నందువలన మా ముగ్గురిమధ్యవున్న అనుబంధం మా కుటుంబాల మధ్య కూడా ఏర్పడింది. అది మా జీవితకాలం కొనసాగింది. ఎతిరాజులు అకాల మరణంతో భార్య పిల్లలు అమెరికాలో స్థిరపడ్డారు. ప్రతాప కుమార్ కుటుంబము, మా కుటుంబంలో జయప్రదాంబ పోయినప్పటికీ సన్నిహితంగానే వుంటు న్నాము. మా పిల్లల మధ్య కూడా అదే అన్యోన్యత కొనసాగుతూవున్నది. ఎతి రాజులకు ముగ్గురు ఆడపిల్లలు, ఆముగ్గురు మా పిల్లలకన్నా పెద్దవారు. ఒకసారి నా భార్య జయప్రదాంబ, ఎతిరాజుల గారి పిల్లలు పెద్దవారు కనుక వారి సంబంధం అందుకోవటానికి వీలులేకపోయింది అని అన్నది. వారి ముగ్గురు ఆడపిల్లలు ఒకరు తెలగ కులస్తులను, రెండవవారు రెడ్డి కులంలోనూ మూడవ అమ్మాయి కమ్మవారితోను వివాహమాడారు. ఎతిరాజులు భార్య పేరు అన సూర్యమ్మ.

**ప్రతాప్ కుమార్** సంతానము ఆరుగురు ఆడపిల్లలు, ఒక మగపిల్లవాడు. ఆ పిల్లవానికి నాపేరే పెట్టాడు. ఇప్పుడు ఇద్దరము వృద్ధాప్యంవలన ఇంట్లోనే వుంటున్నాము. తరచుగా కలుసుకోవటం సాధ్యపడటంలేదు.

1952 వ సంవత్సరములో డాక్టరు కొడాలి వీరయ్య, డాక్టరు కుర్రా వీరరాఘవయ్యలు, తెనాలిలో ప్రాక్టీసు ప్రారంభించారు. అప్పటి నుండీ కొన్ని సం॥రాల పాటు శస్త్ర చికిత్సకు నా సహకారము అందించేవాడిని. వారు జీవితాంతం కలసి ప్రాక్టీసు చేశారు. నాకు తెలిసినంతవరకు, అంత అన్యోన్యంగా జీవితకాలం కలసి ప్రాక్టీసు చేసిన జంట వారే. ప్రాక్టీసులో కూడా అత్యాశకు పోకుండా, ప్రజల కందుబాటులో వుండి వైద్యము చేశారు. వారి తర్వాత వారి బిడ్డలు కూడా అలానే కలసి వుంటారనుకున్నాను. అయితే వీరరాఘవయ్య కుమారుడు సుభాష్ అకాలంగా మరణించాడు. అందువలన వీరయ్య కుమారుడు అశోక్ మాత్రమే ప్రాక్టీసు చేస్తున్నాడు.

జె.కె.సి. కాలేజీ పెట్టిన రెండు సంవత్సరములలో ఒక ఆమె ఇద్దరు ఆడ పిల్లలను తీసుకొని వచ్చింది. ఆమెకు నేను "ఇక్కడ ఎడారిలాగా వుంది సరియైన వసతులు లేవు. మీరు తెనాలి నుండి వచ్చారు మీకు సీటు ఇవ్వటానికి అభ్యంతరము లేదు కాని తెనాలిలో హాస్టలు వసతి వుంది అన్నాను. ఆమె మీ కాలేజీలో మంచి స్టాపును నియమించుకున్నారు. పిల్లలకు ఇక్కడ అయితే చదువు బాగుందని వచ్చాను. తెనాలి సంగతి తెలియక కాదు" అన్నది.

చిలకలూరిపేట నుండి ఒక వృద్ధుడు, మామూలుగా వైద్యానికి వచ్చి చుక్కల్లో చంద్రునిలాగా వెలుగుతున్నారు. అని ప్రశంసించాడు.

అనంతపురంలో ఒక నర్సింగ్ హోం ప్రారంభ వేడుకల్లో పాల్గొన్న సందర్భంగా లేపాక్షి వెళ్ళి దేవాలయంలో మెట్లు దిగివచ్చి ఒక బండమీద (వేములూరి పాడుబండ లాంటిది) కూర్చున్నా. తోటివారందరూ వచ్చిన తర్వాత "నన్ను లేపమని చెయ్యి అందిచ్చాను. ఇంతలో ఒక పొట్టిమనిషి వచ్చి చటుక్కున నా చేయి అందుకున్నాడు. "నీకు ఎందుకు శ్రమ? మా వాళ్ళు ఉన్నారు కదా" అన్నాను. దానికి ఆయన "ఇంత పెద్దవారు ఎంతమందికి ఎన్నో సాయాలు చేసివుంటారు కదా. ఈ సాయం నేను చేయటానికేముంది" అన్నాడు.

అటువంటి వాళ్ళ స్నేహశీలతను ఎలా మరువగలను?

బహుకాలంగా కాంగ్రెసు ఉద్యమంలో పనిచేసి స్వాతంత్ర్యానంతరం ఏ పదవి ఆశించకుండా ఉన్న **గొట్టిపాటి బ్రహ్మయ్యగారిని** సంజీవరెడ్డిగారు ముఖ్య మంత్రి అయినప్పుడు ఎం.ఎల్.సి. చేసి, లెజిస్లేటివ్ కౌన్సిల్కు ఛైర్మన్ గా చేశారు. వారు ఆపదవిని సమర్ధవంతంగా నిర్వహించారు. వారికి కృష్ణాజిల్లా ఘంట శాలలో, వారింట్లో శస్త్ర చికిత్స చేసే అదృష్టం నాకు కల్గింది. ఇట్లానే మరికొంత మందికి కూడా వారింటిలోనే చేసిన శస్త్రచికిత్సను బ్రహ్మయ్యగారు గుర్తుపెట్టుకొని 'జీవననౌకలో ఉటంకించి, మా దంపతల సేవలను శ్లాఘించారు.

అదే ఘంటశాల వాస్తవ్యులు పండిత గొఱ్ఱెపాటి వెంకటసుబ్బయ్యగారు పరిచయమై చాలాసార్లు సాహితీ సదస్సులో పాల్గొని ఆ రాత్రిపూట, ఆయన సంజీవదేవ్, బి.వి. నరసింహరావు మొదలైనవారితో మా ఇంట్లోనే బసచేసేవారు. వారు వ్రాసిన "నేను నా మిత్రులు" అన్న గ్రంథంలో మా దంపతులను గూర్చి రెండు పేజీలు ప్రశంసా పూర్వంగా వ్రాసారు. అలానే ఆచార్య రంగాగారు తనకు పరిచయమైన విశిష్ట వ్యక్తులను గురించి రెండు వ్యాసాలు వ్రాసారు. అందులో మా దంపతులను గురించి రెండు మూడు పేజీల వ్యాసం వ్రాశారు. వీరందరికి నా కృతజ్ఞతలు.

సంక్రాంతి మిత్రులనే సంస్థలో సభ్యులు, బహుకాలం పశ్చిమగోదావరి జిల్లా కో ఆపరేటివ్ బ్యాంకులో ఉద్యోగం నిర్వహించి, పదవీ విరమణానంతరం అబ్యాంకుకే ప్రసిడెంటు అయ్యారు వేగుంట కనక రామబ్రహ్మంగారు వారి ఉపన్యాస ధోరణి విని ఆనందించవలసినదేగాని, వ్రాయనలవికారు, సాహిత్యభి లాష చాలా గొప్పది, జీవితంలో ఎన్ని దర్ఘటనలు ఎదురైనా, స్థిర చిత్తంలో వుండి చివరివరకూ సాహిత్యాభిలాషను కొనసాగించారు. వర్తమానమునకు సంబంధించిన పుస్తకాలు ఎన్నో సంపాదించారు. ఆయన జీవితాన్ని అధ్యయనం చేసి ఒకరు ఎం.ఫిల్. కూడా తీసుకున్నారు. వారికి మిత్రులంటే అపారమైన ప్రేమ.

వారు సాహితీ సదస్సులో ఎక్కువగా పాల్గొనేవారు. వారి మరణానంతరం మండవ శ్రీరామమూర్తిగారు "మాటతప్పిన మహామనిషి" చిన్నవ్యాసం వ్రాసారు.

స్వాతంత్ర్య సమరయోధులు గుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలూకా, ఇరుకుపాలెం గ్రామస్తులు దరువూరి వీరయ్యగారు. నా పెండ్లికి కందుల ఓబుల రెడ్డి గారితోపాటు వచ్చారు. ఆ తర్వాత రెండు సంవత్సరాలకు నేను గుంటూరులో ప్రాక్టీసు పెట్టినప్పటినుండి సన్నిహితంగా వుండేవారు. ఒకరోజు మామూలుగా వీరయ్యగారు ఇంటికి వచ్చినప్పుడు, మా మేనకోడలు ఆశ చాలాఉత్సాహంగా "వీరయ్యగారు మీపేరు పేపర్లో చూశానండీ", అన్నది. విషయం ఏమిటంటే తనకు స్వాతంత్ర సమరయోధునిగా ఇచ్చిన 5 లేక 10 ఎకరాల పొలాన్ని స్వచ్ఛందంగా ప్రభుత్వానికి అప్పగిస్తూ "దేశంలో పేదవారు. చాలామంది వున్నారు. ఈ పొలాన్ని వారికెవరికైనా ఉపయోగించండి. అని ఆ పొలాన్ని వదులుకొన్నాడు. మా ఆశ ఆవార్త చదివిన తర్వాత "వీరయ్యగారు మీకు, మీ కుటుంబానికి మా హాస్పిటల్లో ట్రీట్మెంటు ఉచితంగా ఇస్తాము అని ప్రకటించింది. అదే విధంగా జరిగింది. నేను రాజకీయాలలోకి వచ్చిన తర్వాత నాకు చేదోడు వాదోడుగా వుండేవాడు. (సంపూర్తి జీవితాన్ని గడిపి ఇటీవలే స్వర్గస్తులైనారు). వీరయ్యగారు (తమంతతాము) పొలం వదులు కోవటం మాత్రమేగాక ప్రభుత్వమువారు తరువాత తాముగా శాంక్షనుచేసిన పెన్షను నిరాకరించారు. సంపూర్ణ జీవితాన్ని గడిపి వారు ఇటీవలే స్వర్గస్తులైనారు.

కొందఱు భావుకుండనియు, కొండలు మంచి రసజ్ఞుడంచు వా

కొందరు, వైద్యలోకమునకున్ తలమానికమందు రందఱున్

ఎందఱో 'సాహితీప్రియుడటే' యని కన్నుల కద్దికొందు రీ

చందములన్ని మీ హృదయ సంస్కృతికెత్తు పతాకలే కదా!

–శ్రీ చిన్నము రామయ్య చౌదరి

# విద్యారంగంలో కృషి

చదువుకున్న ప్రతి వ్యక్తికి, విద్యావిధానాలగురించి కొన్ని అభిప్రాయాలు ఉంటాయి. ఎక్కువ సందర్భములలో తాము చదువుకొన్న విద్యావిధానాలే మంచివని, తరువాత వచ్చిన విధానాలవలన, మంచికి బదులు చెడు జరుగు తుందని భావిస్తుంటారు. ఒకప్పుడు పల్లెటూళ్ళలో, ప్రాధమిక విద్య చదవటం, వ్రాయటం, ఆ తర్వాత సమాజానికి అవసరమైన గణితమువరకు నేర్పేవారు. ఉపాధ్యాయులు డిగ్రీలువున్నవారు కాదు. అంతకుముందు గురుముఖతా నేర్చు కున్న చదువులతోపాటు, ఆపైన కావ్యాలు, మొదలైనవి చదివి, వారి విజ్ఞానాన్ని వృద్ధి చేసుకొనేవారు. నేను స్కూల్లో చేరేనాటికి ఈ పద్ధతి చాలా మారింది. గవర్నమెంటువారు ఉపాధ్యాయులను నియమించడం, విద్యార్థులకు అవసరమైన పాఠ్య గ్రంథాలు నిర్ణయించడం జరిగింది. అంతకుముందు స్కూల్లో చదివిన ఆంధ్రనామ "సంగ్రహం 'అమరకోశం' లాంటివి అప్పటికే మరుగున పడి పోయాయి. ఆ తర్వాత హైస్కూలులో ఇంగ్లీషు తెలుగు, లెక్కలు, సైన్సు, హిస్టరీ, జాగ్రఫీ బోధించేవారు. ప్రస్తుత విద్యావిధానంలో పిల్లలను చాలా హింసకు గురిచేస్తున్నారని. నా అభిప్రాయము. ఎల్.కె.జి., యు.కె.జి. ఆపైన ఒకటి రెండు తరగతులు, ఇంగ్లీషు భాషలో బోధించటం, మాతృ భాషను పూర్తిగా ఉపేక్షించటం జరుగుతున్నది. మామూలుగా ఐదు ఆరు సంవత్సరాల వయస్సులలో స్కూలుకు వెళ్ళేబదులు, మూడవ సంవత్సరము నుండి స్కూళ్ళకు పంపటం, చాలా గంటలపాటు స్కూలులో వుండటంవలన వారికి సరైన ఆహారం కూడా అందకపోవటం, ఆటపాటలకు అసలే సమయం లేకపోవటంవలన వారి ఆరోగ్యము వారు ఆశించిన స్థాయిలో వుండటంలేదు. పై చదువులకు వచ్చిన తర్వాత ఎన్నో రకాలుగా అభివృద్ధి చెందిన విజ్ఞానము, వారికందజేస్తున్నారు. అది అభిలషనీయమే. దీనివలన మాతృభాషపై ఏమాత్రము పట్టులేని చదువు.

అందువలన కాలేజీ స్థాయివరకైనా, మాతృ భాషకు ప్రాధాన్యముఇచ్చి, ఆపైన ఇతర భాషలను నేర్పగలిగితే బాగుంటుందని నా అభిప్రాయం.

గుంటూరు పట్టణం, దాదాపు ఒకటిన్నర శతాబ్దము నుండి, ఉన్నత విద్యా కేంద్రంగావున్నది. దీనికి ప్రధానమైన కారణము క్రిస్టియన్ మిషనరీస్, దేశంలో విద్యా, వైద్యముల అవసరాన్ని గుర్తించి, హైస్కూలు, కాలేజీలు పోప్పేటల్పు నెలకొల్పారు. ఆ విద్యా సంస్థలలో చదువుకొని, గుంటూరులో అడ్వకేట్లుగాను, ఉద్యోగులుగాను స్థిరపడిన పెద్దలు, హైస్కూల్పు, కాలేజీలు నడపగలిగారు. గ్రామాలకు సంబంధించినంత వరకు ఎక్కువ గ్రామాల్లో వీధిబడుల్లోనే చదువు కొనేవారు. ఆ ఉపాధ్యాయులకు, ఇంగ్లీషు చదువని వారికి సర్టిఫికేట్లు వగైరాల్లేవు. వారిలో ఎక్కువ మంది తమ తల్లి దండ్రులవద్దనో గురుముఖంగానో నేర్చుకొన్న విద్యను బోధించేవారు. గ్రామస్తుల అవసరాలకు, ఆ విద్య సరిపోయేది.

**మా గ్రామాన్ని తొలిగా సందర్శించిన మంత్రి :**

ఉపాధ్యాయులు గొప్ప పాండిత్యము గలిగిన వారుకూడా వుండేవారు. వారు విద్యార్థులకు బోధన మాత్రమేగాక, పెద్దలకు పురాణ పఠనమువలన, అవసరమైన విషయములు ఎన్నో చెప్పేవారు. కొన్ని చిన్న గ్రామాలలో ఈ వసతి వుండేది కాదు. నేను పుట్టిన గ్రామములో, ప్రభుత్వపు స్కూలు లేదు. ప్రైవేటుగా బడులు పెట్టినవారు ఎక్కువ కాలము ఎవరూ వుండలేదు. నేను గుంటూరులో స్థిరపడిన తర్వాత జిల్లా బోర్డు ఒక స్కూలును ఏర్పాటు చేశారు. దానికి వసతి మాత్రం ఎవరి చావడిలోనే వుండేది. తక్కెళ్ళపాడు గ్రామస్తురాలు మోపర్తి అబ్బయ్య గారి భార్య రత్తమ్మగారు మా గ్రామమునకు ప్రక్కనే వున్న ఇరవయి సెంట్ల భూమిని ఇచ్చి నన్ను స్కూలు భవనము కట్టించమని కోరారు. సుమారు 1955 ప్రాంతాల్లో జిల్లా పరిషత్ ద్వారా స్కూలు ఏర్పాటు చేయటానికి ప్రయత్నం చేశాను గానీ ఉద్యోగస్తుల మొరటుతనంవలన, అది సాధ్యం కాలేదు.. తరువాత సైక్లోన్ రిలీఫ్ ఫండ్ ద్వారా అనుకొంటాను.

పంచాయితీలో ఎన్.ఇ. సీతారామారావుగారు ఆ స్థలంలో రెండు గదుల భవనం ఏర్పాటు చేశారు. దాని ప్రారంభానికి అప్పటి విద్యాశాఖామంత్రి భాట్టం శ్రీరామమూర్తి, డైరెక్టర్ ఆఫ్ హైయర్ ఎడ్యుకేషను రామచంద్రన్ గారిని తీసుకొనివెళ్ళాను. మా గ్రామమునకు మంత్రి రావటము. అదే మొదటిసారి.

**శ్రీ పాటిబండ్ల సీతారామయ్య పాఠశాల ప్రారంభం :**

నా హైస్కూలు చదువంతా హిందూ కళాశాల హైస్కూలు, హిందూ కాలేజీలలో జరిగింది. గుంటూరులోని, విద్యాభిమానుల ఔదార్యమువలన, ఏర్పాటు అయిన సంస్థలు అవి. ప్రతి విద్యార్థి, తన చదువుకు కొంత ఖర్చుపెట్టినా అటు ప్రభుత్వము, ఇటువంటి విద్యా సంస్థల వల్లనే చదువు పూర్తి అవుతుంది. స్వాతంత్ర్యానంతరం పల్లెల్లోనూ, పట్టణాలలోనూ ఉన్నత విద్యపై అభిమానులు పెరగటంవలన చాలా పట్టణాలలోనూ, కొన్ని పల్లెటూళ్ళలోనూ, మాతన హైస్కూళ్ళు, కాలేజీలు నిర్మించేవారు. కాలక్రమేణా అన్ని సంస్థలలోనూ, ఒత్తిడి పెరిగి సీటు దొరకని పరిస్థితి ఏర్పడింది. గుంటూరులో స్థిర నివాసమున్న వారి పిల్లలకు కూడా హైస్కూలులో సీటు దొరకటం కష్టం మైనది.

"లాం" గ్రామంలో శ్రీపాటిబండ్ల సీతారామయ్య అనే గొప్ప వ్యక్తి వుండే వారు. అంటే సంపన్నుడని కాదు. వీరు విద్యపై విశేషమైన అభిమానం కలవారు. ముఖ్యంగా కమ్మకులస్తులకు ఉద్యోగాలలోనూ, చదువులోనూ, ఏ ఇబ్బందీ లేకుండా ఆదుకొనేవారు. 1962లో వారి సంవత్సరీకం జరిగింది. వారి బంధువులతో పాటు గుంటూరులోని విద్యావంతులను చాలామందిని ఆహ్వానించగా ఆరోజున పెద్దలందరూ, భోజన కార్యక్రమము ముగిసిన తరువాత అక్కడే సమావేశమై, వారి పేరిట ఒక విద్యా సంస్థను నెలకొల్పాలని నిర్ణయించి దాని కొరకు వచ్చిన పెద్దలు కొంతమంది రూ.11600 రూ.లను విరాళంగా ప్రకటించారు. సీతారామయ్యగారి స్వయాన మేనమామ అయిన వాసిరెడ్డి సీతాపతిగారిని కమిటీ ప్రెసిడెంటుగా ఎన్నుకోవటం జరిగింది.

నేను కార్యవర్గ సభ్యునిగావుంటేనే సీతాపతిగారు తాము అధ్యక్షునిగా వుంటామన్నారు. మీరు అధ్యక్షునిగా వున్నప్పుడు నేను సభ్యునిగా వుండటానికి అభ్యంతరమేముండదు. మీకు తెలుసుగదా, నేను చాలా బిజీగా వుంటాను. దీనిపై కాలం వెచ్చించలేను అన్నాను. అన్నప్పుడల్లా "మిమ్మల్ని మేము డిస్టర్బ్ చేయము. ఎక్కడికన్నా తప్పనిసరిగా వెళ్ళవలసివస్తేనే మిమ్మల్ని డిస్టర్బ్ చేస్తామని వారు అన్నారు. నేను ఒప్పుకొన్నాను. సభ్యత్వ రుసుము రూ.250.00 గా నిర్ణయించాము. మిగతా పదముగ్గురు 1) సర్వశ్రీ వై.కె.యస్. ప్రకాశరావు, 2) వై. కోటేశ్వరరావు, 3) కారుమంచి వెంకట సుబ్బయ్య 4) జాగర్లమూడి చంద్రమౌళి 5) జి. నరహరి ఇలా ఇంకా వున్నారు. అప్పటినుండి నేను హైస్కూలు కమిటీ మెంబరునే. ఏ సమావేశమునకు వెళ్ళటానికి తీరేది కాదు..

సీతాపతిగారి అకాల మరణమువలన వై.కె.ఎస్. ప్రకాశరావు గారు అధ్యక్షులయ్యారు. ఆ తర్వాత చాలా మంది అయ్యారు. మొదటి సెక్రటరీగా మొవ్వా చంద్రశేఖరరావు, గోగినేని కనకయ్య, తరువాత చాలామంది. ప్రస్తుతం ఆలోకం పెద్ద బ్బయ్య అధ్యక్షునిగా, వాసిరెడ్డి జయరామయ్య సెక్రటరీగా వున్నారు. హైస్కూలు ప్రారంభించినప్పటి నుండి మంచిపేరు సంపాదించినది. మొదట్లో రిటైర్డు హెడ్ మాస్టర్ వుండేవారు. తర్వాత ఘంటా సుబ్బారావు ఎం.ఏ., బి.ఇడి., హెడ్మాస్టరై 20 సంవత్సరాలు దిగ్విజయంగా నడిపారు.

**అంతా మన మంచికే :**

1988లో మోహనరంగా తనిపోయినప్పుడు ముష్కరుల దృష్టి. ఈ హైస్కూలు పైబడి, బిల్డింగులు తగుల బెట్టారు. తరువాత, గుంటూరులోని విద్యాభిమానులు పెద్ద ఎత్తున విరాళాలు వసూలుచేసి, అదనంగా కొంత స్థలం కొని, మూడంతస్థుల బిల్డింగు నిర్మాణం చేశారు. గుంటూరు మునిసిపల్ స్టేడియం ఆనుకొనివున్న ఈ హైస్కూలు, ఆవరణ, బిల్డింగులు, గుంటూరు

నగరానికే శోభ తెచ్చేవిగా వున్నాయి. విద్యా ప్రమాణాలు, ఇప్పటికీ బాగానే వున్నాయి.

**జె.కె.సి కళాశాల ఆవిర్భావం :**

నేను హైస్కూలు కమిటీ మెంబరుగా వుండటం మినహా, చేసిన ప్రత్యేక కృషియేమీ లేదు. 1967 నాటికి, అంతకు పూర్వము హైస్కూలు సీట్లకు ఏవిధమైన కొరతవచ్చిందో, అదే పరిస్థితి కాలేజీకి కూడా వచ్చింది. అందువలన కళాశాల అవసరాన్ని గుర్తించాము. దానికితోడు పోస్టు గ్రాడ్యుయేట్స్లు లెక్చరర్లుగా ఉద్యోగాలు దొరకక ఖాళీగావున్నవారు, పట్టణంలోని పెద్దల వద్దకు వచ్చి, కళాశాల పెట్టమని అభ్యర్థించారు. దానికి వారు ఆర్థిక సహాయము కూడా అందించటానికి సిద్దపడ్డారు. పట్నంలోని పెద్దలు, పట్నంలోని కమ్మహాస్టలులో సమావేశమై కళాశాల అవసరాన్ని గుర్తించి, కళాశాలను ఏర్పాటు చేయటానికి నిర్ణయించి అక్కడే కమిటీ ఏర్పాటును గురించి, శ్రీ జాగర్లమూడి చంద్రమౌళి గారు, అధ్యక్షులుగాను, శ్రీ చేబ్రోలు హనుమయ్యగారు ఉపాధ్యక్షులుగా నన్ను కార్యదర్శిగాను, వై.కె.ఎస్. ప్రకాశరావు, ట్రెజరర్ గాను, గోగినేని కనకయ్యగారు, అడిషినల్ సెక్రటరీగాను, ఒక కమిటీ ఏర్పాటు చేసి, మిగతా మెంబర్లను కో–ఆప్ట్ చేసుకొనే అధికారాన్ని మాకు ఇచ్చారు. జాయింట్ సెక్రటరీగా నన్నపనేని వీరయ్య చౌదరిగారు, వారప్పుడే గవర్నమెంటు సర్వీసులో డి.ఇ.ఓ. గా చేసి రిటైర్ అయివచ్చారు. కళాశాల స్థాపనలోనూ నిర్వహణలోనూ వారెంతో కృషి చేశారు. తరువాత యూనివర్శిటీ వారిని అభ్యర్థించి 1968 జూలైలో గుంటూరులో కళాశాలను స్థాపించాము.

జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరిగారి కుమారులు చంద్రమౌళి గారు, మదన మోహనచౌదరి (బంగారుబాబు గారు లక్ష్మయ్య చౌదరిగారు ఒక లక్ష రూపాయల విరాళము ఇచ్చారు. కేవలం విరాళాల దృష్టితో గాకుండా, అంతకు పూర్వము కుప్పుస్వామి చౌదరిగారు, గుంటూరు జిల్లాలో బహు కాలము జిల్లా

బోర్డు ప్రెసిడెంటుగా అందించిన సేవలను, దృష్టిలో వుంచుకొని వారిపేరుతో కళాశాల ఏర్పాటు చేయటం జరిగింది.

జాగర్లమూడి చంద్రమౌళిగారు కుప్పుస్వామిగారి పేరు పెట్టినా, పెట్టక పోయినా ఒక లక్షరూపాయలు ఇస్తానని చెప్పారు. అదే కాలంలో గుంటూరు జిల్లాలో, పెదనందిపాడు చిలకలూరిపేట, అమరావతిలలో కూడా కాలేజీలు స్థాపించారు.

ఈ కమిటీవారి మొదటి నిర్ణయం లెక్చరర్లుగా సెలక్టయినారు. ఇస్తామన్న ఆర్థిక సహాయమును తిరస్కరించటం. స్టాఫ్ సెలక్షన్లలో మెరిట్ కు ప్రాధాన్యత ఇవ్వటం.

విరాళాలు, నవభారత్ కంపెనీవారు రూ. 50,000/- (నవభారత్ చౌదరిగారు)
గోల్డెన్ టుబాకో వారు రూ.25,000/- (శ్రీ మంగళదాసుగారు).
ఈస్ట్ ఇండియా టుబాకో కంపెనీవారు రూ.25,000/-వై.కె.ఎస్. ప్రకాశరావుగారు.
చేబ్రోలు హనుమయ్యగారు రూ.25,000/-
మద్ది వెంకటరత్నంగారు రూ.25,000/-
గౌరిజవోలు వెంకట్రామయ్యగారు రూ.5,000/-
గోగినేని కనకయ్యగారు. 10,000/-
నేను ఒకసారిగా ఇవ్వకపోయినా, రూ.25,000/- వరకూ,
కారంచేడు గ్రామములో రూ. 70,000/- వేలు, వసూలుచేసుకొని వచ్చాము.

**గ్రాంటులేని కళాశాలలో వేతన స్కేళ్ళు:**

ప్రభుత్వము వారు కాలేజీకి ఇచ్చిన సర్మిషనులో మూడు సంవత్సరాలకు టీచింగు గ్రాంట్లు లేవన్నారు. టీచింగు గ్రాంటు లేకుండా, లెక్చరర్లు స్కేల్సు ప్రకారం జీతాలు ఇవ్వటం ఎంతో కష్టమని భావించి పాత స్కేల్సు ప్రకారం, ఇస్తే ఎట్లా వుంటుందన్న ఆలోచన చేశాము, అప్పుడు పెట్టిన మిగతా కళాశాలలో

జరిగినదే. నేను దానికి ఒప్పుకొనక "మంచి కళాశాల పెట్టాలని ప్రారంభించాము. జీతాలు మనం సక్రమంగా ఇచ్చినప్పుడే. వారు సక్రమంగా పనిచేయగలుగుతారు. అందువల్ల న్యూస్కేల్స్ ప్రకారము ఇవ్వవలసిందే"నని పట్టుబట్టాను. 80 సెంట్ల స్థలంలో నిర్మించిన రెండు పెద్దగోడౌనులను రూ.75,000/- కొని, దానికి అనుకున్న మరొక నలభై సెంట్లచోటు రూ.14,000/- కొని, ఆ షెడ్డులోనే కళాశాలను ప్రారంభించాం. తూర్పువైపున వున్న ఆరున్నర ఎకరాల స్థలమును, ఎకరము రూ.15000/-ల చొప్పున అగ్రిమెంటు వ్రాయించుకొని, క్లాసు రూములకు కొన్ని షెడ్లను, నిర్మించి, అన్ని ఒకేలా ఏర్పాటు చేశాము. నిదానముగా పర్మినెంటు బిల్డింగ్సు నిర్మించాము. కళాశాల ప్రారంభోత్సవము, జులై 14వ తేదీన, కొత్త సచ్చిదానందమూర్తి అధ్యక్షతన, గుంటూరు హిందూ కళాశాల రిటైర్డు ప్రిన్సిపాల్ శ్రీ బుద్ధిరాజు రామచంద్రరావుగారు ప్రారంభించారు. ప్రఖ్యాత కవులు శ్రీ మళ్ళి పూర్ణ ప్రజ్ఞావార్యులు, శ్రీ గుఱ్ఱం జాషువా, శ్రీ తుమ్మల సీతారామమూర్తి ఆశీస్సులందించారు. సీతారామమూర్తిగారి ఆశీర్వాదములతో ఒక పద్యం అప్పటినుండి కాలేజీ మ్యాగజైనులో మొదటిపేజీలో ప్రచురించటం ఇప్పటికీ అనవాయితీ. ఆ పద్యం ఇదే.

కాలేజీలకు లోటు లేదు మన మాగాణమ్మునం; చెవ్వండి
బాలుం, దీ విషయాంక, మీ చతురతాభాస్వంతుఁ డంచె వ్వరే
నాలాపించినఁ గుప్పుసామి పద విద్యాశాల "యీ బిడ్డ నా
పాలన్ రేణినవాఁ"డనవ్వలయు సంపద్భారమై ధీరమై

ప్రారంభించినది మొదలు, విద్యాబోధనకు, పరీక్షా ఫలితములకు, ఈ కాలేజీ ప్రసిద్ధికెక్కినది. మూడో సంవత్సరం గ్రాంటు అన్న ప్రభుత్వం, 5 సం॥ల వరకు గ్రాంటు ఇవ్వలేదు. అయినా ఆ భారాన్ని ఎలాగో నిర్వహించాము. దానికి కళాశాల అధ్యాపకుల సహకారము కూడా వుంది. మొదటి ఎనిమిది సం॥లు నేను సెక్రటరీ మరియు కరస్పాండెంటుగా వున్నాను.

అన్నట్టు చెప్పటం మరచిపోయాను. కళాశాల ప్రారంభానికి ముందే, విద్యా సంస్థకు నాగార్జున ఎద్యుకేషను సొసైటీ అని నామకరణం చేశాము. ఎయిమ్స్, ఆబ్జెక్టులో కేవలం ఒక కళాశాలయేకాక, విద్యా విషయంగా అవసరమయిన, మిగతా సంస్థలు ఏర్పడే దానికి అవకాశము కల్పించాము.

విద్యా కమిటీకి 3 సంవత్సరములకొకసారి ఎన్నిక జరుగవలెనని, మొదట ఏర్పడే కమిటీకి మాత్రం 5 సం॥లు వుండవలెనని నిర్ణయించాము. దీనికి కారణం, అంతకు పూర్వము ఏర్పాటైన కళాశాల కమిటీలు, తెనాలిలోనూ నిడుబ్రోలులో చీరాలలోనూ, వివాదాలలో చిక్కుకొన్నవి. ఐదు సంవత్సరాలకు కాలేజి స్థిరపడగలదని, ఆ తరువాత ఎటువంటి వివాదాలు వచ్చినా, కళాశాల ఉనికికి భంగము కలుగదు అన్న భావనే. రెండో టర్మ్ కూడా మేము వున్నాము. తరువాత కమిటీలో 'సెక్రటరీగా (మూడవసారి) నేను

**పేరేచర్లలో గురుకుల విద్యావనం :**

1968లోనే పేరేచర్లలో గురుకుల విద్యావనం పేరుతో వున్న హైస్కూలు కొన్ని. చిక్కులలో పడ్డందువలన ప్రభుత్వము వారు రద్దు చేసిన గుర్తింపును, తిరిగి సంపాదించి, హైస్కూలు నిర్వహణ, అంతకు ముందున్న కమిటీకే ఇచ్చి, అధ్యక్షుడుగా మాత్రమే నాగార్జున ఎద్యుకేషనల్ సొసైటీ నుండి నిర్వహించే ఏర్పాటు జరిగింది. నాగార్జున ఎద్యుకేషన్ సొసైటీకి సెక్రటరీగా డాక్టర్ మద్దినేని గోపాలక్రిష్ణగారు, కాలేజీ సెక్రటరీగా డా కె. బసవపున్నయ్యగారు వున్నారు. అనూహ్యంగా తరువాత కాలములో, చాలా విద్యా సంస్థలు, నాగార్జున ఎద్యుకేషనల్ సొసైటీ స్థాపించటం జరిగింది. కె.ఎల్.పి. పబ్లిక్ స్కూలు, ఆర్.వి.ఆర్. కాలేజీ ఆఫ్ ఎద్యుకేషను, జె.సి. కాలేజి ఆఫ్ లా. ఆర్.వి.ఆర్. అండ్ జె.సి. కాలేజీ ఆఫ్ ఇంజనీరింగ్, చేబ్రోలు హనుమయ్య కాలేజీ ఆఫ్ ఫార్మసీ ఏర్పడినవి. నర్సింగ్ కాలేజీకూడా రానున్నదని విన్నాను. ఇంజనీరింగు కాలేజీ మాత్రము మద్రాసు ట్రంకురోడ్డై గుంటూరుకు 13 కి.మీ. దూరంలో చౌడవరం

గ్రామంలో 50 ఎకరాల విస్తీర్ణంలో నిర్మాణము చేశారు. ఫార్మసీ కాలేజీ కూడా అప్పట్లో నిర్మాణము చేయటం జరిగింది. గుంటూరు పట్టణములో ఇంజనీరింగు విద్యార్థినుల కొరకు హాస్టలు నిర్మాణం జరిగింది.

నాగార్జున ఎడ్యుకేషన్ సొసైటీ అధ్యక్షునిగా సేవలు : 1988లో అప్పటి ఈ సంస్థల అధ్యక్షుడు శ్రీ జాగర్లమూడి చంద్రమౌళిగారు దివంగతులైన తర్వాత ఆ సంస్థలో పెద్దల కోరిక మేరకు నేను, ఆ స్థానంలో అధ్యక్ష పదవి స్వీకరించాను. అప్పుడు దాదాపు 15 సంవత్సరములు ఆ పదవిలో వుండి, 2003లో ఐచ్ఛికంగా మానుకున్నాను. ఈ సంస్థల ఏర్పాటు మొదలు, ఇప్పటి వరకు జరిగిన ప్రగతిలో పాల్పంచుకోవటం నా అదృష్టంగా భావిస్తాను. ఈ సంస్థలో పని చేసే ఉద్యోగస్తులు, నన్ను ఎంతో అభిమానించేవారు. వారి అవసరాలను గురించి కూడా 'నేను చాలా శ్రద్ధ చూపించేవాడిని.

**కలిసివచ్చిన రోశయ్యగారి క్రమశిక్షణ :**

జె.కె.సి. కాలేజీ మొదటి ప్రిన్సిపాల్ శ్రీ ఎలవర్తి రోశయ్యగారు, వారు ఇంగ్లీషు, తెనుగు భాషలలో అఖండమైన పాండిత్యము కలిగినవారు, అంతకు మించి క్రమశిక్షణ గొప్పగా పాటించేవారు. అధ్యాపకులకు మార్గదర్శిగా వుండేవారు. వారిని ప్రిన్సిపాల్గా చేయవలసి వచ్చినప్పుడు కాలేజీ కమిటీ సభ్యులు చాలా మందికి వారి క్రమశిక్షణ "అతి"గా వుండి, అధ్యాపకులలో విద్యార్థులలో, వ్యతిరేకత వస్తుందని భయపడ్డారు. దానికి భిన్నంగా వారు రిటైరు అయిన తరువాత, దాదాపు 20 సంవత్సరాలు, వారి వరవడినే కళాశాల చాలా క్రమబద్ధంగా జరిగిందని, అధ్యాపకుల భావన. ఆ తరువాత వచ్చిన ప్రిన్సిపాల్స్ డాక్టర్ అనంతం, డాక్టర్ సి.ఎన్.ఎస్. శాస్త్రి (అమరేంద్ర), వీరిద్దరూ అనే పద్ధతిలో కళాకాదు (మక్కలతో నడిపించారు. ఆ తరువాత మీ నటన్నా గాడు. జె.సోమేశ్వర శర్మగారు చెన అయిదు సంవత్సరములు ప్రిన్సిపాల్ బాధ్యతలను బాగా నిర్వహించారు.

ఆ తరువాత ఎన్. భూషయ్యగారు, తరువాత శరణు రామక్రిష్ణ ప్రసాద్ రు ప్రిన్సిపాల్గా చేస్తున్నారు. కళాశాలలో కాలక్రమేణ కంప్యూటర్ కోర్సులు, బయోటెక్, యు.జి., పి.జి., మాధమేటిక్స్, కెమిస్ట్రీ, ఇంగ్లీషు సబ్జక్టులలో, పి.జి. కోర్సులు ప్రారంభించి నడుపుతూవున్నారు.

శ్రీ జాగర్లమూడి చంద్రమౌళిగారి మరణం తర్వాత వారి రెండవ కుమారుడు నరేంద్రనాథ్, సెక్రటరీ పదవి చేపట్టి కళాశాలకు నూతన భవనాలను నిర్మించారు.

జె.కె.సి. కళాశాల స్థాపించిన కొద్ది రోజులకే, మంచి పేరు ప్రతిష్టలు సంపాదించి నందువలన తరువాత స్థాపించిన అన్ని సంస్థలకు ఆదర్శ ప్రాయమై, మంచి పేరు సంపాదించుకొన్నది.

**కమ్మ హాస్టలు :**

గుంటూరు అరండల్పేటలో కమ్మహాస్టలు వున్నది. 1919లో అప్పటికి గుంటూరులో వున్న కమ్మవారు, జిల్లాలో వున్న పెద్దలు గుంటూరులో కమ్మ విద్యార్థుల వసతి కొరకు హాస్టలుకావాలని నిర్ణయించారు. అదే సమయంలో శాఖమూరి లక్ష్మీదేవమ్మ అనే ఆమె ఆరండల్పేట 4–5 లైన్ల మధ్య ఒక భవనాన్ని నిర్మించి, సత్రము పెట్టవలెనని ఆలోచన చేశారు. గుంటూరు విద్యా కేంద్రము అగుటవలన అప్పుడే కమ్మ విద్యార్థులు హైస్కూలు, కళాశాలలకు రావటం మొదలుపెట్టారు. అరండల్పేట బ్రాడీపేటలలో అప్పటికి నివాసముంటున్నవారు ఎక్కువమంది బ్రాహ్మణులు, విద్యార్థులు గది అద్దెకు అడిగిన గృహస్తులు శూద్రులకు గదులు అద్దెకిచ్చేవారుకాదు. అందువలన కమ్మవారిలో పెద్దలు ఒక సంఘముగా ఏర్పడి దానికి "కమ్మ విద్యార్థి సహాయ సంఘము" అని నామకరణం చేశారు. శ్రీమతి శాఖమూరి లక్ష్మీదేవమ్మగారి మేనల్లుడు చిరుమామిళ్ళ లక్ష్మీ నారాయణప్రసాద్ గారు, గుంటూరులో డిప్యూటీ కలెక్టరుగా

వుండేవారు. ఈ సంఘము వారు వారి వద్దకు వెళ్ళి, మీ మేనత్తగారిని నిర్మాణము చేసిన బిల్డింగును హాస్టలుకు ఇవ్వమని, ఆమెను కోరమన్నారు. ఆమె అంగీకరించింది. అప్పుడు హాస్టలు ప్రారంభమైనది.

సంఘ సభ్యత్వాన్ని గురించి, నిర్వహణ గురించి, వారు వివరంగా వ్రాసు కొన్నారు. అయితే కాలక్రమేణా వారిలో ఎక్కువ మంది మరణించటం జరిగింది. జిల్లా వ్యాప్తంగా చాలా మంది వారి ఆస్తులనిచ్చారు. పాతతరం పోయిన తర్వాత డాక్టరు పర్చూరి వీరయ్య చౌదరి ఒక్కరే హాస్టలును నిర్వహించేవారు. వారి హయాంలో కొన్ని ఆస్తులను అమ్మి అరండల్పేట 3–4 లైన్ల మధ్యవున్న భవనాన్ని రూ. 40,000/– వేల రూ.లకు కొని డబ్బిచ్చి, రిజిష్టరు చేయించుకొనలేదు. ఈలోపు వారి కుమారులు వారికి కూడా హక్కువున్నదని, మరొక నలభైవేలు ఇస్తేగాని రిజిష్టరు చేయమన్నారు. అప్పుడే జిల్లా జడ్జిగా రిటైరైన తేళ్ళ క్రిష్ణమ్మచౌదరిగారు తను పూర్వవిద్యార్థిగా వుండి చదువుకొన్న హాస్టలు పరిస్థితి సవ్యంగా లేదని తెలుసుకొని, పట్నంలో వున్న కమ్మ పెద్దలను సమావేశ పరచి నూతనముగా నియమ నిబంధనలను ఏర్పరిచి, హాస్టలును అభివృద్ధి చేయ వలెనని సంకల్పించారు. ఆ సందర్భంగా మొట్టమొదటి నియమాలను గురించి (ఒరిజినల్) వున్న కాగితమును పఠించడం జరిగింది. దాని ప్రకారము అప్పటి సభ్యులు ఎవరూలేరు. అందువలన నూతన సభ్యులను చేర్చుకొని, వారితో కమిటీ ఏర్పాటు చేశాము. గుంటూరు మంగళగిరి రోడ్డులో వున్న ఆరు ఎకరాల పొలమును నవభారత్ కంపెనీకి రూ.36,000/– లకు అమ్మి మిగతా సొమ్మను సభ్యులు చెల్లించి అంతకు పూర్వము రిజిష్టరు లేకుండా వున్న భవనమును, రిజిష్టరు చేయించుకొన్నాము. అప్పుడు తేళ్ళ క్రిష్ణమ్మచౌదరిగారే అధ్యక్షులుగా వున్నారు. కొన్నాళ్ళ తరువాత వారి నివాసమును విశాఖపట్నం మార్చినారు. ఆ సమయంలో నన్ను అధ్యక్ష బాధ్యతలు స్వీకరించమని కోరారు. దానిని నేను అంగీకరించాను. సెక్రటరీగా పెద్ది వెంకటేశ్వరరావు అడ్వకేటుగారు వున్నారు.

నాగార్జున ఎడ్యుకేషనల్ సొసైటీ బాధ్యతలు చేపట్టిన తరువాత తేళ్ళ కృష్ణమ్మ చౌదరిగారి వద్దకు వెళ్ళి, కమ్మ హాస్టలు బాధ్యతలు వారిని తీసుకోమని కోరాను. వారు ఆబాధ్యతలను డాక్టర్ పావులూరి కృష్ణచౌదరిగారికి అప్ప గించారు. ఆ తరువాత డాక్టర్ బసవపున్నయ్యగారు అధ్యక్షుడైనారు. ఇప్పటికీ వారే. అప్పటి నుండి కొత్త భవనాలు నిర్మించి విద్యార్థులకు వసతి పెంచారు. ప్రస్తుతం మొదటి హాస్టలులో కూడా కొత్త భవన నిర్మాణములు జరుగుతున్నవి. శ్రీ మాకినేని బసవపున్నయ్య, శ్రీమోటూరి హనుమంతరావు, ఇంకా కొంతమంది పెద్దలు ఈ హోస్టలు పూర్వ విద్యార్థులే. బీద విద్యార్థులకు మొదటి నుండీ కొంత సహాయము అందేది. అది ఇప్పటికీ కొనసాగుతూవున్నది. పట్టణములోని చాలామంది పెద్దలు ఎవరికి తోచిన సహాయము వారు అందిస్తారు. వార్డెన్ గారు దానిని క్రమ బద్ధీకరిస్తారు.

ఇటీవల గుంటూరులో "కమ్మజన సేవాసమితి" పేరిట నూతన సంస్థ ఏర్పడి, బృందావన్ గార్డెన్సులో, ఒక ఆడిటోరియము, ఆడపిల్లలకు వసతి గృహం, ఏర్పాటు చేసినారు. దాదాపు 600 మంది విద్యార్థినులు ఈ వసతి గృహంలో వుంటున్నారు. దాతల విరాళములతో దాదాపు సగము మందికి ఉచిత భోజన వసతులు ఇవ్వబడుచున్నవి. ఈ కార్య భారము మోస్తున్నవారు శ్రీ ఘంటా పున్నయ్య చౌదరి, ఆయన భార్య సుజాత. మరికొందరు పెద్దలు. హాస్టలులో భోజనాలను గురించి ప్రత్యేక శ్రద్ధ తీసుకొని, మంచి ఆహారమును అందుబాటులో వుండేటట్లు చూస్తున్నారు. "We are not only giving good food–but best food" అని శ్రీమతి సుజాత చెప్తుంది.

**విద్యారంగ కృషిని గురించి మరికొంత :**

విద్యా సంస్థలకు సంబంధించినంత వరకు, తొలుత పాటిబండ్ల సీతా రామయ్య హైస్కూలు కమిటీ మెంబరుగా వుండటం తప్ప నేను నిర్వహించిన బాధ్యతలు ఏమీ లేవు. జె.కె.సి. కాలేజీ ప్రారంభంలో ఒక ప్రత్యేకత వున్నది.

ఏ దాతా కళాశాలకావాలని ప్రత్యేకంగా ఆలోచన చేయలేదు. గుంటూరు పట్టణంలోనూ, చుట్టు ప్రక్కల గ్రామాల నుండి పోస్టు గ్రాడ్యుయేట్ ఎడ్యుకేషన్ పూర్తిచేసుకొని వచ్చి ఉద్యోగాలు లేక ట్యుటోరియల్ కాలేజీల చుట్టూ తిరుగుచున్న సందర్భంలో అప్పటికి రవి ట్యుటోరియల్ కాలేజీ నడుపుతున్న సి.వి.ఎన్. ధన్ గారు, గుంటూరు పట్టణంలో చాలా మంది ధనవంతులు విద్యపట్ల ఆసక్తి గలిగిన వారున్నారు కదా మీరు వారిని కలసి, ఒక కళాశాల ప్రారంభించమని అడగండి. దానికి ఆర్థిక సహాయము కూడా మీరు కొంత చేస్తే బాగుంటుంది" అని ఒక సలహా చెప్పారు. దానిమీద 10 లేక 12 మంది పోస్టు గ్రాడ్యుయేట్లు చేబ్రోలు హనుమయ్యగారిని, జాగర్లమూడి చంద్రమౌళి గారిని, వై.కె.ఎస్. ప్రకాశరావు గారిని నన్ను మరికొంతమందిని కలసి సమావేశమేర్పరచటం (కమ్మహాస్టలు) జరిగింది. అంతకు ముందే కమ్మ హాస్టలు పేరు రిజిష్టరు చేయటం జరిగింది.

**కమిటీ నిర్మాణం ఏకగ్రీవంగా :**

ఆ సమావేశానికి హాజరైన అందరూ కళాశాల ఆవశ్యకతను, గుర్తించి, ప్రారంభించాలని నిర్ణయించుకోవటం జరిగింది. దాని కొరకు అక్కడికక్కడే కమిటీ నిర్మాణము కూడా జరిగింది. సమావేశములో పాల్గొన్న చేబ్రోలు హనుమయ్యగారు అప్పుడు మునిసిపల్ ఛైర్మన్ గా ఉన్నారు. వారు సమావేశములో కొంత సేపు వుండి మున్సిపాలిటీలో పని వుందని వెళ్తున్నట్టు చెప్పి ఆ ప్రక్కవారికి కమిటి ప్రెసిడెంటుగా చంద్రమౌళిగారిని ఎన్నుకోండి నేను వైస్ ప్రెసిడెంటుగా వుంటాను అని చెప్పి వెళ్ళారు. అదే విధంగా చంద్రమౌళిగారి పేరును అధ్యక్షులుగా ప్రతిపాదించినప్పుడు "నేను అపోజిషన్ పార్టీలో వున్నాను. ప్రభుత్వంలో పనులుంటాయి. అందువలన వేరే ఎవరినన్నా ఎన్నుకోమని సూచించారు. ఆ ఇబ్బందులేమీ లేకుండా మేము చూసు కొంటాము. మీరే ప్రెసిడెంటుగా వుండండని అందరూ కోరగా ఆయన అంగీకరించారు.

ఎవ్వరో సభ్యులు (గుర్తులేదు పేరు) సెక్రటరీని ఇప్పుడే ఎన్నుకుంటే బాగుంటుంది అని సూచించారు. నా ప్రక్కనున్న దరువూరి వీరయ్యగారు, డాక్టరుగారు సెక్రటరీగా వుంటారులే అని నా పేరు ప్రపోజుచేశారు. దానికి నేను అభ్యంతరము చెప్పలేదు. ఎందుకంటే అభ్యంతరము చెప్పిన చంద్రమౌళిగారిని ఒప్పించారుకదా. నేను కాదన్నా అదే జరుగుతుంది అని నా ఉద్దేశ్యం. అంతటితో సెక్రటరీనయ్యాను.

**కళాశాల నామకరణం:**

ఆ తరువాత కమిటీ నిర్మాణాన్ని గురించి ముఖ్య దాతలను గురించి, ఆలోచన ప్రారంభమైంది. దాతలను గురించి ఆలోచించినప్పుడు, కనీసం రూ.2,00,000/- విరాళము ఇచ్చిన వారి పేరుతో కాలేజీ పెట్టుదామనుకొన్నాము. అటువంటి వారెవ్వరూ ముందుకు రాలేదు. ఆ సమయంలో, కొంతమంది సభ్యులకు ముఖ్యంగా గోగినేని కనకయ్యగారికి ఒక ఆలోచన వచ్చింది. చంద్రమౌళిగారి తండ్రి కుప్పుస్వామిచౌదరిగారు. గుంటూరు జిల్లాలో మూడుసార్లు జిల్లాబోర్డు అధ్యక్షులుగా పనిచేశారు. వారి కుటుంబంవారే దాతలుగా వుండి కళాశాల కుప్పుస్వామిగారి పేర ప్రారంభిస్తే బాగుంటుంది. అని సూచన చేశారు. దానిపై చంద్రమౌళిగారు వారి సోదరులతో సంప్రదించి, వారి కుటుంబం నుండి ఒక లక్షరూపాయలు విరాళం ఇస్తామని, అంతకన్నా ఎక్కువ ఇచ్చే దాతలెవరు వచ్చినా వారి పేరే పెడ్తామని చెప్పారు. దానిపై ఓ పేరు ఎందుకు ఆలోచించాలని, కుప్పుస్వామి చౌదరిగారు పేరే ఖరారు చేశాము.

**కుప్పుస్వామి కళాశాల అయితే అలాగే పిల్చేవాళ్ళు:**

పేరు విషయము వచ్చినప్పుడు నేను క్లుప్తంగా ఒక్కమాట అయితే పూర్తిగా పిలుస్తారని అన్నాను. దానిపై ప్రకాశరావుగారు "జాగర్లమూడి" కూడా వుండవలసిందే నన్నారు. చంద్రమౌళిగారు చౌదరి అన్నమాట మానాన్నగారి

పేరులో అంతర్భాగమే అన్న తరువాత చౌదరి కూడా వుండవలసిందే అన్నారు. అందువలన జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరికళాశాల అని నామకరణం చేయవలసివచ్చింది. అదే వాడుకలో జె.కె.సి. కాలేజీ అయ్యింది.

ఈ కళాశాల ప్రారంభానికి ముందు కమిటీకి ఏమి పేరు పెట్టాలని ఆలోచనచేసి. అంతకు ముందే బాపట్లలో కళాశాల స్థాపించారు కనుక వారివద్దనుండి, నియమావళిని తెప్పించి దానిలో మార్పులు, చేర్పులు చేసి మా నియమావళిని ఏర్పాటు చేశాము. జె.కె.సి. కాలేజి కమిటీ అనే బదులు ఇంకొద్దిగా ఇన్స్పైయిరింగుగా వుండే పేరు పెట్టవలెనని పేరు ఆలోచనకు వచ్చి నాగార్జున ఎడ్యుకేషన్ సొసైటీ గుంటూరు అని నామకరణం చేశాము. ఈ సొసైటీ ఆధ్వర్యంలో జె.కె.సి. కాలేజియేకాక అవసరమైన మిగతా విద్యాసంస్థలను ఏర్పాటు చేయటానికి విద్యావిషయక కార్యక్రమాలు చేపట్టేదానికి అవకాశము వుండేటట్లుగా బైలాన్ వ్రాయటం జరిగింది.

కమిటీ టరమ్ మూడు సంవత్సరాలు గానూ, మొదటి టర్మ్ మాత్రము 5 సంజలుగాను ఏర్పాటు చేశాము. బై లాస్లో మామూలుగా కమిటీపై అవిశ్వాస తీర్మానము కూడా వుండాలి. ఆ విషయమై మొదటి 5 సం॥లు అవిశ్వాసం తీర్మానమునకు అవకాశము లేదు అని కూడా వ్రాసుకొన్నాము. దీనికి కారణం అంతకు ముందే జిల్లాలో తెనాలి, నిడుబ్రోలు, చీరాలలో ఏర్పాటు చేసిన కళాశాలలో కొంత గందరగోళ పరిస్థితి ఏర్పడింది. నా ఉద్దేశ్యంలో 5 సం॥ల కాలం అయితే కళాశాలకు స్థిరత్వము ఏర్పడుతుంది. ఆ తర్వాత ఎటువంటి అవకతవకలు వచ్చినా కాలేజీ స్థిరత్వానికి భంగం వుండదని". అయితే ఆ అయిదు సంవత్సరాలుగానీ, తర్వాత కాలంలోగానీ అటువంటి ఒడుదుడుకులు. ఏమీ రాలేదు. నాగార్జున ఎడ్యుకేషనల్ సొసైటీ ఏర్పాటు చేసినప్పుడు సమాజంలోని కొద్దిమంది వారికి సభ్యత్వము కల్పించలేదన్న భావనకులోనైనారని తెలియ వచ్చింది.

## దరఖాస్తు లేకుండా దెప్పటం :

ఒకరైతే ఆయన కూతురు జువాలజీ లెక్చరర్ గా అప్లై చేస్తుందని, ఆ ఉద్యోగాన్ని ఆమెకు ఇవ్వాలని, చంద్రమౌళిగారితో చెప్పారు. ఆ విషయం చంద్రమౌళిగారు నాకు చెప్పారు. నేను "సరే" అన్నాను. అయితే ఆ అమ్మాయి అప్లై చేయలేదు, ఇంటర్వ్యూకు కూడా రాలేదు. కనుక సెలక్ట్ కాలేదు.. చేయకపోతే.. మా అమ్మాయికి ఇవ్వకూడదా? అని అన్నారట. సెలక్షను కమిటీలో వుండేది ప్రెసిడెంటు–సెక్రటరీలు ఇద్దరేకాదు గవర్నమెంటు రిప్రిజెంటేటివ్, స్టాఫ్ రిప్రిజెంటేటివ్, హెడ్ ఆఫ్ ది ఇన్స్టిట్యూషన్ కూడా ఉంటారు. కాంపిటీషను కూడా చాలా హెవీగా వుండేది అటువంటప్పుడు ఇది సాధ్యమేనా అని ఆలోచించాలికదా?

## పెత్తనం అంతా సెక్రటరీదేవా?

వారితోపాటు నాసహచరులు, అనుచరులు, అనుకొనే వారికి కూడా వారిని దూరంగా వుంచామన్న భావన ఏర్పడింది. కాలేజీ పెత్తనం అంతా సెక్రటరీగారేనా, మీరు పట్టించుకోనందువలన సెక్రటరీ తనకిష్టమైన వారందరికీ ఉద్యోగాలు ఇస్తున్నాడు. అని ఫిర్యాదులు చేశారు. ఈ విషయం నా చెవిన బడింది. ఎందుకు జనం ఇట్లా మాట్లాడుతున్నారు అని బాధకలిగింది. ఆ సమయంలో దరువూరి వీరయ్యతో నా బాధ వెళ్ళబోసుకున్నాను. దానికి వారు మంచి పనులు చేయాలనుకొనేవారందరికీ ఈ బాధలు తప్పవు. అని చెప్పి లోకమాన్య బాలగంగాధర్ గారికే తప్పలేదు. అని వారి జీవిత చరిత్ర తెచ్చి ఇచ్చారు.

అదే సమయంలో మా శ్రేయోభిలాషి వైద్య విద్యార్థి దశనుండి సమీపంగా ఎరిగిన నందీశ్వరుడు (చెర్లనివాసి) గారు కాలేజీ ప్రారంభించబోతున్నారు కదా దానిమీద విమర్శలు వస్తున్నాయట గదాఅని అడిగారు. దానికి తట్టుకోలేక ఎక్కువగా వస్తున్నాయి నేను రిజైన్ చేస్తే బాగుండేదని ఆలోచిస్తున్నాను అని చెప్పాను. ఈ

విషయం తెలిసి మీ దగ్గరకు వచ్చాను. మనం ఎందులోనూ వేలు పెట్టనంతవరకూ, పెద్దమనుష్యులమే. ఏదైనా పని ప్రారంభించిననాడు విమర్శలు రాకుండా వుండవు. అందువలన మీరు వేరే ఆలోచన లేకుండా ముందుకు వెళ్ళవలసిందే అని ధైర్యం చెప్పారు.

ఇంతకు ముందు చెప్పటం మరచాను. కాలేజీ కమిటి ఏర్పాటునాటికి, నన్నపనేని వీరయ్య చౌదరిగారు డి.ఇ.ఓ. గా రిటైరు అయి గుంటూరు రావటం వారిని కాలేజీ జాయింటు సెక్రటరీగా చేయటం వారి అనుభవంవలన, గవర్నమెంటు ఆఫీసులలో పరిచయాలవలన కాలేజీకి సంబంధించిన పనులు తేలికకగా జరిగినవి. నా భాధ్యత ఎక్కువ వారే నిర్వహించారు–కాలేజీ నడపటం దగ్గరనుండి. వారానికి ఒకటి రెండుసార్లు హాస్పటులుకు వెళ్తు, చంద్రమౌళిగారిని కలసి విషయాలు మాట్లాడుకొనేవారము.

ఒకరోజు ఉదయం చంద్రమౌళి గారి వద్దనుండి ఫోను వచ్చింది. నేను మీ దగ్గరకు బయలుదేరాను అని చెప్పి నేను వెళ్ళాను. స్టాఫ్ సెలక్షన్ ఎంత వరకూ వచ్చిందండీ?

అని చంద్రమౌళిగారు అడిగారు. జే. వెంకటేశ్వర్లు గారివి కెమిస్ట్రీ హెడ్ ఆప్ ది డిపార్టుమెంటుగా తీసుకొనేదానికి ఇంతకు ముందే మీరు నిర్ణయించారు కదా, అలానే రోశయ్యగారిని వైస్ ప్రిన్సిపాల్ చేద్దామని అనుకొన్నాము. దానికి రోశయ్యగారు సుముఖంగానే వున్నారు. తెలుగు డిపార్టుమెంటులో నాగళ్ళగురు ప్రసాదరావుగారు వచ్చి రోశయ్యగారిని కలసి మాట్లాడారు. రోశయ్యగారు "వస్తే మంచిదేగా అన్నారు." కానీ ఆయన మాట ఇవ్వలేదు. అని చెప్పి మీకు పార్లమెంటు సెషన్సు లేవుకదా వచ్చిన అప్లికేషన్లు మొత్తం మీదగ్గరకు పంపిస్తున్నాను అవి చూడండి అని చెప్పాను. అంతకు ముందు ఉద్యోగం నిమిత్తము వచ్చిన వారు చంద్రమౌళి గారి దగ్గరకుగానీ, హనుమయ్యగారి దగ్గరకుగానీ ప్రకాశరావుగారి దగ్గరకుగానీ, మరి ఇతర సభ్యుల వద్దకు గానీ,

వెళ్ళినప్పుడు వారందరూ "ఇవి డాక్టరుగారే చూస్తున్నారు వారినే కలవండి" అని చెప్పేవారు. దాదాపు 700 అప్లికేషన్లు వచ్చినవి. సబ్జెక్టు ప్రకారం ఇంగ్లీషు, తెలుగు, లెక్కలు, సైన్సు అప్లికేషన్లు. వరకూ కొంత పరిశీలించాను. కామర్స్ ఆర్ట్స్ అప్లికేషన్లు నేను చూడలేదు. అప్లికేషన్లు మొత్తం ఆయన దగ్గరకు పంపించాను.

తర్వాత రోశయ్యగారి అప్పాయింట్ మెంటును గురించి వారు రావటానికి కావలసిన కండిషన్స్ గురించి అడిగాను. అప్పుడు వారి జీతం రూ.520/- నాలుగు ఇంక్రిమెంట్లు కావాలని అడిగారు. అంటే అదనంగా రూ. 120/- లు. మిగతావారిలాగా తను అప్లికేషను పెట్టడం బాగుండదని కాలేజీ వారి ఆహ్వానము మీదే వచ్చినట్లు ఉండాలని కోరారు. అట్లానే ఏ.పి. కాలేజీ నుండి రావటానికి ప్రిన్సిపాల్ దగ్గర నుండి పర్మిషన్ నన్నే అడగమన్నారు. అప్పుడు ప్రిన్సిపాల్ థామస్ గారు. నేను వెళ్ళి అడిగాను. దానికి వారు క్రొత్తగా కాలేజీ పెడ్తూ ఉన్న కాలేజీల నుండి స్టాఫ్ ను తీసుకొని వెళ్ళటం న్యాయమా అన్నారు. దానికి నేను ఈ విషయంలో మాకు స్పష్టమైన అవగాహన వుంది. ఊళ్ళో కాలేజీల నుండే కాకుండా బయట కాలేజీలనుండి కూడా ఒకరిద్దరి కంటే ఎక్కువమందిని తీసుకోమని క్రెమిస్ట్రీలో, జే.వీ. గారు, ఇంగ్లీషులో రోశయ్యగారు తప్ప వేరెవరినీ వారి కళాశాల నుండి తీసుకోము. అని చెప్పాను. దానిపై వారు రోశయ్యగారిని రిలీవ్ చేయటానికి ఒప్పుకున్నారు.

**రోశయ్యగారి నియామకం :**

రోశయ్యగారికి వైస్ ప్రిన్సిపాల్ ఇవ్వాలనుకోవటానికి కారణం అంతకు ముందే ఆంధ్రా యూనివర్శిటీలో ఇంగ్లీషు ప్రొఫెసరుగా చేస్తున్న ముత్తుస్వామిగారిని ప్రిన్సిపాల్ అనుకోవటం ఒకకారణం. ఆయనతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపి, ఆయన ఇక్కడకు వచ్చి చూచి గొంతెమ్మకోర్కెలు కోరారు. దానికి చంద్రమౌళిగారికి కోపం వచ్చి "ఇతను బార్గెయినింగ్ ట్రైన్లాగా వున్నాడు. లెటస్ డ్రావ్ హిమ్" అన్నారు. నేను లెక్చరర్లనందరినీ సెలక్ట్ చేస్తున్నానని ప్రచారం

చేస్తున్నవారు. మొత్తం లిస్టు సెక్రటరీగారి జేబులోనే వున్నది. అని ప్రచారం చేయటం జరిగింది. నా జేబులో కాదుగాని, నా దగ్గర ఒక లిస్టు వున్న మాట మాత్రము యధార్థము. ఆ లిస్టు ఏమిటంటే మొట్టమొదట కళాశాల కావాలని కోరిన పోస్టు గ్రాడ్యుయేట్స్ తలా నాలుగువేలు ఇవ్వటానికి సిద్ధమని ఒక ఇరవయిమంది పేర్లు లిస్టు ఇచ్చారు. మా కమిటీ మొదటి సమావేశములోనే, ఆ పద్ధతిన ఉద్యోగాలివ్వవద్దు డోనేషను లేకుండా మిగతా వారితోపాటు ఇంటర్వ్యూకు వస్తేనే సెలక్టు చేద్దామనుకొన్నాము. ఆ లిస్టు నా దగ్గరనే వున్నది. ఆ లిస్టులో వారు నలుగురైదుగురు సెలక్టయినట్టు గుర్తు.

**ప్రెసిడెంటు, సెక్రటరీ బ్రాహ్మణ భక్తులు :**

కాలేజీ ప్రారంభోత్సవమునాడు ఒక చిన్న సంఘటన జరిగింది. ప్రారంభోత్సవమునకు ముందు జరిగిన ప్రిపరేషన్స్ అన్నీ గోగినేని కనకయ్య, నన్నపనేని వీరయ్య చౌదరిగార్లు చూసేవారు. ఇన్విటేషన్స్ అందరికీ వ్యక్తిగతంగా అందించారు. నా సహచరులు, అంతకుముందు నాకు వ్యతిరేకంగా ప్రచారం చేసినవారు ఎవ్వరూ ఆ ఫంక్షనుకు రాలేదు. అప్పుడు ఎందుకు రాలేదా అని అనుమానము వచ్చి ఫోనుచేస్తే మాకు ఇన్విటేషనులేదు. మేము రావటము లేదు అన్నారు. ఇన్విటేషన్సు ఎందుకు వెళ్ళలేదో నాకు అర్థంకాలేదు. తర్వాత 4 లేక 5 రోజులకు డెలివరీ కాని ఇన్విటేషన్సు కట్ట ఒకటి చూపించి గోగినేని కనకయ్యగారు, ఇవిగో ఇన్విటేషన్సు ఇక్కడ వున్నాయన్నారు. ఇది ఎవరి పొరబాటువలన జరిగిందో అర్థం కాలేదు. పొరపాటు క్లర్క్. వారందరకు ఇన్విటేషన్సు పంపించాము. అట్లానే ఇద్దరు గుమస్తాల నియామకం కోటయ్యశాస్త్రి, పుణ్యకోటి ఇద్దరూ బ్రాహ్మణులే. దాన్ని ప్రచారాస్త్రంగా వుపయోగించుకొన్నారు. ప్రెసిడెంటు, సెక్రటరీ ఇద్దరూ బ్రాహ్మణ భక్తులే, ముందు జరిగబోయే అప్పాయింటు మెంట్లు కూడా ఇలాగే వుండవచ్చు అని ప్రచారం. వీరిద్దరికన్నా ముందు ఒక నూతన వ్యక్తిని క్లర్కు-కమ్ టైపిస్టుగా

అపాయింట్మెంట్ చేయడం జరిగింది. తర్వాత రెగ్యులర్ స్టాఫ్ సెలక్షన్లో 35 మందిని తీసుకోవటం జరిగింది. వీరిలో గోదావరి జిల్లా నుండి నెల్లూరు జిల్లా వరకూ, అన్నికులాలవారు వున్నారు. నాన్ టీచింగ్ స్టాఫ్కు సంబంధించి, కమిటితో పని లేకుండా ప్రెసిడెంటుగారే అప్పాయింటు చేస్తారు. అని బైలాన్ వ్రాసుకున్నారు. అదే ప్రకారం అప్పాయింట్ చేశాము. అందులో కమ్మకులస్తులు తక్కువ.

## డాక్టర్! మనటీము కంటిన్యూ అవ్వాలి!

నేను ఏ పదవి నిర్వహించినా అందులోనే శాశ్వతంగా వుండాలని అనుకొనేవాడిని కాదు. ప్రభుత్వము వారు కళాశాలకు అనుమతి ఇచ్చునప్పుడు మూడు సంవత్సరాల వరకూ గ్రాంటు వుండదని చెప్పారు. కానీ 5 సంవత్సరాల వరకూ ఇవ్వలేదు. 5 సంవత్సరాల తర్వాత జరిగే ఎన్నికలలో మానుకుందామనుకున్నాను. ఆ విషయం ముందుగా హనుమయ్యగారి దగ్గర ప్రస్తావించాను. వారు దానికి "డాక్టర్! మనటీము బాగా చేస్తున్నామన్న అభిప్రాయం వుంది. అందువలన మన టీమునే కంటిన్యూ చేయాలి" అన్నారు. ప్రభుత్వము వారు గ్రాంటు ఇవ్వనందువలన మధ్యలో వదలి పెట్టారంటారనే భావంతో సెక్రటరీ పదవి నిర్వహించాను.

## ప్రిన్సిపల్ అప్పాయింట్మెంటు :

ముత్తుస్వామిగారిని డ్రాప్చేసిన తరువాత, ప్రిన్సిపాల్ పోస్టును, భర్తీచేయటానికి అడ్వర్టైజ్మెంటు ఇచ్చాము. కళాశాల ప్రారంభం నాటి నుండి కమిటీలోని ఒకరిద్దరికి ఇన్చార్జీ ప్రిన్సిపాల్గావున్న రోశయ్యగారికి మధ్య సుహృద్భావము లేదు. దానివలన వారు రోశయ్యగారికి వ్యతిరేకంగా పనిగట్టుకొని ప్రచారము చేశారు. వీరికి తోడు కొత్తగా సెలక్టయిన టీచింగు స్టాఫ్లో కొద్దిమంది, రోశయ్యగారు ప్రిన్సిపాల్ అయితే అక్కడ పనిచేయలేము అని కమిటీ మెంబర్ల దగ్గర

చెప్పుకొన్నారు. చంద్రమౌళిగారు, హనుమయ్యగారు విముఖంగావున్నారు. నేను ప్రకాశరావుగారు వారి పేరుకు అనుకూలముగా వున్నాము.

చంద్రమౌళిగారు ఎవ్వరైనా రిటైర్డు ప్రిన్సిపాల్ను అప్పాయింట్ చేసి ఒక సంవత్సరము తర్వాత రోశయ్యగారు ప్రిన్సిపాల్ కావటానికి ఒప్పుకొన్నారు. ఒక సంవత్సరము తర్వాత ఇవ్వటానికి మీరు ఒప్పుకొన్నప్పుడు ఇప్పుడే ఎందుకు ఇవ్వ కూడదు అని నేను పట్టుబట్టాను. అంతకన్న అర్హత గలిగినవారు దొరికినట్లయితే ఇప్పుడే వేయండి. లేకపోతే రోశయ్యగారిని అప్పాయింట్ చేయండి అని పట్టుబట్టి మీటింగు అర్థాంతరంగా ముగించి, ఆరు వారాల తర్వాత మరలా మీటింగు వేశాము.

ఈలోపు కాలేజీ జనరల్ బాడీ మీటింగు జరిగింది. ఆ మీటింగుకు చంద్రమౌళిగారు, హనుమయ్యగారు రాలేదు. చంద్రమౌళిగారు ఊరిలో లేరు, మీటింగులో మాట్లాడిన ప్రతి ఒక్కరూ, రోశయ్యగారు ప్రిన్సిపాల్గా వుండాలని చెప్పారు. మరలా కమిటీ మీటింగు జరిగిన రోజున హనుమయ్యగారు రాలేదు. ప్రకాశరావుగారు జనరల్ బాడీలో ఏమి జరిగింది. పూసగ్రుచ్చినట్లు చంద్రమౌళిగారికి వివరించారు. దానిపై చంద్రమౌళిగారు సరే అని సంతకం పెట్టారు. అయితే తర్వాత ఎన్నడూ చంద్రమౌళిగారు రోశయ్యగారిని కించపరచిన సందర్భములేదు.

**ప్రిన్సిపాల్ అంటే పిల్లలకేమిటి మాకూ భయమే! :**

ఒకరోజు కాలేజీలో ఒక పెద్దాయన వచ్చి చంద్రమౌళిగారితో ప్రిన్సిపాల్ అంటే పిల్లలు భయపడుతున్నారు అని చెప్పాడు. దానికి చంద్రమౌళిగారు 'పిల్లలకేమిటయ్యా మాకుకూడా ఆయనను చూస్తే భయమే"నన్నారు. అయితే కొందరు మాత్రము ఆయన ప్రిన్సిపాల్గావున్న 8 సంవత్సరాలపాటు ఆయనపట్ల అయిష్టతగానే వున్నారు.

1976లో కమిటీ ఎలక్షన్లు జరిగినవి. ఆ ఎలక్షను రోజున, అధ్యక్షుడుగా చంద్రమౌళి గారిని ఏకగ్రీవముగా ఎన్నుకొన్నారు. సెక్రటరీ పదవికి నేను మానుకుంటాను అని అన్నాను. దానికి చంద్రమౌళిగారు అదేమిటి నాకుముందు చెప్పలేదు కదా అని అన్నారు. ముందుగా చెప్తే మీరు ఒప్పుకోదు అందుకనే నేనిప్పుడు చెప్తున్నాను. నేను ఏ పరిస్థితిలోను వుండను. అన్నాను.

**ఆ కోర్టు ఆర్డరు నేను చూడలేదు :**

అప్పుడే ప్రభుత్వము వారు ఉద్యోగుల రిటైరుమెంటు వయస్సు 55నకు తగ్గించటం, ప్రిన్సిపాల్, వైస్ ప్రిన్సిపాల్ ఇద్దరూ రిటైరుగావటం జరిగింది. రిటైరైన అనంతంగారు తన సర్వీసు పూర్తికాలం కావాలని, తను ప్రిన్సిపాల్గా రిటైరు అయ్యాను గనుక ప్రిన్సిపాల్గా వుండాలని కోరుతూ కోర్టుకు వెళ్ళారు. నేను అనంతంగారు రిటైరయ్యింది. వైస్ ప్రిన్సిపాల్, కమిటీ ఖర్చుతో మనం ప్రిన్సిపాల్సస్ ఇచ్చాము. ఆయన రిటైర్మెంటు జరిగితే మనం ప్రిన్సిపాల్ చేద్దాము అని అన్నాను. సెక్రటరీకి బహుశా అనుమానం వచ్చిందేమో. బహుశా నేను తర్వాత అడ్డుపడతాననే ఆలోచనతో కోర్టు వారు అనంతంగారిని ప్రిన్సిపాల్గా రీఇన్స్టిట్ చేయమన్నారు. కోర్టు ఆర్డరు వచ్చిందని చెప్పారు. ఆ కోర్టు ఆర్డర్ ఇంతవరకూ నేను చూడలేదు.

**కళాశాల ఉపాధ్యక్షునిగా రాజీనామా:**

రెండవ విషయము నా హయాములో మొట్టమొదటి 84 సెంట్లలో వున్న గోడౌను, దానికి ఆనుకొని మరొక 84 సెంట్ల స్థలము, రోడ్డుకు తూర్పువైపునవున్న 6 1/2 ఎకరాల స్థలము దానికి ఒక ప్లాటు దూరంగా వున్న 3-19 సెంట్లు సేకరించాను. మధ్యలోవున్న ప్లాటు (3 ఎకరాల చిల్లర అమ్మటానికి ఒప్పుకోలేదు. తరువాత కాలంలో ఒక ప్రైవేటు వ్యక్తి ఆ స్థలాన్ని కొనటం జరిగింది. తర్వాత నా ఇష్టానికి

వ్యతిరేకంగా ఈ స్థలాన్ని ముందుకొన్న 3 ఎకరాల 19 సెంట్లతో ఎక్స్చేంజ్ చేశారు. ఆ తర్వాత నేను వైస్ ప్రెసిడెంటుగా రాజీనామా చేశాను.

## బోధన కళాశాల స్థాపన :

తరువాత కాలంలో జయలక్ష్మి టుబాకో వారు (రాయపాటి సాంబశివరావుగారు) బి.ఇడి., కాలేజీ పెట్టటానికి ఫండ్స్ ఇస్తారని ఎన్.ఇ.ఎస్. వారి నేతృత్వంలో దాన్ని నడపాలని కోరారు. ఐతే దానికి అనుబంధంగా ఒక హైస్కూలు కావాలి. దానికి జయలక్ష్మీ కాటన్వారు (హరిశ్చంద్రప్రసాద్ గ్రూపు) 3 లక్షలు ఇస్తామన్నారు. అంతకు కొద్ది రోజుల ముందే డా బసవ పున్నయ్యగారి పెద్దకుమారుడు మరణించాడు. ఆ మూడు లక్షలు ఇచ్చి, నా కొడుకు పేరు పెట్టుకుంటాను అని నావద్దకు వచ్చి మీరు చంద్రమౌళిగారికి నచ్చచెప్పి. మూడు ఎకరాలు పొలం ఇప్పించమని అడిగారు. నేను చంద్రమౌళిగారి వద్దకు వెళ్ళి ఆయనను ఒప్పించాను. హైస్కూలుకు మూడు ఎకరాలు ఇచ్చినందువలన, ముందువచ్చే ఇబ్బందులు ఆలోచించకుండా ఆపనిచేశాను. దానికి ఒక ఎకరము ఇచ్చి మిగతాది కామన్ ప్లే గ్రౌండుగా వదలివేస్తే సరిపోయేది. ఆ మూడు ఎకరాలకు పాఠశాలవారు కాంపౌండువాల్ కట్టుకొన్నారు. వచ్చిన హైస్కూలు బి.ఇ.డి. కాలేజీకి. అనుబంధంగా వుండే హైస్కూలు కాదు. ఇది పూర్తిగా ఇంగ్లీషు మీడియంలో నడిచే పబ్లిక్ స్కూలు, ఈ విషయంలో జె.కె.సి. కాలేజీలో మొదటి నుండి పనిచేసే లెక్చరర్లు. మిగతా ఉద్యోగస్తులు "నేను చేసిన పనికి ఎంత వ్యధ చెందారో చెప్పలేను."

## ఇంజనీరింగ్ కళాశాల స్థాపన :

ఆ తర్వాత ఇంజనీరింగ్ కాలేజీ, తెలుగుదేశం పార్టీలో నేను ఎం.ఎల్.ఏ. అయిన తర్వాత చంద్రమౌళి గారు ముఖ్యమంత్రి రామారావుగారిని కలుసుకొని ఇంజనీరింగ్ కాలేజీ అడగటానికి వచ్చారు. చంద్రమౌళిగారికి అప్పట్లో

రామారావుగారితో పరిచయం లేదు. మంత్రిగావున్న డాక్టర్ ఎం.ఎస్.ఎస్. కోటేశ్వరరావుగారు, నేను, చంద్రమౌళిగారు ముఖ్యమంత్రి గారిని కలుసుకొన్నాము. మంత్రిగారు చంద్రమౌళిగారిని గురించి పరిచయం చేస్తూ "వీరు జాగర్లమూడి చంద్రమౌళి గారు, కుప్పుస్వామిగారి కుమారులు జె.కె.సి. కళాశాల అధ్యక్షులు డాక్టరుగారు దానికి సెక్రటరీ అని పరిచయం చేశారు. నేను సెక్రటరీని కాదు వైస్ ప్రెసిడెంటుని అని చెప్పాను. దానికి రామారావుగారు వీదయితేఏం మీరు అందులో వున్నారుకదా ఇన్సల్ట్ అన్నారు. తరువాత ఈ అప్లికేషను ప్రాసెసింగ్ టైములో ఎవరోఒక ఉద్యోగి "ఈ కాలేజీని నాదెండ్ల భాస్కరరావు టైమ్లో ఇచ్చారు" అని ఆయన చెవినవేశారు. ఆయన వెంటనే మంత్రిగారికి ఫోనుచేసి "ఏం. కోటేశ్వరరావు కొంపముంచావే! ఈ కాలేజీ భాస్కరరావు టైములో ఇచ్చారట" అని అన్నారట. దానికి కోటేశ్వరరావుగారు అదేమి లేదులెండి, నాకు ఆ ఎడ్యుకేషన్ సొసైటీని గురించి బాగా తెలుసు. వారు చాలా రోజులనుండి ఈ ఉద్దేశ్యంలో వున్నారు. భాస్కరరావు టైములో ఏమన్నా సంతకం పడిందేమోలే అని చెప్పి సి.ఎం. గారిని కలుసుకోమని చెప్పారు. నేను చంద్రమౌళిగారు. గోగినేని కనకయ్య గారు, రామారాయుడుగారు రామారావుగారి దగ్గరకు వెళ్ళాము. వారు చాలా ఆప్యాయంగా చంద్రమౌళిగారిని పలుకరించి, ఆరోగ్యము ఎలా వుందో విచారించారు. చంద్రమౌళిగారు యధార్థమును వివరిస్తూ "భాస్కరరావుగారి టైంలో అందరితోపాటు మేము కూడా వెళ్ళాము. వారు ఆర్డర్లు ఇచ్చినా తగినంత ఫండ్ లేకుండా కాలేజీ ప్రారంభించకూడదన్న ఉద్దేశ్యంలో మేము ప్రారంభించలేదు అన్నారు. వెంటనే నేను "ఇప్పుడు ఆ డబ్బు ఇచ్చేవారొచ్చారు. వారు వీరే రాయపాటి సాంబశివరావు మేనమామ కనకయ్యగారు, హరిశ్చంద్రప్రసాద్ గారి తరుపున రామారాయుడు గారు" అని వారిద్దరినీ పరిచయం చేశాను. ఎంత ఇస్తున్నారు అని రామారావు గారు అడిగారు. 30 లక్షలు అని చెప్పాను. ఎట్లా సరిపోతుంది అన్నారు.

అది న్యూక్లియస్ గా వుంటే డబ్బులు అనే వస్తాయిలెండి. అని చెప్పాను. ఈ లోపల టీ వచ్చింది. ఆయన సాయంత్రం వచ్చి "ఆర్డర్ తీసుకొని వెళ్ళండి" అన్నారు.

**భాగ్యవంతులెంత బీదవాళ్ళో :**

ఇంజనీరింగ్ కాలేజీ ప్రారంభించినప్పుడు, హరిశ్చంద్ర ప్రసాద్ గారి దగ్గర నుండి కొంత డొనేషన్ రావచ్చని భావించి, ఆ విషయం చంద్రమౌళిగారి దగ్గర ప్రస్తావించగా తాను అడగనని అన్నారు. ఒకరోజు హరిశ్చంద్ర ప్రసాద్ గారు గుంటూరులో హరిబాబుగారి ఇంట్లో వున్నారని తెలిసి నేను చేబ్రోలు హనుమయ్యగారు, నన్నపనేని 'జాగర్లమూడి వీరయ్య చౌదరిగారు వెళ్ళి వారిని కలుసుకొని, కళాశాల విరాళం గురించి ప్రస్తావించాము. దానిపై వారు దాదాపు ఒక అరగంట మాట్లాడి మాకు వివరించిన సారాంశం" పూర్ ఆర్ ది రిచ్ పీపుల్".

రామారాయుడిగారి కృషి : ఇంజనీరింగు కాలేజీ ప్రారంభం నుండి రామారాయుడు గారు విశేష కృషి చేసి అవసరమైనప్పుడు బ్యాంకులో 30 నుండి 40 లక్షలు కూడా అప్పుచేసి కాలేజీకి ఏ లోటు లేకుండా సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దారు. మిగతా కమిటీ మెంబర్లు వారు. చెప్పింది వినటం తప్ప దేనికీ అడ్డు చెప్పలేదు. కాలేజీ పని మీదనే మద్రాసు వెళ్ళి ఆయన అక్కడ హఠాత్తుగా మరణించారు. వారి తర్వాత ఆ పోస్టు భర్తీ చేయటానికి జాయింట్ సెక్రటరీగా వున్న పాలడుగు లక్షణరావుగారిని, బాధ్యత తీసుకోమని అడిగాను. ఆయన మర్నాడు అబ్బూరి సుబ్బారావుగారితో కలసివచ్చి తన నివాసము విజయవాడ మార్చినందువలన తనకు వీలుపడదని ఆ బాధ్యతను డాక్టర్ బసవపున్నయ్యగారికి గానీ, డా గోపాలక్రిష్ణయ్య గారికి కానీ అప్పగిస్తే బాగుంటుంది అన్నారు. డాక్టర్ బసవపున్నయ్య గారు ఇప్పటికే ట్రెజరరుగా వున్నారు కదా, డా గోపాలక్రిష్ణకు ఏ పదవీలేదు. ఆయన ఒప్పుకొంటే అలానే చేద్దామన్నాను. వారు వెళ్ళి అడగటం ఆయన అంగీకారం తెల్పటం జరిగింది.

గోపాలక్రిష్ణ సెక్రటరీ అయిన తర్వాత కాలేజీ అభివృద్ధికి, మరింత గొప్పగా సేవ చేశాడు. అక్కడ నూతన భవనాలు నిర్మించటమేకాక ఎన్.ఇ.ఎస్. హాస్టల్ ఫర్ ఉమెన్ పేరుతో ఎస్.వి.ఎన్. కాలనీలో పెద్ద హాస్టలు కూడా నిర్మించారు.

**జె.సి. కాలేజి ఆఫ్ లా :**

లా కాలేజీని గురించి కనకయ్యగారు ఈ కళాశాలను ఏర్పాటు చేయాలని, కమిటీ వారిని ప్రోత్సహించి, జాగర్లమూడి చంద్రమౌళిగారి పేరుతో ఈవినింగ్ కాలేజిని స్థాపించారు. ఈ కళాశాలపట్ల నాకు మొదటి నుండి ఎక్కువ ఉత్సాహం లేదు. దీనికి కారణం కళాశాలవలన ఎక్కువ డబ్బు సంపాదించాలన్న భావన నాకు వచ్చేది కాదు.

తరువాత కాలంలో ఈ కళాశాలకూడా వృద్ధి చెంది. ప్రస్తుతం దే కళాశాలగానే వుండి మూడు సంవత్సరాల కోర్సు మరియు 5 సంవత్సరాల కోర్సును రన్ చేస్తున్నారు. 'లా' కళాశాల ఎక్కడ స్థాపించినా, మిగతా కళాశాలలవలె పనిచేయదు చాలా కాలేజీల కన్నా జె.సి. కాలేజీ ఆఫ్ లా మెరుగుగానే వుంది.

**బి.ఇ.డి. కళాశాల :**

రాయపాటి సాంబశివరావుగారి తండ్రిపేరుతో కళాశాలను ప్రారంభించారు. దానికి అనుబంధంగా వుండవలసిన హైస్కూలు బయలక్ష్మీ కాటన్ వారు నిర్మిస్తారని అనుకొని ఒరిజినల్గా కమిటీ వేయటం జరిగింది. దానికి సెక్రటరీగా వుండటానికి, పాలడుగు లక్ష్మణరావుగారి పేరును రాయపాటి సాంబశివరావు ప్రతిపాదించాడు. ఆ పనిని ఆయన సమర్థవంతంగా నిర్వహిస్తున్నప్పటికీ ప్రతి మీటింగులోనూ కాలేజీ నిర్వహణ గురించి తన అసంతృప్తిని కొందరు వెళ్ళగక్కేవారు. కొన్నాళ్ళు చూచిన తరువాత నేను లక్ష్మణరావుగారితో చాకిరి చేస్తూ కూడా ఈ విమర్శలు ఎందుకు భరించాలి. రాజీనామా చెయ్యవచ్చుకదా

అన్నాను. రాజీనామా చేశాడు కానీ మనసులో నొచ్చుకొన్నాడని కొన్నాళ్ళ తరువాత నాకు అర్థమైంది.

ఈ రకంగా మరొక్కరు నాపట్ల అసంతృప్తిని పెంచుకొన్నారు. దానివలన నేను ఎన్.ఇ.ఎస్. అధ్యక్ష పదవి నుండి మానుకోవాలని అనుకున్నాను. నేను విరమించు కొన్నప్పుడు, ఎవరిపట్ల నేను అసంతృప్తి వెళ్ళడించకుండా, నావలన ఎవరైనా బాధపడితే, దానికి క్షమాపణ చెప్పుకొన్నాను. ఆ తర్వాత ఎన్.ఇ.ఎస్. వ్యవహారాలలో, నేను ప్రత్యక్షంగాగానీ, పరోక్షంగా గానీ ఏ విషయంలో జోక్యం కల్పించుకోలేదు.

**థాంక్యూ గోపాలకృష్ణా :**

అంతకు ముందే ప్రారంభించిన జయప్రదాంబ డిగ్రీ కళాశాల బాగోగులు చూడటానికి, మా పిల్లలెవరూ దగ్గరలేనందువలన, ఆ బాధ్యతనేనే స్వీకరించి, కళాశాలకు ప్రత్యేక భవనముకావాలన్న భావముతో స్థల సేకరణ కొరకు డాక్టర్ మద్దిన గోపాలక్రిష్ణగారి స్థలము అనుకూలముగా వుంటుందన్న వుద్దేశ్యంతో, ఖరీదుకు ఇవ్వమని గోపాలక్రిష్ణ గారికి ఫోను చేశాను. ఇప్పుడు కాలేజీ ఫండ్స్ 20 లక్షలు వున్నాయి. అని ఖరీదు చెప్పమని అడిగినప్పుడు, 20 లక్షలుంటే బిల్డింగ్స్ కావాలి కదా ఆస్థలము మా కోడలు పేరుతో వుంది. ఈ రాత్రి ఇంటిదగ్గర మాట్లాడి రేపు ఉదయం చెప్తానన్నాడు. మరునాడు డాక్యుమెంట్సు తెచ్చి నాచేతికి ఇచ్చి దీన్ని గిఫ్టు క్రింద స్వీకరించమన్నాడు. అది 70 సెంట్లు. నేనులేచి వారిని కౌగిలించుకొని "థాంక్యూ గోపాలక్రిష్ణా" అన్నాను. నా మనస్సు కృతజ్ఞతా భావంతో నిండిపోయింది. కాలేజీ భవన నిర్మాణానికి ప్రభుత్వమునుండి అనుమతి సంపాదించటానికి, చాలా అడ్డంకులను అధిగమించవలసి వచ్చింది. దాతలు ఇచ్చిన విరాళాలతో కళాశాల భవనము నిర్మించగలిగాము. తరువాత కొంతమంది, కళాశాల శ్రేయోభిలాషులు, ముఖ్యంగా కోటపాటి మురహరిరావు

గారు, హాస్టలు నిర్మాణాన్ని గురించి, శ్రద్ధతీసుకొని విరాళాలు అందించుటవలన, ఆపని ప్రారంభించాము. పని కొనసాగుతూ వున్నది.

**పదవులు వాటంతటవే వచ్చాయి:**

విద్యా సంస్థల్లో ఉపాధ్యాయులు చాలా ఎక్కువ మంది నన్ను అభిమానించేవాళ్ళు. సరిగా అర్థంచేసుకొని బహుకొద్దిమంది అర్థం చేసుకోవటం ప్రారంభించారు. అపార్థాలను ఇంకా పోగొట్టుకోలేకపోయిన ఒకరిద్దరి పట్ల నేను వైరి భావాన్ని ప్రదర్శించటం మాట అటుంచి మందలించటంకూడా చేయకుండా ఉపేక్షాభావాన్నే కొనసాగిస్తూ వచ్చాను. నేను ఓ సంస్థకు కరస్పాండెంట్ గాగాని, అన్ని సంస్థలకు అధ్యక్షునిగాగానీ అక్కడి ఉద్యోగులమీద పెత్తనం చెలాయిస్తున్నాననుకోలేదు, వాళ్ళకు స్థానిక సంరక్షకుల్లో అనే భావనే నాలో ఉండేది.

కమ్మ హాస్టలు ప్రెసిడెంటుగాగానీ ఇండియన్ మెడికల్ అసోసియేషను, గుంటూరు మెడికల్ క్లబ్బు యూనివర్శిటీల ప్రైవేటు, సిండికేటు, నాగార్జున ఎడ్యుకేషనులో మొదట సెక్రటరీ అండ్ కరస్పాండెంటు అయినప్పుడు గానీ తరువాత అధ్యక్షుడైనప్పుడు గానీ, పోటీచేసి గెలవలేదు. ఆపదవులు వాటంతట అవే వచ్చినవి. ఎంత తేలికగా వచ్చినవో అంతే తేలికగా ఆ పదువులు వదలిపెట్టగలిగాను.

> గుంటురు ప్రాంతమందు జనకోటి సదాశిరాయ! నిన్ను నిం
> టింటను సేవతో వెలుగులీన పదాశివమూర్తి వందురే
> గంటలు కొట్టి పల్కెద సగర్వముగానది ఎల్లవేళ నీ
> వంటి రసజ్ఞ్య మెచ్చెదను–వర్ధిలుమయ్య చిరాయురువుతిన్
>
> –డాక్టర్ ప్రసాదరాయ కులపతి.

# కొన్ని తీపి గుర్తులు

**డాక్టరు ధ్యాస జబ్బు వైపు రోగి ధ్యాస డాక్టరు వైపు:**

ఇటీవల నన్ను చూడటానికి, ఒక ముసలాయన వచ్చాడు. ఏమిటని అడిగాను. తనది నెమలికల్లు గ్రామమని, తన పేరు ఎడ్లపల్లి వెంకటేశ్వరరావు అని చెప్పాడు. నెమలికల్లులో వుండే ఈ వ్యక్తి నాకు బాగా తెలుసు. 50 సంవత్సరాలలో ఈయన్ని ఎప్పుడూ చూడలేదు. నాకు ఆయన అవునోకాదో అని అనుమానమొచ్చింది. నువ్వు చదువుకొన్నావుగా అని అడిగాను. అవును పాత ఇంటర్మీడియేట్ అని అన్నాడు. 1955 ప్రాంతంలో ఇతను గర్భిణీగా వున్న భార్యను వైద్యం నిమిత్తం నా దగ్గరకు తీసుకొని వచ్చాడు. నేను పరీక్షచేసి గర్భిణీ అని నిర్ధారణ చేసి ఇది సామాన్యమైన గర్భిణీకాదు, "అబ్డామినల్ ప్రెగ్నెన్సీ" అని నిర్ణయించాను. అంటే గర్భసంచిలో కాకుండా, గర్భసంచి . బయట పిండం పెరుగుతూ మామూలు గర్భిణీ అనుకొని గనుక పట్టించుకొనక పోయినట్లయితే ప్రమాదం ఏర్పడేది. అందువలన జనరల్ హాస్పటల్లో ప్రసూతి విభాగానికి పంపించి నేనుకూడా వెళ్ళి డాక్టర్ సత్యభామారెడ్డి గారితో ప్రైమరీ ఆబ్డామినల్ ప్రెగ్నెన్సీ గనుక తీసుకొని వచ్చానని చెప్పాను. ఆమె వైద్యంలో నాకు రెండు సంవత్సరముల సీనియర్. ఆమె సహచరులు ప్రైమరీ అబ్డామినల్ ప్రెగ్నెన్సీ అని మీరెట్లా నిర్ణయించారు. అని అడిగారు. ఫిజికల్ ఎగ్జామినేషను ద్వారానే తెలుసుకొన్నాని చెప్పాను. వాళ్ళకు అంత నమ్మకం కల్గినట్లు లేదు. తరువాత వారు ఎక్స్-రే మొదలగు పరీక్షలు నిర్వహించి, నా నిర్ణయాన్ని ఒప్పుకొని, ఆపరేషను చేసి రక్షించారు. పిండం పెరిగే ప్రశ్నేలేదు. తల్లి ప్రాణానికి ముప్పు తప్పింది. ఆమె భర్త అప్పటి ఆకారమునకు ఇప్పటి ఆకారమునకు ఏమీ సంబంధంలేదు. అసెంబ్లీ ఎన్నికల సందర్భంగా వాళ్ళ గ్రామానికి రెండు మూడు. సార్లు వెళ్ళినప్పుడు, అతని గురించి విచారించాను. ఊరిలో లేడు అని చెప్పారు. ఈ రోజు అతను "మీరు నన్ను ఎంక్వైరీ చేసారంట. నేను అప్పుడు ఊరిలోలేను. మా ఊరివారు. విషయం

చెప్పారు" అని చెప్పాడు. అయితే అతను ఎందుకు వచ్చినట్లు అడిగాను. ఏమీలేదండి మిమ్ములను చూడటానికే వచ్చాను అని అన్నాడు. అతని భార్యకేసు ప్రత్యేకమయినది కనుక నాకు ఎప్పుడూ గుర్తు వుంటుంది. ఇన్నాళ్ళ తర్వాత అతను నన్ను గుర్తుపెట్టుకొని రావటం విశేషంగా భావించాను.

పెద్ద కణుతులకంటే చిన్న సూదులు తొలగించటమే కష్టం: అప్పుడప్పుడు వార్తా పత్రికలలో, డాక్టర్లు పెద్ద పెద్ద కణుతులు తీసినట్టు చదువుతుంటాము. నిజానికి పెద్ద కణుతులు తీయటం అంత కష్టము కాదు. చిన్న చిన్న వస్తువులు తీయటమే (ముళ్ళు, ఇంజెక్షను చేయునప్పుడు విరిగిన సూది) కష్టం. నేను డాక్టరువైన తరువాత, ఒకరోజు మా సర్జను శ్రీరమణమూర్తిగారు ఒక రోగికి ఇంజక్షన ఇచ్చేటప్పుడు విరిగిన సూదికి ఆపరేషను చేస్తున్నారు. ఆ సూది విరిగిన రోగి పిట్టమీద ఎక్స్ రే సాయంతో సూదిని బయటకు తీయటానికి చాలాసేపు కష్టపడ్డారు. కానీ సూది దొరకలేదు. మరొకవర్లను డాక్టర్ చందూ నంబియార్, అక్కడకు రావటం తటస్థించింది. డా రమణమూర్తిగారుపడే అవస్థను చూచి నర్సును పిలిచి ఒక సూది తెప్పించి, దాన్ని విరచి డాక్టర్ రమణమూర్తి, ఇదిగోసూది అని క్లోజ్ చేయమన్నారు. అక్కడున్న మా అందరికీ ఏం జరిగిందో, (రమణమూర్తిగారితో సహా అందరికి తెలుసు. అదృష్టవశాత్తు ఆ స్రీ ఒక డాక్టరు చెల్లెలు, ఆ డాక్టరు కూడా అక్కడే వున్నాడు. విషయం ఏమిటంటే సూదిని తీయుటకొరకు కండంతా కోసేదానికన్నా సూదిని వదిలివేయటమే మంచిదని. ఇదిగో సూది అని చూపించటం పేసెంటు తృప్తికొరకు.

కండలోవున్న సూదివలన జరిగే అవకారము ఏమిలేదు. కండలో ఒకే చోట వుండకుండా, సూది అటూ ఇటూ తిరుగుతుంది. అది తిరిగే క్రమంలో చర్మము కిందకు రావచ్చు. అప్పుడు తీసివేయవచ్చు లేకపోతే ఎన్నడైన అట్లానే వుంటుంది. ఇది సర్జన్లు అందరికీ అనుభవమే. ముళ్ళు మొదలైనవి. శరీరంలో ఆ రకంగా ఇమిడిపోలేవు. అవి తప్పనిసరిగా తీయవలసిందే. అటువంటి ముళ్ళ కేసులు

రెండు మూడు నాకు బాగా గుర్తు. ఈ కేసులు మిగతావాళ్ళు ప్రయత్నంచేసి వదలి వేసినవి. ఇంజక్షన్లు సూదులుకు సంబంధించి, ఒకాయన భుజంమీద ఒక సూది విరిగిందని వచ్చాడు. నేను మత్తు ఇంజక్షను ఇచ్చి ఆ సూది గుచ్చుకొన్నచోట కోసి చూశాను. చర్మం క్రింద రెండుమూడు అంగుళాలైనా. సూదిని తెలుసుకొని దాన్ని తీయటం జరిగింది. సూది విరిగినచోట వుండదు. అందువల్లనే కష్టమౌతుంది. మరొకకేసు సూది విరిగిన తర్వాత ఆ డాక్టరు సూదిని కోసే ప్రయత్నంలో కొంత కండను కోసాడు కూడా. కానీ దొరకలేదు. నేనుకూడా కొంత కండను కోసి ప్రయత్నించాను. దొరకలేదు. ఆ రోగి యువకుడు, చదువుకున్నవాడు అయినందువలన అతనికి అర్థం అయ్యేటట్టు చెప్పి సూదిని తీసే ప్రయత్నం విరమించాను. ఇది జరిగి 25 సంవత్సరాల పైన అయ్యింది. అతను అప్పుడప్పుడు కన్పిస్తూ వుంటాడు కూడా. దాని వలన తనకు ఎటువంటి ఇబ్బంది కలుగలేదని దాని సంగతి మర్చిపోయానని చెప్పాడు.

**నాయుడు నాగయ్యగారి రవ్వ లడ్డు:**

ఇటీవల ఒక యువకుడు ఒక కార్డు తీసుకొని వచ్చాడు. జ్యువెలరీ షాపువాళ్ళ ఎగ్జిబిషన్ కార్డు తీసుకొని వచ్చాడు. నేను అతనిని బెడ్ రూంలోకి రమ్మన్నాను అతడు కార్డు ఇస్తూ మీకు "నాయుడు నాగయ్యగారు" తెలుసుకదా. అంటే ఇంకొల్లు వారేకదా అని అడిగాను, ఆయన నాకు 'తాత' ఔతాడు అని చెప్పాడు. ఆ పేరు వినగానే నాకు చాలా ఆనందమేసింది. అతని పరిచయం వైద్యరూపంగానే కానీ తరువాత చాలా సంవత్సరాలు, నన్ను చూడటానికి ఇంకొల్లు నుండి వస్తూ ప్రతిసారి రవ్వలడ్లు తయారు చేయించి తీసుకొని వచ్చేవాడు. నా దగ్గర అతను ఏ ప్రత్యుపకారము ఆశించలేదు. తరువాత కొన్నాళ్ళకు చనిపోయాడని తెల్సింది. 10 లేక 15 సంవత్సరాల క్రింద వాళ్ళ అబ్బాయి ఎం.ఏ. చదివి, ఉద్యోగాన్వేషణలో నన్ను ఆశ్రయించాడు. నేను ప్రయత్నం చేసినా ఫలించలేదు. అతని గురించి అడిగాను. విజయవాడ చైతన్యలో

స్థిరపడినాడని తెలిసింది. ఈ రెండు విషయాలు వ్రాయటానికి కారణం, నాదగ్గర వైద్యము పొందినవారు ఎన్నో సంవత్సరాల తర్వాత కూడా గుర్తు పెట్టుకొని, నా గురించి ఆలోచించటం. జిల్లాలో బయట ఏ ఊరికి వెళ్ళినా ఒకరు ఇద్దరు వచ్చి నా దగ్గర వైద్యము చేయించుకొన్న కృతజ్ఞతాభావంతో చెప్పుకొంటారని, ఈ విషయం నాకు చాలా సంతృప్తి కలిగిస్తుంది. అందుకే ఈ విషయం వ్రాశాను.

**ఫీజు కంటే అనుబంధాలు గొప్పవి :**

ప్రాక్టీసు పెట్టిన మొదటి కొద్ది నెలల్లోనే ఒక పసిపిల్లకు చర్మముపై ఎఱ్ఱగా ఉబ్బుగా వచ్చినది. వారి ఫ్యామిలీ డాక్టరు దీనికి ఆపరేషను చేయటం వీలుపడదు. మద్రాసు వెళ్ళి కరెంటు వైద్యము చేయించుకోవలసినదిగా సలహా ఇచ్చాడు. ఆ అమ్మాయి తండ్రి చిన్నప్పుడు తక్కెళ్ళపాడులో వుండి నాతోపాటు కొన్నాళ్ళు హైస్కూలులో చదివాడు. ఆ పరిచయంతో ఆ అమ్మాయిని నాకు చూపించాడు. ఆ కేసు "హేమాంజియోమా' రక్తనాళములలో కూడుకున్న గడ్డ. మామూలుగా అయితే ఆపరేషను చేస్తే సరిపోయేది. ఉన్న స్థానాన్ని బట్టి, ఆపరేషనువలన అంగవైకల్యము ఏర్పడుతుంది. ఆపరేషనుతో పనిలేదు. ఇంజక్షనుతో నయంచేయగలను. అని వారికి హామీ ఇచ్చి మూడు నాలుగుసార్లు ఆగడ్డలోకి ఇంజెక్షను ఇచ్చినందువలన తగ్గిపోయినది. ఆ ఇంజక్షను చేయటానికి ఆ పసిపాపకు మత్తు ఇవ్వవలసివచ్చేది. ఆ ఇంజక్షను బాయిలింగ్ వాటర్ (వేడివీళ్ళు) మామూలు సిరంజితో ఇవ్వటానికి వీలులేదు. దానికొరకు ప్రత్యేకంగా ఒక మెటల్ సిరంజి తెప్పించి, బాయిలింగ్ వాటర్ ఇంకెక్షనుగా చేసేవాడిని ఈ పద్ధతి వైద్యము, విశాఖపట్నంలో వుండగా మా వార్డులో చేసేవాళ్ళము. మంచి ఫలితములు వచ్చేవి. అందువలన ధైర్యంగా చేయగలిగాను. వైద్యము పూర్తి అయిన తర్వాత ఆ పాప తండ్రి రూ.150.00 లు తీసుకొనివచ్చి ఇవ్వటానికి సందేహిస్తూ వున్నాడు. అప్పుడు నేను నీ జీతం ఎంత అని అడిగాను, పొగాకు కంపెనీలో ప్రైవేటు ఉద్యోగం అన్నాడు. నాకు రూ. 50

లు చాలని అంతవరకు తీసుకొని మిగతావి తిరిగి ఇచ్చాను. మా అనుబంధం అప్పటినుండి ఇప్పటి వరకూ కొనసాగింది. ప్రస్తుతం ఆయన, ఆయన భార్య లేరు. పిల్లలు మాత్రం అదే అలవాటు కొనసాగిస్తున్నారు. ఇది జరిగిన 20 సంవత్సరాలకు ఆ అమ్మాయి పెళ్ళి చేసుకొంటూ రూ. 500.00 లు ఇచ్చి నన్ను సూటు కుట్టించుకోమన్నది. వారిచ్చిన డబ్బుకన్నా ఏర్పడిన అనుబంధాన్ని గురించి తలుచుకోవటం ఎంతో సంతోషంగా వుంటుంది.

అట్లా చేయగలిగిన డాక్టరు పుట్టలేదా..... పేరేచర్ల గ్రామము నుండి చర్మముమీద 3, 4 చోట్ల కాయలు కాచి (కీలాయిడ్) చూడటానికి అసహ్యంగా వున్నందువలన అవి తీసివేయమని ఒకామె వచ్చింది. అది ఆపరేషను చేస్తే మరలా అదే రకంగా వచ్చే అవకాశము ఎక్కువ. అందువలన నేను తీసివేసిన తరువాత శరీరంలో వేరే ప్రాంతాన్నుంచి చర్మాన్నితీసి అంటిస్తానని చెప్పాను. అలానే ఒకసారి ఆపరేషను చేయటం, చర్మాన్ని అతికించటం చేశాను. ఫలానా డాక్టరు చర్మాన్ని ఆటించి ఆపరేషను చేశారు అని తెలుసుకొన్న వారి ఫ్యామిలీ డాక్టరు "అది అసాధ్యం. అట్లా చేయగలిగిన డాక్టరు ఇంతవరకు పుట్టలేదు అని వ్యాఖ్యానించాడట. ఇట్లాంటి స్కిన్ గ్రాఫ్టింగ్ చేసినప్పుడు కొన్ని సందర్భాలలో అంటించిన చర్మము, అంటుకోక పోవచ్చుకూడా, అదృష్టవశాత్తూ ఈ కేసులో వేసిన చర్మము అంతా సరిగ్గా అంటుకొన్నది. ఆమె పూర్ణాయుస్సుతో బ్రతికి ఇటీవలే మరణించింది.

**సంపన్నులవలన బహుళ ప్రచారం :**

పేరేచర్ల గ్రామమునుండే భైరపనేని వరదయ్య అనే పెద్ద రైతు. సుమారు 60 సంజల వయస్సు. వీపుమీద "రాచపుండు"తో వైద్యానికి వచ్చాడు. అంతవరకు రాచపుండు అంటే బ్రద్దలుగా కోయవలసిందే, ఈ కేసు తొలిదశలోనే వుంది కనుక ఆపరేషను లేకుండా, మామూలు ఇంజన్లతోపాటు, ఆ గడ్డలోనికి నేరుగా పెన్సిలిన్ ఇంజక్షను ఇస్తే.. ఆపరేషను లేకుండా నయం చేయవచ్చని భావించి, ఆ వైద్యము చేశాను. అది ఒకసారిచేస్తే సరిపోయేదికాదు. రోజు మార్చి రోజు,

నాలుగైదుసార్లు, చేసిం తర్వాత, పూర్తిగా తగ్గిపోయింది గడ్డలోనికి నేరుగా ఇస్తే మత్తుమందు ఇచ్చి ఇంజక్షను చేసేవాడిని డా జయప్రద, జనరల్ అనేస్థిసియా ఇచ్చేది. ఆయన పళ్ళు కొన్ని లూజు గా వుండి అనే స్టేసియా నుండి తెలుసుకొనేటప్పుడు ఈ పళ్ళన్నీ పీకేసేవాడిని. ఇదంతా అవుట్ పేషెంటు ట్రీట్మెంటులు. ఆయన కుమారులు మాతోపాటు హైస్కూలులో చదువుకొన్నారు. మరొక కొడుకు ఎం.ఎస్.సి. బి.ఇ.డి. చేసి ఉద్యోగం చేయకుండా చిన్న చిన్న వ్యాపారాలు చేస్తూ గుంటూరులోనే మా ఇంటి దగ్గరనే స్థిరపడి, నలుగురు బిడ్డలనూ డాక్టర్లుగా చేయగలిగాడు. ఆయన అళ్ళుల్లు ఇద్దరూ, తాడికొండ వాస్తవ్యులు, ఒకరు శ్రీ త్రిపురనేని సాంబశివరావు, రెండవ వారు గోగినేని కనకయ్యగారు. వీరందరూ సంపన్నులైనందువలన బంధుత్వము . ఎక్కువగా వున్నందువలన, వరదయ్యగారికి నేను చేసిన వైద్యమునకు బహుళ ప్రచారము జరిగింది. వైద్యము పూర్తి అయిన తరువాత వారిచ్చిన ఫీజు రూ.200/- అదనంగా జయప్రదకు ఒక రూ.50.00 లు ఇచ్చి చీరుకొనుక్కోమన్నారు. అప్పటికాఫీజు ఎక్కువే అనుకొన్నాము. మొదటి ఆరునెలలూ కరెంటుకూడా లేదని చెప్పాకదా, అదే సమయంలో, ఆడవారికి, మగవారికి కూడా మేజరు సర్జరీ చేయటం జరిగింది. మొత్తం మీద ఒక సంవత్సరం అయ్యేటప్పటికి ప్రజానీకం నన్ను సర్జనుగా గుర్తించారు.

ఇప్పటిలాగా, ఒక్కొక్క జబ్బుకు ఒక్కొక్క డాక్టరు వద్దకు వెళ్ళటం అప్పట్లో అలవాటు లేదు. ఎప్పుడైనా మేము ఎవరిదగ్గరైనా చూపించుకోమన్నా, పేషంట్లు ఒప్పుకొనేవారుకాదు. కంటివైద్యము అంతకు పూర్వము ఎన్నో సంవత్సరముల నుండి ప్రత్యేకంగా కొంతమంది సర్జనులు చేసేవారు. కనుక ఆ వైద్యము తప్ప మాచేతనైనంత వరకూ మిగతా అన్ని వైద్యాలు చేసాము. రోగులకు కూడా సౌలభ్యంగా వుండేది.

## హోటలు ప్రొప్రయిటరు ఆదర్శం:

జీవితంలో జరిగే కొన్ని ఘటనలు, వ్యక్తిపైన చాలా ప్రభావము చూపుతవి. ఉదాహరణకు 1962 డిసెంబరులో పూనేలో జరిగిన ఐ.ఎం.ఏ. కాన్ఫరెన్సుకు నేను డాక్టర్ ప్రతాప్కుమార్, డాక్టర్ వైయస్. కృష్ణమూర్తి ఆయన భార్య కస్తూరి, మా అబ్బాయి రమేష్ ఒక కారులో ప్రయాణముచేసి ఔరంగాబాదు, అజం ఎల్లోరాలను చూచి అటునుండి బొంబాయి వెళ్ళి ఆ తరువాత పూనా కాన్ఫరెన్సుకు అటెండయి, తిరుగు ప్రయాణంలో నాగార్జున సాగర్ గుండా, ఇంటికి తిరిగి వచ్చాము. అప్పటికి సాగర్ కట్టుబడి జరుగుతున్నది. అక్కడ, అప్పుడు లైట్లు గొప్ప అట్రాక్షన్. నాగార్జునసాగర్ చూసిన తర్వాత మాచర్లలో ఒక హోటలులో భోజనం చేశాము. డ్రైవరుతో సహా ఆరుగురము భోజనముచేసాం. ఆరు రూపాయలు ఇచ్చాను. అప్పుడు భోజనం 0–14 అణాలే. హోటలు ప్రొప్రయిటరు 12 అణాలు తిరిగి ఇచ్చాడు. చిల్లర అవసరంలేదు అట్టిపెట్టుకోమన్నాను. ఎందుకండీ? అని అడిగాడు. గత పదిరోజులనుండీ బొంబాయిదాకా తిరిగి వచ్చాము ఇంత మంచి భోజనము పెట్టినవారు ఎవ్వరూ లేరు అందుకనీ. రూపాయి చొప్పున తీసుకోమన్నాను. దానికతను "మీకంత నచ్చితే ఇంకొకసారి తినండి. అంతేకాని నేను రూపాయి చొప్పున తీసుకొనను. మీరు చిల్లర తీసుకొనవలసిందే" అని వత్తిడి చేసి చిల్లర తిరిగి ఇచ్చాడు. వందలు, వేలు సంపాదించేవారు చాలా మంది తమకు వచ్చే సంపదతో తృప్తి పడలేక ఇంకా ఎక్కువ రాలేదే అని బాధపడేవారిని చూస్తుంటాము. అందువలన ఆ సంఘటన నాపై చాలా ప్రభావము చూపింది.

''___. లోకసేవఁ గడుఁ బండిన కాసరనేని ధన్యతా
సురుచిర జీవముందు జయసుందరుడై మహనీయ గౌరవ
స్ఫురణములన్ శతాబ్దములు భూమి సుఖంబుల వందుగాక!..." –
తెనుఁగులెంక

''..........................యా

నెఱసరి మన్నదన్ గనెడి నేఁటి కిశోరులు మేటి కర్ణముల్
వెలుపి గణేయ పీఠముల నిల్తురుగాక, నరుండు సేవలన్
మరిగిన నాఁడే యీవిచేస మక్కువ చూపిన నాఁడె మెప్పులన్
గొౌటులు నటన్న గుట్టు గనుగొందురుగాక "తెనుంగు లెంక" నాఁ
బరఁగెడి వృద్ధు దీవెనలు పందునుగాక శుభాకరమ్ములై" –తెనుఁగులెంక

## ఇండియన్ మెడికల్ అసోసియేషన్

నేను గుంటూరులో డాక్టరుగా స్థిరపడినప్పుడు కేవలం వైద్యం మీదనే దృష్టిపెట్టి పనిచేశాను. కాలక్రమేణా స్థానిక పెద్దలు పరిచయాలు కావటం స్థానిక కార్యక్రమాలలో పాల్గొనటం జరిగింది. మొదటిది ఇండియన్ మెడికల్ అసోసియేషన్ను గుంటూరు బ్రాంచికి కొన్నాళ్ళు, జనరల్ సెక్రటరీగా వుండటం, తరువాత కొన్ని సంవత్సరాలు ప్రెసిడెంటుగా వుండటం జరిగింది. ఈ పదవులు ఎన్నికలలో పోటీ చేసి గెల్చినవికావు.

### మెడికల్ క్లబ్ ఏర్పాటు :

గుంటూరు జిల్లా బ్రాంచ్ ఆఫ్ ఐ.ఎం.ఏ. 1935లో ఆల్ ఇండియా ఇండియన్ మెడికల్ అసోసియేషన్ బ్రాంచిగా అప్పటికే జిల్లా మొత్తం మీదవున్న ఎం.బి.బి.ఎస్. ఎల్.ఎం.పి.లు డాక్టర్లందరూ సభ్యులుగా వుండేవారు. 1940 తర్వాత ఐ. ఎం.ఏ. కాంగ్రెస్ స్వాతంత్ర్య పోరాటమును బలపరచుతున్న కారణంగా, ప్రభుత్వము వారు ఆ సంవత్సరము ఆ సంస్థను నిషేధించారు. గుంటూరులోవున్న డాక్టర్లు ఐ. ఎం.ఏ. పేరుతో గాకుండా, మెడికల్ క్లబ్ అని ఏర్పాటు చేసుకొని దాని ఆధ్వర్యములో కలుస్తుండే వారు. దానికి స్వంత భవనము ఏమీ లేదు. అందువలన వారు స్వంత భవన నిర్మాణము ఏర్పాటు చేసుకొనేదానికి, జిల్లా కలెక్టరును కొంత స్థలముకావాలని అడిగారు. గుంటూరులో ప్రస్తుతం వున్న గవర్నమెంటు కాలేజీ ఫర్ వుమెన్ ఆ పరిసర

ప్రాంతాలను రాజాగారితోట అని పిలిచేవారు. ఎవరో ఒక రాజుగారు ప్రభుత్వము నుండి ఆ స్థలమును 99 సం॥ లీజుకు తీసుకున్నారు. ఆ ప్రాంతము అంతా బీదలు ఇళ్ళువేసుకొని వుండేవారు. అందులో కొంత స్థలమును మెడికల్ క్లబ్లు ఇవ్వటం జరిగింది. క్లబ్బువారు అందులో చిన్న కట్టడం ఏర్పరిచారు. ఆ తరువాత ప్రభుత్వ కళాశాల విస్తరణలో ఆస్థలం ప్రభుత్వం తీసుకొన్నది.

ఐ.ఎం.ఏ. పై వున్న నిషేధం రద్దు అయినందువలన ఐ.ఎం.ఏ. బ్రాంచ్ కూడా పునరుద్ధరింప బడింది. గుంటూరు వైద్య కళాశాల ఏర్పడిన తరువాత ఐ.ఎం.ఏ. మీటింగ్సు సాధారణంగా కాలేజీలో జరుగుతూవుండేవి. ఐ.ఎం.ఏ. వారు జిల్లా కలెక్టరును కలసి దానికి ప్రత్యామ్నాయంగా కనీసం 1000 గజాలు స్థలం కావాలని అడిగారు. దానికి అంగీకరించి వారు ప్రస్తుతం ఐ.ఎం.ఏ. బిల్డింగ్లు వున్న ఏరియా ధర గరిష్టం ఒక్కింటికి 1.00 రూ. చొప్పున ఐ.ఎం.ఏ. కు ఇచ్చారు. అప్పటికి వారి దగ్గర కొద్ది మొత్తంలో డబ్బు వున్నది. అక్కడ ఒక భవనము నిర్మాణము చేయవలెనని పునాదుల వరకు కట్టుబడిచేశారు. 1962-63లో నేను ఐ.ఎం.ఏ. గుంటూరుకు అధ్యక్షుడుగా వుండి గుంటూరులో స్టేట్ కాన్ఫరెన్సు జరిపి వైద్య కళాశాల వున్న పట్టణం కనుక కళాశాల ప్రిన్సిపాల్ ఆహ్వాన కమిటీ ప్రెసిడెంటుగా వుంటే, హుందాగా వుంటుందన్న ఉద్దేశ్యంతో అప్పటి ప్రిన్సిపాల్, శ్రీ పిన్నమనేని నరసింహారావుగారిని కోరాను. వారు అంగీకరించారు. జనరల్ హాస్పిటల్ సూపరిండెంట్ గా వున్న డాక్టరు ఎస్. రామచంద్రరావుగారు, నేను వైస్ ప్రెసిడెంట్లుగా వున్నాము.

ఆ సమయంలో జిల్లా వ్యాప్తంగా, నేనూ, నా సహచరులు తిరిగి, కొంత డబ్బు వసూలు చేశాము. కాన్ఫరెన్సు ఖర్చుపోను సుమారు రూ.25,000/- మిగిలింది. ఆ డబ్బును మెడికల్ క్లబ్కు ఇచ్చాము. పేరు మెడికల్ క్లబ్ అయినా ఐ.ఎం.ఏ. కార్యక్రమాలన్నీ అక్కడ 'నిర్మించబోయే' హాలులోనే జరపాలని ఆలోచన. అప్పటి క్లబ్ ప్రెసిడెంటు డాక్టర్ సి. సాంబశివరావుగారు.

ఆ కాన్ఫరెన్సులో, వైద్య కళాశాలలో, ప్రొఫెసర్లుగా పనిచేసి, రిటైరైన ఇద్దరు ప్రొఫెసర్లను ఆహ్వానించాము. ఒకరు డాక్టర్ డి. గోవిందరెడ్డి, రెండవవారు ప్రొఫెసరు ఈశ్వరయ్య (ఫార్మశీ కాలేజీ ప్రొఫెసరు టెక్స్ట్ బుక్ వ్రాసారు) ఆ మీటింగులో డా గోవిందరెడ్డి గారు ఇచ్చిన ఆరేషన్కు బంగారు మెడల్ ఇచ్చాము. డాక్టర్ ఈశ్వరయ్యగారు బెంగుళూరులో వుండేవారు. అక్కడ నుండి వారే టిక్కెట్టు కొనుక్కొచ్చారు. తిరిగి వెళ్ళేటప్పుడు టికెట్ ఇచ్చి అటువైపు నుండి వచ్చిన టికెట్ డబ్బులు కవర్లో పెట్టి రూ. 300/- ఇచ్చాను. "మీరు అటునుండి టిక్కెట్టు కొనుక్కున్నారు." అన్నాను. దానికి ఆయన చిరుకోపం ప్రదర్శించి "It is not a mercenary job. One ticket is more than enough అని నిరాకరించారు. ఈ విషయం ప్రత్యేకంగా ఎందుకు చెప్పవలసివచ్చిదంటే ఆయన ప్రొఫెసరుగా వున్నప్పుడు ప్రభుత్వ జీతము మినహా వేరే ఆదాయము ఏమీలేదు. అయినా పదవీ విరమణానంతరం కూడా ఆయన అంత సంయమనము పాటించారు.

## మెడికల్ క్లబ్ మెడికల్ అసోసియేషన్ వారిది :

ఆ తర్వాత కాలంలో డాక్టర్ సి, సాంబశివరావు నాయకత్వంలో చాలా డబ్బులు వమాలుచేసి, ప్రస్తుతమువున్న కట్టడాన్ని నిర్మించారు. మెడికల్ క్లబ్ పేరును మెడికల్ అసోసియేషనుగా మార్చారు. అందువలన బిల్డింగ్ను ఐ.ఎం.ఐ. బిల్డింగ్ అని పిలిచినప్పటికీ టెక్నికల్గా ఆ ఆస్థి గుంటూరు మెడికల్ అసోసియేషన్ వారిది. దీనికి వేరే కార్యవర్గముకూడా వున్నది.

## రేడియో ప్రసంగాలు :

వైద్యానికి సంబంధించిన వివిధ సమస్యలను గురించి, విజయవాడ ఆల్ ఇండియా రేడియో ద్వారా 10 లేక 12 ప్రసంగాలు చేసాను. ఆ ప్రసంగాలన్నీ ప్రింటు చేయటానికి ఒక స్నేహితునకు ఇచ్చాను. "పుస్తకం వనితా విత్తం

పరహస్తం గతం గతః" అన్నట్లు ఇది పుస్తకంగాకపోయినా ఈ ప్రసంగాలకు అదే గతి పట్టింది. అవి అచ్చయి వున్నట్లయితే ఒక పుస్తక రచయితగా వుండేవాడిని .

"ఒరులేయవి యొనరించిన
నరవర, యప్రియము తన మనంబునకగు, దా
నొరులకు నవి సేయకునికి
పరాయణము ధర్మ పథములకెల్లన్"

అనేది నేను విశ్వసించే జీవన సూత్రం అంటూ షష్టిపూర్తి సభలో చెప్పాలని. చెప్పలేక పోయిన మాటలకు అక్షరరూపం ఇచ్చిన సందర్భంగా రూపుదిద్దుకున్న నా భావనలలో ఓ భావన.

# వైద్యంలో ప్రగతి

మానవ సమాజమునకు, ఆదినుండి వ్యక్తులు ఆనారోగ్యానికి ఏదోరకమైన వైద్యము చేయించుకోవటం జరుగుతున్నదే. రణపు గడ్డలు వచ్చినపుడు, మంగలివాటిని కోసేవాడు, ప్రపంచ వ్యాప్తంగా అలాగే వుండేది. మిగతా జబ్బులకు గ్రామములోని పూజారులు, నంబి, తంబళ వారు వైద్యము చేసేవారు. మంత్ర తంత్రాలువారే నిర్వహించేవారు. కొంతమంది వైద్యులు, వంశపారం పర్యంగా, వైద్యం చేసేవారు.

**ఘన వైద్యులు :**

వీరిలో కొంతమందిని "ఘన వైద్యులు" అని పిలిచేవారు. గ్రామములలో పెద్దలకు దీర్ఘ వ్యాధులు వచ్చినపుడు, ఆ ఘన వైద్యులను పిలిపించేవారు. ఆ రోగి ఇంట్లోనే వుండి వైద్యముచేస్తూ, దానికితోడు తొట్టి స్నానము వంటిది చేయించేవారు ఆయన భోజనము కూడా రోగి ఇంట్లోనే. వారు మాత్రం రోగికి పత్యము చెప్పేటప్పుడు, వారికిష్టమైన పిండి వంటలు చెప్పేవారు. అందుకనే రోగి పాలు గోరాడు వైద్యుడు పాలేగోరాడు అనే సామెత వచ్చింది.

శస్త్ర చికిత్సకు సంబంధించినంత వరకు, మంగలివారే నిర్వహించేవారు. గాయాలు కూడా మాన్చేవారు. నాకు 1940 వేసవి కాలంలో ఆసనము ప్రక్కన చిన్న గడ్డ. మూడు నాలుగు రోజులు చాలా బాధపడ్డ తర్వాత దానికి చీము బయటకు వచ్చి తర్వాత బాధ తగ్గింది. అదృష్టవశాత్తు ఫిస్ట్యులా (లూటీ) గాకుండా గాయం మానిపోయింది. ఆ కోసినభార ఇంత అని చెప్పటానికి వీలులేదు. కాలిదెబ్బ మా చాకలి వైద్యముచేసి మాన్పిన సంగతి చెప్పాను. ఇప్పుడు ఇంగ్లీషు వైద్యంగా పిలువబడే అలోపతి వైద్యము మన దేశంలో చాలా సంవత్సరాల నుండి జరుగుతున్నది. మొదట్లో అంటే 100 లేక 150 సంవత్సరాల క్రితం, ఆ గ్రామీణ వైద్యానికి ఈ అల్లోపతి వైద్యానికి ఫలితాలలో

తేడా అంతగా వుండేది కాదు. శస్త్ర చికిత్సకు సంబంధించినంత వరకు ప్రధానమైన అవరోధాలు రెండు: ఒకటి మత్తు మందు తెలియకపోవటం. రెండు గాయాలకు చీముపట్టకుండటం ఎట్లానో తెలియక పోవటం.

## మత్తు మందు ఆవిష్కరణ :

19వ శతాబ్దపు ఉత్తరార్థంలో మత్తుమందు కనుక్కోవటం గాయాలు చీము పెట్టడానికి కారణం "సూక్ష్మజీవుల"నీ వాటిని నిరోధించటం సాధ్యమని, తెలుసుకున్నారు. అంతకు పూర్వము కేవలం శరీరం పై భాగానికి మాత్రమే పరిమితమైన శస్త్ర చికిత్స తరువాత శరీరంలో అన్ని భాగాలు లోతుకు వెళ్ళే, శస్త్ర చికిత్స చేయటం సాధ్యమైనది. గత వంద సంవత్సరాలలో, శస్త్ర చికిత్స బాగా అభివృద్ధి చెంది, శరీరంలోని ప్రతి అవయవానికి, గుండె మెదడు వగైరా అవయవాలకు కూడా శస్త్రచికిత్స చేసి మామూలు ఆరోగ్య స్థితికి తీసుకొని రాగలుగుతున్నారు. ముఖ్యంగా గుండె చికిత్సను గురించి తెలియని వారు ఎవరూ లేరనుకొంటాను. కాళ్ళకు చేతులకు పరిమితమైన శస్త్రచికిత్స. పొట్ట మొదలైన అవయవాలకు (ఉదరం) చేయటం కొంత కాలం పట్టింది.

## పొట్ట ఆపరేషన్ చేస్తే అపెండిక్సు మిగలదు :

మా చిన్నప్పుడు కడుపులో నొప్పి వచ్చినప్పుడు విరోచనాలకు వేయటం జరుగుతుండేది. అదే కాలంలో "అట్లా చేయటం తప్పు. కొన్ని సందర్భాలలో లోపల అపెండిక్స్ చిన్న పేగు చీముపట్టి విరోచనానికి వేసినప్పుడు ఆ చీము గడ్డ పగిలే ప్రమాదము. వస్తుంది అని, నొప్పి వచ్చిన వెంటనే డాక్టరు దగ్గరకు వెళ్తే అపెండిసైటీస్ అయితే దానిని నిర్ధారణచేసి ఆపరేషను చేస్తారని చెప్పుకొనేవారు. ఇలా నొప్పివచ్చినప్పుడు అశ్రద్ధ చేయకుండా 24 గంటలలోపల డాక్టరు దగ్గరకు వెళ్ళాలని చెప్పేవారు. దీనిని 24 గంటల నొప్పి జబ్బు అని పిలిచేవారు. అంతే త్వరగా డాక్టరు దగ్గరకు వెళ్ళాలని దీని అర్థం. ఈ జబ్బు వయస్సువారికైనా

రావచ్చు. 20వ శతాబ్దపు ప్రారంభంలో ఇద్దరు ప్రముఖులకు ఈ జబ్బు వచ్చింది. బ్రిటీషు రాజు ఎడ్వర్డుసెవెన్" పట్టాభిషేకం నాటికి, ఈ జబ్బు వచ్చినందువలన పట్టాభిషేకం వాయిదా పడింది. ఆకారణంగా ప్రపంచ వ్యాప్తంగా ఈ జబ్బు అందరికీ తెలిసింది. రెండవ వ్యక్తి మహాత్మాగాంధీ. వీరు దక్షిణాఫ్రికాలో వున్నప్పుడు అక్కడ బ్రిటీషు సర్జను ఆపరేషను చేసి గాంధీగారికి ఈ జబ్బు నుండి విముక్తి కలిగించారు. అందువలన సామాన్య ప్రజలలో ఒక అవగాహన వుండేది.

కొంతమంది సర్జన్స్ అయితే కడుపులో నొప్పి కొద్ది రోజులనుంచి వున్నా దీర్ఘకాలంగా వున్న దీనికి ఎపెండిక్స్ కారణంగా చూపి ఆపరేషను చేసేవారు. మరికొందరు పొట్టకోసిన తర్వాత వ్యాధి కారణం కనిపించనప్పుడు అపెండిక్సును తీసివేసేవారు. ఇంకొందరు వారు నిర్ణయించిన జబ్బుకు ఆపరేషను చేసి ఈ ఎపెండిక్సు, ఎప్పుడైనా బాధించవచ్చుకదా అని దానిని కూడా తీసివేసేవారు. మొత్తం మీద పొట్ట ఆపరేషను చేయించుకొన్నవారిలో అపెండిక్సు మిగిలేదికాదు. ముందు ముందు అపెండిసైటీస్ రాదు అన్న భ్రమకూడా వచ్చేది.

**యాంటి బయాటిక్స్; వ్యాక్సీన్స్ :**

1935 నుండి చీము పట్టకుండా వుండటానికి సల్ఫానమైడ్స్ వచ్చినవి. 1940 అలెగ్జాండర్ ఫ్లెమింగు పెన్సిలిన్ అనే యాంటిబయాటిక్ కనిపెట్టిన తర్వాత ట్యూబర్ క్లోసిస్కు స్ట్రెప్టోమైసిన్ టైఫాయిడ్కు క్లోరోమైసిటన్ మిగతా అనేక సూక్ష్మ జీవులను నిరోధించటానికి ఆరియోమైసిన్, ఈ ఆరియోమైసిన్ అమెరికాలో లెడర్లీ లేబరేటరీలో పనిచేస్తూ డాక్టర్ ఎల్లాప్రగడ సుబ్బారావు గారు దీనిని కనుగొన్నారు. అప్పటినుండి ఇప్పటి వరకూ చాలా రకములైన యాంటీబయాటిక్స్ కనుగొన్నారు. అతి భయంకరమైన స్ఫోటకమునకు (స్మాల్ పాక్స్) టీకామందు కనిపెట్టి నిరోధానికి, దాని ద్వారా ప్రపంచ వ్యాప్తంగా నిర్మూలనానికి ఉపయోగించారు. సర్ లూయిపాశ్చర్ ఈ వాక్సిన్ కనుగొన్నారు. దీని ఉపయోగం ద్వారా, ప్రపంచంలో ఈ వ్యాధిని నిర్మూలించగలిగారు. అలానే

మలేరియా వ్యాధిని కూడా నిర్మూలించటానికి ప్రయత్నాలు జరిగినవి కాని మన అలసత్వమువలన సరైన ఫలితములు అంతగా రాలేదు. సర్ రోనాల్డ్స్ మలేరియాలో జీవిత చక్రం కనుగొన్నాడు. 1881లో డొనవాన్ అనే ఫ్రెంచ్ ఫిజీషియన్ మలేరియాకు కారణమైన క్రిమిని కనిపెట్టారు. ఆ క్రిమి దోమ ద్వారా మానవ శరీరంలోనికి ప్రవేశపెట్టబడుతుంది.

## వైద్యరంగానికి మంచి రోజులు :

నేను వైద్య వృత్తిలో ప్రవేశించిన కాలం, చాలామంచికాళం అని నా అభిప్రాయం. దీనికి కారణము అంతకు ముందు చాలా జబ్బుల నివారణకు సరైన వైద్యము లభించేది. కాదు. వైద్యరంగంలో ఆంటీబయోటిక్స్ చాలా గొప్ప మార్పును తీసుకొని వచ్చినవి. మొట్టమొదట 1940 దశకంలో పెన్సిలిన్, కనుగొన్నప్పుడు దానిని వండర్ డ్రగ్ అని భావించాము. దాని తరువాత క్షయ వ్యాధులు, టైఫాయిడ్ మొదలైన వాటికి ప్రత్యేకమైన ఆంటీబయోటిక్స్ ్‌ను కనుక్కోవటం జరిగింది. ఇప్పుడు దాదాపు, సూక్ష్మ జీవులవల్ల వచ్చే అన్ని జబ్బులకు తగిన ఆంటీబయోటిక్స్ వచ్చినవి. ఈ మందులు సామాన్య ప్రజలకు అందుబాటులో వున్నవి. అందువలన ఎక్కువ ప్రజానీకానికి మేలు జరిగింది.

## వర్జరీ :

శస్త్ర చికిత్సలో, ముఖ్యంగా ఊపిరి తిత్తులు, గుండెపై శస్త్రచికిత్స చేయటం నిరపాయకరంగా మారింది. రోగనిర్ణయ విషయంలో లాబరేటరీ టెస్టులు అంతకుముందు పరిమితంగా వుండేవి. ఎక్స్ రేలకే పరిమితమైన రేడియోలజీ కొత్తగా స్కానింగు ఎం.ఆర్.ఐ. మొదలైన పరీక్షలు వచ్చినందువలన, చాలా జబ్బులను, మొదటి దశలోనే తెలుసుకోవటం. సాధ్యమౌతుంది. దీనితోపాటు పరిమితంగా వున్న బయోకెమికల్ టెస్టులు కూడా అభివృద్ధి చెంది రోగనిర్ణయంలో ప్రముఖపాత్ర వహించినవి. అయితే రోగికి ఏ పరీక్షలు

అవసరమో డాక్టరే నిర్ణయించాలి. అలాకాకుండా రోగులు తమంత తాముగా వచ్చి స్కానింగు కావాలి. ఎం.ఆర్.ఐ. కావాలి ఇంకా ఏమైనా ఖరీదైన టెస్టులుంటే అవికూడా కావాలి అని ఎగబడుతున్నారు. ఏ ఒక్క టెస్టు రోగాన్ని నిర్ణయించలేదు. ఆ నిర్నయం డాక్టరువల్లనే అవుతుంది. టెస్టులవల్ల జబ్బు నిర్ణయమౌతుందన్న భ్రమలో, సామాన్య రోగులు, డాక్టరుతో ప్రమేయం లేకుండా కూడా ఆ టెస్టులకు ఎగబడటం, ఆ టెస్టులు చేసేవారు వారి బలహీనతలను ఆసారాగాతీసుకొని దుర్వినియోగం చేయటంకూడా జరుగుతుంది.

## హెచ్.ఐ.వి./ఎయిడ్స్ :

మేము చదువుకొన్నప్పుడు మాకు తెలియని క్రొత్త జబ్బు ఎయిడ్స్. ప్రస్తుతం ఆ జబ్బుకు నివారణలేదు. ప్రపంచ మొత్తాన్ని గడగడ వణికిస్తున్న సమస్య ఇది. బహుశా కొన్ని సంవత్సరాలలో మందు కనుక్కోగలుగుతారేమో. ప్రస్తుతం మా వైద్యంలోవున్న మందులేని జబ్బు, పిచ్చికుక్క కరిస్తే వచ్చే హైడ్రో ఫోబియో అనే జబ్బు. జబ్బు కొద్ది రోజులలోనే ప్రాణం తీస్తుంది. ఎయిడ్స్ వచ్చిన రోగి చాలా సంవత్సరాలు బ్రతకవచ్చు. జాగ్రత్తలు పాటిస్తే ఆ జబ్బును వ్యాపింపచేయకుండా వుండవచ్చు. నేడు వైద్యానికున్న సవాల్ ఎయిడ్స్ వ్యాధి.

## హాస్పటల్ సిల్వర్ జూబ్లీ ఫంక్షను:

1976లో మా పెద్దబ్బాయి రమేష్, మూడవ అమ్మాయి ఉషాబాల, వివాహం నిశ్చయం అయింది. అప్పటికి గుంటూరులో మేం నర్సింగ్ హోంను నెలకొల్పి 25 సం॥ పూర్తి అయింది. ప్రాక్టీసు కూడా, మేము ఊహించిన దానికన్నా, బాగానే వృద్ధి చెందింది. అప్పటికి నేను, పది సంవత్సరాలు, గుంటూరు మెడికల్ కాలేజీలో ఆనరరీ ప్రొఫెసరుగా పనిచేసివున్నాను. నాగార్జున ఎడ్యుకేషన్ సొసైటీ ఫౌండర్ కరస్పాండెంటుగా వుండి జె.కె.సి. కాలేజి స్థాపించి, దిగ్విజయంగా నడిపి ఆ పదవి నుండి విరమించుకున్నాను. వర్సింగ్ హోం రజితోత్సవము జరిపి,

మాకు మెడికల్ కాలేజీలో ప్రొఫెసర్లుగా చేసి అప్పటికి సజీవులుగా వున్న వారందరినీ సన్మానించుకొన్నాము. అదే సందర్భములో మా వద్ద పనిచేసిన డాక్టర్లు జనరల్ హాస్పిటల్లో మా వద్ద విద్యార్థులుగా వుండి నా పట్ల అభిమానాన్ని పెంచుకొన్న డాక్టర్లు కలిసి మమ్మల్ని సన్మానించాలనుకొన్నారు.

ఆ ఉత్సవానికి అధ్యక్షులుగా ప్రొఫెసర్ ఎన్.జి. రంగాగారు వచ్చారు. మా ప్రొఫెసర్లలో నలుగురు మాత్రము రాగలిగారు. వారు డాక్టర్ డి.వి. సుబ్బారెడ్డి, ఎం.డి., డాక్టర్ అనంతాచారి ప్రొ. ఈశ్వరయ్య, డాక్టర్ డి. జె. రెడ్డిగారలు వచ్చారు. కొంతమంది. వృద్ధాప్యంవలన రాలేకపోయారు. ఆ సభల్లో మేము మా ప్రొఫెసర్లను సత్కరించాం, అలానే మా అనుయాయిలు, మిత్రులు, మమ్మల్ని సన్మానించారు. ముఖ్యమైన విషయము. ఏమంటే "రైతు కుటుంబాలలో, ఒక బిడ్డకైనా ఉన్నత విద్యను ఇవ్వటానికి, తల్లి దండ్రులు ఎన్ని త్యాగాల్ని చేయవలసి వస్తుందో ఊహించుకోమని, అలా చదివినవారు తల్లి దండ్రులపట్ల ఎంత కృతజ్ఞతాపూర్వకంగా వుండి వారిని సేవించారో రంగాగారు వివరించారు. మధ్యలో సన్మాన సత్కారాలు మామూలే. చాలా మంది డాక్టరు సోదరులు, పురప్రముఖులు వచ్చి మమ్మల్ని అభినందించి ఆశీర్వదించారు. ఆ కార్యక్రమము తరువాత రాత్రిపూట మా పిల్లలిద్దరి పెళ్ళిళ్ళు అయినవి. అందరికి ఆనందాన్ని ఇచ్చిన ఆరోజును మరచిపోలేము.

మా సర్జనుడా ఆత్మారామారావుగారు రాలేకపోయారు. హాజరయిన వారికి చేసిన సత్కారము వారికి అందజేయటం జరిగింది. వీరి దగ్గర సీనియర్ హౌస్ సర్జను అసిస్టెంటు సర్జనుగా పనిచేస్తూ ఎం.ఎస్. డిగ్రీ పొందాను. అదే సందర్భంలో మా సర్జరీ ప్రొఫెసరు రమణమూర్తిగారి తైలవర్ణ చిత్రము అనంతాచారిగారితో ఆవిష్కరింప చేశాము. నా చదువుకు కారణభూతమైన మా మేనమామ పిన్నమనేని సూరయ్యగారి తైలవర్ణ చిత్రముకూడా ఆవిష్కరింపచేశాము. నాకు

ఎక్కువ సంతృప్తి ఇచ్చిన కార్యక్రమమది, ఆత్మారామారావుగారికి పట్టుబట్టలు మెమొంటో పంపించాను.

హాస్పిటలు వెనుక భాగంలోవున్న... సిల్వర్ జూబ్లీ భవనం నిర్మించాలన్న ఉద్దేశ్యంతో డాక్టర్అనంతాచారిగారితో ఫౌండేషన్ వేయించాము. తరువాత కొద్ది మాసములలో వచ్చిన ఎన్నికలలో, నేను పాల్గొనటంవలన అది క్రియారూపము దాల్చలేదు. ఇప్పటికి మా పిల్లలు కావాలనుకుంటే వారికి నచ్చిన విధంగా నిర్మాణం చేసుకోవచ్చు.

# విదేశీయానం

నేను డాక్టరు అయిన తరువాత ఒక సంవత్సరము ఇంగ్లాండులో పనిచేయాలను కొనేవాణ్ణి. అప్పటి ఆర్థిక పరిస్థితి సహకరించనందు వలన, ఆ ఆశను వదులుకొన్నాను. ప్రాక్టీసు మొదలు పెట్టిన తరువాత, విదేశాలకు వెళ్ళి వచ్చేటంతటి వ్యవధి లేకపోయింది. 1950 చివరి నుండి, చాలామంది యువ డాక్టర్లు, అమెరికా వెళ్ళటం ప్రారంభించారు. ఆ వెళ్ళినవారు ఎప్పుడైనా స్వదేశానికి తిరిగివచ్చినప్పుడు వారి అనుభవాలు తెలుసుకొంటూ వుండేవాడిని. తరువాత మా తమ్ముడు మన్మధరావు అమెరికా వెళ్ళిన తరువాత, తరచు అక్కడి విషయాలను గురించి వ్రాస్తూ వుండేవాడు. మా పిల్లలు డాక్టర్లయిన తర్వాత, పెద్దమ్మాయి అల్లుడు ఇంగ్లాండుకు వెళ్ళారు. ఆ తర్వాత రెండవ అల్లుడు, అమ్మాయికూడా ఇంగ్లాండుకు వెళ్ళటం జరిగింది. ఆ తరువాత మా పెద్దవాడు. కూడా ఇంగ్లాండు వెళ్ళాడు. తరువాత మా మేనకోడలు భర్త నరసింహారావు అమెరికా వెళ్ళారు. వీళ్ళందరూ మమ్మల్ని రమ్మని వ్రాస్తూ వుండేవారు. మా వద్దనే పెరుగుతున్న మా పెద్దమ్మాయి కుమారుడు సమీర్ ఇంగ్లాండు వెళ్ళి అక్కడ నుండి అమెరికాలో ఒలంపిక్స్ జరిగే సమయానికి, అమెరికా పర్యటన కూడా చేసి వచ్చారు. నేను వెళ్ళటానికి వెనుకముందు ఆలోచించటానికి కారణం నా ఆస్థ్మాజబ్బు. జయప్రదాంబ తిరిగి వచ్చిన తరువాత వేసవికాలంలో ఇక్కడకు అక్కడకు తేడా ఏమీలేదు. అందువలన ఆస్మా గురించి భయపడవలసింది ఏమీలేదు. అని ప్రోత్సహించారు. ఆ సమయానికి మా పెద్దబావగారు వర్మగారు, అమెరికా ప్రయాణానికి సిద్దపడ్డారు.

మేమిద్దరమూ, 1985 జూన్ 30వ తేదీ అమెరికా బయలుదేరాము. జులై మొదటివారంలో జరిగే "తానా" సభలకు గూడా నాకు ఆహ్వానము వచ్చింది. అదే "తానా" మహాసభలకు హాజరుకావటం కొరకు బయలుదేరిన యార్లగడ్డ

లక్ష్మీప్రసాద్ గారు మా ఫ్లయిట్లోనే వచ్చాడు. అప్పటికే 10–15 ఏళ్ళ నుండి అతను పరిచయం. చాలా ఉత్సాహవంతుడు, వాక్చాతుర్యంకల వ్యక్తి. అందువలన మా ప్రయాణము చాలా సునాయాసంగా సాగింది. బొంబాయిలో ఉదయం 7 గంటలకు బయలుదేరిన మేము లాస్ఏంజెల్స్ విమానాలు దిగేటప్పటికి అక్కడ సమయము 6.30ని.లకు అయింది. మేము ప్రయాణం చేసిన సమయం 24 గంటలు. భూమి తన చుట్టూ తాను తిరుగు చున్నందువలన జరిగిన పరిణామము ఇది. మొత్తం మీద విమానంలో 3–4 సార్లు భోజనం పెట్టారు. అక్కడ విమానం దిగేటప్పటికి ఇంకా సూర్యుడు తీక్షణంగానే వున్నాడు. నాకయితే ఫ్లయిట్ ఎక్కినదగ్గర నుండి సూర్యునితోపాటు ప్రయాణించాము కదా మన ఊర్లో సూర్యుడు అస్తమించి మళ్ళా ఉదయంచాలి కదా. అనే భావమే ఆశ్చర్యం కలుగచేసింది.

డాక్టరు నరసింహారావు, అరుణ ఇద్దరూ ఎయిర్పోర్టులో మమ్మల్ని రిసీవ్ చేసుకొన్నారు. వారు అక్కడకు 120 మైళ్ళ దూరంలో వున్న పామ్ స్ప్రింగ్స్ అనే పట్టణంలో వుంటున్నారు. అక్కడనుండి బయలుదేరి ఒక గంటన్నరలోపే అక్కడకు వెళ్ళాము. ఇంకా ప్రొద్దు కన్పిస్తానే వుంది. వెళ్ళిన వెంటనే కాసేపటికి భోజనం చేస్తారా అని అడిగారు. ఇదేమిటి ప్రొద్దుకుంగకముందే భోజనం చేస్తున్నారా అని అడిగాను. ప్రొద్దు కూకటానికి ఇంకా చాలా టైముంది. మన టైం ప్రకారము భోజనం చేయాల్సిందే అన్నారు. తరువాత 10.30ని.లకు పొద్దుకూకింది. (సూర్యాస్తమయం) నిదురపట్టీ పట్టకుండా వున్నది. మూడున్నర నాలుగు గంటలకు తెల్లవారింది. భూమధ్యరేఖకు ఉత్తరం చాలా దూరంగావున్న ప్రదేశాలలో పరిస్థితి ఇది. ఇదే శీతాకాలమైతే పగలు చాలా తక్కువగాను, రాత్రిళ్ళు చాలా ఎక్కువగానూ వుంటుంది. అక్కడ ఏ పనిచేసేవారైనా, సూర్యోదయం–అస్తమయంలతో సంబంధము లేకుండా గడియారంలా పనిచేస్తుంటారు. రెండు మూడు రోజులు వారితో వున్న తర్వాత లాస్ఏంజెల్స్లో

జరిగే 'తానా' సమావేశాలకు హాజరై ఆ రెండుమూడు రోజులు ఎంతోమంది తెలిసినవారికి నేను ఆనరరీ సర్జనుగా చేసే రోజులలో నావద్ద తర్ఫీదయిన డాక్టర్లను చాలా మందిని కలిసాను. నేను అక్కడ దిగిన దగ్గర నుండి, నాకు ఆశ్చర్యము కలిగించిన విషయాలు విశాలమైన రోడ్లు, చాలా విశాలమైన బిల్డింగ్స్ వాటి ప్రక్కనే అంతస్తులవారిగా కారు పార్కింగు. ఆ సమావేశాలు శ్రీమతి టంగుటూరి సూర్యకుమారి ప్రారంభగీతంతో మొదలైనవి. ఆమె మన దేశంలో పుట్టి పెరిగి, కొద్దిగా సినిమాలలో నటించి, గొప్ప గాయినిగా పేరు సంపాదించుకొని వివాహమైన తరువాత ఇంగ్లాండులో స్థిరపడింది. ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశంగారి అన్నకూతురు, ఈ ప్రోగ్రాంకొరకు ఆమెను ఇంగ్లాండు నుండి పిలిపించారు. ఆ రెండు మూడురోజులు సాహిత్య కార్యక్రమాలు ఆటపాటలలోనే గడిచింది. తెలుగు దేశంనుండి చాలామంది కవులు, పండితులు కూడా వచ్చారు. హరికథా ప్రవీణుడు శ్రీ వీరగంధం వెంకటసుబ్బారావుగారు. ఆయన భార్యలక్ష్మి పార్వతితోపాటు వచ్చారు. ఆయనను అంతకు ముందే ఎరుగుదును. లక్ష్మీపార్వతిని చూచి ఈమె మీ "అమ్మాయా" అని అడిగాను. ఆయన నిమ్రతగా "కాదండీ నా భార్య" అని చెప్పారు. ఇటువంటి అనుభవాలు నాకు ఇంతకు పూర్వము కూడా జరిగినవి. విశాఖపట్నంలో కె.జి. హాస్పటల్లో ఒక సీనియర్ డాక్టరు పేషెంటుగా అడ్మిట్ అయ్యాడు. ఆయనను చూడటానికి వెళ్ళినప్పుడు ఒక అమ్మాయి చాలా ఆందోళనగా వుంది. "ఈవిడ మీ అమ్మాయా" అని అడిగాను. దానికతడు చాలా కోపంగా "నో షీ ఈజ్ మై వైఫ్" అన్నాడు. తానాలో చేసిన భోజనపు ఏర్పాట్లు నాకయితే ఏమాత్రము తృప్తికలిగించలేదు. పులిహోర, దద్ధోజనం మొదలైనవి. తయారు చేయించారు కాని అవి ఇంపితముగాలేవు. ఆ కార్యక్రమంలో జరిగిన ఒక చిన్న విశేషము..... ఆడ పిల్లలు తమ తల్లి దండ్రులు సెక్స్ విషయంలో మగ పిల్లలకు ఇచ్చిన స్వతంత్రము తమకు ఇవ్వటము లేదు అని ప్రసంగించటం.

ఆ తరువాత చాలా పట్టణాలలో తిరిగినప్పటికి కూడా నాకు కలిగిన అభిప్రాయము మనవారు ఎక్కువమంది, ఎక్కువకాలం అమెరికాలో వున్నప్పటికీ, స్థానికులలో కలసిపోకుండా, ఎవరికి వారుగా వుండటం, దానివలన తరువాత తరం వారికి వచ్చిన ఇబ్బంది. ఇంట్లో తమ ప్రవర్తన ఒక విధంగా వుండాలి, బయట వేరొక విధంగా వుండాలి. అనేది సమస్యాత్మకంగా మారింది. ఈ మూడు రోజులయిన తరువాత మరల సాంస్ప్రింగ్స్కు వెళ్ళి అక్కడ కొన్ని రోజులున్న తర్వాత మిగతా ప్రదేశములకు వెళ్ళటానికి బయలుదేరాము. దీనికొరకు విమానపు కంపెనీలు కొన్ని ప్రత్యేకపు ఏర్పాట్లు చేశాయి.

అమెరికా వచ్చే సందర్శకులు, వివిధ ప్రదేశాలకు వెళ్ళటానికి ఎనిమిది టిక్కెట్లు 600 డాలర్లకు అమ్మేవారు, మేము ఏఏ ప్రదేశాలు చూడదలచుకొన్నామో ఆ లిస్టు ముందే ఇవ్వాలి. సెంట్ లూయిస్ వున్న డాక్టరు మధుసూధనరావు దంపతులు ఈ ఏర్పాట్లను చూశారు. లాస్ఏంజల్స్ నుండి సెంట్ లూయిస్ వచ్చి అక్కడనుండి మిగతా పట్టణాలకు ప్రయాణము ఏర్పాటుచేసుకొన్నాము. దాని ప్రకారము అట్లాంటా, వాషింగ్టన్, న్యూయార్క్, మాంచెస్టరు డాక్టర్ మన్మధరావుతో అక్కడనుండి కారులో నయాగరా, తిరిగి న్యూయార్కు వచ్చి అక్కడనుండి ఇంగ్లాండు బయలుదేరాము. అప్పటికి అయిదు వారములు అమెరికాలో వున్నాము.

ఈ ప్రయాణాలలో చెప్పుకోదగింది చికాగో–డెట్రాయిట్. చికాగోలో సిటీ సెంట్రల్ హాల్లో వున్న డాక్టరు మాకు సన్మానము చేశారు. 100–125 మంది పాల్గొన్నారు. ఎలవర్తి రామరాజ భూషణుడు (రోశయ్యగారి కుమారుడు) ఈ సభను నిర్వహించారు. అటు తర్వాత డెట్రాయిట్ వెళ్ళినప్పుడు వారు ఆదివారం నాడు పిక్నిక్లోగా ఏర్పరచుకొని ఆకార్యక్రమానికి నన్ను ఆహ్వానించారు. చాలామంది పూర్వ విద్యార్థులను కలిశాను. ఆ పట్టణంలో నా పూర్వ విద్యార్థి వేమూరి రమేష్ ఇంట్లోదిగాము. మరియొక పూర్వ విద్యార్థి డా గణేశ్ కుమార్ (గుంటూరులోని

డాక్టర్ అనంతరామశాస్త్రిగారి కుమారుడు) ఇంటికి వెళ్ళాము. అతని ఇంటికి వెళ్ళినపుడు ఆగదిని పరికించి చూస్తున్నాను. గణేశ్కుమార్ వెంటనే లైబ్రరీ ప్రక్క గదిలోనే వున్నది అని తీసుకొని వెళ్ళి చూపించి మాకు కావలసిన పుస్తకాలన్నీ తీసుకొని వెళ్ళమన్నాడు. అతను వైద్య విద్యార్థిగా వున్నప్పుడు డాక్టర్ కడియాల వాసుదేవరావుకు క్లాస్మేట్. డిబేట్లో ఆయన పార్టనర్. హాస్పిటల్ కంటే నేను చాలాసార్లు వారిని బుక్ షాపులో కలుసుకొనేవాడిని. అందువలన నా సాహిత్య అభిమానం ఆయనకు తెలుసు. "పుస్తకాలు నీవిచ్చినా ట్రాన్స్పోర్టు నావల్ల అయ్యేపనికాదు అని తిరస్కరించాను. మరియొక పూర్వ విద్యార్థి డాక్టర్ వడ్లమూడి రాజేంద్రప్రసాద్, బ్రేక్ ఫాస్ట్కు ఆహ్వానించి, స్వయంగా తయారుచేసి వడ్డించాడు. ఆదివారం సెంట్రలోహాలులో అందరము సేక ఆడుకొన్నాము.

**డాక్టర్ల జీవన విధానం :** ఎక్కువ మంది డాక్టర్లు పగలు డ్యూటీలో అచ్చట క్యాంటీన్లో దొరికే ఆహారం తీసుకొంటారు. రాత్రిళ్ళు మాత్రం ఇక్కడ లాగానే రైస్, కూరలు భోజనం చేస్తారు. డ్రింక్చేసే అలవాటు చాలా కొద్దిమందికి మాత్రమే వుంది. అప్పటికి దంపతులు ఒకరిద్దరు మాత్రమే డైవర్స్ చేసుకొన్నారు. నాకు కలిగిన అభిప్రాయము ఏమంటే "అందరూ బాగానే వున్నారు. ఎక్కువమంది ఒకచోటులో లేరు అలా వున్నట్లయితే కల్చరల్ దగ్గర దగ్గర వుండేవారు. కాని ఎవరూ కలిసినట్లు కన్పించలేదు. నేను ఒకరిద్దరిని అడిగాను. "మీ ఇంట్లో ఏదైనా ఫంక్షన్ జరిగినప్పుడు మీతోపాటు పనిచేసేవారినెవర్నైనా ఆహ్వానిస్తారా? అని లేదు అని సమాధానం. మీ ఇరుగు పొరుగునెవరినైనా ఆహ్వానిస్తారా? అన్నాను. దానికి లేదనే సమాధానం. ఇప్పుడు చాలా పట్టణాలలో మనవారు చెప్పుకోదగ్గ సంఖ్యలోనే వున్నారు. లాస్ ఏంజెల్స్లో వున్న 'యూనివర్సల్ స్టూడియో' రెండోది "డిస్నీలాండ్" డిస్నీలాండ్ చూసిన తర్వాతనే రామోజికి "ఫిల్మ్సిటీ ఏర్పాటు చేయవలెనన్న అభిప్రాయం కలిగింది అంటారు. ప్రస్తుతం హైదరాబాదులో ఏర్పాటుచేసిన ఫిల్మ్ మేకింగ్ ఆ స్థాయికి దగ్గరగా వుందనుకుంటాను.

కాలిఫోర్నియా స్టేట్ నే "ఫ్రెంజ్నో నగరంలో వున్న మా విద్యార్థి డాక్టర్ అంబటి శ్రీమన్నారాయణ ఆహ్వానంపై అక్కడకు విమానంపై వెళ్ళి అక్కడ రెండు మూడు రోజులు గడిపిన తరువాత కారులో శాన్ఫ్రాన్సిస్కో బయలుదేరాము. నేను లాస్ ఏంజిల్స్లో వుండగానే, శాన్ఫ్రాన్సిస్కో శాన్రుబాయిలో స్థిరపడ్డ రత్తయ్య అనే ఇంజనీరుగారి ఆహ్వానము అందినది. శాన్ ఫ్రాన్సిస్కో వెళ్ళేముందు వారింటికి వెళ్ళి వారితో పాటు శాన్ఫ్రాన్సిస్కో వెళ్ళాము. అది సుందరమైన నగరము, దానికి ప్రక్కనే వున్న నదిమీద పెద్ద వంతెన గొప్ప ఇంజనీరింగ్ ఫీట్ అని చెప్తారు. అది కాక చిన్న ఐలాండు మెయిన్ లాండుకు సుమారు రెండు కిలోమీటర్ల దూరం ఎక్కుడా పిల్లర్లు లేకుండా నిర్మించారు. అదే రెండు అంతస్తులుగా, మొదటిసారి చూసేవారికి ఆశ్చర్యం కలిగించక మానదు.

ఆరాత్రి తిరిగివచ్చి రత్తయ్యగారింట్లో బసచేశాము. ఆయన భార్య రమణమ్మ గుంటూరులో విద్యార్థిగా వుంటూ అక్కడ ప్రయాణానికి అవసరమైన ఫిజికల్ ఫిట్నెస్ సర్టిఫికేట్ జయప్రదాంబగారి దగ్గర నుండి తీసుకొన్నదట. ఆ విషయాన్ని గుర్తు పెట్టుకొని మాకు బాగా మర్యాదచేసింది.

తిరిగి ఫెరెనో చేరాము. అక్కడ నుండి విమానం మీద పాల్ స్ప్రింగ్స్ చేరుకున్నాము. అక్కడ నుండి ఒకరోజు శాన్డడియాకో మెరైన్ జూ (సముద్ర జంతువుల 200) చూసివచ్చాము. మరొకరోజు లాస్ వేగన్ పట్టణం వెళ్ళి ఒకరాత్రి అక్కడ జరిగే వినోద కార్యక్రమాలు, ప్రతి హోటలు నిండా గాంబ్లింగ్ కార్యక్రమాలు చూశాము. ఆ పట్టణం. యొక్క ప్రత్యేకత గాంబ్లింగ్. ప్రభుత్వము అనుమతి సంపూర్ణంగా వుంది. దాని కొరకు దేశం అన్ని ప్రాంతాలనుండి వచ్చి పెద్ద మొత్తంలో గాంబ్లింగ్ (జూదం) ఆడుతుంటారు. అక్కడ రాత్రి అనేది లేదు.

అట్లాంటిసియాలో గుంటూరులో పూర్ణా ట్యుటోరియల్ నడిపిన జి. పూర్ణచంద్రరావు, అక్కడ దగ్గరలో వున్న కొలంబస్ పట్టణంలో డాక్టర్ ఫి. పూర్ణ

చంద్రరావు వున్నారు. ఈ ఇద్దరి దగ్గరకు వెళ్ళి వారి ఆతిధ్యమును అందుకున్నాము. వాషింగ్టన్లో మా దగ్గర బంధువు, మా విద్యార్థి కూడా అయిన ఎస్.ఎస్.ఆర్.కె. ప్రసాద్ ఇంట్లో మూడు రోజులు బసచేశాము. అందులో ఒకరోజు అక్కడ అందుబాటులో వున్న మా విద్యార్థులు, ఇతర మిత్రులు గొప్ప డిన్నరు ఇచ్చారు. అక్కడ నుండి తిరుగు ప్రయాణానికి రావాల్సివుంది. న్యూజెర్సీలో వున్న డాక్టర్ ఎతిరాజులు నన్ను చూడకుండా ఎట్లా వెళతారు, కార్లోవచ్చి న్యూజెర్సీలో ఆగండి అని అడిగారు. దానికి డాక్టర్ ప్రసాద్ అంగీకరించి కారులో తీసుకొని వచ్చి అక్కడదించారు. ఆరోజు అక్కడ వుండి మర్నాడు న్యూయార్కు వచ్చి అక్కడనుండి ఇంగ్లాండు బయలుదేరాము.

**న్యూ వరల్డ్ :**

మనం మామూలుగా అమెరికా అని మాట్లాడుకున్నప్పుడు ఉత్తర అమెరికా ఖండంలో, ఒక భాగమైన యు.ఎస్.ఏ. (అమెరికా సంయుక్త రాష్ట్రాలు) ఆమెరికా అంటే ఉత్తర అమెరికా, దక్షిణ అమెరికా రెండూ చాలా పెద్ద ఖండాలు. ఈ రెండు ఖండాలు కూడా 15వ శతాబ్దం చివరి వరకూ మిగతా ప్రపంచానికి తెలియదు. యూరోపియన్లు, సముద్ర యానంలో దిట్టలు కనుక భూమి గుండ్రంగా వున్నప్పుడు, ఆఫ్రికా ఖండం చుట్టి, ఇండియా చేరుకోగలము. అన్నభావంతో, సముద్రయానం చేసి కనుక్కొన్న భూభాగాలు ఇవి. యూరప్లో వున్న అన్ని దేశాలనుండి ఉత్సాహవంతులు కొత్తగా కనుగొన్న అమెరికాలో బంగారము, వెండి రాసులు రాసులుగా దొరుకుతుందని అన్ని దేశాలనుండి వెళ్ళారు. అలా వెళ్ళినవారు ఎక్కువమంది అక్కడే స్థిరపడి పోయారు. స్థానికంగావున్న ప్రజలమీద యుద్ధాలుచేసి, వారిని చంపి, ఆ భూమిని ఆక్రమించుకున్నారు. స్థానికులపై వీరు గెలవటానికి, ప్రధానకారణము "గన్పౌడరు". స్థానికులు కర్రలతోనూ, కత్తులతోనూ, ఎంత యుద్ధము చేసినా, తుపాకిమందుకు ఓడిపోయారు. ఇప్పటికి కొద్దిమంది స్థానికులను కొన్ని ప్రాంతాలలో శాంపుల్గా

వుంచారు. వారిని రెడ్ ఇండియన్స్ అంటారు. ఎందుకంటే మొదట కొలంబస్ అమెరికాను కనుగొన్నప్పుడు ఇండియా అనే అనుకున్నాడు. స్థానికులు రంగులు వేరుగా వుండటం అది ఇండియా కాదని తెలియటం వలన వారికి రెడ్ ఇండియన్స్ అని పేరుపెట్టాడు. చాలా పెద్ద భూమిని ఆక్రమించుకొని, వ్యవసాయం చేస్తూ సంపన్నులైనారు.

ఎక్కువ భూములలో వ్యవసాయం చేయటానికి ఆఫ్రికానుండి బలవంతంగా కొంతమంది నీగ్రోలను, పట్టుకొచ్చి, వారితో పని చేయించుకొనేవారు. వారిని (స్లేవ్స్) బానిసలు అనేవారు. కాలక్రమేణా వారి జనాభా కూడా పెరిగి, మేము స్లేవ్స్ ము కాదు మానవులమే, మీతోపాటు అభివృద్ధి కావటానికి అవకాశము ఇవ్వాలని, పోరాడి, హక్కులు సంపాదించారు. 400 లేక 500 సంవత్సరాలలో తెల్లవారికి, నీగ్రోలకు, వివాహములు కూడా జరిగి వారికి కలిగిన సంతానము, సమాజములు ఇప్పుడు అటు తెల్లవారు, నల్లవారే కాక మధ్య వివిధ రంగులవారు అందరూ సమాన హక్కులు కలిగి వున్నారు.

ఇప్పుడు అమెరికా ఖండాలలో యు.ఎస్.వీ. తోపాటు చాలా దేశాలున్నను అందరి ఆర్థిక స్థితి ఒకేరకంగా లేదు. యు.ఎస్.వీ.కు ప్రక్కనే వున్న మెక్సికో దేశం ఆర్థికంగా చాలా వెనుకబడివున్నదని, ప్రక్క రాష్ట్రాలలో పనిచేసే మన భారతీయులు చెప్పారు. దక్షిణ అమెరికా ఖండంలో చాలా దేశాలున్నవి. వీరు ప్రధానంగా, వ్యవసాయంపై ఆధారపడి, బ్రతుకుతూవుంటారు. భాషల కూడా వేరే. ఒక యు.ఎస్.ఏ.లో మాత్రము వ్యవసాయికంగా ప్రారంభమైన సమాజము తొందరగా పారిశ్రామికదేశమై, ఇప్పుడు సైన్సు అండ్ టెక్నాలజీలు చాలా అభివృద్ధి చెంది, మిగతా ప్రపంచ దేశాలపై ఆధిపత్యము వహించే స్థానానికి జేరింది. ఒక్క యు.ఎస్.ఏ. వరకు తీసుకొంటే విస్తీర్ణము మన దేశానికి మూడురెట్లు, జనాభా మనలో నాలుగోవంతు.

అమెరికాదేశాన్ని చాలా కాలం న్యూవరల్డ్ అని పిలచేవారు. మా చిన్నప్పుడు, గుంటూరులో ఒక కాలేజి ప్రిన్సిపాల్గారు అమెరికా వెళ్ళి తిరిగి వచ్చారు. ఆయనకు ఇంగ్లీషు అంత బాగారాదు. 'When I went to the other world (new world)–my picture fell in many papers' అన్నాడని జోక్కులర్గా చెప్పుకునేవారు. ఇప్పుడు new world అనే మాట ఎవరూ ఉపయోగించటం లేదు. నిజానికి మొత్తం ప్రపంచాన్ని "గ్లోబలిలేజ్" అని పిలుస్తున్నారు. దీనికి కారణం ప్రయాణ సౌకర్యాలు, వార్తా సౌకర్యాలు వెలసి ప్రపంచంలో ఏమూల ఏం జరిగినా మరొకముల వారికి క్షణాలలో తెలియటమే. అబ్రహాం లింకన్ చనిపోయినప్పుడు, మిగతా ప్రపంచానికి ఆ వార్త తెలియటానికి, ఎన్నాళ్ళు పట్టిందో ఊహించగలరా?

గత 50 సంవత్సరాల నుండీ, మనదేశమునుండి చాలామంది డాక్టర్లు ఇంజనీర్లేకాక, వ్యాపారస్థులు, ఇతరులు ఎక్కువగా వెళ్తున్నారు. మొదట్లో వెళ్ళేటప్పుడు కొన్నాళ్ళుండి. తిరిగి వద్దామనే వుద్దేశ్యంతో వెళ్ళినప్పటికీ ఎక్కువమంది అక్కడే స్థిరపడిపోయి, పిల్లల పెళ్ళిళ్లుకూడా అక్కడి వారితో జరిపి వారు అమెరికన్లయ్యారు. కొంతమంది మేధావులు భావించునట్లుగా ఇది బ్రెయిన్ డ్రెయిన్ (మేధోవలస) అయితే వారి దృష్టితో చూచినప్పుడు. ఈ దేశము వారిని ఇముడ్చుకోలేక పోయిందనేది కూడా యదార్థమేకదా! అమెరికాకు సంబంధించినంత వరకు ఇట్లా స్థిరపడ్డ వాళ్ళు కూడా, మిగతాపౌరులతో పాటు సమంగానే భావిస్తారు. దీనికి కారణం, అక్కడవున్న వాళ్ళందరూ అట్లా వచ్చినవారేకదా!

**అమెరికా మంది ఇంగ్లండు చేరాం :**

ఇంగ్లాండు ఎయిర్ పోర్టులో దిగేటప్పటికి మా పెద్దమ్మాయి రమాటాల, పెద్ద అబ్బాయి రమేష్ ఎయిర్పోర్టుకు వచ్చారు. నాకు ఎయిర్పోర్టులో దిగినప్పటినుండి

పరాయి దేశంలో వున్నట్లు అనిపించలేదు. కారణం అక్కడ పనిచేసేవారు. ఎయిర్పోర్టులో షాపులు నడిపేవాళ్ళు ఇండియన్స్, అదీ కారణం. లండములో డాక్టర్ సత్యప్రసాద్ వుండేవాడు. వెళ్ళి అక్కడ లంచ్ చేసి తర్వాత బర్నింగ్ హాంలో డాక్టర్ శ్రీహరి నిర్మల వారింట్లో రాత్రివుండి. మర్నాడు ఉదయం వారింగ్టన్ వెళ్ళాము. అక్కడే మా పెద్ద అమ్మాయి, అల్లుడు, పెద్ద అబ్బాయి రమేష్ పనిచేస్తున్నారు. తరువాత న్యూసెంట్రల్ ల్యాప్టాన్ దగ్గర వున్న మారెండో అమ్మాయి ఉమ, అల్లుడు సుబ్బారావు గారి ఇంటికి వెళ్ళాము. అక్కడ నుండి ఒకరోజు ఎడింబర్లో పట్టణానికి వెళ్ళి అక్కడ మెడికల్ కాలేజీ మొదలైనవి చూసివచ్చాము. వారింగ్టన్లో వుండగా అక్కడ మా డాక్టర్లందరూ ఒక ఆదివారం రోజు గెట్ టుగెదర్ ఏర్పాటుచేశారు.

సౌత్ ఎండ్ ఆన్ సీ అనే పట్టణంలోవున్న మా పూర్వ విద్యార్థి డాక్టర్ కె. సుబ్బరాజును డిన్నరుకు ఆహ్వానిస్తే చాలా దూరం కనుక రాలేనని క్షమించవలసిందిగా కోరాడు. అయితే మేమే వస్తామని చెప్పి తిరుగు ప్రయాణంలో లండన్చేరి అక్కడకు 30 మైళ్ళ దూరంలోవున్న సుబ్బరాజు ఇంటికి వెళ్ళాము. మేము వచ్చినందుకు ఆయన ఆయనభార్య ఎంతో ఆనందించారు. దాదాపు రాత్రి అంతా కబుర్లతోనే సరిపోయింది. మరునాడు ఉదయం బయలుదేరి లండన్ వచ్చి అక్కడనుండి విమానంలో తిరుగు ప్రయాణం చేశాము.

## రోడ్లమీద విమానం గస్తీ :

ఆ రెండు దేశాలలో అన్ని రోజులు–మొత్తం రెండు నెలలు తిరిగినా, ఎక్కడ కారుచౌక అయినట్టు కన్పించలేదు. మెయిన్ రోడ్డు మీద మైలుకు ఒక తెలుగు బంక్ వుంది. తర్వాత అంతకు ముందు నిన్నా నమ్మలేని విషయం, కొన్ని రోడ్లపై విమానం గస్తీ తిరుగుతూ వుంది. ఎక్కడైనా యాక్సిడెంట్ జరిగితే దగ్గరవుండే పోలీస్ స్టేషన్కు సమాచారం అందిస్తారు.

ఇంగ్లాండులో ప్రత్యేకంగా చూసినవి షేక్స్పియర్ జన్మించిన స్థలం, "స్ట్రాట్ఫర్డ్ ఆన్ అవాన్" లేక్ఇస్ట్రిక్ట్ వున్న వర్డ్స్ వర్తు ఉన్న ఊరు. ఎడిన్ బరోలో వున్న మెడికల్ కాలేజీ హాస్పిటల్, అక్కడ వున్న మ్యూజియం, అక్కడవున్న పెద్ద పాలెస్, రాబర్ట్ బ్రూపు అంకితం చేయబడింది. ఈ రాబర్డు బ్రూను గురించి మనవాళ్ళు చాలా పట్టుదలకు మారు పేరు మనిషిగా ఎక్కువసార్లు పరాజయం చెందినందుకు ఎగతాళిగా మాట్లాడతారు. కానీ అక్కడ అతన్ని చాలా గౌరవభావంతో చూస్తారు.

అలానే లండను దగ్గరకూడా రెండు మూడు ప్యాలెస్లు చూసాము. ఇంగ్లీషువారు కొన్ని వందల సంవత్సరాలనుండి గొప్ప ప్యాలెస్లు నిర్మించుకోవటం అలవాటయింది. తరువాత చిన్నప్పటి నుండి ఇంగ్లాండును గురించి ఆహార విషయంలో ఒక దురభిప్రాయం వుండేది. అక్కడే ఏమీపండదని, కానీ అక్కడ గోధుమ పంట మొక్కజొన్నపంట చూసిన తర్వాత ఆ అభిప్రాయము మార్చుకొన్నాము. అయితే అక్కడ గమనించదగ్గ విషయం పొలంలో చాలా భాగం ఖాళీగా వుంచి ప్రత్యేకంగా గడ్డిని పెంచుతారు. ఆ పశువులు, అంతేగాక ఆవులు, గొర్రెలు పెంచుతారు. వీటిని వారు ఆహారంగా ఉపయోగించు కొంటారు.

అక్కడ చూడగానే మనకు కన్పించేవి నల్ల జంతువులు, తెల్లజంతువులు. నల్ల జంతువులు గేదెలుకాదు: అవన్నీ ఆవులు, తెల్ల జంతువులు గొర్జెలు. హైబ్రిడైజేషనువల్ల ఈ విధంగా వచ్చినవి, కొన్ని తరాలనుండి క్రాసు బ్రీడింగు వలన మనకు కూడా జెర్సీఆవుల పరిస్థితి అంతేకదా! తెల్లజంతువులు గొర్రెలు, వీటిని ఆహారంగా ఉపయోగించు. కొనటమేగాక బొచ్చును కత్తిరించి "వులెన్" వస్త్రాలు తయారుచేసుకొంటారు. అక్కడ తెల్ల ఆవులు కన్పిస్తాయేమోనని చూశాను. వేల్సులో మాత్రము ఒక ఫారంలో తెల్ల ఆవును చూశాను.

వేల్సు ప్రాంతమువారు బీదవారు, వెనుకబడ్డవారు అని అక్కడవారి అభిప్రాయము. స్కాట్లెండువైపు వెళ్ళిన కొద్దీ ఆహార ధాన్యాలకన్నా పశువుల పోషణ ఎక్కువగా కనపడుతుంది. మనలాగానే ఇంగ్లాండు వేల్సు స్కాట్లాండు మూడు ప్రాంతాలుగా వ్యవహరిస్తారు. వారు ప్రవృత్తులు భిన్నంగా వుంటాయని చెప్పటానికి ఒక కథను చెప్తారు. "ఒకరికి మూడు ప్రాంతాలలో ఒక్కొ స్నేహితుడు ఉన్నాడట. తాను మరణించిన తర్వాత తనను పూడ్చి పెట్టేటప్పుడు ముగ్గురును ఒక పౌండు డబ్బు వేయమని కోరాడట. ముగ్గురు సరేనన్నారు. వేల్సువాడు చిత్తశుద్ధితో ఒక పౌండు నాణేనిని అందులోవేసాడు. ఇంగ్లాండు వాడు ఒక పౌండు చెక్కురాసి, అందులో వేశాడట..

స్కాట్లాండువాడు రెండు పౌండ్లకు చెక్కువ్రాసి వేల్సువాడు వేసిన పౌండు నాణాన్ని తీసుకొన్నాడట" ఇలాంటి కథలు చాలా విన్నానక్కడ. ఆహార విషయంలో మనలాగా అన్నంతోపాటు కూరలు తినరు. ప్రధానమైన

ఆహారం మాంసము, ఏజంతువుదైనా. రెండవది చేపలు, చిన్న దేశం, చుట్టుతా అంతా సముద్రము అందువలన చేపలకు ఎప్పుడూ కొదవలేదు. మాంసము, చేపలు తింటూ దీనితోపాటు గోధుమ రొట్టెగానీ, బంగాళదుంపలు గానీ నంజుకుంటారు. పాలు పెరుగుకు కొదవలేదు. అందువలన మనం తీసుకునే ఆహారం కన్నా బలమైన ఆహారం తీసుకుంటారు. బలిష్టంగా వుంటారు. ఎక్కువ పనిచేయగలుగుతారు.

మొదటి ప్రపంచ యుద్ధం నుండి స్త్రీలు, పురుషులు చేసే పనులు చాలా అలవాటు చేసుకొన్నారు. అందువలన ఇప్పుడు అన్ని వృత్తులలోనూ, వ్యాపారాలలోనూ, పురుషులతోపాటు సమ ఉజ్జీలుగా పనిచేస్తారు. మొదటినుండీ బాగా చదువుకొన్నవారు కనుక కుటుంబ నియంత్రణ ఎవరూ చెప్పే పనిలేకుండా పాటిస్తూ వుంటారు. రెండవ ప్రపంచ యుద్ధం జరిగిన తర్వాత చాలా రంగాలలో

పనిచేసేవారు లేక మిగతా దేశాల వారిని ఆసియావాసులకు, ఆఫ్రికావాసులకు ఎక్కువమందిని ఆదేశానికి వచ్చుటకు అవకాశాలు కల్పించారు. అట్లా వెళ్ళినవారిలో ముఖ్యంగా పాకిస్తాను నుండి వెళ్ళినవారు. కుటుంబ నియంత్రణ లేకుండా జనాభాను పెంచేస్తున్నారు.

స్థానికులు పిల్లలు, చదువుపూర్తి అయిన తరువాత అమెరికా, కెనడా, ఆస్ట్రేలియా మొదలైన దేశాలకు స్వేచ్ఛగా వెళ్ళటం అక్కడ స్థిరపడటం జరుగుతుంది. వారు నాగరీకులమని అనిపించుట కొరకు అన్య దేశాల వారిని అంగీకరించారు. అక్కడ స్కూళ్ళలో ప్రాధమిక స్థాయిలో "ఈ దేశం బహుళజాతి సమాజంతో కూడుకున్నది" అన్న విషయం అక్కడ పిల్లలకు బోధపడేటట్లు చేసారు. విద్యా సంస్థలలో పనిచేసేవారందరూ తప్పనిసరిగా ఈ విషయాన్ని అంగీకరించ వలసిందే. పొరపాటున కూడా, ఏ జాతిని చులకన చేసి మాట్లాడరు. మనం ఇక్కడ దళితులను కులం పేరుతో ఈ పడించితే ఎంత నేరమో, అక్కడ జాతి పేరుతో నిందిస్తే అంతేనేరము. అయితే ఇంగ్లాండులో కూడా ఇతర జాతుల వారితో ఎవరూ స్నేహముగా వున్నట్టు కనిపించరు.

వైద్యరంగంలో అప్పటికి ఒక గుండె విషయంలో తప్ప ఇక్కడ మన వైద్యంలాగానే జరుగుతుండేది. బైపాసు ఆపరేషను సర్వసాధారణమైనది. అప్పుడు గుండె మార్పిడి చేయడం కూడా జరుగుతున్నది. ప్రభుత్వము వారు దేశము మొత్తం ప్రజలకు ఉచిత వైద్య సహాయము అందిస్తారు. ప్రతివ్యక్తి యొక్క ఆదాయంలో హెల్తు ఇన్స్యూరెన్సు పేరుతో, కొంత వసూలు చేస్తారు. అంతేకాక నిరుద్యోగులకు వారి స్థాయికి తగినంత నిరుద్యోగ భృతి ఇస్తారు. ఇది అమెరికాలో కూడా వున్నది. వృద్ధులకు జీవన భృతికి ఇబ్బంది లేకుండా చూడటమేకాక వారికి కావాల్సిన వైద్య సదుపాయాలన్నీ ప్రత్యేకముగా నర్సింగు పనులు అనే పేరుతో నిర్వహిస్తారు.

ఇంగ్లాండులో ఇప్పటికీ సీసాలలో పాలు ఇంటింటికీ అందిస్తారు. కొన్ని ఏళ్ళ క్రిందట ఇట్లా ఇంటింటికి ఇచ్చేబదులు ప్రతి బజారుకు ఒక చోట పాలు నిల్వచేస్తే ప్రజలు వచ్చి తీసుకొని వెళ్ళవచ్చు కదా అని ఒక ప్రపోజల్ పార్లమెంటులో వచ్చింది. కానీ పార్లమెంటు అంగీకరించ లేదు. కారణం ఒక్కొక్క ఇంట్లో ఒకరు ఇద్దరు వృద్ధులు వుండవచ్చు. వాళ్ళు బయటకురాలేని పరిస్థితి. డిపోకు రాలేరు. కనుక ఇంటింటికి సప్లయి చేయవలసిందే. ఆ ఇంట్లో వున్న వృద్ధులకు పాలు సప్లయి చేసేవారితోను బయట ప్రపంచములో సంబంధం ఏర్పడుతుంది. ఇది కూడా మానివేస్తే వారు బ్రతికి వున్నదీ లేనిదీ కూడా తెలియదు. అలానే వృద్ధులకు బస్సు ప్రయాణము ఉదయం పది గంటలనుండి మధ్యాహ్నము 3 గంటల వరకు ఉచితం. బస్సు మీద వెళ్ళి మార్కెటులో ఏర్పాటుచేసిన పెద్ద హాలులో తమ వంటి వారిని కలిసి కాలం గడిపి ఇంటికి తిరిగివస్తారు.



హార్వర్డ్ యూనివర్శిటీని సందర్శించిన సందర్భంలో

# షష్టిపూర్తి

1985లో శాసనసభ ఎన్నికలలో గెలిచిన తర్వాత మామూలుగా జరిగే అభినందన సభలు కొన్ని జరిగినవి. ఆ తరువాత నేను మొదటిసారిగా విదేశీ యాత్రకు వెళ్ళివచ్చాను. ఆ క్రిందటి సంవత్సరము మా శ్రీమతి వెళ్ళి వచ్చినది. చిన్నప్పుడు విదేశాల పట్ల ప్రేమవున్నప్పటికీ, క్రమేణా తగ్గినది. మా శ్రీమతి చూచివచ్చిన తరువాత, ఆమె ప్రోత్సాహముతో, నేను మా బావమరిది పెద్దవర్మ గారితోపాటు, అమెరికా, ఇంగ్లాండు, రెండు నెలలపాటు తిరిగివచ్చాము. గుంటూరులో మా జూనియర్ డాక్టర్లు కొంతమంది, సన్మానము చేయవలెనని ప్రయత్నం చేసి నా వద్దకు వచ్చి అడిగారు. కేవలం ఎం.ఎల్.ఏ. అయినందుకు, విదేశీయాత్ర చేసినందుకు సన్మానము చేయటం అంత బాగుండదేమో నాకు ఎటూ 60 సంవత్సరములు నిండినవి. షష్ఠిపూర్తి పేరుతోచేస్తే బాగుంటుందని చెప్పాను. దీనికి ప్రోత్సాహకారులు ముఖ్యంగా డాక్టర్ ముద్దన హనుమంతరావు,

1986 జనవరిలో షష్టిపూర్తి ఉత్సవము జరిగినది. దానికి సభాధ్యక్షులు ఆవుల సాంబశివరావుగారు. ముఖ్య అతిధి డాక్టర్ డి.జె. రెడ్డిగారు కార్యక్రమము పూర్తి అయిన తరువాత కృతజ్ఞతలు తెలుపుటకు ప్రయత్నం చేసి రెండు మూడు నిమిషాల కన్నా ఎక్కువసేపు రుద్ధకంఠంతో మాట్లాడలేకపోయాను. సభాసదులు నిరుత్సాహపడ్డారును కొన్నాను, కానీ బాలబంధు బి. వి. నరసింహరావుగారు అది సహజమేనని దానికేదో పేరుకూడా చెప్పారు. పేరుగుర్తులేదు. నాట్యంలో ఒకపేరు. షష్టిపూర్తి; నర్సింగ్ హోమ్ రజతోత్సవం. ఈ రెండు సందర్భము లలోనూ సావనీరు వెలువరించాము. నా అనుయాయులు, సహచరులు నాపట్ల చూపిన ఆదరణకు, నేను చలించిపోయాను.

**వైద్యశాలల ప్రారంభోత్సవాలు :**

ఇవికాక, చాలా సంస్థలు, వ్యక్తులు, వివిధ సందర్భాలలో సన్మానాలు చేశారు. నేను సమాజమునకు చేసిన సేవకున్నా సమాజము నాపట్ల చూపిన ఆదరణ

ఎక్కువ. గుంటూరు పట్టణములోకాని, పరిసర జిల్లాలల్లో కానీ, నూతనముగా ప్రాక్టీసు ప్రారంభించే డాక్టర్లు, నన్ను ప్రారంభించమని అడిగేవారు. మొదట్లో చిన్న చిన్న ప్రదేశాలలో ప్రాక్టీసు పెట్టి వారిని అక్కడి ప్రజలకు పరిచయం చేయటం, వారికందుబాటులో వుండేటట్లు డాక్టరుకు సలహా చెప్పటం జరిగేది. కాలక్రమేణా ఒక ఆచారమైపోయి నెల్లూరునుండి నిజామాబాద్ జిలాల్లల వరకు నేను కొన్ని వందల ప్రదేశాలలో ప్రారంభించాను.

ప్రాక్టీసు మానివేసి దాదాపు 15 సం॥లు అయినా ఇప్పటికీ ప్రారంభోత్సవాలకు పిలుస్తుంటారు. నాకు వెళ్ళటం ఆనందంగానే వుంటుంది. ఇట్లా ప్రాక్టీసు పెట్టినవారు చాలా మంది దిగ్విజయంగా ప్రాక్టీసు చేస్తున్నారు. అటువంటి డాక్టర్లును ఏదైనా అవసరమై నా సహాయము అడిగితే, తప్పనిసరిగా అందించేవాడిని వారిలో ఎక్కువమంది ఇప్పటికి నాపై ప్రేమాభిమానాలు కలిగివున్నారు. వీరిలో నూతనముగా హాస్పటల్ భవనాలు నిర్మించుకున్నప్పుడు, ఆ గృహప్రవేశాలకు నన్ను పిలిచేవారు. కొంతమంది రజతోత్సవములు చేసుకొన్న సందర్భంగా నన్ను పిలచి మర్యాదచేసేవారు. నా ప్రధాన ఉద్దేశ్యము సామాన్య ప్రజలకు వైద్యము చేరువకావాలనేదే. అది చాలా వరకు నెరవేరింది. కానీ అట్టడుగువారికి అందుబాటులోనికి రాలేదు. దీనికి ప్రధానకారణము ఖరీదైన మందులు, డాక్టర్లు సేవనైతే అందించగలరుకానీ, ఖరీదైన మందులు కూడా ఇచ్చి, వైద్యము చేయటం సాధ్యముకాని పని.

నే ప్రాక్టీసు పెట్టిన తరువాత మందుల ఖరీదు తగ్గుతూ వచ్చినవి. 1971 తర్వాత అనూహ్యంగా మందుల ఖరీదు పెరిగినవి. ఇప్పుడు మధ్య తరగతి వారుకూడా మందుల ఖరీదు భరించలేని పరిస్థితి. చాలా కాలం నేను ప్రిస్కిప్షన్ ఇస్తే, పది రూపాయలకన్నా ఎక్కువ అయ్యేది కాదు. ఇప్పుడు ఒక్కొక్క ఇంజక్షన్ కొన్ని వందల రూపాయలు అవుతున్నవి. అలానే రక్త పరీక్షలు మొదలైనవి అందుబాటులో వుండేవి. ఎక్స్ రే పది రూపాయలుండేది. దానికి కూడా ఎంతోమంది రోగులు అంత ఖర్చు చేయలేమనేవారు. ఇప్పుడు పరీక్షలకు

వందలు వేలు ఖర్చు అవుతున్నవి. ఇవి గాక అప్పటికి తెలియని పరీక్షలు స్కానింగు, ఎం.ఆర్.ఐ. మొదలైనవి ఇప్పుడు అమలులోనికి వచ్చినవి. వాటి కొరకు ఒక వేయి రెండు వేలుకాక 10 వేలకు పైగా ఖర్చు పెట్టవలసి వస్తుంది. శస్త్ర చికిత్స అభివృద్ధి చెందినందువలన ముఖ్యంగా గుండెపై జరిగే ఆపరేషన్లకు లక్షలు ఖర్చు అవుతున్నది. నిజానికి ఇదంతా డాక్టర్లకు చెందదు. ఆపరేషన్లు ఉపయోగించే కొన్ని పదార్థాలు, చాలా ఖరీదైనవి. ఒక్క రోగికి మాత్రము ఉపయోగపడని కనుక ఇవి ఖరీదు పెరిగినవి.

హార్ట్ బైపాస్ ఆపరేషను, ఇప్పుడు అందరికీ తెలిసిందే. పెద్దవయస్సువారు కలుసుకొన్నప్పుడు ఒకరికొకరు పరామర్శగా బైపాస్ అయిందా? ఒకసారి రెండుసార్లా?

అని అడగుటం కద్దు పాశ్చాత్య దేశాలలో, ప్రత్యేకమయిన ఆపరేషన్లకు ఖరీదు మరీ ఎక్కువ. ఎన్.టి. రామారావు, అక్కినేని నాగేశ్వరరావు, మొదలైనవారు బైపాస్ ఆపరేషను అమెరికాలో చేయించుకున్నందువలన బహుళ ప్రచారం జరిగి, ఇప్పుడు ఆపరేషను పేరు తెలియనివారులేరు. నాగేశ్వరరావు రెండుసార్లు చేయించుకున్నాడు. ఇంకొంతమంది. 3, 4 సార్లు చేయించుకొన్న వారు కూడా వున్నారు. ఈ ఆపరేషను ఫలితాలు చాలా ఆశాజనకంగా వున్నందువలన, ఎక్కువ మంది ఆపరేషనుకు సిద్ధపడుతున్నారు. వృద్ధులకే గాకుండా పసి పిల్లలకు కూడా గుండె నిర్మాణములో జరిగిన లోపాలవలన ఆపరేషన్లు అవసరమగు తున్నవి. ఇటీవలి కాలంలో పసిపిల్లలలో గుండెకు ఆపరేషను అవసరమైన వారికి ఉచితంగా ఆపరేషను చేయాలని ఆందోళనచేయటం ప్రభుత్వమూ, ప్రైవేటు హాస్పటలుకూడా, వారికి ఆపరేషను చేయటం జరుగుతుంది. అయినా ఇంకా చాలామంది అవసరమైనవారికి ఇవి అందు బాటులోనికి రాలేదు.

మన రాష్ట్రంలో బైపాస్ సర్జరీకి ప్రఖ్యాతి వహించిన ప్రసాదరావు, పి.వి. సత్యనారాయణ నావద్ద పోస్టు గ్రాడ్యుయేట్స్ గా ఎం.ఎస్. డిగ్రీ లు పొందారు. ఆ తరువాత గుండె సర్జరీ చికిత్సపై ప్రత్యేక తర్ఫీదుపొంది, గుండె సర్జన్లుగా ఎదగటం

నాకెంతో గర్వకారణం. డాక్టరు ఎం.ఎస్.ఎస్. కోటేశ్వరరావుగారు మంత్రిగావున్న కాలంలో ఆస్ట్రేలియాలో ప్రత్యేకంగా తర్ఫీదు పొంది తిరిగివచ్చిన ప్రసాదరావుగారికి గవర్నమెంటు వారు ప్రాధమిక ఆరోగ్య కేంద్రంలో ఉద్యోగం చేయమని ఉత్తర్వులు ఇచ్చారు. వారు ఆ ఆర్డరు తీసుకొని మంత్రిగారిని కలిసి తను ప్రత్యేకంగా ఆస్ట్రేలియాలో శిక్షణ పొంది వచ్చానని ఇప్పుడు ప్రభుత్వమువారు ప్రాధమిక ఆరోగ్య కేంద్రంలో ఉద్యోగము ఇచ్చారని తనకు అవకాశమిస్తే గుండె శస్త్ర చికిత్స చేయగలనని చెప్పారు. మొదట ఆయనను నిమ్స్ చేరమని సలహాఇచ్చి కాకర్ల సుబ్బారావుగారితో చెప్పి ఉద్యోగము ఇప్పించారు. అంతవరకు జరిగిన ఒకటి రెండు చికిత్సలు విఫలమైనందువలన, మంత్రిగారు ప్రసాదరావుగారు ఇద్దరూ చాలా పట్టుదలతో, మొదటి ఆపరేషను సఫలంచేశారు. దానికి ముఖ్యమంత్రి ఎన్.టి.ఆర్ చాలా ఆనందపడ్డారు. అనతికాలంలోనే నూరు ఆపరేషన్లు విజయవంతంగా పూర్తిచేసారు. ఈ కాలంలో వారి దగ్గర తర్ఫీదు అయినందువలన, మిగతా హాస్పటల్స్ కూడా ఈ ఆపరేషన్లు విరివిగా చేశారు, హార్టు ఆపరేషను అంటే కేవలం బైపాస్ మాత్రమేకాదు. గుండె నిర్మాణంలో జరిగిన లోపాలు, కాలక్రమేణా వచ్చిన మార్పులవలన కొత్త వాల్వు అమర్చటం మొదలైనవి చాలా రకాలు వున్నవి.

మా నియోజక వర్గం నుండి ఒక కుర్రవానికి ఆపరేషను చేసి 25 వేలు, 35 వేలు బిల్లువేసారు. నేను ప్రసాదరావుగారితో ఆరోగి చాలా బీదవాడు ఏమన్నా తగ్గిస్తారా.

అనిఅడిగాను. ఆయన మొత్తం ఫీజును రద్దు చేసారు. మాకు బాగా తెలిసినవారు ఒకరికి రెండు మోకాళ్ళ వెనుకవుండే ప్లాస్టిటియర్ ప్లాసా అన్యురిజం వచ్చి ఒక కాలు గాంగ్రిన్ దశకు వచ్చింది. నేను పరీక్షలు జరపకుండానే ఆ జబ్బును గురించి వివరిస్తూ నిమ్కు ఉత్తరం వ్రాసాను. అక్కడ ఓ.పి.లో ప్రసాదరావు సత్యన్నారాయణ ఇద్దరూ చూసి "ఏ పరీక్షలు లేకుండానే మాస్టరుగారు ఈ

డయాగ్నిసెస్ చేశారు అని ఆనందపడి, తరువాత వారు పరీక్షలు చేసి నా డయాగ్నిసెస్ నిర్ధారణ చేసుకొని ఆపరేషను విజయవంతంగా చేసి ఎం.ఎల్.ఏ. క్వార్టర్సులో వున్న నన్ను కలిసారు. మామూలుగా అయితే ప్రసాదరావుగారు చాలా బిజీగా వుండటంవల్ల ఎవరినీ ఇంటికిరానివ్వరని చెప్పుకొనేవారు. ఆరోజు వారు నా రూముకు వచ్చినప్పుడు 5-6 గురు రూములోవున్నారు. వారు ప్రసాదరావుగారు నా రూముకు రావటం ఏమిటని ఆశ్చర్యపోతున్నారు. అప్పుడు సత్యనారాయణగారు కత్తి ఎట్లా పట్టుకోవాలో మాకు నేర్పింది మాస్టరుగారే అని చెప్పారు. రూములో వున్నవారు నన్ను డాక్టరుగా ఎరుగుదురుగానీ అంత పెద్ద డాక్టర్లకు గురువుగావుండి సర్జరీ నేర్పించానని తెలుసుకొని ఆశ్చర్యపోయారు.

**చేసిన సేవ కంటే వచ్చిన గుర్తింపు గొప్పది :**

మొత్తం మీద నేను ప్రజలకు చేసిన సేవకున్నా, ప్రజలనుండి నాకొచ్చిన గుర్తింపు ఎక్కువ అని నా భావన. మొదటినుండి విద్య, సాహిత్యముపట్ల ఎక్కువ అభిమానం వుండటంవలన ఆయా కార్యక్రమాలు జరిగేటప్పుడు సాధ్యమైనంత వరకు వాటిల్లో పాల్గొనేవాడిని-హైస్కూలు, కళాశాలల వార్షికోత్సవములు మొదలైనవి. ఈ కార్యక్రమాలకు హాజరు అయినందువలన కొందరు నూతన వ్యక్తులు, వివిధరంగాలలో నిష్ణాతులైన వారి పరిచయం ఏర్పడింది. అట్టి పరిచయంవలన, చాలా మంది మిత్రులయినారు. నేను మిత్ర సంపదనెప్పుడూ గొప్పగా భావించేవాడిని.

కొంతమంది కవులు తమ వృత్తి ధర్మము ద్వారా పరిచయం అయినారు, వారు వ్రాసిన కావ్యాలంకితమిచ్చారు. శ్రీ కొల్లా శ్రీకృష్ణారావు వ్రాసిన "పూతోట" అన్న కావ్యాన్ని 1960కు పూర్వమే అంకితం ఇచ్చారు. ఆ సభలో శ్రీనార్ల వెంకటేశ్వరరావు, శ్రీ ఆవుల గోపాలక్రిష్ణమూర్తి మొదలైనవారు, శ్రీకృష్ణారావు కావ్యాన్ని ప్రసంశించారు. తరువాత ఎడ్లపల్లి సీతారామయ్య అనే హిందీ అధ్యాపకుడు, "కట్టబ్రహ్మన" నాటకాన్ని అంకితమిచ్చారు. తరువాత బొద్దులూరి నారాయణరావుగారు రాధేయుడు కావ్యాన్ని, బోడేపూడి వెంకటరావుగారు

"తృష్ణా వర్తము" అనే కావ్యాన్ని అంకితమిచ్చారు. ఈ కావ్యము ఆంధ్రా యూనివర్శిటీలోనూ, మైసూరు యూనివర్శిటీలోనూ, బి.ఏ.కు పాఠ్య గ్రంథముగా పెట్టారు. ఆచార్య ఎన్.జి. రంగాగారి క్రెడో ఆఫ్ వరల్డ్ పెజెంట్రీ అనువాదం "కర్షక వేదము"ను డాక్టర్ జక్కంపూడి సీతారామరావుగారు కూడా నాకు అంకితం ఇవ్వడం. జరిగింది. ఈ కృతికర్తలెవ్వరికి నేను చేసిన ప్రత్యేక మర్యాద లేమీలేవు.

షష్టిపూర్తి మహోత్సవ సమయమన్న
అది పునర్జన్మమనిగదా ? ఆర్యవాక్కు
అందుకే పునర్వివాహ కార్యక్రమమ్ము
తప్పుకోలేము, పూర్వ సిద్ధాంతములను! –శ్రీ కొసరాజు రాఘవయ్య చౌదరి.




షష్టిపూర్తి మహోత్సవ వేదికపై పెద్దలు

# ముగింపు

**సమాజసేవకు పురికొల్పిన అంశాలు :**

నేను సమాజసేవ చేసాననటం అతిశయోక్తియేమో! నేను నా వృత్తి ధర్మాన్ని సక్రమంగా నిర్వహించాను అని మాత్రమే అనుకొంటున్నాను. నేను పుట్టి పెరిగింది. గాంధీయుగంలో, ఆతరం వారికి చాలా మందికి స్వాతంత్ర్య సమరాన్ని గురించి, దేశ పరిస్థితులను గురించి, ఎంతో కొంత అవగాహన వుండేది. బీదరికం అన్ని గ్రామాల్లోనూ, కళ్ళకు కట్టినట్లుగా కన్పించేది. ఒక మాదిరి ఆదాయం వున్న రైతులు కూడా. ఇంగ్లీషు వైద్యానికి వెళ్ళగలిగేవారు కాదు. బీదల సంగతి చెప్పే పనిలేదు. అందువలన, నా వృత్తిలో బీదసాదలకు చేతనైనంత సాయం అందించాలనుకునే వాణ్ణి. ఎంత ఉదారంగా వున్నా కొంతమంది మందుల ఖర్చుకూడా పెట్టుకొనేవారు కాదు. అటువంటి సందర్భములలో నావద్ద వున్న (మందుల కంపెనీవారు ఉచితంగా యిచ్చిన) మందులను కొన్ని సందర్భాలలో మెడికల్ షాపుల్లో తెచ్చిన మందులను ఇచ్చేవాడిని, హాస్పిటలులో అడ్మిట్ అయిన రోగికి సంపూర్ణ వైద్యంచేసి జబ్బు నివారణ చేసి పంపేవాడిని. అయితే చాలామంది బీదలు మందులకే గాక, వారి తిండికి కూడా ఇబ్బంది పడే పరిస్థితి. అట్టివారికి ఏమీ చేయలేకపోయానే అని బాధగా వుండేది. ప్రాక్టీసు పెట్టిన కొత్తలో ఒకటి రెండు సందర్భాలలో రోగులు నేను అడగకుండా ఇచ్చిన డబ్బును ఎక్కువ ఇచ్చారని కొంత తిరిగి ఇచ్చేవాడిని. ఆ విషయం సమాజంలో ఎక్కువ ప్రచారమయ్యింది.

ఏ విషయం మీదనయినా భిన్నాభిప్రాయం కలిగిన వ్యక్తులను, మన వాదనల వలన అతని అభిప్రాయము మార్చలేము. వారు సరిగా అర్థం చేసుకోలేక మనలను శత్రువులుగా భావించే అవకాశము కూడా వుంది.

మామూలు సంభాషణల్లో చాలా సార్లు ఎదుటివారిని నొప్పించేటట్లుగా మాట్లాడటం. కొంతమందికి అలవాటు. దానికి ప్రతిస్పందన మనం అంతకన్నా ఎక్కువగా నొప్పించగలం. దీనివలన కూడా అతను శత్రువు అయ్యే ప్రమాదం వుంది. ఇది నేను జీవితంలో మొదటిలోనే అర్థంచేసుకొని అట్లా రిపార్టీ ఇచ్చేవాడినికాదు.

మొత్తం మీద నేను సమాజానికి చేసిన మేలుకన్నా ప్రజల నుండి నాకు వచ్చిన గుర్తింపు ఎక్కువ అనే భావిస్తాను. చిన్నా, పెద్దా సన్మానాలు చాలా జరిగినవి. 1986వ సంవత్సరము గుంటూరులో నన్ను అభిమానించే యువకులు కొంతమంది షష్టిపూర్తి ఉత్సవం పేరుతో చాలా ఘనంగా సన్మానించారు. నాకు అప్పుడు 63 సంవత్సరాలు. ఆ సభకు ఆవుల సాంబశివరావుగారు, డాక్టర్ డి. జె. రెడ్డిగారు మొదలైన ప్రముఖులు వచ్చారు. మాపై ప్రశంసల జల్లులు కురిపించారు. సభికులుకూడా, ఆ జల్లులలో "తడిచి పోయారు" చివరకునే జవాబుచెప్పే సందర్భంలో, నే చెప్పాలనుకొన్నదంతా చెప్పలేక మధ్యలో విరమించాను. ఆచర్యను బాలబంధు బి.వి. నరసింహారావుగారు ప్రస్తావించారు. దీనికి ఏదో అలంకారముకూడా చెప్పారు. అంతకుముందు 1976లో మా ప్రజావైద్యశాల సిల్వర్ జూబ్లి పంక్షనుకు శ్రీ ఎన్.జి. రంగాగారు అధ్యక్షత వహించారు. అధ్యక్షోపన్యాసంలో ప్రధానంగా ప్రస్తావించిన విషయాలు, "సామాన్య రైతు కుటుంబములో ఒక పిల్లవాడిని ఎం.బి.బి.ఎస్. చదివించటానికి, తల్లి దండ్రులు ఎంత కష్టపడ్డారోనన్న విషయాలు, మనం మరచిపోకూడదు. అట్లా చదివిన డాక్టరు కుటుంబ బాధ్యతలు పంచుకోవాలి. అట్లా ఎందరు చేస్తున్నారో తెలియదు. ఈ దంపతులు ఇద్దరూ ఆ బాధ్యతను బాగా నిర్వహిస్తున్నా"రని ప్రసంసించారు. ఆ ఉత్సవం యొక్క ప్రత్యేకత-మెడికల్ కాలేజీలో మా గురువులైనవారందరినీ పిలిచి వారిని సన్మానించటం అదే సందర్భంలో, నా వద్ద తర్ఫీదు పొందిన డాక్టర్లు నాకు సన్మానం చేశారు. తక్కెళ్ళపాడులో కొన్ని సంవత్సరముల నుండి "లలిత కళాపరిషత్" అను పేరుతో

కార్యకలాపములు జరిపే సంస్థ నా పేరు పెట్టి, ఊరేగింపు జరిపి సన్మానము జరిపారు. నాకు మరపురాని సంఘటన అది.

## స్వేచ్ఛా భావన :

మానవ సమాజాన్ని నిశితంగా పరిశీలిస్తే ఒక విషయం స్పష్టమౌతుంది. అది ఏమిటంటే కుటుంబ వ్యవస్థలో రెండు మూడు తరాల మనుష్యులు కలసి జీవించడం. ఆరకంగా ఒకరు చెప్పే పనిలేకుండా, పైతరంవాళ్ళు క్రింది తరం వాళ్ళకు వారి అనుభవాల ద్వారా చాలా విషయాలు అందజేస్తారు. అలానే బాల్యంలో వున్నవారు వారి ఆసక్తికొద్దీ పైతరాలవారిని అడిగి చాలా విషయాలు నేర్చుకొంటారు. అలానే వివిధ వృత్తుల వారు ఒకేచోట నివసిస్తూ సమాజంలో మిగతావారిని గురించి కూడా అర్థం చేసుకొంటారు, నాగరికత పెరిగిన కొద్దీ, కొత్తతరంవారు పాత తరాన్ని పట్టించుకోకుండా, తామే మేధావులమనుకోవటం జరుగుతుంది. అలానే ఏవృత్తివారు వారు ఆ వృత్తి వారితోనే కలవటం మిగతావారికి దూరంగావటం జరుగుతుంది. నా వద్దకు వచ్చే వారిలో అన్ని తరాలవారువున్నారు. మనం వారితో స్వేచ్ఛగా వున్నప్పుడు వారి అనుభవాలు మనకు చెప్పటం అలానే క్రొత్త తరంవారు మన దగ్గరకు ఏమి తెలుసుకోవాలి అని రావటం. జరుగుతుంది. ఒక్కొక్కసారి క్రొత్తతరంవారే, పాతతరంకన్నా విద్యావంతులవటం, పైతరం. వారికి కొన్ని విషయాలు, అర్థం అయ్యేటట్టు చెప్పగలరు. అందువలన నేనెప్పుడు అందరితో స్వేచ్ఛగా మట్లాడతాను. ఎదుటవారికి స్వేచ్ఛగా మాట్లాడే అవకాశమిస్తాను.

మామూలుగా డాక్టర్లు ప్రాక్టీసు చేసే వైద్య విధానాన్ని ఇంగ్లీషు వైద్యం అంటారు. మేము, శాస్త్రీయ వైద్యమనీ ఆధునిక వైద్య విధానమనీ అంటాము. ఇవిగాక చాలారకములైన వైద్య విధానాలు, మన దేశంలోనూ, మిగతా దేశాలలోనూ అమలులో వున్నాయి. మిగతా వైద్య విధానాలు ఎంతవరకు శాస్త్రీయమో మేము చెప్పలేము. మిగతా విధానాలలో వైద్యము చేయించుకున్న రోగుల అనుభవాలను

విన్నప్పుడు ఆ విధానాల పట్లకూడా సద్భావం. ఏర్పడుతుంది. (ఉదా: నేను విద్యార్థిగా వున్నప్పుడు, నా కాలిపుండు డాక్టర్లవల్ల కానప్పుడు. మా ఇంటి మంగలి వేసిన మందువలన నయమైందని మొదట్లోనే చెప్పాను). సుమారు 5 దశాబ్దాలు ప్రాక్టీసు చేసిన తర్వాత వైద్యంలో పొరపాట్లు జరగలేదని చెప్పటం సాహసమే. కొన్ని పొరపాట్లను గ్రహించినప్పుడు దానిని సరిజేయటం జరిగేది. కొన్ని గుర్తించకపోవటంవలన రోగి బాధకు గురిఅయ్యేవాడు. అటువంటి వారందరికీ నా హృదయపూర్వక క్షమాపణలు తెలుపుకొంటున్నాను.

మా దంపతులు ఇరువురినీ ఎంతో అభిమానించి, మాకు వైద్యరంగంలోనూ, సేవా రంగంలోనూ సామాజికంగా ఒక ఉన్నత స్థితి కల్పించిన సమాజమునకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు. పునర్జన్మ ఉన్నదో లేదో తెలియదు, ఉంటే వచ్చే జన్మలో–ఈ జన్మలో అందుకోలేనిదేమున్నా అందుకొంటాను. తెలిసిన లోపాలను సరిదిద్దుకుంటాను.

వేల సంవత్సరముల నుండి వైద్యాభివృద్ధికి ఎంతో మంది మహానుభావులు కృషి చేశారు. దాని ఫలితంగానే ప్రస్తుతం ప్రజలకు మంచి వైద్యం అందించ గలుగుతున్నాము. ఇరవయ్యవ శతాబ్దంలో, రోగ నిర్ధారణలోనూ, శస్త్ర చికిత్సలోనూ, అరుదైన పరిణామాలు వచ్చినవి. ఆకాలంలో మేము డాక్టర్లమై వైద్యము అందించగలిగినందుకు సంతోషిస్తున్నాము. ముందు రాబోయే పరిణామాలవల్ల ఇంకా మంచి వైద్యము, ప్రజలకు డాక్టర్లు అందించగలరని కోరుకొంటూ వారికి శుభము పలుకుతున్నాను. ఇప్పుడు వైద్యం చేయించుకోకపోతే చాలామంది పోతారు. జీవన శైలి నాజూకు అయింది.

# HOW TO BE A SUCCESSFUL GENERAL PRACTITIONER?

**INTRODUCTION:** The problem of being a successful general practitioner is a very complicated one and set rules can hardly be laid down. It is probably because the material of practice, the human being (body and mind) consists of a number of varieties-psychological, temperamental, social, economic, cultural, etc. It is but natural that when one deals with such a variety of patients many factors play a part which lead to the success of a practitioner. I shall try to deal with some of the more important of these aspects. For want of space as well as versatility I shall be brief without dogmatism.

## I. Pre-requisites of a successful practitioner:

1) KNOWLEDGE: Undoubtedly anybody who ventures to be a general practitioner must acquire more versatile knowledge than any specialist. Though not possible to acquire the knowledge of a specialist in every branch, basic knowledge in each branch must be definite and precise. Sufficient experience in each branch is equally essential. It is worth observing the specialists in the institution and the senior colleagues in general practice, dealing with all varieties of cases because it is not possible to deal with them during the period of apprentice.

2) THE OUTLOOK of a practitioner must be such that his life mission is to deal with the sick and suffering subordinating every other activity. One cannot afford to take up this profession as a hobby or side business. He can have any hobby which is recreational but not interfering with the normal course of practice.

3) THE SOCIAL STATUS: of a practitioner plays a part in fetching his clientele in the beginning. Naturally a novice coming from an influential and socially well-placed family stands a very fair chance of being soon known to a great circle of people. His later success of course depends upon his efficiency and skill in dealing with them thereafter.

4) THE ATTITUDE TOWARDS THE PATIENT is a most important factor that goes a long way in deciding the success of a practitioner. The latter will do well to bear in mind that his patients are first human beings and then sick. The suffering is the same for all classes of people probably more among the less well-to-do, for the fear of not being taken care of well makes the suffering worse. So a human and gentle approach is essential in treating every patient.

5) OBLIGATION TO THE SOCIETY: It is purely by chance and opportunity that one becomes a medical man, by which I mean nobody is born as a medical man in contrast to the other professions like agriculture, rural arts and crafts, etc., which are mostly hereditary. The medical men are produced

at a great cost to the Government (i.e.) the people. So he has naturally got an obligation to the people.

The social status of a medical man is very high in civilized countries. Even in ours it is fairly high. Every practitioner must be very conscious of his duties and obligations to society and discharge them conscientiously.

) THE CHARACTER: of the practitioner does influence his career. Integrity of character naturally adds confidence in the patients. Vices in the practitioner turn away large sections of people particularly in rual and semi-urban areas. After all, a man with vices cannot bestow proper attention in any field of serious or responsible activity.

7) PHYSIQUE AND PERSONAL APPEARANCE are of course nature is gifts. An impressive personality is a definite advantage. His personal habits like cleanliness and virtuous

simplicity are factors that have some bearing on his success.

8) ART OF DETACHMENT: As Sir William Osler has advised the medical profession, as early as the turn of last century, a medical man cannot afford to enjoy the various luxuries and diversions of modern life as the calls upon his time are too urgent and various. He must be prepared to forgo some luxuries.

**II. General behaviour :**

1) LIBERAL ATTITUDE: People are good at heart. The doctor is very richly rewarded by society for his services. This truth can be realised sometime later in the practice. If one considers monetary remuneration only, one cannot realise this truth. Wherever he goes he comes across people who show their gratitude in a number of ways. If a few people behave unexpectedly, he should not take it to heart but maintain his liberal, charitable attitude.

2) PUNCTUALITY AND AVAILABILITY: No other profession requires greater punctuality than medical. Either in the clinic or at home the patient waits anxiously for the doctor. If there is delay his anxiety increases in addition to physical suffering. If the doctor is attending to any emergency the patient does not mind to bide his chance. He cannot, however, reconcile himself to the doctor's delay in social clubs or calls.

The medical man must always be available either in the clinic or in the house. In case he has to be away for some time he should leave information. The doctor can hardly afford to refuse a professional call irrespective of his remuneration or the seriousness of the case.

3) WORDLY KNOWLEDGE: The medical profession gives great opportunities to learn something of every other

profession because the patients belong to various professions and during their visits pour out some information regarding their professions. This knowledge can be taken best advantage of in understanding the origin of their symptoms namely whether psychological or somatic. While the patient gets only one benefit, namely the relief of his suffering, the practitioner gets a number of benefits from him such as remuneration, experience, knowledge about the various factors influencing the disease process. Indeed, one of my teachers used to say "HE FELT MORE OBLIGED TO PAY THE PATIENT WHO GAVE HIM THE FIRST CHANCE OF DOING A TRACHEOTOMY."

4) THE RELATIONS BETWEEN THE COLLEAGUES: Two practitioners seldom get on well, especially when both of them are successful. It is unfortunate that such a state should exist in our country, particularly in rural parts. Many of the unpleasant rivalries between the practitioners are based on information given out by patients, which in all probability is false.

It is a basic instinct, rather, to put it more bluntly, an animal instinct, to react sharply to any injury or insult. The medical practitioner belonging to profession dealing with all types of human beings should develop restraint on such basic instincts. It is unworthy of our education and culture to succumb to the basic instinct of reaction. With a little

introspection one can understand how deleterious it is to oneself and others. Ultimately it proves to be harmful to both, reflecting on their honour and dignity.

The general attitude towards the older colleagues should be one of respect. After all they have trod their way in less favourable circumstances like lack of development of science and inadequate equipment. Besides folks used to be less disease conscious. Hence it behoves us to be courteous to our seniors who paved the way for us to do better and smoother work. The junior practitioner looking at the senior is always nervous and a bit jealous though perhaps he himself is better equipped. So, he needs and deserves encouragement and assistance.

After all the world is wide and there is scope for every one of us to make a mark in the profession.

5) DUE HUMILITY: The limitations of our knowledge of a rapidly progressing science and possibility of our erring in the diagnosis and treatment should be borne in mind. Due humility stressed so much by Sir William Osler should be the guiding factor.

**III. Dealing with the individual patient.**

NAME: As Dale Camegie says the sweetest name in the world is one's own. If the patient is called by his name in contrast with the name of the disease which is often

uppermost on our minds, he feels that he is being taken care of well. It pays to remember as many names as possible.

1) COMPLAINT AND CASE HISTORY: We must give a patient hearing to what the patient says even though he indulges in minor details. This naturally gives an impression to the patient that we are showing real interest in him. Better to make a note of the salient points for future reference. We should not put too much reliance on our memory.

AGE: Different age groups of people require different methods of approach.

CHILD: As Hutchison says, the child distrusts a person who looks directly in its face just as an adult distrust a person who does not. The examination should start while the child is being caressed by the mother or the nurse and only on completion of the examination must the doctor look into the face for further information. The child is really very much afraid of the doctor, especially in these days of more and more parenteral therapy. Whenever it is possible it is wise to abstain from the injection.

2) ADOLESCENT: It is this age group of people that hesitate to see the doctor readily. It can be easily understood that it is this age which gives maximum physical and mental turmoil. They are too old to complain of their trouble

to the parents and too young to see the doctor directly. So, the practitioner should show a friendly attitude towards them. Very often their trouble may be only a physiological change which is mistaken as pathological. If the doctor explains away the symptoms and reassure the patient, he will prove to be a good friend for, sooner or later. He will realise the truth of the advice and naturally puts more confidence in him rather than in a practitioner who tries to exploit his anxiety. The doctor should

be more a humanist than a moralist. The youth should not be admonished for his follies but should be made aware of the possible dangers of his acts and of the necessity of obtaining from them. This will very often achieve what the moralist cannot by his admonition. The patient is thankful for the doctor's advice and treats him more respectfully.

3) ADULT: Every adult must be treated as a mature person. If we treat even the most ignorant person as such his pride will be hurt. As a practitioner, one can ill afford to displease one is clients.

4) OLD AGE: Age should be respected, irrespective of intelligence, occupation, learning or social status. What age frequently misses at home by way of polite attention, must be made good by the doctor's sympathy.

## EXAMINATION OF THE PATIENT:

It is not always possible for the practitioner to treat the patients in favourable circumstances not to deal only with simple cases Cases of grave prognosis and cases which require very urgent treatment are often met with where the practitioner must bring into play equanimity of mind and dexterity of action. Sir William Osler has emphasized it so well that we cannot overestimate its importance.

In the daily routine and rush of practice one is tempted to hurry up the examination and consequently commit errors in diagnosis. The virtue of methodical approach which was dinned into our ears as students must be diligently followed.

At the end of the examination of the patient it may not be possible to arrive at a diagnosis in every case. A more thorough examination, therefore, should be conducted sometime later or the next day with the necessary special investigations. Similarly, thoroughness of treatment should be the watchword.

**INVESTIGATIONS**: Greater judgement is called for special investigations, rather than the routine investigations done by a specialist, who is apt to be extravagant owing to his reluctance to allow any scope for error in diagnosis by omission of any of them. But it is impossible for a general practitioner, at any rate in this country, to have all the

investigations done, partly for financial reasons and partly unwillingness or rather lack of understanding on the part of the patient and, too, want of facilities.

**DIAGNOSIS**: With the case history and the findings of clinical examination and the necessary investigations one comes to a reasonable diagnosis by the application of his knowledge and clinical experience. He will be advised to adopt an attitude of probability without feeling cock sure.

**PROGNOSIS**: It is always desirable to give hopeful prognosis even to the most incurable patient but under no circumstances should one guarantee cure as any imishap reflects upon the doctor's ability. In case of a bad prognosis someone who is important to the patient must be informed early.

**TREATMENT**: The patient should be advised about the treatment in a gentle but firm manner. The treatment should be adjusted according to the patient is circumstance, occupation, mental attitude etc., without prejudice to the basic principles. It is worth using preparations of reputed concerns, especially in cases of emergency. After all a well-balanced preparation of a potent drug though apparently costly may work out cheap by virtue of its quality.

**REMUNERATION**: This is probably the most important and difficult thing in a private profession. There are no

fixed fees for the services of a medical man. This lack of fixed fees further complicates the matter and at least the junior practitioner is puzzled to stipulate the fees. The fees vary in the various strata of society, various localities and from practitioner to practitioner even in the same place. It is not always correct that the patient prefers a doctor who is chargeless. But on the whole where the compency and the attention are almost equal the majority of the people prefer the doctor who charges less. The fees must be fixed according to the patient's capacity. This does not purely depend upon his social environment, cultural level, and habit of paying. From time immemorial it is the practice in our rural areas to spend very little on medicine. Even the people who can afford it were not accustomed to pay because it is the village vidyas whose needs were minimum and establishment nil who were treating them depending upon some remuneration in kind rather than in cash. As the society is turning more materialistic, people are realising the necessity of paying doctors. It is only after some experience that the medical man can assess the payment from his client. It is matter of individual preference that the fee is fixed first or last. As long as there is good understanding between the doctor and the patient this does not matter much. If the patient finds it difficult to come up to the expectations of the doctor the latter must show his

nobility and magnanimity with his liberal dealings. In no case should one insist on payment in an emergency.

**OVER–WORK**: We meet all types of people in our profession as disease is universal. We must enrich with people of very high character, knowledge, experience, friendliness. Though the master–word in medicine is work, the feeling of over–work is often psychological but not real. If we realise that the practice of medicine is an art and not a trade, we do find delight in the work in which the head and the heart will be equally exercised.

**TOLERANCE TOWARDS OTHER SYSTEMS OF MEDICINE**: Being practitioners of a scientific medical system, we know that science is only the pursuit of truth but the whole truth. Realising the limitations of knowledge, we must develop tolerance towards other systems of medicine.

**EDUCATE THE PATIENT:** Whenever we get an opportunity to treat infectious and other common diseases, we should try to educate the patients about the causation and prevention of diseases and remove their wrong notions.

**DEALINGS WITH SPECIALISTS**: Though a wise specialist treats his professional brother, the general practitioner, with due courtesy sometimes one comes across specialists who behave with an air of superiority. The general practitioner should never give way to the opposite complex.

It is natural that he cannot possess the same depth of knowledge as a specialist, and it is equally true that the specialist's knowledge in other branches of medicine is virtually nil. Whenever necessary the specialist should be consulted. The delay in the consultation should not be detrimental to the patient nor should the practitioner of a science stand too much on prestige. With the growing consciousness of the need for a specialist, there is now a tendency to depend too much on the specialist. This definitely reflects upon the efficiency of the practitioner, who should be wise enough to steer clear of these two extremes.

**LEARNING OF THE PRACTITIONER**: The practitioner should never allow himself to be outmoded in his professional learning which he should brush and keep in constant repair by periodically consulting his text books and keeping himself abreast by reading at least the important journals and constantly associating himself with junior colleagues.

**MEDICAL ETHICS**: Having taken the noble Hippocratic oath one should endeavour, if not to live up to it, at least not to violate its injunctions.

Thus far I have dealt with the desirable methods of practice to bring success. I have deliberately refrained from touching upon a hundred known and a thousand unknown undesirable practices which bring what some may choose to call success.

One cannot but give the aspiring practitioner this advice.

Love the profession, Love your patient' Act with nobility, Maintain dignity of profession, Cultivate due humility and Success shall be yours.

As I write these lines there stands before me on my desk an image of the Buddha with the following inscription.

"FOLLOW THE PATH OF DUTY, SHOW KINDNESS TO THY BRETHREN AND FREE THEM FROM SUFFERING" These words, though perhaps meant for alli apply with special force to the medical man.

**SUMMARY OF HOW TO BE A SUCCESSFUL GENERAL PRACTITIONER**

The success of a practitioner depends upon many factors. Some of the imortant factors are discussed.

The basic knowledge in every branch of medicine must be precise and definite. Profession must be practiced as a life

mission. The practitioner should realise his duties and obligations to the patients as well as to society in general. The virtues of his personal character and his physical appearance add to the success. He has to forgo the luxuries of modern life for the sake of the profession.

He should maintain his liberal, charitable attitude towards the patients and make himself available as much as possible. He may take advantage of the variety of his patients to enrich his knowledge. He should develop restraint to the basic impulses of reaction and maintain good relations with his colleagues. He should treat seniors with regard and juniors with affection. Due humility should be part of his behaviour. He should maintain intimacy with every patient. Different age groups of people must be handled appropriately. The examination of the patient must be methodical and thorough, and the doctor should maintain equanimity of mind always. The patient should not be burdened or observed with the rigmarole of specialist investigations. One should give a hopeful prognosis and advise the patient about the treatment gently but firmly. The practitioner should take several factors into account and, at any rate, try to be fair to the clients regarding remuneration and should find delight in his work.

One should develop tolerance towards systems of medicine. He should educate the public about the common diseases.

The general practitioner should avoid the extremes of consulting the specialists too much or too little. He should keep abreast of the latest knowledge. He who loves his work prospers sooner or later.

**PEOPELS NURSING HOME,**

**GUNTUR.**



*The Family of People's Nursing Home.*



జాతీయ నాయకులతో



బాబూ జగజ్జీవన్‌రాంతో



అప్పటి రాష్ట్రపతి నీలం సంజీవరెడ్డితో



వాజ్‌పేయి, చరణ్‌సింగ్‌లతో



ప్రజావైద్యశాల రజతోత్సవ సభావేదిక



ఎన్టీఆర్ దంపతులతో తాత - మనువడు



డాక్టర్ల లోగిలి – లక్ష్మీపురం, గుంటూరు

"విద్యతో పాటు విజ్ఞానాన్ని,
వినయాన్ని పెంచుకొని...

కలిమి పెరిగే కొలది చెలిమిని,
సేవాభావాన్ని పెంచుకొని...

వయస్సు పెరిగే కొలది ఓరిమిని,
విశాల దృక్పథాన్ని అలవర్చుకొని...

వైద్యునిగా, ఉపాధ్యాయునిగా,
విద్యాదాతగా నిష్కళంక ప్రజాప్రతినిధిగా

అసమాన సేవలందించిన అమృతమూర్తి
**డా॥ కాసరనేని సదాశివరావు గారికి**
శుభాకాంక్షలు...

**ముప్పా అంకమ్మరావు**



తెలివి గల నాతల్లి గర్భము నుండి నీ ఒడిలోనికి
చేరినప్పటి నుండి నేటివరకు ఏ లోటు లేకుండా పోషించిన ఓ భూమాతా!
నీకు వందనములు - డా॥ కాసరనేని సదాశివరావు

(తుది శ్వాసకు ఓ వారం ముందు డాక్టరు గారి పలుకులు)

Sree Lakshmi Press, Guntur-2, Ph: 0863-2230643